# సింహ సేనాపతి

(నవల)

మూలం:

మహాపండిత రాహుల్ సాంకృత్యాయన్

అనువాదం:

గద్దె లింగయ్య



విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ.

# భూమిక



‘బ్రతకడంకోసం’ తర్వాత యిది నా రెండో నవల. అది క్రీ. శ. యిరవయ్యో శతాబ్దాన్ని గురించి; యిది క్రీ. పూ. అయిదో శతాబ్దానికి సంబంధించినది. నేను మానవసమాజారంభ దశనుండి నేటివరకు జరిగిన వికాసాన్ని గూర్చి యిరవై కథలు (ఓల్గా నుంచి గంగవరకు) గా వ్రాయాలనుకొన్నాను. వాటిలో ఒకటి బౌద్ధయుగానికి సంబంధించినది. వ్రాయటానికి పూనుకున్నప్పుడు అన్ని విషయాలను కథలో యిముడ్చుట కాని పనిగా తోచింది. అందువల్లనే ‘సింహ సేనాపతి’ నవలారూపంలో మీ ముందుకు వస్తోంది.

‘సింహ సేనాపతి’కి సమకాలిక సమాజాన్ని చిత్రించటంలో నేను చారిత్రక కర్తవ్యాన్ని, ఔచిత్యాన్ని పూర్తిగా పాటించాను. పాలీ, టిబెట్, సంస్కృత సాహిత్యాల్లో - ముఖ్యంగా జైన సాహిత్యంలో ఆ కాలపు ప్రజాస్వామికాలకు సంబంధించిన వివరాలు కొంతవరకు లభించుతున్నవి. నేను వాటిని వుపయోగించటానికి ప్రయత్నించాను. ఆహార - పానీయాల్లో, ఆచార - విహారాల్లో యెన్నో విషయాలు నేడు భిన్నంగా కన్పించుతాయి; కాని, ఆ భిన్నత్వము ప్రాచీనసాహిత్యంలో వ్రాయబడివున్నదే.

సెంట్రల్ జైలు,
హాజారీబాగ్,
27—5—42.

రాహుల్ సాంకృత్యాయన్.



# ప్రవేశిక

వైశాలి ప్రజాతంత్రాన్ని గూర్చి వ్రాయబడిన వివరాలు చాల కొద్ది. నాకు వాటిని చదువుతూంటే మరికొంత తెలిస్తే బావుండు ననిపించేది. నా మిత్రులలో కొందరు భూత - ప్రేతాలను నమ్మేవారున్నారు. మరణించిన వారి ఆత్మలు శరీరాలను వదలి ప్రేతలోకంలో మనచుట్టూ తిరుగుతూ వుంటాయనీ, వాటితో మాట్లాడే మహానుభావు లున్నారనీ వారి విశ్వాసం. అసలు ఆత్మయందే నమ్మకం లేని నాకు మరి ఆ ప్రేతాత్మలయందు, వాటి లోకంపైన విశ్వాసం యెలా వుంటుంది? అయినా పారసూరామ్ బ్రహ్మ నారాధించే బాబూరామదాస్ గౌడ్‌ను పరీక్షించడానికి నేను దీనినొక అవకాశంగా తీసుకున్నాను. వైశాలి ప్రజాస్వామికానికి చెందిన కొన్ని పేర్లు ఆయనకుచెప్పి వారిలో ఎవర్నైనా పిల్చి వైశాలిప్రజాతంత్ర చరిత్రను గూర్చిన వివరాలు తెలుసుకోమన్నాను. అలా చేస్తే యికనుంచి నాకలం ఆయన ప్రేత విద్యనుగూర్చి తీవ్రప్రచారం సాగించుతుందన్నాను; కాని, ప్రేతాత్మ కల్లబొల్లి మాటలు వాగితే నావద్ద గీటు రాయి వున్నదనే సంగతి జ్ఞాపకం వుంచుకోమని హెచ్చరించాను. అందుకు గౌడ్‌జీ యేమేమిటో చెప్పుకొచ్చాడు. తుద కాయన మాటల సారాంశం 'భూత ప్రేతవిద్య గ్రుడ్డివాళ్ళు, ధనవంతులకోసమే'నని తేలింది. భూతవైద్యము, ప్రేత విద్య ఎలాంటి బూటకాలో చెప్పటానికే యిక్కడీ విషయాన్ని తెచ్చాను.

కొన్ని సంవత్సరాలకు - గౌడ్‌జీ జీవితం చాలించిన తర్వాత - ఒక అసాధారణ విషయం జరిగింది. బాల్యంనుంచి పేద రైతుకుటుంబీకులైన నా తలిదండ్రుల కట్టి సామర్థ్యం లేకపోయినా - నన్ను సుకుమారంగా పెంచటానికి ప్రయత్నం జరిగింది. సుకుమారత్వం మహాపాతకమని, బంగారంలాంటి శరీరాన్ని మన్నుచెయ్యాలంటేనే ఆ పాపాన్ని మూటకట్టుకోవాలనీ అప్పట్లో నాకు మాత్రం ఏం తెలుసు? నాకాజ్ఞానం కలుగునప్పటికే పిట్టలు దాదాపు చేలో గింజలన్నీ యేరుకొని తినివేశాయి. అయినా యిప్పుడు - మంచి వయస్సులో - కాలుమీద కాలేసుకొని కూర్చోవటం నాకిష్టంలేదు. నేను నిత్యము నియమంగా పారతో నేల తిరగవేయ నారంభించాను. ఇది వ్యాయామమేగాక భూసేవ కూడాను. అందువల్ల యీ పరిశ్రమయందు నాకు మరీయిష్టం.

ఆ నాడు నేను చాప్రాజిల్లాలో ఒక మిత్రుని యింట అతిథిగా వున్నాను. ఉదయాన ఆయన్నడిగి పార తెప్పించుకొన్నాను. ఆవాళ నా మిత్రుడు దున్న బోతున్న చేలో ఒకచోట త్రవ్వసాగాను. నేల గట్టిగావుంది. త్రవ్వ సాగటం లేదు. అయినా ప్రక్కనేవున్న ఎండుతుమ్మకేసి పారను కొట్టి అంటు వదిలించు కుంటూ మళ్ళీ నా పని సాగించుతూనేవున్నాను. మిత్రుడు నా అవస్థ చూచి యేదో నెపంతో నన్నాశ్రమనుంచి తప్పించి యింటికి తీసికొని వెళ్ళటానికి ప్రయత్నించాడు; కాని, నే నెలాగైనా నిత్య-నియమాన్ని పూర్తిచేసితీరాలి. అదేగాక, అలవాటుచే నా చేతులు కాయలుకాని వుండటంవల్ల అప్పుడే బొబ్బ లెక్కుతాయేమోనన్న భయంకూడ లేదు. మిత్రుడు నా మొండిపట్టుతో నిరాశ చెంది ఒక ప్రక్కన కూచున్నాడు. అప్పుడే నేను నేలమీద పారతో నా బలం చూపాను. అడుగున నేల కొంచెం మెత్తగా వున్నట్టు తోచి మరి రెండుసార్లు విసిరాను. ఆ దెబ్బతో నా పార రెండుమూరల లోతు చూచింది. పైన చూస్తే యెక్కడా జనావాస చిహ్నమే లేదు; కాని, లోపల కుండపెంకులు కన్పడినై. నాకు పురాతనకాలంనాటి సంగతులు తెలుసుకోవాలనే ఆసక్తి-పిచ్చి-వుంది. నా కొక ఆలోచన కలిగింది - మూడడుగుల క్రిందవున్న యీ చిహ్నాలు ఆరువందల యేండ్లనాటివి కాకపోయినా కనీసం నాలుగుశతాబ్దాలనాటివి అయివుంటాయి. అంటే-ఎటుచూసినా మైలుదూరం వ్యాపించివున్న యీ పొలం-పైన మానవులు కాపురమున్న గుర్తులు ఇప్పుడేమీ కన్పించకపోయినా - ఒకప్పుడు జనావాసమై ఉండివుండవచ్చు. నా కుతూహలం అధికమైంది. పారతో యెదురుగా త్రవ్వటం మాని, క్రిందికి త్రవ్వ నారంభించాను. మరి రెండడుగుల క్రిందికిపోగా జనావాస చిహ్నాలు మాయమైనవి. నే నా అయిదడుగుల లోతుకు వెళ్ళానంటే వెయ్యేళ్లు కాకపోయినా యెనిమిదివందల సంవత్సరాలకు పూర్వం-మహమ్మదీయు లిక్కడికి వచ్చినప్పటి నేలమీద నిలబడి వున్నానన్నమాట. అప్పు డది జనశూన్యమై ఉండి వుండవచ్చు. ఏ వరదతోనో కొట్టుకొచ్చిన మట్టిని చూస్తే వుత్సాహం తగ్గాలి; కాని, అప్పుడు నా కుతూహలం యేమాత్రం అణగారిపోలేదు. ఆనాడు అంతటితోనే పని చాలించాను; కాని, మర్నాడు మళ్లీ అక్కడికే వ్యాయామానికి వెళ్తానని నా మిత్రునితో చెప్పాను.

ఆ రాత్రి పరిపరివిధాల ఆలోచించాను. పూర్వపు మహీనది - నేటి గండకి - యిక్కడికి కొన్ని క్రోసుల దూరంగా ప్రవహించుతున్నా, యీ ప్రదేశ మంతా దాని నీటితో తడిసినదే. మహీ ప్రవాహం ఒకప్పుడు యింకా దక్షిణంగా ప్రవహించింది. కాబట్టి యీ భూమి యిప్పటిలాగా కాక, పూర్వం మహాకా వినంగా వుపయోగపడి వుంటుంది. ఇంకా లోతుకు త్రవ్వి చూస్తే ఆ వరదమట్టి క్రింద ఇంకేమైనా జనావాసచిహ్నాలు లభించునేమో !

నేను త్రవ్విన ఆ గుంటకు మరునాడు ఆరడుగుల వ్యాసంగల బావి రూపమిచ్చాను. క్రిందికి పోయినకొద్దీ నేల మెత్తగా వుంది. ఒకచోట అడుగున్నర లోతున గుంట త్రవ్వాను. అక్కడ మళ్ళీకుండ పెంకులు, యిటుక ముక్కలు, యింటికప్పుకుపయోగించే పెంకులేకాక, రెండు చక్కని మట్టిబొమ్మలు, గాజుపళ్ళెమ్ముక్కలుకూడ కనపడినవి. రెండడుగుల దిగువనుంచి ప్రతి ఆరంగుళాల లోతున లభించిన జనావాసచిహ్నాల్లో ముఖ్యమైన వాటన్నిటిని వరుసక్రమంలో నమోదు చేసుకుంటూ వచ్చానని వేరే చెప్పనక్కరలేదు. ఎనిమిదడుగులలోతున గుప్తకాలపు (క్రీ. శ. 4వ శతాబ్దం) పొరయందు లభించినవస్తువులు నన్ను మరీ ఆకర్షించాయి. ఆ పైన వ్యాయామంతోపాటు ప్రాచీనచరిత్రను గూర్చిన జిజ్ఞాస కూడ నన్ను భూమితో బంధించివేసినది; కాని, అంత లోతున త్రవ్వటం, త్రవ్విన మట్టిని బయట పారవెయ్యటం నా ఒక్కనితో అయ్యేపని కాదు. నా ఉద్దేశాన్ని నా మిత్రుడుకూడ గ్రహించాడు. పైగా నా మాటలు, నేను వ్రాసుకున్న వివరాలనుబట్టి పురాతనవిషయాలపట్ల ఆయనకూ శ్రద్ధ కలిగింది. అందుచే నా కంటే ముందు ఆయనే చెప్పుకొచ్చాడు – "ఇంకా లోతు త్రవ్వాలంటే యెక్కువమంది అవసరమవుతారు. మన్ను తీయటానికి మాత్రమే కాదు; మరికొన్ని అడుగుల లోతుకు పోతే నీరూరవచ్చు. జనానికి కొదువలేదులే. కూలి విషయంలో సందేహించనక్కరలేదు ఎందరు కావాలో చెప్పండి"

నేను "ఇప్పుడు కొంచెం తెలివిగలిగి, దృఢకాయులైన వాళ్ళు అయిదుగురు చాలు, కాని వారికి కూలినే నిచ్చుకొనే షరతుమీద అయితే" అన్నాను.

ఆ మిత్రునికి నా బలహీనత, అప్పటి నా వికలత తెలుసు; అందువల్ల ఆయన నా షరతుకు అంగీకరించలా. మరునాడు నే నక్కడికి చేరుకునేప్పటికే నా స్నేహితుడు దిట్టమైన అయిదుగురు కూలీలతో, పారలు – పళ్ళికలతో సహా సిద్ధంగా ఉన్నాడు. నేను మళ్ళీ నా షరతు చెప్పాను. అందుకాయన "ఇక్కడ మీ షరతు లేవీ చెల్లవు. ఇదిగో చూడండి! టేపు నావద్ద వుండనే వుంది. ప్రతి ఆరంగుళాల పొరలోని వస్తువులను వేర్వేరు నెంబర్లతో విడివిడిగా పెట్టించుతాను. జనావాస చిహ్నాలు కనపడకుండ వుండేంత వరకు త్రవ్వసాగిస్తాను. నా యీ చేతల్లో యే లోపం జరిగినా ఆ పాప – పుణ్యాల భారమంతా మీదే" నన్నాడు.

ఇక నా షరతును పట్టుకొని వూగులాడటం అవివేకమే.

నేను నూతిలో రెండు ప్రక్కల అంచులవద్ద అరడుగు లోతున సమతలంగా త్రవ్వాను. ఆ మట్టినంతా బయట పారవెయ్యమని కూలీలతో చెప్పాను. ఇకమీదట ఆదేవిధంగా అరడుగు చొప్పున క్రిందికి వెళ్ళాలని బోధపరిచాను.

ఆరేసి అంగుళాల లోతుకు వెళ్ళటం అంటే ఒక్కొక్క శతాబ్దం వెనక్కి పోవటమే. గంగా – గండకీ తీరప్రదేశంలో భూమి మెరక వేసిన

దాని పరిణామ మిదే. ఈవిధంగా మేము క్రీ. శ. నాలుగో శతాబ్దాన్నుంచి మూడో శతాబ్దం, రెండో శతాబ్దాలనాటి నేల వైపుకు సాగిపోతున్నాము. ఇక నూతిలో నా వ్యాయామానికి వీలు లేకపోయింది. నూతిలోనుండి బయటికి వచ్చే ప్రతి పళ్ళేను జాగ్రత్తగా పరిశీలించి అందులో మానవ హస్తాలతో నిర్మితమైన వస్తువు లేవైనావుంటే ఏరి తీసి పదిలపర్చటము, మట్టి రకములను గుర్తించి, వీటన్నిటినీ కాగితంమీద గుర్తుగా రాసుకోవటమే కాక, నేను కూలీలకు పలుగులు, పారలు జాగ్రత్తగా వుపయోగించమనికూడ హెచ్చరించవలసివుంది. చాలా వస్తువులు-వాటిలో అతి ప్రాముఖ్యమైనవికూడ క్రీ.పూ. మొదటిశతాబ్దపు పొరలో దొరికాయి ఇది ఇలా వుండగా వూళ్ళో వింత వింత పుకార్లు పుట్టాయి. ఇక్కడ పూర్వం ఏ రాజుదో ఖజానా పాతపెట్టబడి వున్నదని అందరూ చెప్పుకో సాగారు; యిందులో మా పనివారి చెయ్యికూడ వుంది. 'పండిట్ జీ వద్ద ప్లాను వుండబట్టే త్రవ్వించుతున్నా'రని అనోట ఆనోట ప్రాకిపోయింది. ఈ లేనిపోని పుకారుతో యే రాత్రివేళ ఎవరు సాహసించి వచ్చి పడతారో, తలాతోకా లేకుండ అడ్డాడ్డంగా త్రవ్వేస్తారో - కంపోజు చేయబడిన కాపీలేని గ్రంథంలోని పుటల వైపు చిందర వందర అయినట్టు - నా యీ కృషి అంతా ఎప్పుడు భంగమై పోతుందోనని నేను చాలా భయపడ్డాను. నేను కలతచెందుట గాంచి నా మిత్రుడు ఆరాత్రే ఒక డేరా తెప్పించి యిచ్చాడు. తానుకూడ నాతోపాటు అక్కడే వుంటా నన్నాడు. నాకు అంతకంటె - గ్రుడ్డివానికి రెండు నేత్రాలకు మించి - యింకేం కావాలి?

శరీర పరిశ్రమకోసం త్రవ్వనారంభించిన ఆభూమి యిప్పుడు ప్రాచీన చారిత్రక పరిశోధనా క్షేత్రంగా మారింది. రోజూ గంట ప్రొద్దువుండగా వ్యాయామం నిమిత్తం నేను వేరొకచోట నేలను తిరుగవేస్తూవుండేవాణ్ణి. నేను రాత్రిపూట లాంతరువెల్తురులో పగలు యేరిపెట్టిన వస్తువులను రిజిష్టరులో ఎక్కించుతూంటే, నా మిత్రుడు వాటిమీద రిజిష్టరులోని వరుససంఖ్యలను, సంకేతాక్షరాలను అంకితంచేసి చెక్కలపెట్టెల్లో భద్రపరచేవాడు. ఆపని పూర్తి అయినతర్వాత నేను ముఖ్యమైన ఒకటి రెండు వస్తువులనుగూర్చి నా మిత్రునికి వివరించి చెపుతూండేవాడిని. 'అరంగుళాలక్రింద ఒక శతాబ్దానికి ముందు' అన్న సిద్ధాంతంమీద నామిత్రునికి నమ్మికలేకపోయింది. తర్వాత యెన్నో పొరలలో లభించిన గాజుపెంకులపైన, రెండు రాతిముక్కలమీద అక్షరాలుకూడ కన్పించాయి. ఓఝా (పరిశోధకుడు) గారి నుండి పురాతన లిపి మాదిరికూడ తెప్పించాను. అది వచ్చినపిదప కొన్ని అక్షరాల సాదృశ్యంకూడ చూపించాను; అయినా అయనకు విశ్వాసం కుదర్లేదు; కాని, త్రవ్వుసాగించే విషయంలో నాకంటె అధికంగానే ఆయన ఉత్సాహం కనపర్చేవాడు.

వెనకటి శతాబ్దాలలోకి జొరబడేకొద్దీ మాకు మరీ ప్రాముఖ్యమైన వస్తువులు లభ్యమైనాయి; కాని, అవి యితర గ్రంథాలకు సంబంధించినవి. నా యీ ప్రస్తుతకృతికి అవి అప్రస్తుతాలు.

పదహేను అడుగులలోతున మన్ను మరీ తడిగావుంది. బయటపడ్డ వస్తువులలో పెంకిక్రలు, చెక్కలు - నగిషీ చెక్కబడివున్నై. ఎప్పుడు ఊటవచ్చి అంతా నీటిమయమైపోతుందోనని నాకు భయం కలుగసాగింది. అప్పుడు నేనే స్వయంగా క్రిందికిదిగి, రానున్న ఆరంగుళాల పొరలోని విశేషాలను కనిపెట్టడానికి తవ్వుగోదలతో త్రవ్వసాగాను. ఏదో గట్టిగా తగిలింది. నేను తవ్వుగోదలతో అడుగునవున్న గట్టి వస్తువును గోక నారంభించాను. అక్కడ రాళ్ళుపరచివున్నట్టు తోచింది. నూతిలో రెండోవైపున అంచు తొలిచి క్రిందికి త్రవ్వి చూచాను. అక్కడకూడ రాళ్ళు పేర్చివున్నై. ఒక రాయి పెల్లగించి తీయటానికి ప్రయత్నించాను: కాని, అది విరిగిపోయింది. రెండుముక్కలూ చేర్చిపెడితే అడుగున్నర చదరంకలిగి అంగుళంమందాన అచ్చు తీసిన యిటుకలా వుంది. అది మౌర్యవంశపురాజులనాటి (క్రీ. పూ. ౩, 4 శతాబ్దాలు) పొరలోనిదని నే నూహించాను. ఇంతవరకు లభించిన యిటుకల కిది భిన్నంగావుంది.

ఆవాళ అంతటితో పని కట్టిపెట్టి పైకి వచ్చేశాను. ఇటుకముక్కలను జాగ్రత్తగా పరిశీలించసాగాను. వాటిమీద మాసిపోయిన అక్షరాలు కనిపించాయి; కాని, నాకు నమ్మకంలేకపోయింది. అసలాయిటుకమీద అక్షరాలు లేకపోయినా నా యేకాగ్రచిత్త విభ్రాంతియే ఆ అక్షరాలను దానిమీద అంకితం చేస్తోందని తలిచాను. అనుకొన్నట్టే జరిగింది. మళ్ళీ చూస్తే యిటుకమీద అక్షరాలు కనపడలేదు. నన్ను నేను కసురుకొన్నాను.

తెల్లవారేసరికి యిటుకముక్కలు కొంచెం గట్టిపడినై. మిగతా యిటుకలను పదిలముగా బయటికి తీయాలని నిశ్చయించుకొన్నాను. అందుకోసం కొయ్యచెక్కలకు త్రాళ్ళుకట్టి కాటాబల్లలవలె తయారుచేశాను. ఆనాడు నా మిత్రుని కలుపుకొని నేను స్వయంగానే పనిచెయ్యాలనుకొన్నాను. నూతి ఒడ్డున అంచునవున్న మట్టిని దూరంగా పారవేయుటకు కూలీలను పురమాయించుమని మిత్రునితో చెప్పాను. ఈ పురమాయింపుతో కూలీల కిదివరకే వున్న అనుమానం మరీ బలపడింది. ఆ యిటుకలు సత్యయుగంలో యే రాజో పూడ్చిపెట్టిన ధననిక్షేపంవున్న నేలమాళిగవే నని వాళ్ళనమ్మకం!

నేను పైవరుస యిటుకలను బల్లమీదపెట్టి మెల్లమెల్లగా పైకి జేరవేయించసాగాను. రెండుమూడు యిటుకలు చూచినపిమ్మట నా మిత్రుడు 'వీటిపైన అక్షరాలున్నట్టున్నై, చూడండి!' అన్నాడు బిగ్గరగా. క్రింద వెల్తురు తక్కువగా వుంది. వెంటనే నేను పైకెక్కివచ్చి పరిశీలించి చూచాను. ఇటుకలన్నిటిపైన

మాసిపోయిన బ్రాహ్మీ అక్షరాలువున్నై. అవి సామాన్య యిటుకలు కావనీ, యేదో గ్రంథంలోని పుటలనీ గ్రహించటానికి యెంతోసేపు పట్టలేదు. నా కుతూహలం ప్రబలమైంది. రెండోవరుసలోని యిటుక నొకదాన్ని తీసి పరీక్షించాను. దానిమీద చెక్కబడివున్న అక్షరాలు స్పష్టంగా కన్పించాయి. అది పై వాటికంటె గట్టిగాకూడ వుంది. నేను తక్షణమే దాన్ని తీసుకొని పైకి వచ్చాను.

మీ రీ అచ్చుపుస్తకాన్ని చదివినట్లే నేను బ్రాహ్మీలిపిలోవున్న అశోకుని శిలాశాసనాలను చదువగలను. కాబట్టి ఆ యిటుక రెండు ప్రక్కల చెక్కబడివున్న పంక్తు లన్నిటిని నేనొక కాగితంమీద నాగరిలిపిలో యెత్తివ్రాశాను. కొన్ని అక్షరాలు అశోకుని అక్షరాలకు భిన్నంగా వుండి చదవటానికి సందిగ్ధంగా వున్నా, యిటుక కిరువైపులనున్న అక్షరాలన్నీ స్పష్టంగానే వున్నై. భాషకూడ అశోకుని శాసనాల్లోనిభాషకు కొంచెం భిన్నంగానే వుంది. కాని, భాషోత్పత్తికి పూర్వా కొన్ని శతాబ్దాలతో పరిచితిగల నా కా భాష ఆకళింపు కాకపోదని కొద్దిసేపటిలోనే బుజువైంది. ఈ విధంగా లిపియందలి సందేహాలను భాష ద్వారాను, భాషలోని అనుమానాలను లిపివల్లను చక్కబెట్టుకుంటూ ఎత్తి వ్రాశాను, ఇటుకమీద ఒక్కొక్కవైపున పదహారుపంక్తులు - ప్రతిపంక్తియందు 26-27 అక్షరాలు - చొప్పున మొత్తం సుమారు వెయ్యి అక్షరాలు లేక పదహేను శ్లోకాలు వున్నై.

అప్పటి నాయానంద మెంతని చెప్పను! సంతోషంతో పొంగిపోయాను. ఆనందం చరమ దశకు చేరినప్పు డెట్లుంటుందోనాకప్పుడే బోధపడింది. ఆ అక్షరాలనూ నా చేష్టల్ని చూచి మిత్రుడా యిటుకల ప్రాముఖ్యతను గ్రహించాడు. ఎత్తి వ్రాయటం పూర్తికాగానే నేనా యిటుకలను యెండలో వదలి గుడారంలోకి వెళ్ళిపోయాను. మిత్రుని కుతూహలాన్ని గ్రహించి నే నాయనతో యిలా చెప్పాను.

"ఇవి మామూలు యిటుకలు కావు; ఒక గ్రంథంలోని పేజీలు. రచయిత కాగితము, సిరాలకు బదులు పచ్చి యిటుకలను, గంటాన్ని వుపయోగించి తన కృతిని స్వయంగా వ్రాశాడు, లేక రాయించాడు. తరువాత వాటిని కాల్పించి యిక్కడ నిక్షేపించాడు. మొత్తం యెన్ని యిటుకలున్నవో మనం తెలిసికోవలసివుంది. ఈ యిటుకపైన వ్రాసివున్న దాన్నిబట్టి రచయిత తన పరిసర వస్తువులను చక్కగా - కృత్రిమంకాని భాషలో - వర్ణించినట్టు తోస్తోంది. ఇందులో వున్న 'ఇష్టకా ఘర్' 'శిహ' అన్న పేర్లు రెండూ నాకిదివరకు తెలిసినవే. 'ఇష్టకా ఘర్' అనేది బుద్ధునికాలంలో వైశాలి ప్రజాస్వామికంలో ప్రసిద్ధిచెందిన బస్తీ. 'ఇష్టకా ఘర్' అంటే యిటుకల గృహమని అర్థం. అక్కడే శిహకి

(సింహుడు) కమత ముండేది. వైశాలి సర్వ సేనాపతి పేరు సింహుడే; కాని యీ సింహ నామము అతనిదేనని యిప్పుడే చెప్పటానికి వీల్లేదు. ఈ గ్రంథకర్త కూడ ఆ సింహుడేనని చెప్పలేము. ఏది ఏమైనా యీ ముఖ్యో రెండుపంక్తుల్లో వర్ణింపబడినట్లే గ్రంథమంతా రచింపబడి వున్నట్లయితే యిది ప్రపంచంలో కనుగొనబడిన ముఖ్యమైన వాటిలో ఒకటి అనటానికి సందేహంలేదు."

పాఠకులారా! పుస్తకాన్నిగూర్చి ఎక్కువగా తెలుసుకోవటానికంటె మీరు అసలు గ్రంథాన్ని చదవాలని ఆత్రపడుతున్నారు కదూ? నేను కూడ ఆవిధంగా తొందరపడ్డవాడినే. ఇందువల్ల మూల గ్రంథం ప్రకటింపకముందే అనువాదం - సింహ సేనాపతి - మీ చేతికెక్కుతోందని మీరు గ్రహింపగలరు. మరి ఒకటి రెండు మాటలు వినటానికి ఓపికపట్టండి. గ్రంథమంతా ఎత్తి వ్రాసి, అనువదించుటతో రచయిత మరెవరో కాక, వైశాలి ప్రజారాజ్య సర్వసేనాపతి సింహుడేనని స్పష్టమయింది. అతడు తన జీవితాన్ని - కాదు - తన కాలంనాటి ప్రపంచాన్ని సజీవమైనభాషలో యీ గ్రంథ రూపాన చిత్రించాడు. ఇందులో అతని జీవితాంశాలుకూడ లేకపోలేదు. సింహుని జీవితాంశాలున్న కొన్ని యిటుకల మీద అక్షరాలు మాసిపోయివుండటం శోచనీయమే; కాని యిప్పుడు మనయెదుట వున్నదాని ప్రాముఖ్యతకూడ తక్కువదికాదు. చివరను యిటుకలపైరాత అసలు చదవటానికే వీల్లేకపోయింది. మధ్యలోకూడ సరిగా కాలని యిటుకలు చదువశక్యంకాలేదు. అందువల్ల గ్రంథంలో అక్కడక్కడ కథాక్రమం తెగిపోయినట్టు చూడగలరు. ఇటుకలమీద వరుససంఖ్యలుకూడ వున్నై. అయితే అవి అంకెలలో కాదు-అక్షరరూపంలో వున్నై. నేటిఅంకెలు-మనవి-ప్రపంచమంతటా వాడబడుతున్నవి-పదమూడు లేక పదునాల్గు వందల సంవత్సరాలక్రితం మాత్రమే మొట్టమొదట మన భరతఖండంలోనే కనిపెట్టబడినాయి. అందువల్ల యీ గ్రంథంలో అంకెలు వాడబడియుండక పోవటం స్వాభావికమే. తుదిమాట ఏమంటే-రెండున్నరవేల సంవత్సరాల అనంతరం నేను దీనిని 'సింహసేనాపతి' (యీ పేరు నేను పెట్టినదే. గ్రంథంలో ఎక్కడా పేరు లభించనేలేదు. ప్రకరణాలకూడ శీర్షికలు నేనే పెట్టాను)ని అప్పటి వైశాలిభాష నుంచి హిందీలోకి అనువదించి మీముందు పెడుతున్నాను. నేను స్వంతంగా చేర్చినది [ ] బ్రాకెట్లలో వున్నదిమాత్రమే. ఇటుకలు పూర్తిగా చదువశక్యం కాని చోట్ల × × × × యీగుర్తులూ, అక్షరాలు మాసిపోయి, బోధపడనితావులందు ...... యీ చుక్కలూ వుంచాను. ప్రాచీన భూగోళ సంబంధమైన పేర్లకు బదులు పాఠకుల సౌకర్యానికి ప్రస్తుతం వాడుకలోవున్న పేర్లు వాడాను. మూల నామములు మూలగ్రంథం ప్రచురించిన తర్వాత తెలియగలవు. సింహుని కాలంనాటి రీతి-రివాజులు కొన్ని నేటి హిందూధర్మానికి విరుద్ధంగా కన్పించుతాయి. ఈ విషయంలో హిందూ పాఠకులు నన్ను తిట్టవచ్చు; కాని

అట్టివారి కొఱక వినతి చేస్తున్నాను. నేను నేటి అనేకమంది హిందూరచయితల్లాగా వాస్తవాన్ని మరుగుపరచి, సత్యానికి ద్రోహం చేయలేను; సింహా సేనాపతికి అపచారం చెయ్యజాలను. నా యీ నిజాయితీయందు విశ్వాసంలేనివారు యీ పదహారువందల యిటుకల్ని పాట్నా మ్యూజియంలో చూడవచ్చును. కొంచెం ఓపికపట్టితే ఆ యిటుకల ఛాయాచిత్రాలతో సహా నాగరిలిపిలో ప్రచురితమైన గ్రంథమే మీ చేతికొస్తుంది. నేటి పతిత హిందూ మానసికతత్వాన్ని నేను లక్ష్యపెట్టను; నేను గౌరవించేది ఒక్క సత్యాన్నే-కాలో హ్యయం నిరవధిర్విపులా చ పృథ్వీ.

—సంపాదకుడు.



13



# 1. ఆచార్య బహుళాశ్వుడు

× × × [మరికొందరి] తర్వాత నేను ఆచార్యుని ఎదుటపడవలసివచ్చింది. ఆచార్య బహుళాశ్వుడు "నీ పేరు, గోత్రా లేమిటి నాయనా?" అని అడిగారు.

"కశ్యప గోత్రం, పేరు సింహుడు" అని చెప్తూ నేను కైండా డాలును ఆచార్యునిముందు పెట్టాను.

ఆచార్యుడు అక్కడక్కడ యినుపమేకులు తాపడం చేయబడ్డ ఆ డాలును చేత్తో పట్టుకొని చూసి "యీ డాలు చాల అందంగాను, దృఢంగా కూడ వున్న"దన్నారు.

"నా తండ్రి కైండాను తమ చేతుల్తోనే చంపారు. ఇది కైండా తయారు చేసిందే"

"అయితే వత్సా! నీ జనకునికి తక్షశిలా పౌరులకు ప్రియమైనదేదో తెలుసన్నమాట; కాబట్టే ఆయన ప్రత్యేకంగా దీన్ని సంపాదించి పంపాడు!"

"కాని-గురూ! నా తండ్రి గతించి పదమూడు సంవత్సరాలు గడిచిపోయాయి. అప్పుడు నాకు అయిదేండ్లు మాత్రం"

"అయ్యో నాయనా! తండ్రిలేని పుత్రుని అవస్థ నే ననుభవించిందే. నా కనిమిదేళ్ళప్పుడే మా తండ్రిగారుయీ లోకాన్ని విడచిపెట్టారు. అయితే నాకు ముగ్గురన్నలు, జనని వున్నారు. నీకు తల్లి వున్నదికదూ?"

"అవును గురూ! నన్ను ప్రాణంగా చూచుకొనే తల్లిక్షేమంగానేవుంది. నే నామె తొలి బిడ్డను. నా తండ్రి మరణానంతరం అమ్మ మళ్ళీపెళ్ళి చేసుకొన్నది. ఆమె రెండో భర్త నన్ను మారుటితండ్రిగా కాక బాగానే చూస్తున్నారు. ఆయనదయవల్లనే నేనింతవరకు చదువుకొని శాస్త్రజ్ఞానం సంపాదించుకోగలిగాను."

"అయితే వత్సా! నువ్వు శుల్కమిచ్చి చదువుకోలేవన్నమాట; అయినా పర్వాలేదులే. నీలాంటి పేదవిద్యార్థులకు బహుళాశ్వుని సదనంలో స్థానానికి కొదువ లేదులే."

"ఆచార్యులవారి కృపకు నా కృతజ్ఞతను మాటలలో యెలా తెలుపగలను."

"చెప్పాల్సిన అవసరం లేదు కాని, నా నేర్పబోయే విద్యకు తగిన శిష్యుడనని పించుకో, అంతే చాలు."

“ప్రయత్నించుతాను గురూ! వైశాలిలో ఆచార్య మహాలికి యోగ్య శిష్యుడ ననిపించుకొన్నట్లే, యిక్కడకూడ తమ వాత్సల్యానికి పాత్రుడ నవటానికి ప్రయత్నిస్తాను.”

“అయితే నువ్వు వైశాలి ప్రజాతంత్ర రాజ్యపౌరుడవన్నమాట. వజ్జిదేశాన్నుంచి వచ్చావా? నా సహపాఠి - మిత్రుడు - ఆచార్య మహాలికి శిష్యుడవా? చాలా సంతోషం. వత్సా, సింహా! తక్షశిలను మీ వైశాలిగానే భావించుకో. తూర్పున వైశాలిని తలచుకొని మేము గర్వపడుతాముసుమా. తతిమ్మా వన్నీ నిరంకుశ నియంతృత్వాలే. కురు, పాంచాల, వత్స, కోసల, మగధరాజ్యాలన్నింటా నిరంకుశరాజుల ఏకాధిపత్యమే. అక్కడ ఆర్యత్వమే అంతరించిపోయింది. ఆ రాజ్యాల్లో తిన్నగా తలెత్తుకొని తిరిగే మగవాడేడీ? ఆ నిరంకుశ పాలకులు దేవజాతీయులనీ, ఆర్యులనీ పిల్వబడుతున్నారు. ఆర్యు లందరూ సోదర సమానులౌతారేగాని, వారిలో కొందరు దేవాంశ సంభూతులై నిరంకుశ పాలకులు కాజాలరు. సట్లజ్ నది కీవల నిరంకుశరాజెవడైనా వున్నాడూ వత్సా?”

“లేదు గురూ!”

అంతే వత్సా! మా సప్తసింధులో మల్ల, మద్ర, తూర్పు గాంధార రాజ్యాల్లో యెక్కడికైనా వెళ్లిచూడు; అన్నిచోట్ల ప్రజాతంత్ర ప్రభుత్వాలనే చూడగలవు. ఇక్కడ నిరంకుశరాజనేవాడే లేడు. మా రాజ్యాల్లో ఒకనిముందు మగాడు చేతులు నలుపవలసిన అగత్యం లేదు. వైశాలిలోవలెనే తక్షశిల, సాగల్‌కోట [సయాల్‌కోట] లలో గణ [ప్రజాతంత్ర] శాసనాలే అమల్లో వున్నై. తూర్పున నిరంకుశరాజ్య మహాసముద్రంలో వైశాలి ఒక ద్వీపంలాగా ప్రజాపాలనను నిలబెట్టుకొంటోంది. అంతే, శాక్య, కోలియ, మల్ల ప్రజాతంత్ర రాజ్యాలు పతనమైపోగా వైశాలి ఒక్కటే నిల్చివుంది. కోసలరాజ్య నిరంకుశ ప్రభువు - అతని పేరేమిటి?”

“ప్రసేనజిత్తు, !”

“ఆఁ, ప్రసేనజిత్తు. అతడు మా గురువుగారు - ఆచార్య భూరిశ్రవుని వద్ద చదువుతూండేవాడు. ఒట్టి శుంఠ. చేతినిండ డబ్బుండబట్టిగాని, లేకుంటే తక్షశిల గురుకులంలో విద్యార్థి కాగలిగేవాడేకాదు. మా గురువుగారు తూర్పు నుంచి వచ్చిన విద్యార్థుల్లో మహాలి, బంధులమల్లు లందు అభిమానం కలిగివుండేవారు. వారు నన్నుకూడ వాత్సల్యంతో చూసేవారు.”

“బంధులమల్లు యిప్పుడు కోసల సేనాధిపతిగా వున్నాడు గురూ!”

“సిగ్గుసిగ్గు! నిరంకుశరాజుకు కొలువుచేసేకంటే పస్తుండి చావటం మేలు. విషం తాగి ప్రాణం వదలటం ఉత్తమం; ఏఁ వత్సా?

“అవును గురూ! ప్రజారాజ్యపౌరుల కనీసవాంఛ అదే.

"కుమారా; సింహా! తూర్పున పంచాయితీ రాజ్యాలనుండి వచ్చే విద్యార్థులకు విద్యాబోధ చేయటంలో మేము ప్రత్యేక శ్రద్ధవహించుతాము. అందుకు కారణ మేమిటో తెలుసా? వారే తూర్పున ఆర్యధ్వజధారులై ఆర్యధర్మాన్ని కాపాడుతారని మేము నమ్ముతున్నాం. మేము స్వతంత్రమానవులము, ఆర్యులము. ఆర్యులైనవారెల్లరు స్వతంత్రులుగా వుండుటే మా అభిమతం. మా పూర్వీకులసోదరులు, బంధువులు తూర్పు ప్రాంతాలకు పోయి క్రమంగా ఆర్యుల ఆచార-వ్యవహారాలను విడనాడి, కురు, పాంచాల ప్రజాస్వామికాల స్థానే నిరంకుశ ఏకాధిపత్యాలు స్థాపించారు. అప్పటినుంచి మేమువారిని పతితులుగానే భావించుతున్నాము. వారు తా మార్యులమని చెప్పుతున్నా మేము వొప్పుకోము. ఆర్యావర్తమన్నదిదే. ఇక్కడే ఆర్యధర్మం ఆచరణలో వుంది. ఆర్యుల రంగు-రూపాలు యీ ఆర్యావర్తంలో మాత్రమే కన్పించుతవి. వత్సా! తూర్పుదేశాల విద్యార్థుల్ని ప్రేమతో చూడటానికిదే హేతువు. మీ వర్ణం మారంగులాగానే వుంటుంది. మహాలిచ్ఛవీ అలాగే వుండేవాడు. బంధులమల్లుకూడ అంతే. ప్రసేనజిత్తుని చూచీమాత్రంతోటే వర్ణసంకరుడని తోస్తుంది."

"అవును గురూ! రాజులు కాముకులు, వారు కామాంధులై ఆర్య, అర్ధార్య, అనార్య భేదాన్నే పాటించరు. అందువల్లనే వారి ఆర్య రుధిరం ఆర్య రక్తంతో కలిసి తొత్తిడమైపోయింది. వారు వీర్యాన్ని మాత్రమే ప్రధానంగా గణిస్తారు."

"వాళ్ళ మొఖాన గణిస్తారు. ఎక్కడా [illegible]ట్ట తెగకుండ కాపాడుకొంటూ వచ్చిన పూర్వుల ప్రత్యేకతను, వర్ణ సంపత్తిని బూడిదపాలు చేసివేశారు. కాల సర్పం కాటువేస్తే మేమా వ్రేలును తక్షణం నరికి వేస్తాం. చీడ పట్టిన రెమ్మను ఆ క్షణంలోనే త్రుంచివేస్తాము. అందువల్లనే యిక్కడ స్త్రీ-పురుషులెల్లరు గౌరవర్ణం కల్గివుండటం చూడగల్గుతున్నావు. అందరి వెంట్రుకలు అగ్నిశిఖలవలె పసుపెరుపుల సమ్మిళిత వర్ణంగాను, నేత్రములు నీలి లేక స్వర్ణకాంతికలిగి వుంటాయి. ఇంతకుముందు మనయెదుటనుంచి వెళ్ళిన ముగ్గురు తూర్పుయువకుల్ని చూచావుగా. వారిలో యీ వర్ణసంపద వున్నదంటావా?"

"కాని, గురూ! ఆ వర్ణ దారిద్ర్యానికి యితర కారణాలుకూడా వున్నై. తూర్పున అర్ధార్యులు, అనార్యులు ఆర్యులకంటె అధికంగావున్నారు. వారు ఆర్యులకు లోబడివున్నప్పటికీ, అనార్యులసంఖ్యాధిక్యతచే ఆర్యరక్తందూష్యమౌతోంది."

"అయినా నీ రక్తం కళంకితం కాలేదే! వత్సా! నిన్ను మా రోహిణీపరసు నిలబెట్టితే నీవు మా అమ్మాయికి సోదరుడవు కావని యెవరనగలరు? సరిగా ఈ మెరువలె నికేశములు, అదే నీలిరంగు లీనుతున్న కళ్ళు! మహాలి, బంధుల మల్లులుకూడ అచ్చంగా యిలాగే వుండేవారు."

"ఇందుకోసం తూర్పున ప్రజాస్వామికాల్లో మేము ఎన్నో కట్టు దిట్టాలు యేర్పరచవలసి వస్తోంది. బిడ్డలనుకనే తలి - దండ్రుల్లో యే ఒకర్ని జాత్యేతర సంబంధం పెట్టుకోనివ్వము. మేము మా ప్రజాసత్తాక రాజ్యంలోనో, లేక అట్టి యితర రాజ్యాల్లోనోతప్ప అన్యత్ర వివాహాలు చేసుకోము. అయితే మా ప్రజాస్వామికంలో ఆర్యేతరులు లేకపోలేదు నల్లని దాసీజనం మా యిండ్లలో తఱచుగా కన్పించుతూనే వుంటారు.

"అది చాల ప్రమాదం వత్సా! అన్ని అనర్థాలకు అదే హేతువు. అందువల్లనే ఆర్యరక్తం అనార్య క్షేత్రంలోకి పోతుంది. ఆ తర్వాత ఆర్యుల సర్వనాశనం ఆరంభ మవుతుంది. మా పంచాయతీరాజ్యంలో బానిసవిధాన మే లేదు. అనార్య నౌకరులు, పనిబాగులవాళ్ళు వున్నారు. వారికి మా పంచాయతీ పాలనలో పాల్గొనే హక్కు లేదు; కాని, మేము వారిని క్రయ - విక్రయాలు చేయబడే బానిసల్లాగా చూడం. సట్లజ్ కివతలి ప్రదేశంలో అనార్యులు చాల తక్కువగా కన్పిస్తారు. సరె వీటన్నిటికి యేమిటిగాని, వైశాలి పంచాయితీ రాజ్యం సుభిక్షంగా వుందా? సౌమ్యమూర్తి - మహాలి కుశల ప్రసన్నుడేగద?

"అవును గురూ! వైశాలి సర్వసమృద్ధంగానే వుంది. ఆ గడ్డమీద సర్వసస్యాలు ఫలించుతున్నై. అక్కడి ఆవుపాలు, పెరుగు, నెయ్యి, మాంసాదులు లిచ్ఛవులకు పుష్టిని చేకూర్చుతున్నాయి. కోల, శాక్య, మల్లరాజ్యాలు కోసలరాజు ప్రాదాక్రాంత మవటంచూచి మగధభూపాలుడు - బింబిసారుడు వైశాలినికూడ తలెత్తుకొని వుండనీకుండ స్వాధీనం చేసుకోవాలనుకొంటున్నాడు. దక్షిణోత్తర అంగ రాజ్యాన్ని జయించిన దర్మలా అతనికి వైశాలి వైభవాన్ని కైవశం చేసుకోవాలన్న కాంక్ష ప్రబలమయింది. కాని, యింకా లిచ్ఛవీ క్షత్రియుల కత్తులు మొద్దుబారలా; మా ఒరలు శూన్యంగా లేవు; వీర లిచ్ఛవుల మేనులందింకా ఉడుకు రక్తం పొంగుతూనే వుంది. పదమూడేళ్ళ క్రితం లిచ్ఛవుల బాహు బల పరాక్రమాన్ని చవిచూచిన మగధరాజుకు మళ్ళీ యింతవరకు వైశాలివైపు కన్నెత్తిచూచే ధైర్యం లేకపోయింది. ఆ యుద్ధంలోనే నా తండ్రి చంపబడ్డాడు."

"అయితే నువ్వు వీరపుత్రుడివి! భేష్, మరి నా సోదర సమానుడు - మహాలివద్ద యే యే విద్యలు నేర్చుకున్నావు?"

ముష్టియుద్ధం నేర్చుకొన్నాను. మల్ల, ఖడ్గయుద్ధాల్లోకూడ పాల్గొనగలను. ధనుర్ధారినై శబ్దం, చలనాలనుబట్టి గురిపెట్టి కొట్టటంలో తర్ఫీదు పొందాను. రథ, గజ, తురగ, పదాతిదళాల ఆక్రమణ, ప్రత్యాక్రమణ విధానాల్లోను, వ్యూహ, దుర్గ రచనల్లోను నేను నేర్చుకొన్నది నామమాత్రమే."

"ఏమిటీ, పద్దెనిమిదేళ్ల వయస్సులోనే యిన్ని విద్యలు నేర్చావా! శభాష్! కాని, వత్సా! చదువుకు అంతులేదు. అది దినదినాభివృద్ధి చెందుతూనే వుంటుంది.

మా వద్దకు తూర్పునుండే కాక, పశ్చిమదేశాలనుంచికూడ విద్యార్థులు వస్తూంటారు. ఇప్పుడిక్కడ పశ్చిమగాంధార, కాంభోజ, పారశీక, బవేరు [బాబిలోనియా], గ్రీకుదేశాల విద్యార్థులుకూడ వున్నారు. మా యీ దూరప్రాంతాల విద్యార్థులు కేవలం అభ్యాసకులే కాదు; మేము వారిద్వారా ఎప్పటికప్పుడు నవీన యుద్ధ విధానాలు ఆకళింపుచేసుకుంటాం. ఈమధ్య పర్షియా రాజును చావుదెబ్బ కొట్టిన యవనవీరులు ఆ యుద్ధంలో సరికొత్తపద్ధతులు అవలంబించారు; అయితే అది సముద్రయుద్ధమే ననుకో. మన పంచాయితీ రాజ్యాలవారికది విద్యావిలాసంగానే వుంటుంది; కాని, వత్సా! దీన్నిబట్టి యుద్ధవిద్య అనుదినాభివృద్ధిచెందుతూన్నట్టు కన్పించటంలేదూ? తక్షశిలావాసులం నిరంతరం పరిణతిచెందుతూన్న సమర విధానంలోని అతి చిన్న మార్పులనుకూడ గమనించుతూ, వాటిని గ్రహించుటలో అత్యంత శ్రద్ధ వహించుతాము. మేము ఎల్లప్పుడు బూజుపట్టిన పాతవిద్యనే నేర్పుతూ కూచుంటే, తక్షశిలకీ ప్రాముఖ్యత ఎన్నాళ్ళుంటుంది? విద్యా విషయంలో తక్షశిల పేరు, ప్రఖ్యాతులు జగద్విదితమే! మాకు తూర్పున వైశాలి యెంత దవ్వున వుందో పడమట అంతదూరానగల పర్శుపురం అవతలకూడ తక్షశిల కీర్తి వ్యాపించింది. యవనులు అంతకంటె దూరాన వున్నారు; అయినా వారు మాకు మిత్రులే. విరోధిశత్రువు మిత్రుడవటం సహజమే. గ్రీకులు పారశీకపు రాజును తలెత్తకుండ ఓడించారన్నవార్త తెలియగానే మా తూర్పు గాంధారంలో ప్రతిచోట ఆనందోత్సవాలు జరుపబడినాయి. పశ్చిమ గాంధారం - మహాసింధు అవతలిప్రాంతం యింకా పారశీకుల ఆధీనంలోనే వుండిపోయిందన్నదే మాచింత. యవనులచే దెబ్బతిని వుండకపోతే వాళ్ళు మా తక్షశిలవైపుకూడ సాగి వచ్చేవాళ్ళు"

"గురూ! పడమటివైపునుండి తక్షశిలకెట్టి భయమున్నదో అట్టిదే వైశాలికి మగధరాజ్యంవల్ల వుంది. తక్షశిలకు ప్రమాదం ఒక్కవైపునుండేగాని, వైశాలికి రెండుప్రక్కలా-తూర్పు, దక్షిణదిశలందు దుష్టబింబిసారుని రాజ్యమేవుంది. బింబిసారుడు యింతవరకు మెదలకుండానే వున్నాడు; కాని అత డేక్షణంలోనైనా దండెత్తిరావచ్చునని లిచ్ఛవీ యువకులం యెరుగుదుము."

"కాని, మగధరాజు పర్షియాచక్రవర్తి ముందేపాటి! మహాసింధు-ఎరుగుదువా!-యిక్కడికి నాల్గైదు రోజుల ప్రయాణంలోవుంది. అక్కడినుంచి యవనరాజ్యందాక ఆ క్రూరునిరాజ్యమే. మా గాంధారజాతి బాహుబల పరాక్రమంలోగాని, యుద్ధ-కళా-కౌశలంలోగాని వారికి తీసిపోదు; అయితే యేం? పారశీకులు సగం ప్రపంచాన్ని ఆక్రమించుకొని వున్నారు. ఇదే విడదీయరాని సమస్యయై మమ్మెదుర్కొంటోంది. ఇందుకు తరుణోపాయమే తోచకున్నది. సప్తసింధులోని ప్రజాస్వామికాలన్నీ కలిసికట్టయితే యెదిరించి పారశీకుల్ని

తరుమవచ్చు; కాని, అందరూ ఏకమవటం అంటే ప్రజాస్వామ్య సూత్రాలకు స్వస్తిచెప్పటమే అవుతుంది ”

“మాకు కూడా యీ చిక్కే యెదురౌతున్నది శాక్య, కోల, మల్లరాజ్యాలు కోసలాధిపతిచే పరాజితమవటానికిదే కారణం. వారి కంఠకంటె గత్యంతరం లేకపోయింది. ఆవి తమ ఆచారానికి విరుద్ధంగా ఐక్యం కాలేకపోయినవి. మరి దేనికదే ప్రత్యేకంగా కోసల సేనా వాహినులను అరికట్టడానికి తగు సామర్థ్యం లేకపోయింది.”

“...మరి ఆ కోసలరాజ్యానికి బంధులమల్లు సేనాపతి అయినాడు! ఛి, ఛీ! సిగ్గుచేటు !”

“అందరూ అసహ్యించుకొంటున్నారు ఇప్పుడతడు నామమాత్రపు మల్లు, మల్లు లెవరూ అతణ్ణి స్వజాతీయునిగా పరిగణించటంలేదు.”

“వత్సా! ఇంతకూ బంధులమల్లు ఒళ్లమ్ముకోవలసి వచ్చుటకు హేతు వేమిటో తెలిసిందా ?”

“అతడు తక్షశిలలో నేర్చిన విద్యాపాటవాన్ని పరీక్షింపదలిచి మల్లు లొక నాడు పాతిన యెదురుగుంజలను ఒకే వేటుతో నరకమన్నారట.”

“ఊఁ, అయితే ?”

“బంధులమల్లు ఒక్కదెబ్బకే నరికివేశాడు; కాని, నరికేటప్పుడు ‘ఝున్’ మన్న ధ్వని అయిందట. పరిశీలించిచూస్తే వాటిలో పెద్దపెద్ద యినపమేకులు కన్పించాయి.”

“మల్లులుచేసినపని వీరోచితము, ఆర్యులకు తగినదీ కాదు.”

“అందువల్ల బంధులమల్లుకు పట్టరానికోపంవచ్చింది. వెంటనే అతడు కుశినరలో తన కెవరూలేరనీ, యిక తనకా పట్టణంతో ఏలాటి సంబంధం లేదనీ చెప్పి, తక్షశిలలో తనకు సహాధ్యాయిగావున్న ప్రసేనజిత్తువద్దకుపోయి ఆశ్రయించాడు. నీచుడు - ఉచ్చాపని చేశాడు !”

“అదైనా ఎలాంటి తరుణంలో! మల్లులు తమ స్వాతంత్ర్యాన్ని తిరిగి సాధించుకొనుట కతని సేవాశక్తి అవసరమున్న అదన్లో !”

“అవును, సరిగా అట్టితరుణంలోనే”

“వత్సా! బంధులమల్లు ఆవిధంగా చేస్తాడని నేను కలలోకూడ తలచి వుండలేదుసుమా. ఒకవేళ తక్షశిల నన్నవమానించి, అపహాస్యం చేసినా నేను పోయి శత్రుమూకలో చేరితే క్షమింపవచ్చునా ? బంధులా! ఎట్టినీచానికి ఒడిగట్టావోయ్! ఆచార్య భూరిశ్రవుల పవిత్రనామానికి కళంక మాపాదించావే - సరే, వత్సా! నిన్నుగూర్చి నేనింకే వివరాలూ తెలిసికోవలసిన జరూరులేదు. నీవు నేటి నుండే నా శిష్యుడుగా పరిగ్రహింపబడ్డావు.”

అని చెప్పి ఆచార్యుడు తమ తనయ నుద్దేశించి చెప్పారు - "రోహిణీ! సింహుని తీసికొని పో, ఇతణ్ణి అన్నగా చూచుకో, మన యింట్లోనే బస, భోజనం యేర్పాటు చెయ్యి, వివరాలు మీ అమ్మ చెప్తుంది."

మేము మాట్లాడుతూన్నంతసేపు రోహిణి ఆచార్యుని ప్రక్కనే కూచొని వుంది. ఆచార్యుడు నన్ను రోహిణితో పోల్చుతున్నప్పుడే నా దృష్టి ఆమెపైన పడింది. అప్పుడే నా చెల్లెలు "సోమ" జ్ఞప్తి కొచ్చింది. సోమ పదేళ్ళది. ఆమె రోహిణీవలెనే సువర్ణకేసి. సమున్నత నాసిక, విశాల ఫాల భాగము, నిగనిగ మెరసే మేను, పెద్ద కళ్ళతో సోమ రోహిణిలాగే వుంటుంది. అయితే రోహిణి సోమకంటె పెద్దది. నేను వైశాలినుండి వర్తక సమూహంతో బయల్దేరి యెనిమిది నెలలకు తక్షశిలకు చేరుకొన్నాను. ఇన్నాళ్ళలో సోమ రూపం నా స్మృతి పటంలో క్రమంగా వన్నె తరుగుతూ వచ్చింది. కాని రోహిణీ సందర్శనంతో ప్రియసోదరీస్మృతి మళ్ళీ యథారూపం దాల్చింది. నా ముందున్నది. రోహిణే కాని, నా కళ్ళ కక్కడ సోమ కన్పిస్తోంది. నా చూపు ఆమెపైనే నిల్చిపోయింది. ఆచార్యుడుగాని, అన్యులుగాని గమనించితే ఏమనుకొంటారోనని నా మనసును నిగ్రహించు కోటానికి ప్రయత్నించాను. ఆచార్యునితోడి సంభాషణ సుబోధకము, మనోరంజకము అయివుండకపోతే నేను కన్నీరాపుకొని యుండజాలక పోయేవాణ్ణే. మధ్య మధ్య రోహిణిపైన దృష్టిపడినపుడెల్లా హృదయానికి శీతగాలి తగిలినట్టుండేది. అసలది చలికాలంకూడాను. తక్షశిల పరిసరాల్లోని కొండలు తెల్లని మంచు తెరతో కప్పబడి వున్నై.

ఆచార్యుని ఆదేశంతో రోహిణి లేచివచ్చింది. నేను మౌనంగా ఆమె ననుసరించి బయల్దేరాను. ఆచార్య బహులాశ్వుడు తక్షశిల పంచాయితీరాజ్యంలో సర్వ సంపన్నుడైన గౌరవనీయ వ్యక్తి. ఆ ప్రజారాజ్యానికి సర్వసేనాపతిగాకూడ పనిచేశారు. పంచాయితీ సభ [ప్రజా పరిషత్తు]లో ఆయన సలహాలు సగౌరవంగా స్వీకరింపబడేవి. ఆచార్యుని లోగిలి యేడు భాగాలుగా విభాజితమైవుంది. బయటి భాగంలో ఘోటకశాలలు వరుస తీర్చివున్నై. అచటి గుఱ్ఱములను గొప్పగా చెప్పకోటానికిగల కారణాన్ని ఆతురంగములను గాంచి గ్రహింపసాగాను. ఆచార్యునికి అశ్వములను పోషించుటయందె గాక, ఉత్తమజాతిని వృద్ధిచేయుటలో కూడ మోజెక్కువ. ఇతర తక్షశిలావాసులకువలెనె ఆయనకు చాలా దూరంవరకు వ్యాపించిన భూములున్నవి. వాటిలో ఒకదాన్ని ఆయన గుఱ్ఱాల మేతకోసం ప్రత్యేకించివుంచారు. గుఱ్ఱపుస్వారీ యందుకూడ వారికి సరదాయే. షష్టిపూర్తి అయినా ఆయన ప్రతినిత్యం తెల్లవారుజామున ఒక గంటసేపు నియమంగా స్వారీ చేస్తుంటారు. ఆయన స్వోపయోగానికి పదహారు గుఱ్ఱాలు యెప్పుడూ సిద్ధంగా వుంటై. అశ్వశాలలలోవున్న ఆ గుఱ్ఱాలను రెప్పవాల్చకుండ చూస్తున్న నన్ను గాంచి రోహిణి "ఏం అన్నా! గుఱ్ఱపుస్వారీ నీ కిష్టమేనా" అని అడిగింది.

"బలే సరదా రోహిణీ! మా ప్రాంతాలకు సైంధవాశ్వాలు యిక్కణ్ణుంచే యెగుమతి అవుతై; కాని, వీటినిచూస్తే మా కొచ్చేవన్నీ పనికిరాక యేరి వేసినవని తోస్తోంది."

"అవునంతే, మావద్దకూడ బేరగాళ్లు యేటేటా నలభై-యాభై గుఱ్ఱపిల్లల్ని కొనుక్కుపోతుంటారు; కాని, నాన్నగారు మంచిజాతిపిల్ల నొకదాన్ని కూడ అమ్మరు."

"ఆ సంగతి వీటిని చూస్తేనే తెలుస్తోంది. నేనిట్టి ఉత్తమాశ్వాలను మా వైశాలిలో ఎక్కడా చూచెరుగను. రోహిణీ! నువ్వు స్వారీ నేర్చుకొంటున్నావా ?"

"నేర్చుకొంటున్నావా అని అడుగుతావేమిటి ? నేనీ పదహారు గుఱ్ఱాల్లో దేన్నైనా యెక్కి స్వారీచేయగలను. ప్రతిరోజూ ఉదయాన నాన్నగారితో పాటు నేనూ స్వారీచేస్తుంటాను."

"నా చెల్లెలు సోమ ఎన్నడూ గుఱ్ఱమెక్కిన పాపానపోదు. అందువల్ల అడగానులే."

"ఏం అన్నయ్యా! నీకు చెల్లెలుకూడ వుందీ ?"

"అవు నమ్మాయీ; మా అమ్మ సంతానమే. అచ్చంగా నీకుమల్లేనే వుంటుంది. ఇప్పుడామెకు పదేళ్ళుంటై. మరి నీకో ?"

"ఓహో, బలేగా వుందే! నాకూ పదేళ్లే."

"కాని, సోమ నీకంటె చిన్నదిలా కన్పిస్తుంది. నేనూ చిన్నదే ననుకొంటున్నాను. అయితే యీ యెనిమిదినెల్లో యింకా కొంచెం ఎదిగివుండవచ్చు. సోమ చాల మితంగా మాట్లాడుతుంది."

"అయితే నేను అధికంగా వాగుతున్నానా?" అని రోహిణి చిన్నపుచ్చుకొన్నట్లు మొహం దించుకుంది.

రోహిణి వీపుమీద బంగారుతీగల్లాగా విడబడివున్న కేశములను చేతి వ్రేళ్ళతో దువ్వుతూ లాలింపుగా అన్నాను–"కాదు రోహిణీ! సోమ నీముందు మూగదానిలా వుంటుందని చెప్పబోతున్నాను. ఏపిల్లా మూగదానివలె వుండటం నాకు బాగుండదు. సరే, నేనుకూడ నీతో కలసి స్వారీచేస్తుంటానేం?"

"అట్లయితే, అన్నయ్యా! నువ్వా ఎఱ్ఱగుఱ్ఱాన్నెక్కుదువుగాని దాన్ని 'రోహిత్' అంటాం. అది అన్నిటికంటె మంచిది; అదంటే నాన్నగారికి చాలా యిష్టం. రోహిత్ నన్ను చక్కగా ఆనవాలెరుగుతుంది. నేను దానిదగ్గర కెడుతున్నాను, చూడు" అని రోహిణి రోహిత్ వైపుకు వెళ్ళింది. అది ఆమెను చూడగానే సకిలించింది; ముందు కెళ్లగానే రోహిణిమూర్ధాన్ని మూర్కొనసాగింది. ఆమె ఆనందంతో నావంకచూస్తూ అంది– "రోహిత్ కు నేనంటే

ప్రేమ. నాన్నగారు నా లలాటంమీద ముద్దుపెట్టుకోవటం చూస్తూంటంవల్ల యిదికూడ నా తలకు ముట్టాన్చుతుంది. సింహన్నయ్యా! మనిషికిమల్లె తెలివి గల్గిన యిలాంటి గుర్రాన్ని ఎక్కడైనా చూచావూ?"

నేను నవ్వి అన్నాను-"లేదమ్మాయ్! ఇలాంటిదాన్ని చూడలా. నువ్వెప్పుడైనా దీన్నెక్కి స్వారీచేశావా?"

"స్వారీచేశాను కాని, చూడు, చెయ్యెత్తినా నాకు దానివీపు అందదు. అందువల్ల దీనిపై కెక్కటానికి నాన్నగారిసాయం కావాల్సివస్తోంది"అని రోహిణి చిన్నపోయిన మొహంతో నాదరి కొచ్చింది.

నే నామె చిబుక మెత్తి పట్టుకొని "అవసరంలేదు రోహిణీ! నువ్వెప్పుడూ యింత కుఱచగానే వుండిపోవుగా. ముందుముందు ఎత్తుగా ఎదుగుతావులే. అందాక నువ్వు కోరినప్పుడెల్లా నిన్నెత్తి రోహిత్పై కెక్కించటానికి నేనుంటాగా" అన్నాను.

"కాని, అదినిన్ను దరికి రానివ్వదన్నయ్యా! రోహిత్ కొత్తవాళ్ళని, తనకు కోపం తెప్పించినవాళ్ళని దగ్గరకే రానియ్యదు. నవ్వబోకన్నయ్యా! రోహిత్ బలే తెలివిగలది. అయితే నీకు నేనొక వుపాయం చెపుతాలే. దానికి పచ్చని గోధుమ చాలాయిష్టం. పచ్చిదుబ్బులు తెచ్చిదాని నోటికి అందించుతూండు. నిన్నుచూచి అది సకిలించిందా నీ కది మాలిమి అయినట్టే."

"సరే. యిక వెళ్దాంపద. నీకు ఆకలవుతూంటుంది, అమ్మదగ్గరికి తీసుకెళ్ళి నీకు అన్నం పెట్టిస్తా రా."

"అలాగే రోహిణీ! ఆకలిగానే వుంది కాని, ముందు అమ్మని చూడాలని వుబలాటంగా వుంది."

"మా అమ్మ చాలా మంచిది. నీకక్కడ నాలాంటి చెల్లాయివుందనీ, అమ్మవంటి తల్లివుందనీ విని, నిన్ను బాగా ప్రేమిస్తుంది. వెళ్దాంరా" అని రోహిణి ముందు దారితీసింది.

ఆచార్య బహుళాశ్వుని పేరు ఆయనకు చక్కగా తగిపోయింది.



# 2. గురుపత్ని

మేము ముందుగా గురుపత్నిని చూడవలసివుంది. అందుకని గోష్ఠచావడి, విద్యార్థుల వసతిగృహం దాటి సరాసరి అక్కడికే వెళ్ళాము. ఆ గృహనిర్మాణం చాలవరకు మా వైశాలి భవంతుల్నే పోలివుంది. అక్కడిలాగే ఒక ప్రక్కన వసారాలున్న కొట్లు, మధ్య మెట్లూ, వరుసగా గదులు వున్నై ఆ యింటికీని. ఏదీ రెండంతస్తులకు తక్కువలేదు. అశ్వ, గోశాలలు మిద్దెల మీదనే గడ్డి-గాదాలుంచే గదులూ, పాలగదులూ, నౌకర్లగదులూ వున్నై. ఇక్కడ కొనడానికీ, అమ్మడానికీ దాస - దాసీ జనంలేరు. ఆచార్యునికి ఆర్య వర్ణ - సంపద (రంగు) అంటే మహా శ్రద్ధ. ఆయన నౌకర్లలో నల్లటివాళ్లుగాని, చామన చాయ మనుష్యులుగాని లేనే లేరు. పశ్చిమ గాంధారులు, కాంభోజులే ఎక్కువగా వున్నారు. కొద్దిమంది యిరానీయులుకూడ వున్నారు. ఇక్కడియిళ్ళ మా వైపు పెంకుటిళ్లవలెగాక, పశ్చిమకోసల దేశంలో మాదిరిగా పైకప్పులన్నీ మిద్దెలే. మట్టితో వంకరటింకర కంకరముక్కలు కలిపి మిద్దె వేస్తారు. గోడలుకూడ రాతి ముక్కలతో పేర్చినవే; పైన మట్టితో మందంగా పూత[illegible]తారు. ఇక్కడ గోడలుకడుతూంటే చూచాను. చిన్నరాతిముక్కలతో అంతేసి పెద్దపెద్ద గోడల్ని అందంగాను, దృఢంగాను కట్టవచ్చని నేను వూహించనైనా లేదు. కిటికీలు ద్వారాలు దేవదారు కఱ్ఱవి. కఱ్ఱమీద లతలు, పువ్వులు, విగ్రహాలు చెక్కి నగిషీపెట్టడంలో తక్షులు వైశాలి వారి కేమాత్రం తీసిపోరు. ఆచార్యుని స్వగృహానికిముందు విశాలమైన ప్రాంగణం వుంది. అందులో రకరకాల పూలమొక్కలు నాటబడివున్నై. అప్పుడు మంచు జడు లధికమవడంవల్ల వాటి ఆకులన్నీ రాలిపోయాయి. ఒక పందిరినిండా ఆకుల్లేని ద్రాక్షతీగ అల్లుకొని వుంది. "ఇది మామూలు ద్రాక్ష కాదు. పేరుమోగిన కపిషా ద్రాక్ష. మా నాన్నగారి శిష్యుడొకాయన ఆఫ్ఘనిస్తానం నుంచి పంపించాడు. మారుకాలం వచ్చింది; కాని అప్పుడైతే పచ్చని ఆకుల్లోన్నుంచి ద్రాక్షగుత్తులు ఎంతైనా కమనీయంగా కన్పించుతై." అని రోహిణి ఆద్రాక్షనుగూర్చి చెప్పింది.

మరి "తీ పోకి?" అని నే నడిగాను.

"ఆ సంగతి చెపితే నీకు నమ్మకం కలుగదన్నయ్యా! నీకు రుచి చూపిస్తాగా."

"ఎలాగైనా యెండుద్రాక్షలో ఆ మాధుర్యం వుండదు."

"ఎండువి కాదు-తాజా పండ్లలాంటివే."

"అయిదు నెలల క్రితం కోసినవి తాజాగా ఎలావుంటై ?"

"నువ్వే చూస్తావుగా ! మరి నువ్వా కపిషా ద్రాక్ష సారా చవిచూడనే లేదేమొ ? ఏం అన్నయ్యా ?"

"లేదమ్మా ! చెప్పుకోవటంమాత్రం విన్నాను, అంతే."

"అట్లయితే అమ్మతో చెపుతా, యివాళే రుచిచూపించమని. అది అఫ్ఘనిస్తానంనుంచి వచ్చిండే. సార్థవాహులు లిక్కణ్ణుంచి యేటేటా ఆ దేశానికి వెడుతూంటారు. ప్రతి సంవత్సరం వారు వందలాది కుప్పెలతో ద్రాక్షసారా మాకు తెచ్చిపెడతారు."

"అయితే మీ యింట్లో అక్కడినుంచి తెప్పించిన ద్రాక్ష రసాన్నే తాగుతూంటారా రోహిణీ ?"

"ఉహ్హే, కాదు, అది వ్యాపారంకోసం. తూర్పుదేశాల వ్యాపారులుకూడ తక్షశిలనుంచి వేలకొద్దీ తోలుసిద్దెలతో కపిశాయనము తీసుకుపోతూంటారే ! నువెప్పుడూ తాగనేలేదూ?"

"మా వైపున అది చాల ప్రియంగా అమ్మబడటంవల్ల అందరికీ అందుబాటులో వుండదు. తూర్పు ప్రజాస్వామికాల్లోని ప్రజలం తిండి, గుడ్డల విషయంలో చాల పొదుపుగా వాడుకుంటాము." అని నేనంటూండగా గురుపత్ని దృష్టి మావైపు పడింది. ఇంకనూ అరుల్లేని ఆ ద్రాక్ష పందిరివద్దనే జాగుచేయడం బాగోదని నేను ముందుకెళ్ళి ఆచార్య సతికి నమస్కారం చేశాను. రోహిణి నన్నామెకు తమ భాషలో పరిచయం చేసింది.

"అమ్మా ! ఈయన కొత్తగా వచ్చాడు. ఈ అన్నయ్య పేరు సింహ, నాన్నగారు నన్నీయన్న సోదరుడుగాచూచుకోమన్నారు. మరినాకు అన్నయ్యేగా, రా, అన్నా ! నాప్రక్కనుంచో ఓహో! నేను నీ రొమ్ముదగ్గిరకేవచ్చాను !అమ్మోయ్ ! చూడు ! నాకీత డన్నయ్య అని నాన్నగారు భలేగా కలిపారు కాదూ ?" అంది రోహిణి.

"అవునమ్మా ! నీకు అన్నే; కాని, యింతకూ మీ అన్నకు ఆకలితీర్చేదేమన్నా వుందా, లేక "అన్న, అన్న"అని వుత్తమాటల్తోనే కడుపునింపేస్తావా? రా నాయనా ! అదుగో, వాకిట్లో నీళ్ళున్నై : కాళ్లూ, చేతులూ కడుక్కోనిరా. తరవాత అన్నం తింటూ కబుర్లుచెప్పుకోవచ్చు."

"నే నన్నయ్యకి కపిసా ద్రాక్షపండ్లు పెడతా నన్నానమ్మా."

"అయితే పరుగెత్తుకెళ్ళి తే, చూస్తావెందుకు ? ఒక ద్రాక్షకుప్పె పట్టుకురా."

"అమ్మా ! మరే, సాయంత్రం ద్రాక్షరసం కూడానే" అన్నది రోహిణి.

"అట్లాగేలేవే. మర్యాద అంతా నువ్వేచేసి సింహను నువ్వొక్కదానవే అన్నను చేసుకోవాలనుకుంటున్నానా ? అమ్మకుమాత్రం కొడుకేడీ ? దబ్బున

పోయి కుప్పెతీసుకురా. సాయంత్రం అన్నా-చెల్లెలు ద్రాక్షరసంతో విందారగిద్దురుగానిలే. మరి నువ్వు రోహిణావద్ద నేర్చుకొన్న పార్శీనృత్యంకూడ చూపించుదువుగాని."

రోహిణి పరుగెత్తికెళ్ళింది. నేను వాకిట్లోవున్న చెంబుతీసుకొని చేతులూముఖం కడుక్కొని గురుపత్నివెంట మెట్లెక్కి పైకెళ్ళాను. ఇక్కడ చెప్పులు అనేక రకాల తోలు అట్టలు కలిపి దళసరిగా కుట్టుతారు. పాదాన్నంతా మూసివేసే తోలుమేజోళ్ళుకూడ తొడుక్కుంటారు. గురుపత్ని అలాంటిజోడే ధరించి వున్నది. చలిబాధనుండి తప్పించుకోటానికి నేనుకూడ తక్షశిలకు వస్తూ, మార్గంమధ్యలో అల్లాంటి జోడే కొన్నాను. మేము ద్వారంవద్ద చెప్పులు వదలి హాలులో ప్రవేశించాము. అందులో క్రింద రంగు రంగుల లతాగుల్మములతో అతి రమణీయంగావున్న తివాసి పరచబడివుంది. గోడలకు రెండుమూడు పటాలు వేలాడుతున్నై. అందులో ఒకటి 'రోహిత్' లాంటి అశ్వానిది. అది గురుపత్ని చిత్రించినదే. చావడి, భోజనశాల ఆడంబరం లేకుండా అలంకృతమైవున్నాయి. హాలుకు కొంచె మవతలగా వంటిల్లువుంది. వంటింటి పొగగొట్టంలోనుంచి పొగ లేస్తోంది. దాన్నిబట్టి మధ్యాహ్న భోజనం సిద్ధమవుతున్నట్టుంది.

మేము తివాసీ మీద చతికిలబడ్డాము. గురుపత్ని తెల్లని దుప్పటిని మాముందు పరిచింది. తర్వాత ఆమె భోజన సామగ్రిని తెచ్చేందుకు వంటింట్లోకి వెళ్లింది. అంతలో రోహిణి కొబ్బరి కురిడీలాంటి మట్టి కుప్పెతో వచ్చింది. కోసిన అయిదు నెలల తర్వాత కూడ ద్రాక్షపండ్లు తాజాగానే వుంటాయన్న నమ్మకం నాకింకా యేర్పడనేలేదు. ఆ కుప్పె రెండు కొబ్బరి చిప్పల్లాంటి మట్టి డిప్పలతో తయారుచేయబడ్డది. రెండు డిప్పలూ బంకమట్టితో అతికించబడినాయి. ఆఫ్ఘనిస్తానంలో ద్రాక్షపండ్ల నిల్లాగే నిల్వచేస్తారని రోహిణి చెప్పింది. అంచుల వద్ద అతికిన మట్టి నూడదీసి పైమూతను తెరువగానే అందులోనుంచి రెండేసి అంగుళాలపొడగుపాటి ద్రాక్షపండ్లు స్వర్ణకాంతు లీనుతూ కన్పించినై. గురుపత్ని రెండు పెద్దపెద్ద వుడుకబెట్టిన మాంసపుముక్కలు, సైంధవ లవణపొడి, కొన్ని వుండ్రాళ్ళు తెచ్చి వడ్డించింది. రోహిణీ, నేనూ వాటిని తినసాగాము.

"ఇక చెప్పు నాయనా! నీ దేవూరు?" గురుపత్ని కన్నతల్లిలాగ ప్రేమతో అడిగింది.

నే నామెకు నా పుట్టుపూర్వోత్తరాలు సవిస్తారంగా చెప్పాను. అంతా ఆలకించి ఆమె మళ్ళీ అన్నది — "మహాలిలిక్షువీని నే నెరుగుదును. అప్పుడు నేను రోహిణికంటె చిన్నదాన్ని. మహాలి మా తండ్రి భూగ్రశవులవారిశిష్యుడు. అతడు నాకు చాలా చక్కని కథలు విన్పించేవాడు."

"అన్నయ్యా! నీకూ కూడ కథలు వచ్చా? నాకూ కూడ మంచిమంచి కథలు చెప్పవూ?" అంది రోహిణి మధ్యలో అందుకొని.

"అయితే, పిల్లా! నువ్వు మమ్మల్ని మాట్లాడనిస్తావా లేదా? ఆc, వత్సా! అప్పట్లో తక్షశిల ముష్టిరు లందరిలోను మహా బలశాలి మహాలే. అత నితో కాస్త కుస్తీయుద్ధంగా జోడు కాగలవా రెవరైనా వుంటే మీ గురువుగారే. సరేగాని, దారిలో ఏ యిబ్బందులూ కలుగలేదుగద?"

"సార్థవాహుల వెంట ప్రయాణంచేశాను. వ్యాపారం నిమిత్తం వణిజా డొకాయన వైశాలినుంచి సాకేతపురానికి బయల్దేరుతూంటే నేనుకూడ వెంట వస్తాననీ, అంతవరకు తన సార్థంలో యేదైనా పని యిప్పించమనీ ఆయన్నడి గాను. ఆయన అందుకంగీకరించి నావలనుండి సరుకు దిగుమతి, ఎగుమతులు చేస్తూ రాత్రిప్పు కత్తి చేతపట్టి పహారా యివ్వటానికి నియోగించాడు. బత్తెఖర్చు లేకుండా సాకేతపురానికిచేర్చేయాఖై♦కార్షాపణములివ్వటానికియేర్పాటుచేశాడు."

"అట్లయితే బిడ్డా! నువ్వు రెక్కల కష్టంచేస్తూ యిక్కడికి చేరుకొన్నా వన్నమాట. పాపం ఎంత యాతన పడ్డావో!"

"సాకేతందాక యే కష్టంలేదమ్మా! అంతవరకు పడవమీదనే ప్రయాణం. మేము మాళవదేశాన్నుంచి గంగానదిలో యెగువకు ప్రయాణంచేసి సరయూ నదిలో ప్రవేశించాము. మా బిడారులో యాభై పడవలతో వెయ్యిమందికి మించి జనం వున్నారు. సరయూలోసగం ప్రయాణంచేసినపిదప ఒక్క పర్యాయం మాత్రమే బందిపోటు దొంగలువచ్చి మా పైనపడ్డారు. అయినా, మేమే ఎక్కువ మందిమికావటంవల్లా, మాలో ఆయుధ పాణులు బల - పరాక్రమవంతు లవటం వల్లా వాళ్ళు వెంటనే తోకముడుచుకొని వుడాయించారు. మా గుర్రపు రౌతులు వెంటపడాలనుకున్నారు. కాని, అపరిచితారణ్యంలో వాళ్ళ పత్తా తెలియటం సులువుగాదని విరమించారు. తర్వాత సాకేతపురం యివతలి యాత్రలో వుపద్ర వాలు యెక్కువయ్యాయి. శ్రావస్తి వణిక్ శ్రేష్ఠుడు-సుదత్తుని సార్థవాహులు తక్షశిలకు ప్రయాణం కట్టారు. ఆ బిడారులో వెయ్యిబండ్లు, రెండువేలకు పైగా ఎడ్లు, గుర్రాలువున్నై. వెయ్యిన్నరజనం వున్నారు. దారిలో పెద్ద పెద్ద నదులు, మహారణ్యాలు దాటవలసివచ్చింది. మార్గం యేర్పరచుకోవటము, అంతమంది జనానికి భోజనం, పశువులకు గ్రాసము - దానా యేర్పాటు చేసుకోవటము, పైగా రేయింబగళ్ళు సాయుధదళం వంతులవారీగా కాపలా కాయటము యివన్నీ మొత్తంమీద కష్టంతోకూడుకొన్నవే. ఒక బండికి పహారాయిచ్చేపని నావంతు కొచ్చింది. తక్షశిలకుచేర్చి, నాకు నూరు కార్షాపణములు ముట్టజెప్పారు."

"వైశాలినుంచి యిక్కడికి చేరుకోటానికి యెన్నాళ్ళుపట్టింది నాయనా!"

"ఎనిమిది మాసాలు అమ్మా"

"తినటం ఆపకు నాయనా! దూడమాంసం వేడిదైతేనే రుచిగావుంటుంది. ఏదీ ఆ కత్తియిలా యివ్వు; నేను ముక్కలు కోసియిస్తాను. ఆ వుగ్రాళ్ళు కూడ

♦ కార్షాపణం నవటాకెత్తు వెండి నాణ్యం.

తిను; ద్రాక్షపండ్లు తీసుకోవేం? ఇక్కడ వాటికేమీ కొదువ లేదులే, తిను బిడ్డా!"

"మా తూర్పుదేశంలో వుండ్రాళ్ళు సర్వసామాన్యమే గాని, యీ ద్రాక్ష మాత్రం మాకు దుర్లభమే నమ్మా! ఎండుద్రాక్ష మాత్రమేలభ్యమౌతుంది. తాజావి మాకు స్వప్నతుల్యమే."

"అలాగా నాయనా! తర్వాత బండిమీద ప్రయాణం సంగతిచెప్పు. ఇన్నాళ్ళు యెందుకు పట్టిందీ?"

ఆవిధంగా మా ప్రయాణం రోజుకు రెండు యోజనాలకుమించి సాగేది కాదు. గడ్డిగాదం లభ్యంకానిచోట యెకాయెకీని వేగిరంగాను, అది సుళువుగా దొరికే ప్రాంతంలో నాలుగైదు దినాలు విశ్రాంతి తీసుకుంటూ తాపీగా గుర్రాలను, ఎడ్లను కడుపార మేపుకొని ప్రయాణం సాగించవలసివచ్చేది. అంతేకాక దారిలో అహిచ్ఛత్రం, హస్తినాపురం, ఇంద్రప్రస్థం మొదలైన పట్టణాల్లోను, పల్లెలందును వ్యాపారం కూడ చూచుకోవలసివుంది. సన్నని మజిలీన్లు, రత్న సెల్లాలు, పట్టుబట్టలు, తివాసీలతో మా బళ్ళునిండివున్నై. అవిగాక చందనాది సుగంధ ద్రవ్యాలు, దంత, సువర్ణరత్న ఖచిత వస్తు సముదాయము కూడ వున్నది. గంగ, యమున మున్నగు నదీతీరములందలి తీర్థస్థానములందు ప్రతిచోట సుదత్తుని అంగళ్లు వున్నై. అట్టి తావులందు విక్రయార్థము సరకుల దిగవిడచి, క్రయంచేసిన వస్తువులను యెగుమతి చేసుకొనే వాళ్ళం."

"అయితే సుదత్తుడు గాలగొప్ప సార్థవాహుడన్న మాట!"

"తూర్పు దేశాల మొత్తానికే గొప్పవాడు. ఇప్పు డతనితో దీటగు మరొక వణిజుడే లేడనొచ్చు. అసలు జంబూద్వీపం మొత్తంలోనే అట్టివాడు కన్పించడం కష్టం. ఇక్కడ కూడ అతని పణ్యాగారం వుంది."

"తక్షశిలలోనా? ఇంతదూరాన కూడ అతని అంగడా?"

"అవును యిక్కడే నన్నమాటేమిటి, తూర్పు - పశ్చిమ సముద్రతీరాలందలి తామ్రలిప్తి, భరుకచ్ఛములవంటి తీర్థరాజములందు కూడ ఆయనకు అంగళ్లు వున్నాయి. నదీ వాహినులన్నీ పోయిపోయి సముద్రంలో కలియునట్లు నాలుగు సముద్రాల లక్ష్మి ప్రవాహంగావచ్చి శ్రావస్తిలోని సుదత్తుని యింటపడుతోంది"

"ఆఁ! సరే, యిక నీ ప్రయాణం వైనం పూర్తిచెయ్యి".

"సుదత్తశ్రేష్ఠిబిడారు నిర్మాణము విధానము, యేర్పాట్ల పద్ధతులవల్ల అతని పతాకాన్ని చూచినంతనే దొంగలు దారిలోనుండివైదొలగిపోతారు. ఒక్క పాంచాల మహారణ్యంలో మాత్రం ధ్వజమెత్తి దోపిళ్ళు చేస్తున్న గజదొంగ ఒకడు మాకు తారసిల్లాడు. వాడు అయిదు వందలమంది జనము, వారికి చాలినన్ని గుర్రాలతో వచ్చాడు; అయినా వాళ్ళు మాముందు ఒక్కగంటసేపు మాత్రమే నిల్వగలిగారు. అక్కడే ఆచార్య మహాలి ప్రసాదించిన ఖడ్గవిద్యను ప్రదర్శించే అవకాశం

చిక్కింది నాకు. ఎనమండుగురి రక్తంతో నా ఖడ్గానికి అభిషేకం చేశాను కూడాను."

"అయితే, నాయనా! నీకు దెబ్బలేమీ తగల్లేదుగద?"

"ఒకటి తగిలింది స్వల్పంగా, ఈచేతి మనికట్టుకు పై భాగాన" అని నేను ఉన్ని చొక్కాచేతిని పైకెత్తి పొడుగాంటి మచ్చను చూపించాను.

రోహిణి - నాకు ద్రాక్షపండ్లను తుడిచి యిస్తున్నదల్లా చటుక్కున మచ్చ మీద వ్రేళ్లతో తడిమిచూసి "అబ్బో! ఎంతనెత్తురు కారిపోయిందో నన్నయ్యా!" అన్నది.

"లేదు, రోహిణీ! కత్తివేటుతో పడ్డ గాయాన్నుంచి అంతగా రక్తం కారిపోతుందన్న భయంలేదు. నరం తెగినాకూడ రెండువేపులా గట్టిగా బిగించి కట్టు కడితే రక్తస్రావం కట్టుడిపోతుంది. బల్లెంతోనో, అంబుతోనో పడ్డ గాయమైతే ప్రమాదమే. ఆ గాయాన్నుంచి రక్తంకారకుండ ఆపటం చాలా కష్టం".

"కాని, అన్నయ్యా! ఆ అద్ధాన్నపు అడివిలో నీ గాయానికి మందువేసి కట్టుకట్టేందుకు వైద్యుడులేడుగా?"

"ఈమాత్రపు గాయానికే మందూ మాకూ యెందుకమ్మా! అయినా సుదత్తుని బిడారులో శల్యచికిత్సకుడు, విషవైద్యుడూకూడ వుంటారు. అక్కడొక్కచోటనే దెబ్బలాటదాకా వచ్చింది. తతిమ్మా ప్రయాణమంతా నిరపాయంగా సవ్యంగానే సాగింది. నిన్న సుదత్తుని బిడారు యిక్కడికి చేరింది. ఆచార్య మహాలి ఆదేశంప్రకారం నేను తిన్నగా గురుకులానికి వచ్చేశాను."

"ఇది నీ స్వంతయిల్లే నాయనా!"

♦ ♦ ♦ ♦



# 3. తక్షశిల

తక్షశిల మా వైశాలివలెనే మైదానంలో నిర్మింపబడ్డ మహానగరం. వైశాలికి చుట్టుపట్ల ఎక్కడా పర్వతాలు లేవు. కాని, తక్షశిలకు దూరంగా పసిరిక కొండలు, పర్వతాలు వున్నై. పట్టణానికి పక్కనేవున్న చిన్న నదిలో యీ కాలం ఆ కాలమనక యెల్లకాలం నీరుంటుంది. ఉత్తరానవున్న కొండకుచేర్చి కట్టవేసి, పెద్ద జలాశయమొకటి నిర్మింపబడింది. అది మగధలోని సుమాగధివలెనే వుంటుంది. దానిలోనుంచిబయల్దేరిన కాల్వలు నగరంలో బహుముఖాలుగా ప్రవహించుతాయి. వాటికిరుప్రక్కలా గట్లపైనున్న వృక్షలతలు చూడటానికి అత్యంతరామణీయకంగా వుంటై. పచ్చని దృశ్యానికి తహతహాప్పస్తే హేమంత ఋతువులో తక్షశిలయందలి స్త్రీ - పురుషుల కా దృశ్యం నేత్రానంద దాయకంగా వుంటుంది. ఇక తక్షశిలా నగరవీథుల్లో ఒకప్రక్కన సుందర సౌధములముందు మందగమనంతో ప్రవహించుతూండే ఆ కాలువల దృశ్యం మరీ అద్భుతమై చూడ సొంపుగా వుంటుంది. ఆ కాల్వల్లోని నీరు నగరోపయోగానికే గాక తోటలు, భూముల తడుపుకూడ వినియోగపడుతుంది. పట్టణ బహిర్భాగాన వ్యాపించియున్న పండ్లతోటలు, వుద్యాన వాటికలు నగరానికి మరింత శోభను చేకూర్చుతున్నై. ఆ వుద్యాన వనాలు ద్రాక్ష, అక్రోటు, అంజూర, సీమరేగు, మొదలగు వివిధ ఫల - వృక్ష - లతా సంభరితములు. వేసవియందీ చెట్ల శీతల ఛాయలనుండి కాలువల్లో ప్రవహించు నిర్మల వినీల తోయముల నెంతసేపు చూచినా కన్నుల కలసటే వుండదు. మా ఆచార్యునికికూడా పండ్లతోటలు విరివిగానే వున్నై. తోటలందే పండ్ల నెండబెట్టుటకును, నిల్వచేయుటకును తగినయిండ్లు, గోదాములుకూడ వున్నవి. వర్షఋతువు ఆరంభమైన లగాయతు శరదృతువు గడచిపోయేవరకు వృక్షములు, లతలు పుష్పించి ఫలించుతుంటాయి. ద్రాక్ష తీగలను కత్తిరించి గుబుర్లుగా చేస్తారు. ద్రాక్ష గుత్తులు మొదట్లో లేతరంగు పచ్చలవలెను, పిమ్మట పుష్యరాగముల గుత్తులవలెను అతి మనోహరంగా కన్పించుతాయి. పద్మరాగాలను పోలిన ఎర్రని అంజూరపండ్లశోభ నేత్రానంద దాయకంగా వుంటుంది. విశాలోన్నతములైన అక్రోటుమ్రానులు కొమ్మలంతటా చిక్కగా ఆకులుకల్గి చల్లని నీడ నిస్తాయి. చెట్లనిండ పండ్లుండు కాలంలో తక్షశిలలోని తోటలదారులన్నీ తెరువబడి వుంటాయి. పాంథులు స్వేచ్ఛగా యే తోటలోనికైనా పోయి యే యేపండ్లైనన్ని కోసుకొని ఆరగించినా అభ్యం

తరం వుండదు; కాని, కష్టపడి మూటలుకట్టుకొని పోవడంమాత్రం తప్పుగా భావించబడేది.

తోటలు దాటిన తర్వాత పంటభూములు చాలా దవ్వువరకు వ్యాపించి వున్నై. మా గురువుగారికి కొండ్ర యెక్కువగానే వుంది. చలికాలంలో ఆ భూములందు స్మశానవాటికల్లోని నిశ్శబ్దవాతావరణం తాండవించుతూంటుంది. భూములన్నీ ఒట్టి యెండుగడ్డలు. పొలాల్లోవుండే యిండ్లలో నౌకర్లు మాత్రమే మసలుతూంటారు. గొడ్లు-గోదకూడా వుంటాయి. వసంతాగమనంతో అక్కడి నిస్తబ్ధతపోయి నల్దిక్కులా సజీవత్వం నిండిపోతుంది. కరిగిన మంచుతో చెమ్మగిల్లిన భూమిని చీల్చుకుంటూ వందలాది అరకలు నడుస్తుంటాయి. మేడపట్టి దున్నేవారి మధురగానంతో ఆ ప్రాంతాలు ప్రతిధ్వనించుతూ వుంటై. ఆ పనిపాటల రోజుల్లో విద్యార్థులం అందరం ఆచార్యునితోపాటు పొలాల్లోకి వెళ్ళేవాళ్ళం. చెత్తపోగులు విరజిమ్మటం, దుక్కిదున్నటం వగైరా పనుల్లో సాయపడుతూండే వాళ్ళం. వైశాలిలో వుండగా నేను పొలంపాటులో ఆరిందా ననిపించుకొన్నాను. ఇక్కడకూడా ఆ పేరు నిల్పుకొన్నాను. మా ప్రాంతంలో దున్నుతూ పాడేపాటలు నాకింకా జ్ఞప్తికున్నది. కాని భాషాభేదమే కాక యిక్కడి పాటల్లోకూడ చాలతేడా వుండటంవల్ల యెగతాళి చేస్తారన్న వెరపుకొద్దీ నేను గొంతెత్తి పాడటానికి సాహసించేవాణ్ణి కాను; అయినా నా ప్రక్కనున్నవాళ్ళు పాడుతూంటే లయనందుకొని గునిసేవాడిని. మరుసటి దుక్కులొచ్చేసరికి యిక్కడి పాటలే కొన్ని కంఠస్థం చేశాను.

మధ్యాహ్నంవేళ నాగళ్ళాపి చిగురుటాకుల చెట్ల నీడను విశ్రాంతి తీసుకొనే వాళ్ళం. ఒక్కొక్కప్పుడు పుష్కరిణీ రూపం దాల్చిన పంటకాల్వలలో స్నానమాడేవాళ్ళం. అది స్నానంచేసే సమయం కాకపోయినా యువకచాపల్యంతో నీటిలోకి దిగేవాళ్ళం. అలాంటప్పుడు మా శరీరావయవాల గుణదోషాలను తెల్పుతూ ఆచార్యులు చక్కని సలహా నిచ్చేవారు. బట్టలన్నీ దిగవిడిచి దిగంబరులమై యువతీ - యువకుల మందరము గట్టుమీదనుంచి నీడలు తేలుతూన్న నీటిలోకి వురికేవాళ్ళం. మేము ఓలలాడుతూంటే మా సర్వాంగములను పరిశీలనగా పరికించిన ఆచార్యులు "రోహిణీ! నీ పార్శ్వంలో కొవ్వు పేరుకుంటోంది". "సుమేధా! నీ పిక్కల్లో కండరాలున్నట్టే లేవు". "అనురుద్ధా! పిఱుదుల్లో అంత మాంసం మోస్తున్నా వెందుకోయి?" "సింహా! అందరిలోక నీ వొళ్ళే సర్వాంగ సుందరంగావుంది. కొవ్వెక్కడా మచ్చుకైనాలేదు. శరీరమంతా నరాలు, కండరాలతోనే నిండివుంది...పనికి దొంగలైనవారిలోనే కొవ్వు పెరుగుతుంది. సరస్వతి బర్రెలాగా తయారవుతోంది. ఆమె పొత్తికడుపు చూడండి! ఎప్పుడూ కడుపుతూన్నదానివలె కన్పిస్తుంది." "సరస్వతీ! నువ్వురోజూ కాస్సేపు గుఱ్ఱపు

స్వారీ చేస్తూండు. ఇక్కడ మన కొట్టంలో గుర్రాలు వుండనే వున్నైగా" అని యిలాగే ప్రతివారికి శరీర పరిశ్రమను గూర్చి సలహా లిచ్చేవారు.

మేము గంటలతరబడి యీదులాడుతూ, బుటకలువేస్తూ, ఒకరినొకరం పట్టుకుంటూ, నీళ్ళుచిమ్ముకుంటూ ఆ గ్రీష్మ అపరాహ్ణాలను గడుపుతుండే వాళ్ళం. తర్వాత పెరుగు, తేనె, పళ్ళరసాలు కలిసిన పానీయం తాగేవాళ్ళం. వేసవికాలంలో మధ్యాహ్నం తేలికైన ఆహారం తీసుకోవటము మామూలు; కాని సాయంత్రపుపూట చాల హుషారుగా వుండేది. అప్పుడు పనికూడ చాల కొద్ది సేపే చేయాల్సివుండేది. సూర్యాస్తమయం కావటంతోటే అందరం పనులాపివేసి పొలంలోని యింటిముందుకు చేరి; వూడ్చి శుభ్రంచేయబడ్డ నేలమీద కూచునే వాళ్ళం. పొగలేని మంటలో పేల్చబడ్డ గోమాంసపు ముక్కలు, మధుకలశాలు యెదుట ప్రత్యక్షమయ్యేవి. మేము మాంసపు ముక్కలు నములుతూ, మధ్య మధ్య కొయ్యగ్లాసులతో మద్యపానంచేస్తూ ప్రక్కనున్నవాళ్ళకూకూడ అందించేవాళ్ళం. కళ్ళు కొంచెం యెఱుపెక్కగానే కూనిరాగాలూ, పాటలూ, దరువులూ ఆరంభమయ్యేవి. ఆఖరున స్త్రీలు నృత్యంచేసేవారు. గురుపత్నికి అయిదోపడి ముగింపుకొస్తున్నా ఆమె నటనా నైపుణ్యం అబ్బురంగా వుండేది. నాలాటి పడుచువాళ్ళిద్దరు సతమతమై చెమటలో మునిగి ముద్దలైనా ఆబిడ అడుగు, స్వరం దరువుతప్పేవికావు. ఇంతకూ చిత్ర మేమంటే ఆమె అలిసేది కాదు.

నాట్య ముగింపోత్సవనాడు ఆచార్యులు తమ అద్భుత నాట్య కౌశల్యాన్ని ప్రదర్శించారు. ప్రతి అవయవము, కండరము ఆయన స్వాధీనములో వున్నట్టు తోచింది. నృత్యము సర్వోత్తమ మయిన వ్యాయామమని వారి విశ్వాసం. అది యావజ్జీవాహ్లాదమైన పరిశ్రమయని ఆయన చెప్పారు. "పసిబిడ్డను ఊయలలో పడుకోబెట్టితే శిశువందులో పడివుండియే అటు నిటు కొట్టుకొని తన అవయవాలను కదిలించుకొనును. ఆ విధంగా కొవ్వును కరిగించుకొని కండరాలుగా మార్చుకుంటోంది. జ్ఞానం కల్గిన దర్మిలా శరీరపటుత్వాన్ని నిల్పగలది నృత్యమొక్కటే. గొడ్డలితో నరకటంవల్లా, పలుగుతో తవ్వటంవల్లా కొన్నికండరాలకు సత్తువ చేకూరేమాట నిజమే. నడక, పరుగులవల్ల కాళ్ళు దృఢమై, తిన్నగావుంటై. మల్ల - ముష్టియుద్ధాలచే అనేక అవయవాలు శక్తివంతమవుతాయి. కాని, సక్రమపద్ధతినిచేస్తే శరీరమందలి ప్రతికండరాన్ని పుష్టివంతంచేయగలదిమాత్రం నృత్యమే. ఎండవేడికి మంచుకరుగునట్లు నాట్యంతో కొవ్వు కరిగిపోతుంది. తతిమ్మా శారీరక పరిశ్రమలన్నిటివల్ల మనస్సు విసుగు చెందుతుంది. ఏ శ్రమ చేయటానికైనా చిత్తాన్ని బలవంతం చేయవలసి వస్తుంది; కాని, నృత్యం చేయటానికి మనస్సెన్నడు విసుగుచెందదు. దీనివల్ల శరీరావయవాలన్నిటికి పుష్టిచేకూరుటతోపాటు మానసిక అలసత్వంకూడ పటాపంచలవుతుంది. పగలంతా కష్టపడి,

వచ్చిన తర్వాత సాయంత్రం కాస్త సురాపానంతో నృత్యంకూడచేస్తే, మర్నాటికి కావలసిన శక్తిసంచయం జరుగుతుంది. నృత్యకళ మానవుల కపారమైన ఆనందాన్ని కల్గిస్తుంది. సరస్వతికి నృత్యంపట్లగల విముఖత్వమే ఆమెనట్లు బ్రహ్మరోడ్డులా తయారు చేస్తోంది." ఇది ఆ వుత్సవంనాటి నృత్య సందర్భంలో ఆచార్యుడు వెల్లడించిన భావాలు.

నాట్లు, విత్తుట అయిన అనంతరం వుత్సవం జరిపే రివాజు మా వైశాలిలోనూవుంది; అయితే యిక్కడివారాఉత్సవాన్ని మరింత వుత్సాహంతో జరుపుకుంటారు. ఆనాడు లేగలు, ఆవులు, గొర్రెలు, పందులు మొదలైన వివిధ జంతువుల మాంసం పక్వంచేస్తారు. నేతి అరిసెలు, అప్పచ్చులు, తీపివి, చప్పనివి, సన్నబియ్యపు క్షీరాన్నం, బోకెలు, మాంసంతో రెండు ఝాముల పర్యంతం మరగకాచిన రుచిగలచారు, యింకెన్నో రకాల కూరలు వండుతారు. ఆనాడు ఆచార్యుని భూముల్లో పనిచేసే కమతగాళ్లు, సహాయులు యావన్మంది నగరానికి చేరువలోవున్న పొలంలోని యింటికి చేరుకుంటారు. అక్కడి కందరు నూతన వేసవివస్త్రాలు ధరించివస్తారు. ప్రొద్దుగ్రుంకక పూర్వమే పాన- గానములు ప్రారంభమవుతాయి. ఆ సమయంలో ఆచార్యుని మద్యభాండారంలో నిల్వ వున్న యెప్పటెప్పటి మద్యములు, ద్రాక్షారసములు అక్కడికి వస్తాయి. ఆచార్యుడు, శిష్యబృందం, పనివాండ్ర పరివారాల్లోని యావన్మంది సహపంక్తినే భోజనంచేస్తారు. ఆ రాత్రిఅంతా నృత్య- గానములతో గడచిపోతుంది.

భూములు, తోటలేగాక తక్షశిలావాసుల జీవనాధార సాధనాలలో వాణిజ్యంకూడ ముఖ్యమైనదే. భూమార్గాలగుండా తూర్పురాజ్యాల్లోని వస్తుసముదాయాన్ని పారశీక, బాబిలన్, గ్రీకు దేశములకు చేర్చుటలో సహాయపడుట తక్షశిలలోని స్థల సార్థవాహుల పని. శ్రావస్తి, రాజగృహం, కౌశాంబి, ఉజ్జయినీలకంటె తక్షశిల సర్వ సమృద్ధిశాలిగా వుండుట కా వ్యాపారమే ప్రధాన హేతువు. శ్రావస్తి, కౌశాంబి పట్టణములయందు మహారాజులు, రాజకుమారులు, అమాత్యులు, శ్రేష్ఠులు, సార్థవాహులకు వ్యభవనాలెన్నోనివున్నాయి. ఆ భవనాంతర్భాగము లందలి ఐశ్వర్యంతో తక్షశిల సామాన్యపౌరుల సిరి - సంపదలు తూగలేవు; అయితే తక్షశిలలో ఒక విశేషం కన్పిస్తోంది. అది ఆరాచ నగరుల్లో కన్పడదు. ఇక్కడ ఆకలితో అటమటించువారుగాని, బిచ్చమెత్తుకొనువారుగాని కంటికగపడరు. మానవుల కట్టి నికృష్టస్థితికల్గుటను ఇక్కడి ప్రజలు పెద్ద కళంకంగా భావించుతారు. సమర్థులను ప్రతివారికి పనినో, లేక యేదేనియితర జీవితాదర్శమార్గాన్నో వారికి చూపించుట తమ విధ్యుక్తధర్మంగా యెంచుతారు తక్షులు. ఇక్కడ బానిసలనేవాళ్ళే లేరు. నౌకరీచేయు స్త్రీ - పురుషులున్నా యజమానులు వారిని తమతో సమాన మానవులుగానే చూస్తారు; వారిపట్ల యజమానుల ప్రవర్తనకూడ అల్లాగే వుంటుంది. వీరు నౌకరులకు చాలి

నంత ఆహార - వేతనాలను యిస్తారు. ఇంతేకాదు, ఆమోద ప్రమోదాల్లోకూడ తమతో సమభాగులను చేస్తారు. తక్షశిల పౌరుల్లో ఎవరైనా యేదైనా ఆపత్తుకులోనై గత్యంతరంలేక భృత్యులు కావలసివస్తే వారిని నౌకరు లనడానికి వల్లకాదు. అల్లాంటి వాళ్ళను పరివారంలోని వ్యక్తులుగానే పరిగణించి, వారి ఆహార-పానీయాల్లో, వస్త్రధారణలో, నివాసవిషయంలో సమానావకాశాలను కల్పించుతారు. తక్షశిలప్రజారాజ్యంలోకి పరాయిచోటునుంచి వచ్చిన కర్మకరుల (నౌకర్ల) గూర్చి మాటల సందర్భంలో ఆచార్యుడు చెప్పినది "మా పంచాయితీ రాజ్యం రక్తసంబంధంతో ఆధారపడివుంది. కాబట్టి బయటనుండి వచ్చినవారికి పౌరసత్వ హక్కులివ్వటము మా స్వాధీనంలో లేనిపని. అయితే మానవులము, ఆర్యులము అయివున్న కారణంగా మేము వారికి పరాయివాళ్ళమనే భావమైనా కలుగకుండునట్లు ప్రవర్తించాలి."



# 4. సహోపాధ్యాయుడు

నేను తక్షశిలకువచ్చి నాలుగేండ్లు గడిచిపోయినై. ఈ లోగా నేను గ్రహించిన సంగతులను గురించి కొన్ని చెప్పాను. పూర్వంలాగా తక్షశిల నాకిప్పుడు కొత్తదికాదు. ఈ అద్భుత విచిత్రనగరం నాకిప్పుడు సుపరిచితమైంది. తొలిదర్శనంతోనే తక్షశిలపై నాకేర్పడిన ప్రేమమరింత హెచ్చి నా హృదయంలో స్థిరపడిపోయింది. ఇప్పుడు వేష-భాషల్లో తక్షశిల పౌరునివలె నేనూ మారిపోయాను. శీతాకాలంలో వారిలాగానే నేనూ చొక్కాయి, పరాయి ధరించుతున్నాను. పొడుగ్గా పెరిగిన జుట్టును ముడివేసుకొని చర్మంతో కుట్టబడిన చెవుల టోపీని తగిలించుకోవటానికీ అలవాటు పడ్డాను. అన్నిటికిమించి ఆచార్యులవారి శిష్యబృందంలో అందరికంటె కుశాగ్రబుద్ధిగా పేరుపొంది, వారి ప్రేమ-వాత్సల్యాలకు పాత్రుడనయ్యాను. నేనిప్పుడు క్రింది తరగతుల విద్యార్థులకు పాఠాలుకూడ చెపుతున్నాను. అమ్మ, చెల్లాయి-సోమ అప్పుడప్పుడు జ్ఞాపకం రాకపోవటంలేదు; కాని, ఆచార్యుడు, గురుపత్ని, రోహిణుల స్నేహ-వాత్సల్యబంధితుడనైన తక్షశిలను వీడిపోవలసివస్తే వారి యెడబాటుకు నిట్టూర్చకుండా వుండగల్గడము అసంభవమే. ఇన్నాళ్ళ వ్యవధిలోను నాకు వైశాలినుంచి వర్తమానం చేరింది ఒక్కసారి మాత్రమే. అమ్మ సార్థవాహులను బతిమాలి తాళపత్ర మొకటి సుదత్తుని మనిషికిచ్చి పంపింది. అదొక్కటే నాకు చేరినది. నేను యేటేటా తిరిగివెళ్ళే సార్థవాహుల ద్వారా వుత్తరాలు పంపుతూనే వున్నాను; కాని, ప్రతిదీ అమ్మకి అందినదనడానికి వీల్లేదు. అమ్మ సాకేతంలోనో, శ్రావస్తి యందో వుండి వున్నట్లయితే జాబులు సులభంగా అందడానికి అవకాశం వుండేది. తూర్పు దేశసమాచారాలు మాత్రం సుదత్తు మనుషుల ద్వారా నాకు చేరుతుండేవి.

పైరులు బాగా పండి ఒరిగాయి. కుసుమవర్ణపు కంకులతో గోధుమ కోతకు సిద్ధంగావుంది. ఆచార్యులు ఒక పొలంలోని పైరును కోయించి కైలు చేయించే బాధ్యతను నాకు అప్పగించారు. ఆ చేనే వారి పొలాల్లోకి పెద్దది. విశాలంగా వ్యాపించివున్న మడులకు మధ్యన ఒక యిల్లుంది. కమతగాళ్ళేకాక కొందరు విద్యార్థులు, రోహిణీ నాకు సహాకరించటానికి వచ్చారు. సంధ్యవేళ మేమందరము కమత గృహానికి చేరుకొనేవాళ్ళం. ఉదయాన గంపెడు చీకటుండగానే నేను చద్దితిని, మజ్జిగవున్న తోలుసిద్దెను చంకను తగిలించుకొని, గుర్రమెక్కి పొలంలోకి వెళ్ళేవాడిని. కోతకోసి కుప్పవేసిన చేలో వదిలేసిన పచ్చనికర్రలను తినటానికి గుర్రాన్ని

విడచి, కొడవలి చేతబట్టి మునుంలో వొంగేవాణ్ణి. అప్పటికి అందరూ వచ్చి మునుంపట్టేవారు. ఏదో య కాపాయలో ఒకడు పాడుతూంటే ఆడవాళ్ళు, మొగ వాళ్లు అందరూ అందుకొని పాడుతూ కోతకోసేవాళ్లు. పురుషులము స్త్రీల స్వరాల్లో స్వరం కలిపేవాళ్లం; కాని, ఆ మాధుర్యం మా స్వరాల కెక్కణ్ణుంచి వస్తుంది! ఆవిధంగా పాటలో తన్మయులమై యెంతిసేపుకోసినా శ్రమ అనిపించేది కాదు. మా భోజనాలయేర్పాటు రోహిణి చూచుకొనేది. ఆమె మధ్యాహ్న మప్పుడు గుర్రపు పాలతో కాచిన కల్లునొక జాడీతో తీసుకొని, ఆహారపదార్థాలను, మంచినీటి పీపాను ఒక చిన్న బండిలో వేసుకొని మా వద్దకు తెచ్చేది. అందరము ఒక చెట్టునీడను చేరి వెక్కిరింతలు - వేళాకోళాలతో ఖులాసాగా సాపాటు ముగించేవాళ్లం. రోహిణి వంటవారిని వెనక్కిపంపేసి, తాను మాతోపాటు పనిలో నడుంకంచేది. మధ్యాహ్నం యెండతీవ్రంగా వున్నప్పుడు కాస్సేపు మాలిగేవాళ్లం. అల్లాంటప్పుడు పచ్చిగోధుమలను వేయించుకొని వూదబియ్యం తినేవాళ్లం. అరు పచ్చని ఆకుల్ని, రెమ్మల్ని, బంగారురంగు గోధుమకంకుల్ని సహచారిణుల స్వర్ణ, అరుణ, గౌరవర్ణ కేశపాశాల్లో తురిమేవాళ్లం. వినోదం కలిగించే కథలూ, కబుర్లూ చెప్పుకుంటూనో, కునుకుతీసో ఆ సమయాన్ని గడిపేవాళ్లము.

పొద్దువాలినతర్వాత మళ్ళీచేలో వొంగేవాళ్ళం. రోహిణి కోతకోయటంలో ఆరితేరినచెయ్యి. ఆమె స్వరం - హేమంత ఋతువులోని కలవింక పిట్టకూత లాగా—అతిమధురంగా వుండేది. చకచకా కోస్తూ పాడుతూంటే ఆమె తీయని గీతాలాపన - చంద్రకుని వేడికిరణాల క్రింద శీతలచ్ఛాయగా - హాయిగా వుండేది. సూర్యబింబము అరుణార్ణవమైన పిమ్మట మేమెక్కెక్కప్పుడు క్షేత్రనృత్యం చేసేవాళ్ళం. యువతీయువకులము పండ్లతోగూడిన పచ్చని లతాభూషణాలను తలపైన సింగారించుకొనేవాళ్ళం. కంకులతోవున్న గోధుమపనను కట్టగా కట్టి నిలబెట్టి కుడిచేత కొడవలి, యెడమచేతితో గోధుమకంకుల గుత్తులు పట్టుకొని చుట్టూ కమ్ముకొని, అందరం కలిసిపాడేవారము. తర్వాత రెండు ముఠాలుగా చీలిన యువతీ-యువకులము నిలబెట్టివున్న గోధుమ కట్ట చుట్టూ తిరుగుతూ నాట్యం చేసేవాళ్ళం. గొంతులు తడారిపోతే రోహిణితెచ్చిన మద్యంతో తడుపుకొనే వాళ్ళము. క్రమంగా కళ్ళెర్రబడేవి. దివాకరు డటు పడమటి కొండ చాటున దాగగానే మే మిటు క్షేత్రగృహానికి చేరుకొనేవాళ్ళం.

గ్రీష్మఋతువు ఆఖరు రోజుల్లో గడ్డి - గాదములు పుష్కలంగా వుండేవి. పశువులు మస్తుగామేసి పుష్టిగా వుండేవి. మా రాత్రి భోజనంలో మాంసం తప్ప కుండా వుండేది. అందుకోసం బలిసివున్న ఆవునో, గొర్రెనో, పందినో కోసే వారు. సాయంత్రం పనుల్లోనుంచి యింటికి చేరుకోగానే మేము కాల్వకుపోయి స్నానమాడి వుతికినబట్టలు వేసుకొనేవాళ్ళం. వేసవికాలంలో తమ్ములు కూడ కైశాలి (వారుల) వలె దుస్తులు ధరించుతారు, ఆడవాళ్లు ధోవతులు, ఉత్తరీయాలే

కాక పొట్టేరవికెలుకూడ ధరిస్తారు. మా వైపు స్త్రీలవలె యిక్కడివారు నగలు పెట్టుకోవటం చాలతక్కువ. రెండు-మూడు పేటల హారాలు? కర్ణభూషణాలు - యివే వారి ఆభరణాలు. వెండి బంగారు నగలకు మారు లతా-పత్ర-పుష్పభూషణములయందె వీరికి మోజెక్కువ. గాంధారిణులు, మద్రయువతులు, సహజ సుందరీ మణులు వా రాభరణాలవల్ల అందకత్తెలుకావడంకంటె ఆ సుందరాంగులవల్లనే ఆభరణాలుశోభించుతాయి. ఎండాకాలంలో మేజోళ్లు ధరించేవారుకారు; కాని, యిక్కడి వారికి చెప్పులువేసుకొనే అలవాటు తూర్పురాజ్యాల ప్రజలకంటె అధికమే.

పైరుగు కోసినతర్వాత ఒకరోజు పనమీద యెండనిచ్చేవాళ్ళం. మర్నాడు మోపులుకట్టి కర్మాంతగృహానికి చేరువలోచేసిన కళ్ళంల్లోకి చేర్చుతాము. కోత సాంతమైనతరువాత మా పనిఅంతా ఆ కళ్ళంలోనే. పనని యెడ్లతో తొక్కించి నూర్చేవాళ్లం. నిత్యంనూర్చి పోగుచేసిన కనకరాశి (గోధుమలు)ని సాయంత్రం గోతాల కెత్తినతర్వాత కళ్లంలోనే పానం, నృత్యం జరిగేవి. అహో! ఆ కనకరాశి చూడటానికెంతరమణీయంగా వుండేది! తమ శ్రమఫలితంగా మట్టిలోనుండి పుత్పత్తి అయిన ఆ బంగారుపంటను కళ్లారచూచుకొన్నప్పుడు మానవులకు కలిగే ఆనందాన్ని వర్ణించు టెవరితరము! ఊర్పుళ్లోకంటె పండి వొరిగిన పైరును కోసేటప్పుడు కలిగే ఆనందమే అద్వితీయము. కాబట్టి అప్పుడు ప్రతివారి కంఠములనుండి మధురమైన కూనిరాగం వెలువడటంలోగాని, మనస్సు పరవశ్లు తొక్కుతూ నృత్యం పైకి పరుగులెత్తటంలోగాని వింతలేదు.

కోతలరోజుల్లో వర్ష మెప్పుడు వచ్చిపడుతుందో నన్న భయం వుండేది. ఇక్కడ వానలు కురవటం తక్కువే; కాని, తీరా వస్తే చేనుమీద, కళ్ళంలోను వున్న పంట - నోటిదగ్గరకువచ్చినపంట - పాడైపోతుందని బెదురు. అందుచే కుప్పలువేయటానికి ఆత్రపడేవాళ్ళము. నూర్పిడి, పోత అయిపోయి ధాన్యము - దూగరలతో కళ్లాలు ఖాళీగానే మళ్ళీ సహపంక్తిభోజనాలు వుండేవి. పొలాల్లో పనిచేసిన స్త్రీ పురుషులు యావన్మందీ అందులో పాల్గొనేవారు. ఈసంవత్సరం నా అజమాయిషీక్రింద వున్న పొలంలోని ధాన్యమే ముందుగా యింటికి చేరింది. ఇందుకు నన్నూ, నా సహచరుల్నీ ఆచార్యులు మెచ్చుకున్నారు.

నాలుగో సంవత్సరం ప్రారంభమవుతూనే నేను సగం విద్యార్థిని, సగం వుపాధ్యాయుణ్ణీ అయ్యానని యిదివరకే చెప్పాను. ఆచార్యుని శిష్యులు అయిదు వందలమంది వుంటారని వాడుక. అయితే యీ అయిదువందలమంది దూర ప్రదేశాలనుండి వచ్చి పై తరగతులలో శిక్షణ పొందుతున్నవారు మాత్రమే. ప్రస్తుతము తూర్పునుంచి వచ్చిన విద్యార్థులు తక్కువ. నగరిలోను వేతన మిచ్చి చదువుకొంటున్న మగధ యువకులే జాస్తి. ఈ తేడా శుభలక్షణం కాదని ఆచార్యులు అంటూండేవారు. ఒక పర్యాయం ఆయన యిల్లాచెప్పారు:

"వత్సాసింహా! తూర్పున యుద్ధవిద్యాప్రాముఖ్యతను గుర్తించినది మగధ ఒక్కటేనని విశదమౌతోంది. వైశాలి, కుసీనర, కపిలవస్తు, పావా, అనూపియా దేవదహ - యిన్ని ప్రజాస్వామికాలుండగా నిన్ను మినహాయించితే వాటికి చెందిన మరో విద్యార్థి లేకపోవటము వారు యుద్ధవిద్యను మహాసింధు వాహినిగా యెంచక నిర్జల పుష్కరిణిగానే భావించుతూన్నట్లు తెలుపుతోంది. వత్సా! నేను తక్షశిలకు లేని గౌరవాన్ని, ప్రతిభను కలిగించేందుకు పొగడటం లేదని నీ వెరుగుదువు. ఈ తరుణంలో తక్షశిల జ్ఞానోదకాన్ని పుచ్చుకోనివారు యుద్ధవిద్యలో వెనకపడిపోక తప్పదు. మహాలియుద్ధవిద్యావిశారదుడే. పతిత బంధుల మల్లు విద్వత్తులోకూడ వారు సందేహంలేదు; కాని, వారి విద్యలు పాతికేళ్ళకు పూర్వానివి. వారు వైశాలి, శ్రావస్తి నగరాల్లో కూర్చొని పారశీకులు సైన్య సంచాలనమందేయే నూతన పద్ధతులు ప్రవేశపెట్టారో, వ్యూహాలను ఛేదించటానికెట్టి కొత్త విధానం కనిపెట్టారో, విల్లు - అంబులశక్తి వృద్ధికేమి మార్పులుచేశారో, శిలాదుర్గాలను మార్చివేయటానికే యే ఆయుధాలను తయారు చేశారో, యింకా యిలాంటి నూతన విషయాలూ తెలిసికోజాలరు. తక్షశిలలో మాత్రమే తెలియగలవు. మేము పారశీకులతోగాని, గ్రీకులతోగాని దగ్గర సంబంధం పెట్టుకోము; అయినా వారి ఆంతరంగిక గుట్టు-మట్టులను బయటికిలాగి గ్రహించుటలో ఆరితేరాము మా యుద్ధవిద్య సింధునదీ ప్రవాహం. అదెన్నడూ ఎండిపోదు. నూతన జ్ఞానవాహినులు సదావచ్చి అందులో కలుస్తూనే వుంటై. విచారం! విచారం!! తూర్పున యీ విషయాన్ని గ్రహించిన రాజ్యమేదైనా వుంటే అది మగధమాత్రమే. మగధ యుద్ధవిజ్ఞానాన్ని అత్యంతశ్రద్ధతో సముపార్జించుకొంటోంది. ఇక్కడికి వచ్చిన మగధవిద్యార్థులు నాకిచ్చే శుల్కాన్ని వారు తమ స్వగృహాలనుండే తెచ్చి యిస్తున్నారనుకోను."

"లేదు గురూ! వారికి ఖర్చంతా రాజ్యకోశాన్నుంచే లభ్యమవుతోంది. మగధభూపాలుడు బింబసారుడు తెలివిగలయువకులను గాలించి గాలించి తక్షశిలకు పంపుతున్నాడు."

"నాకూడ—వత్సా! — సరిగా యిదే సందేహం వుంది. ఎన్నడూ మగధ యువకులు విద్యార్జనకై యిక్కడికింతమంది వచ్చేవారుకాదు. నాకు అరవై నాల్గు సంవత్సరాలు వచ్చినై. అనుభవాన్నిబట్టి మగధ తూర్పురాజ్యాల స్వాతంత్ర్యానికి ప్రబల శత్రువుగా తయారవుతోందని నా తలంపు. అది యెప్పుడో ఒక నాడు తూర్పు పంచాయితీ రాజ్యాలను స్వాహాచేసివేస్తుంది; అంతేకాదు, అక్కడి చిన్న పెద్ద యేకాధిపత్య రాజ్యాలను కూడ భుక్తంచేసుకొని తీరుతుంది. మగధ రాజు పర్షియా షాహన్ షా వలె తూర్పున యేకచ్ఛత్రాధిపతి అవుతాడు - అది నేడే కాకపోవచ్చు; కాని, వాని జ్ఞానతృష్ణ యిప్పటిలాగే తనివితీరకుండా వుంటే పదేండ్లకు లేకపోతే యాభై సంవత్సరాల అనంతరం!!"

"అయితే మాకు ప్రమాదమున్నదన్నమాటే ?"

"ఇంకా సందేహమా ?"

"కాని, గురూ ! మగధ నెదిరించటానికి మా లిచ్ఛవీ పంచాయతీ ఒక్కటే చాలునని మా విశ్వాసం. ఈ సంవత్సరం మరో ఐదుగురు లిచ్ఛవీ యువకులు యిక్కడికి రాబోతున్నారు. లిచ్ఛవుల మెన్నటికి మా జ్ఞానపిపాస నారనివ్వము; వైశాల తక్షశిలల అన్యోన్యత అచంచలమై స్థిరస్థాయిగా వుండితీరుతుంది."

"వత్సా ! మా అభిమతంకూడ అదే. తూర్పున ఒక్క వైశాలితోనే మాకు సన్నిహితసంబంధంవుంది. మగధ పొగరణచడానికి లిచ్ఛవు లొక్కరే చాలునని మాకూ విశ్వాసంలేకపోలేదు; అయితే సందేహానికికూడ ఆస్కారం కన్పిస్తోంది. అంగరాజ్యాన్ని మగధ వుదరగ్రస్తం చేసుకొన్నదని నువ్వేచెప్పావు. అంటే అంగ రాజ్య అంగ - అర్థబలమంతా మగధ చేతిలోకి వెళ్ళిపోయిందన్నమాట. కోసల రాజ్యానికూడ వృద్ధాప్యం దాపురించినట్టే కన్పడుతోంది. అపార జన - ధనము లతో కాశీ, కోసల రాజ్యాలను ఆధీనం చేసుకొని, శాక్య, మాళవాది రాజ్యాల పరవశత్వ న్నూతగొని వైశాలి స్వాతంత్ర్యాన్ని సంకటావస్థలో పెట్ట వచ్చును. మగధ కింకా వయస్సుడిగిన చిహ్నాలు కానరావటంలేదు. బింబసారుడు పరిపాలనా దక్షుడు. అతని కొడుకుకూడ తండ్రివంటివాడే. అయితే వైశాలి ఆదమరచివుండక అప్రమత్తతో మెలగాలి."

"బింబసారుని కుమారుడు అజాతశత్రుని నే నెరుగుదును గురూ ! అతడు అతి చతురుడు. వాని జనని మా విదేహ దేశపు ఆడుబిడ్డే. అజాత శత్రుని నేను చూచాను కూడాను. అతడు ఆచార్య మహాలివద్ద యుద్ధకళలో ప్రావీణ్యత సంపాదింప వచ్చాడు. తక్షశిలకు రావాలనికూడ వువ్విళ్లూరాడు; కాని వాని తలి-దండ్రు లందుకు అంగీకరింపలేదు. ఇక్కడ విద్యాభ్యాసచేసి వెళ్లిన జీవకుడు అజాత శత్రుకు చాల అన్యోన్యంగా వుంటున్నారు."

"జీవకుడా ! ఇక్కడ చదువుకొని వెళ్ళాడా ?"

"అవును గురూ ! అయితే అతడు వైద్యుడు. ఇప్పు డతనికి తూర్పు దేశాల్లో మంచిపేరు-ప్రఖ్యాతులున్నాయి. మగధ, కోసలములందేగాక ఉజ్జయిని దాకా అతడికి గిరాకివుంది. జీవకుడు వైద్యశాస్త్ర విశారదుడేగాని యోధుడు కాదు."

"వీరులు, వైద్యులు కలిస్తేనే యుద్ధంలో జయాన్ని సాధించగలుగుతారు వత్సా ! ఆరితేరిన శస్త్ర చికిత్సకులు గాయపడిన వేలాది సైనికులను రక్షించడమే కాదు; కుటిల సంగ్రామంలో వారు అత్యంత సహాయకారులు కూడాను. ఒకే ఒక వైద్యుడు ఒక మహా సైన్యాన్నంతనూ మూర్ఛాగతం గావింపగల శక్తి వంతుడు."

"జీవకుడట్టి విషయాల్లో మరీ నేర్పరి గురూ! ఈ మధ్యనే అవంతిరాజు-ప్రద్యోతునికి చికిత్సచేయటానికి జీవకుడు ఉజ్జయినికి వెళ్లాడు. ఏ కారణానో రాజు అతనిమైన కుపితుడయ్యాడు. జీవకుడు పలాయనంచేసి ప్రాణం దక్కించుకోవాల్సివచ్చింది. ప్రద్యోతుని దూత ఒకడు అతన్ని మార్గంలో లంకించుకున్నాడు. అప్పుడు జీవకుడు వుసిరికాయలు తింటున్నాడు. వాటిలో రెండు రాజదూతకు తినమని యిచ్చాడట. జీవకుడు తాను భక్షించుతూన్న వాటిలోనే యివ్వడంవల్ల వాడు అనుమానించక తినివేశాడు. తత్ఫలితంగా ఆ దూత మూన్నాళ్లదాక స్పృహ లేకుండా పడివున్నాడట."

"కాబట్టి-కుమారా!- జీవకుడు యుద్ధంలో యెంత వుపయోగికారి కాగలడో నీకు విదితమే. ఏమైనప్పటికి- మగధ యిప్పుడెంత శక్తివంతమై వున్నా లిచ్ఛవుల నేమీ చేయజాలదని నాకు విశ్వాసం వుంది. కాని, మగధ మరికొన్ని రాజ్యాలను స్వాధీనంచేసుకోవటంలో కృతకృత్యులయినప్పుడు మాత్రం ప్రమాదం హెచ్చుతుంది. అందుకు తగినట్టుగానే సమీపంలోని కోసలరాజ్యం ఆడబడుతూనే వుంది. పైగా తక్షశిలలో పట్టభద్రులై వెళ్ళేనున్న ఈ భావి మగధ సేనాపతులు కనపడుతూనే వున్నారు!"

"కాని, తమరు వారికి యుద్ధవిద్యారహస్యాలన్నిటినీ అంతు చిక్కనివ్వటం లేదుగా గురూ!"

"అది యదార్థమేగాని, మేరు నేర్చుకునేది మాత్రం అల్పమా? గుట్టు-మట్టుల సంగతో, వాటిలో చాలమట్టుకు నేర్పరులైనవారు తక్షశిల గాలి సోకుట వల్లనే గ్రహింపగల్గుతారు. మగధ మహా ప్రమాదకరమైనది. అది పశ్చిమావలెనే తూర్పున పెనుభూతం! పశ్చిమగాంధారపురుషులను నీవు చూచేవుంటావు. తూర్పు, పశ్చిమ గాంధారములకు కేవలం మహాసింధు మాత్రమే అడ్డుగా వుంది. వారు తెలివితేటల్లోగాని, శౌర్య-పరాక్రమాల్లోగాని మాకేమాత్రం తీసిపోరు; కాని, దరయుసు అపారసేనావాహినులముందు వారి కాళ్లానలేదు. మేమైనా ఒంటరిగానే యెదిరించవలసివస్తే తక్షశిలగూడా దరయుసుసామంతుడే అధికారం చలాయించేవాడు. ఉత్తరాపథంలోని ప్రజాసత్తాకరాజ్యాలన్నీ దరయుసుకువ్యతిరేకంగాఏకమై నిలబడటం మా అదృష్టమే; కాని, యీ ఐక్యతఒక్కటే సరిపోదని నావుద్దేశం. మా ఐక్యతసానుభూతిపైనాధారపడివున్నది. మద్రదేశీయులు తమస్వదేశసంరక్షణార్థం పోరాడినట్టుగా తక్షశిలకోసం యుద్ధం చేయగలరా? వారికి సయాల్కోటపైనున్నంత ప్రేమాభిమానాలు తక్షశిలపై నెట్లుండగలవు? కాబట్టి మా ఐక్యత అచంచల మనడానికి వల్లకాదు. అటువైపున పారశీకపు రాజు-దరయుసు తన చేతి క్రింది జనపదాలన్నింటిని రథానికి పూన్చిన గుఱ్ఱాల్లాగా కూర్చుకొని ముందుకు ఉరకడానికి సంసిద్ధంగా వున్నాడు."

"...గురూ! ఈ భయమే అప్పుడప్పుడు నన్నుకూడ వ్యాకులపరుస్తూంటుంది."

"కాని, వత్సా! ఈ ప్రమాదాన్నుంచి తప్పించుకొనే వుపాయం నాకిప్పటికీ తోచలేదు. ఒక వుపాయం వుంది; కాని, అది మా కాచరణయోగ్యం కాదు. ఉత్తరాపథంలోని పంచాయితీ రాజ్యాలన్నిటినీ కలిపి ఒక కూటమిగా యేర్పరచి, ఒకే శాసనం తయారుచేయటం సఫలమైనప్పటికీ ఆ తరువాత మేము మా జాతిస్వాతంత్ర్యం, జాతిగౌరవము, రక్త సంబంధాలను విడచిపెట్టకోవలసి వస్తుంది. ఇందుకు మా పంచాయితీలోని పసిబాలుడు కూడ అంగీకరించడు. పరస్పర సానుభూతి, సమాన ప్రమాద సామ్యంవల్ల యిప్పుడు మా ప్రజాస్వామికాల్లో యేర్పడి వున్న ఐక్యత నిలచివున్నంతవరకుమాత్రం పారశీకులను మహాసింధు దాటి కాలుమోపనీయము."



# 5 రోహిణి

నాకు యిరవై నాలుగోయేడు జరుగుతోంది. రోహిణికి పదహారేళ్లు. రోహిణితోటి నా బాల్య స్నేహము మా యిద్దరిమధ్య యువతీ యువకుల ప్రేమగా పరివర్తనమైన ముహూర్తం - లేక రోజు - ఫలానా అని చెప్పటం కష్టం. అయితే సంవత్సరంక్రితం జరిగిన ఒకఘటన మాత్రం యింకా జ్ఞాపకం వుంది. అప్పుడు నేను కాయిలాపడి మంచమెక్కాను. వారంరోజులు గడిచినా జ్వరం నిమ్మళించలా. వైద్యుని ఔషధము యేమి పనిచేయకపోవటం జూచి మా ఆచార్యునిహృదయంలో సందేహ మేర్పడింది. నేను జీవించనేమో నన్న అనుమానంతో ఆయన మాటిమాటికి నావద్దకు వచ్చి చూస్తుండేవారు. తన పడకగదికి ప్రక్కగదిని ఖాళీచేయించి నన్నక్కడికే చేర్చారు. నేను పూర్తిగా క్షీణించిపోయి బొత్తుగా లేవలేని స్థితిలో వున్నాను. మందు, మంచి నీరు తప్ప వేరే ధారకంలేదు. ఆచార్యుడు, గురుపత్ని - యిద్దరూ నిత్యము యెన్నోసార్లు వచ్చి నన్ను చూచి వెడుతూండేవారు. రోహిణి నా గది విడచి వెళ్ళేదికాదు. ఆమె యెప్పుడూ నా మంచం ప్రక్కనే ఒక యెత్తుపీటమీద కూచుని పంఖా విసురుతూనో, మందు తాగిస్తూనో, పక్కసరిచేస్తూనో వుండేది. నేనెప్పుడైనా 'పోయి పడుకోమని అంటే యిప్పుడే నిద్రలేచి వచ్చా'ననేది. అప్పటి నా స్థితిలో ఆమె చెప్పింది నిజమేనని నమ్మేవాడిని; కాని, రోహిణి అధరారుణిమ రోజు రోజుకు పేలవమై తెల్లబడుతూండటం గమనించుతూనేవున్నాను. ఒకనాడు నేను స్పృహలేకుండా పడివున్నాను. కొంతసేపటికి తెలివి వచ్చినిద్రనుంచి మేల్కొన్న వానివలె కళ్ళు తెరచేప్పటికి రోహిణి కనుకొలకుల నుండి అశ్రుబిందువులు రాలుతున్నై. నా నోట మాట పెగలటమే కష్టంగా వుంది; అయినా లేని ఓపిక తెచ్చుకొని "ఏడుస్తున్నావా పిల్లా! నేను చూచాన్లే" అన్నాను. ఆమె కళ్లు తుడుచుకొని నా వంక చూచింది. రోహిణి కళ్లు వాచివున్నై. నల్లని ఆమె కనుపాపల మీద కన్నీటి ఛాయలు కనబడుతూనే వున్నాయి. నేను చెయ్యాడించా లనుకుంటూండగా ఆమె తలను నాకు దాపుగా పెట్టింది. ఎన్నాళ్ళనుంచో ఆమెకేశములు సంస్కారం లేక చిక్కుపడివున్నా, మృదువుగానే వున్నై. నే నామెకుంతలాల్లో వేళ్లాడించుతూ "రోహిణీ! నాకు ఖులాసాగానే వుంది, నువ్వు విచారించకు" అన్నాను.

"అవునన్నయ్యా! నీకు ఖులాసాగానే వుంది." స్వరాన్ని బిగబట్టుకొని అంది.

"మరినువ్వు దుఃఖించుతున్నా వెందుకు ?"

ఆమె సమాధానం చెప్పకుండానే చేతితో నా నొసటిమీద నిమురసాగింది. ఆమె చేయిచల్లదనం నాకు హాయిగొల్పింది. నాటినుంచి నిజంగానే నా జ్వరం తిరుగుముఖం పట్టింది. క్రమంగా పథ్యంకూడ పెట్టారు. అప్పుడందరికంటె అధికంగా ఆనందించింది రోహిణి.

మళ్ళీ సంవత్సరం గిర్రున తిరిగి వచ్చింది. నా శరీర మిప్పుడు పూర్వంలాగే సత్తువకలిగి బలిష్టంగా వుంది. ద్రాక్షఫలించే దినాలు. ఒక తోటను సంబాళించే భారాన్ని నేనూ, రోహిణి వహించాము. వర్షంలేదు. గాడ్పులు తీవ్రంగానే వున్నై. ఇద్దరం తోటలో కెళ్ళాము. పచ్చని ఆకులున్న ద్రాక్షలతతో రోహిణి శిరోజాల నలంకరించాను. పచ్చని పండు ద్రాక్షగుత్తులను కూడ ముచ్చటగా జుట్టుకు వేలాడదీశాను. ఆమె చెవుల నుండి కపిషా ద్రాక్షగింజలు వేలాడుతూనే వున్నాయి. అదే ద్రాక్షమాల మెళ్ళో అలరారుతోంది. అప్పుడామె ముఖ సౌందర్యా న్నవలోకించుతూ "నీ అరుణ ముఖమండలము, స్వర్ణకేశాలు, చిరు గుబ్బలమీది యీ ద్రాక్షాభరణాలు యెంత రమణీయంగా వున్నయో్యా చూడు రోహిణీ !" అన్నాను.

"ఆఁ, నువ్విలాగే పొగడుతావులే" అన్న దామె.

వెంటనే నేను రోహిణి కరకమలాలను నా చేతుల్లోకి తీసుకొని ఆమెనొక దొరువుదగ్గరకు లాక్కెళ్ళాను. రావటానికి ఆమె ఏమాత్రం అభ్యంతరం చెప్ప లేదు; ఆమె బుగ్గలు ఎరుపెక్కాయి. దొరువు వొడ్డున కూచొని నేను నీటిపైకి ఒంగుతూ "చూడు రోహిణీ ! నువ్వెంత అందంగా వున్నావో!" అన్నాను.

ఆమె ముందుకు వొంగి చూచుకున్నది; గాని, వెంటనే దృష్టిని నా ప్రతి బింబంపైకి మరల్చి "మరి నువ్వో? నవ్వుతూన్న నీ కళ్ళెంత చక్కగా వున్నయో్యా చూచుకో" అంది.

"కాదు రోహిణీ ! నువ్వు పొరబడుతున్నావు. నిజంగానువ్వు మోహినిలా గున్నావు."

"చాల్లే పరిహాసం"

"పరిహాసమా ! యిటు రా, యిద్దరం నీటిలో మన ప్రతిబింబాలను చూద్దాం; కాని, రోహిణీ ! నిజం చెప్పాలిసుమా" అన్నాను.

ఆమె తన కుడి కపోలాన్ని నాయెదమబుగ్గ కాన్చి వొంగి చూడటానికి బిడియపడలా. ఇద్దరం ఆనుకొని కూచొని వొంగి నీటిలోని మా ప్రతిబింబాలను చూచుకుంటున్నాము. రోహిణి అర్ధనిమీలిత నేత్రాలలో నల్లని కంటి పాపలు అతి హృద్యమంగా వున్నై. ఆమె అరుణాధరముపైన చిందులు తొక్కుతూన్న చిరునవ్వు రోహిణి సుందర ముఖారవిందానికి మరింత వన్నె పెడుతోంది.

"ఏం, రోహిణీ! నువ్వు వనదేవత వలెనో, దేవకన్యలాగానో లేవో? నిజం చెప్పు" అన్నాను.

నేనింకా నీటిలోనే చూస్తున్నాను. రోహిణి తన ప్రతిబింబాన్ని చూడక, నా ప్రతిబింబాన్నే రెప్పవాల్చకుండా చూస్తోంది. నా మాటవిని! వెంటనే తలెత్తి నా కళ్ళల్లోకి చూస్తూ "కాదు, సింహ ముఖమే చూడముచ్చటగావుంది" అని నా కపోలంమీద తన పెదవు లాన్చింది. ఆమె వెనక్కి తొలగిపోటానికి అవకాశమీయకుండా నేను వెంటనే రెండు చేతుల్తోను లతాభూషణాలంకృతమై వున్న రోహిణి కేశపాశాన్ని పట్టుకున్నాను. ఆ యద్వితీయానందముద్రతో అలా ఎంతిసేపున్నామో మాకే తెలియదు. ఇంకా యిరవైబుట్టల ద్రాక్షపండ్లు కోయాలన్న సంగతి స్ఫురణకు రాగానే నేనామెను వదలిపెట్టి "రోహిణీ! మనం చేయాల్సినపని అలాగే వుండిపోయింది" అని లేచాను.

మేము బుట్టలు ఒకచేతబట్టి తయారైన ద్రాక్షగుత్తు లొకటొకటిగా యేరికోసేవాళ్లం. ప్రతిదినం కోసిన ద్రాక్ష గుత్తులను సాయంత్రం ఉద్యాన - గృహో పరిభాగాన దక్షిణోత్తరదిశలందలి ఎత్తైన గోడలలోవున్న కిటికీలవంటి వందలాది కంతలలో యెండటానికి వ్రేలాడగట్టేవాళ్లం.

మరొకరోజున సంధ్యవేళ రోజూలాగానే ద్రాక్షగుత్తులను వ్రేలాడదీస్తున్నాము. పని ముగింపుకొచ్చింది. రోహిణి ఆనందోల్లాసాలతో అస్పష్టంగా కూనిరాగం తీస్తోంది. నా కోరికతో ఒకపాట పాడింది. అప్పుడు నేనన్నాను- "రోహిణీ! ద్రాక్షపండే యీ ఋతువుకు అంతమనేది లేకుండావుంటే ఎంత బాగుంటుంది!"

"మరెప్పుడూ మధ్యాన్న-సాయంత్రాలు లేకుండా, చీకటి వుండక ప్రభాతమే వుంటేనో!" అన్నది రోహిణి టక్కున.

"ఆపైని నువ్వు శాశ్వతంగా పదహారేళ్ళ బాలవుగానే వుంటే."

...నీ చదువుకూడ సాంతం కాకుండా వుండాలి."

...చదువు పూర్తిఅయితే యేం రోహిణీ!"

"ఆ తర్వాత నువ్వు వైశాలికి వెళ్లిపోతావేమోగా?" కంపితస్వరంతో అంది రోహిణి.

"నువ్వు లేకుండానా? అలా ఎన్నడూ జరుగదు రోహిణీ!" అని నేనామెను గట్టిగా హృదయానికి హత్తుకున్నాను.

రాత్రి నిద్రించబోయేటప్పుడు కూడ 'వైశాలికి వెళ్లిపోతావేమో' నన్న రోహిణి మాటలే నా చెవుల్లో ప్రతిధ్వనించాయి. రోహిణి అనుమానమైనా ఆధార రహితంకాదు. నేను తక్షశిలకు వచ్చినది వైశాలి నిమిత్తమేగా. వైశాలి ప్రాచీనవైభవాన్ని కాపాడుకునేటందుకు నేను చేయజాలని త్యాగమేముంది? 'వైశాలి, రోహిణులలో ఎంచుకోవలసివస్తే దేన్ని కోరుకుంటా'వని నన్ను నేను

ప్రశ్నించుకున్నాను. అప్పుడు నా మనసులో తోచిన సమాధానంతో నా హృదయాన్ని ఒక్కసారిగా వేయిసూదులతో గుచ్చినట్టయింది. నిజానికి నేను కోరుకోవలసింది వైశాలినే. అయితే మరి నేను రోహిణిపట్ల వంచకుడు నన్నమాటేగా: "ఏనాడైనప్పటికి వైశాలియందలి నా ప్రేమ ప్రేమహద్దులు దాటినప్రేమ' అనుకున్నప్పటికి నా మనసు ఊరట కలుగలేదు. మళ్ళీ అను కున్నాను. "రోహిణినికూడా వైశాలికి తీసుకొనివెళ్తే ఉభయప్రేమలూకూడ సార్థకమవుతాయి కదా' అని. అయితే అది సాధ్యమయ్యేదెట్లా? నాకు నా వైశాలియం దెట్టి ప్రేమగలదో రోహిణికక్కడ తక్షశిల - తన తలి-దండ్రుల తక్షశిల - తన జన్మస్థానంపట్ల అట్టి ప్రేమయే వుండటం సహజంగదా. అదీగాక ఆచార్యదంపతులు తమ ఏకైక తనయరోహిణిని విడచి ఎలాఉండగలరు?

ఆ రాత్రి అంతా నా మనస్సు వికలంగానేవుంది. అగ్నిజ్వాలలో వున్న ట్టుగావుంది. నిద్రాదేవినన్నెప్పుడా జ్వాలలలోనుండి బయటికితీసి, తనచల్లనిఒడిలో నిద్రపుచ్చిందో నాకు తెలియదు. ఉదయాన పెందలాడేలేచి చక్కగా ముఖా కడుక్కున్నాను. రోహిణి యెదుటికి పోయేముందు రాత్రి పడ్డ అవస్థతో ముఖంలో యేర్పడ్డ మ్లాన చిహ్నాలన్నిటినీ తుడిచివేయ ప్రయత్నించాను, కాని తీరా యిద్దరం కలుసుకోగానే రోహిణి నాతలమీద చేయివేసి నిమురుతూ 'రాత్రి పీడకలలు కన్నావా?' అని అడిగినప్పుడు నా అసమర్థతను గ్రహించుకున్నాను.

నాగుండె దడదడలాడింది. నా ముఖంలోని మార్పును కప్పిపుచ్చటానికి ఆమె కళ్లలోకి చూస్తూ చిరునవ్వు తెచ్చిపెట్టుకున్నాను. అయినా "అవును, ప్రియరోహిణీ! స్వప్నాలెప్పుడూ చిత్తాన్ని వ్యాకులపర్చటానికే వస్తా"యన్న మాటలు నా నోటినుంచి తూలిపోయినై.

"ఇంతకూ కల యేమని వచ్చిందేమిటి?"

"అంతా జ్ఞాపకంలేదు."

"జ్ఞప్తి వున్నంతమట్టుకే చెప్పు ప్రియా!

"భీకరాకారుడైన రాక్షసు డెవడో నిన్ను నా వద్దనుంచి గుంజుకోబోతు న్నాడు నేను కరవాలాన్ని ఒరలోనించి లాగాలనుకొన్నానేగాని, అది ఎంతకూ బయటికి రాకపోయింది. అప్పుడు నేను ఒరను విసరిపారవేసి ఆ రక్కసునిపైకి లంఘించాను. వాడి రెండు రెక్కల్నీ విరిచి కూలద్రోసి, క్రింద పడవేయబోతు న్నాను: అంతలో వాడు మెలాయించుకొని నాపైకి కత్తి విసిరాడు. నేనా దెబ్బనైతే తప్పించుకున్నాను; గాని, నువ్వు స్పృహతప్పి చైతన్య విహీనవై క్రిందపడివున్నావు."

"లేదు ప్రియా! అలాంటప్పుడు నేను మూర్ఛిల్లటం జరుగదు." అని రోహిణి నా భుజాలు పట్టుకొని వూపుతూ తన బాహుబలాన్ని ప్రదర్శించింది.

"నేను చెపుతూన్నది స్వప్నవృత్తాంతం రోహిణీ! కలలోని సంగతులు అసలు జరిగేదానికి విరుద్ధంగా వుంటాయి."

"కాని, నీ మోము చూస్తే నువ్వు జాగ్రదావస్థలోని విషయాలే చెబుతున్నట్టుగా వుంది."

"అదీ నిజమే. నా హృదయం స్వప్న ప్రభావంచే వికలమైవుంది. ప్రియ రోహిణీ! నీవు తలచినట్టు అనిష్టాన్ని వూహించినా భయదాయకమే అవుతుంది."

"సరేగాని, ప్రియతమా! ఇంతకూ ఆ రాక్షసుడిని ఏంచేశావు?"

"వాడిదెబ్బలు తప్పించుకుంటూ వాని దౌడమీద బలంగా ముష్టిఘాతం చేశాను. ఆ దెబ్బతో వాడు క్రింద పడగానే పైనెక్కి కూచున్నాను."

"మునుపొకసారి తక్షశిలలోని ముష్టియుద్ధ ప్రవీణః ల్లెరిలోను మేటియగు దత్తుని నువ్వుపడవేసి అణచిపెట్టినట్టేనా? అబ్బ! ఆ దృశ్యాన్ని చూచి నేనెంతగా మురిసిపోయాను! అభిమానంతో నా తలహిమవంతునివలె పైకిలేచింది. నా చెలులు నన్నెంతగానో అభినందిచారు. వారానాటి నీ విజయాన్ని నావ్యక్తిగత విజయంగానే భావించారు."

"మరి నీవో రోహిణీ!"

"నేనుకూడాను; అందువల్లనే ఆనందం పట్టలేక పోయాను."

"నే నారాక్షసుణ్ని ఓడించి మరీ వదిలాను; కాని, ఏం లాభం? లేచి చూస్తే నువ్వక్కడలేవు. నాకు ప్రాణంయెగిరిపోయి నట్లైయింది; అయితే అంతలోనె నాకు మెలకువ వచ్చింది."

"ప్రియా! నీకు కలలంటే విశ్వాసమేనా?"

"లేదు, నాకు నమ్మకంలేదు రోహిణీ!"

"నాన్నగారికీ నమ్మకంలేదు; అమ్మకు మాత్రం గట్టి నమ్మకమే. స్వప్నంలోని సంగతులు మేలు కీడుగాను, కీడుమేలుగాను వుంటాయి అంటుంది."

"నమ్మవలసివస్తే అమ్మఅనే ధోరణిలో నమ్ముతాను రోహిణీ!"

"మరి........."



45

# 6. సమరసన్నాహం

పారశీకచక్రవర్తి గ్రీకులతోడి యుద్ధంలో చావుదెబ్బతిన్న కారణంగా మరి తూర్పున సరిహద్దులను విస్తరింపజేసుకోవాలన్న వుత్సాహమే లేకపోయిం దతనికి. అయితే అతని సామంతరాజు - ఆర్తశత్రుతుడుమాత్రం మిన్నకుండజాలక సామ్రాజ్యానికి తూర్పుసరిహద్దుల్లో కదలించి కంపుచేయటానికే నిశ్చయించు కున్నాడు. పొరుగు రాజ్యాలలో ఏమి జరుగుతున్నదీ ఎప్పటికప్పుడు సుళువుగా తెలిసే అవకాశాలుండటం తక్షశిల అదృష్టమే! తక్షశిల వర్తకులు పారశీక రాజ ధాని నగరంవరకు వెళుతూండేవారు. పారశీక సామ్రాట్టు తన దర్బారుకు వైద్యు లను, విద్యాబోధకులను తక్షశిలనుంచి పిలిపించుకొనేవాడు. ఈ కారణాలవల్ల తూర్పు గాంధారానికి ప్రతికూలంగా చేయబడే కుట్రలు, యుద్ధ ప్రయత్నాలు దాగియుండేవి కావు.

కోతలు అయిపోయి ఫలసాయం ఇళ్ళకుచేరింది. వాన లారంభమయినై. యుద్ధాన్నిగూర్చిన వదంతులు వ్యాపించునప్పటికి నేను తక్షశిలకువచ్చి ఎనిమిదేళ్లు గడచిపోయినవి. పంచాయితీ సమావేశాలు నిత్యము జరుగుతూండేవి. ఆచార్యు డెల్లప్పుడు దీర్ఘాలోచనా నిమగ్నుడయి వుండటము నేను కనిపెట్టాను. ఒకరోజున ఆయన్ను యుద్ధ వివరాలనుగూర్చి అడగ్గా ఆయన యిలా చెప్పారు:

"వత్సా! తూర్పుగాంధారం పైకి యుద్ధమేఘాలు కమ్ముకొస్తున్నై. పశ్చిమ గాంధారంలోని తన సామంతరాజుకు పారశీకచక్రవర్తి మాపైకి సమరసన్నాహం చేయవలసిందిగా ఆదేశించాడు."

"సమరసన్నాహమా! తక్షశిలపైకి దండయాత్రా!!"

"అవును, మేమున్ను ఒక నిశ్చయానికి వచ్చాము. ఇప్పటినుండి ప్రతి పౌరుడు సైనిక సేవయే తన ప్రధానకర్తవ్యంగా భావించాలి. పాంచాలంలోని పంచాయతీ రాజ్యాలన్నీ మాకు అండగా నిలబడటానికి సిద్ధంగావుండటం మా కనలేని ఆనందాన్ని కూర్చింది. వృద్ధాప్యం వల్ల నేను సర్వసైన్యాధపత్యానికి సమ్మతించ లేక పోయాను; కాని, సేనానాయకులకు శిక్షణ నిచ్చి దీక్షాబద్ధులను గావించటానికి మాత్రం జవాబుదారీ వహించాను."

"గురూ! తక్షశిలకు తటస్థించే ముప్పును వైశాలి తనదిగానే భావించగల దనే నే నాశించుతున్నాను."

"అవశ్యం అంతే. వైశాలి తూర్పున తక్షశిలయే ఇవి రెండూ అక్కచెల్లెళ్ళే."

"మరి తమ యీ శిష్యునికి యీ యుద్ధంలో పాల్గొనే అవకాశమివ్వాలి గురూ !"

"ఎలాంటి అభ్యంతరం వుండదనే నా తలంపు. అందుకనుజ్ఞనీయ వలసినదిగా నేను యుద్ధసమితికి విజ్ఞప్తి చేస్తానులే" అని ఆచార్యులు నా భుజంతట్టి చెప్పారు.

తర్వాత యుద్ధసమితి నన్నొక సైనికునిగా అంగీకరించుటేగాక మా వైశాలి యువకు లైదుగురు కూడ సైన్యంలో చేరటానికి సమ్మతించింది. తక్షశిలా పౌరులే గాక, వేలాది నవాగంతుకులు, బానిసలు తక్షశిలారక్షణకు పోరాటంలో పాల్గొనేందుకు అనుమతి యీయబడింది.

ఈ విధంగా తక్షశిలలో ప్రతిపౌరుడు నిర్బంధ శిక్షణపొందుట అవసరమయింది. అపార పారశీక సేనావాహినుల నరికట్టవలసి యుండుటచే తూర్పు గాంధారమం దెల్లెడల సైనికశిక్షణ, వ్యూహరచన, సైనిక విన్యాసాలు జరుగుచున్నవి. తక్షశిలా వాసులెల్లరికి సైంధవాశ్వము లుండనే యున్నవి. వారికి స్వంత ఆయుధాలుకూడ వున్నై. ఎవరికైనా యేదేని ఉపకరణము లేకపోతే వెంటనే పంచాయతీ సరఫరాచేసేది. సేనానాయకులు తమతమ భటులకు తర్ఫీదునిస్తున్నారు. వారికి ప్రత్యేకశిక్షణ నిచ్చేబాధ్యత యుద్ధవిద్యా విశారదులు-మా ఆచార్యులవారిదే. ఆయన తమ కవచాన్నీ అశ్వాన్ని నాకు ప్రసాదించారు. కొమ్ము ధనస్సు, అంబులపొది, పెద్ద ఖడ్గము, ఒకబల్లెము, బాకు నావద్దనే వున్నవి; ఇవిగాక మంచి గదకూడవుంది.

మా కెప్పటి కప్పుడు శత్రువులప్రయత్నాలు తెలుస్తూనే వున్నై. ఈ విషయంలో పశ్చిమగాంధారసోదరులు మా కెంతగానో వుపకరించుతున్నారు. వారు నిర్బంధంగా పారశీకసైన్యంలో చేర్చబడుతున్నప్పటికీ, యథాసమయంలో తమ కర్తవ్యపాలనచేసితీరుతారనే మా విశ్వాసం. తుదకు జరిగినదికూడ అంతే.

వానలాగిపోగానే దండయాత్ర ప్రారంభమవుతుందన్న సంగతి మాకు ముందే తెలిసింది. వర్షఋతువు సమాప్తమవుతూండగానే శత్రువు ఆకస్మికంగా మాపై దాడిచేయవచ్చునని మా సైనికదళాలు రేవులు, పొలిమేరలు, కనుమలు, మార్గముల రక్షణకు పంపబడినవి. ఆచార్యులు పుష్కలావతినుండివచ్చే మార్గాన్ని కాపాడేభారాన్ని నాపై మోపారు. అక్కడ రక్షణసైన్యం సిద్ధంగానేవుంది. ఇక ఆదేశంరాగానే నేనక్కడికి చేరుకోవలసివుంది. అప్పటికి తక్షశిలచుట్టూ వున్న రాతిప్రాకారం మరమ్మతుచేసి దృఢంచేయబడింది. నగరద్వారములవద్ద గట్టి పహరా ఏర్పాటుచేయబడ్డది. ఆ ద్వారములవద్ద కాస్సేపు కూర్చున్నట్టయితే లోనికి, బయటికి పరుగులుతీస్తున్న గుర్రాలు కన్పించుతాయి. ఆ అశ్వారోహకులు వార్తలను తెచ్చువారు, ఆజ్ఞాపత్రికలను గొనిపోవువారే.

ఒకనాడు ఆచార్యులవారు నాతో యిలా అన్నారు—

"వత్సా సింహా! ఈ పర్యాయం యుద్ధం చాలా ఘోరంగా వుంటుంది. పారశీకచక్రవర్తి తక్షశిలను ధ్వంసంచేయాలని తనకున్న మంది బలాన్నియావత్తూ సమీకరించి యుద్ధసన్నద్ధుడౌతున్నాడు. మేమైనా ఒంటరిగాలేము. మల్ల, మద్ర...ప్రజారాజ్యాలన్నీ అవిరామంగా సమరసన్నాహాలు చేస్తూనే వున్నవి. ఇప్పటికే మహాసింధు తీరప్రాంతంలో ఎవరికి నిర్దేశింపబడిన రేవులకు వారి సైనికదళాలు చేరుకున్నవి. దాడిచేసేవారికే యుద్ధంలో అధికలాభం; అయితే, యిక్కడ మా విషయంలో మాత్రం ఆ సూత్రం ప్రతికూలమవుతుంది. అరావళీ ప్రాంతీయులం వెనుకనున్న ప్రదేశములతో సంబంధం పెట్టుకోడానికి మహాసింధు ఆటంకంగా వుండటమే అందుకు హేతువు. శత్రువులు ఎక్కడపడితే అక్కడ సింధునదిని దాటి రాలేకపోవటంకూడ మేలే. వాళ్ళు యివతలికి రావాలంటే మా కాపులోవున్న రేవుల్లోనే దాటిరావలసివుంటుంది. అందువల్లనే వారు తమ మందిబలంవల్ల పూర్తిప్రయోజనం పొందలేరు."

తొలిసారిగా నేను శిరస్త్రాణమును దాల్చి, ధనువు, తూణీర, ఖడ్గ, గదాధారినైనప్పుడు రోహిణి నా గదిలోనేవుంది. నన్నా వేషంలో చూచి రోహిణి నన్ను గాఢాలింగనం చేసుకొన్నది. "నీకీకఠోరకవచం బాధకలిగిస్తుంది. ప్రేయసీ!" అన్నాను.

"నాకు బాధా? లేదు నా కేసరీ! తక్షశిలావాసినులము మేముకూడ తయారవుతున్నాము. కత్తిమొనకు తేనెపూసి తక్షశిలలో బాలురచే నాకించినట్లే బాలికలనుకూడ ఆయుధ సేవలో తయారుచేస్తారు.

నేను శిరస్త్రాణాన్ని తీసి అవతలపెట్టి రెండుచేతుల్తో రోహిణి బుజాలు పట్టుకొని అన్నాను - "ప్రియ రోహిణీ! ఈ విషయంలో తక్షశిల స్త్రీలు వైశాలి కాంతలను మించిపోయారు సుమా!"

"అలా అంటావేం? లిచ్ఛవీయాణులు రణరంగంలో దూకటానికి నడుం కట్టలేరూ?"

"అదికాదు విషయం. పూర్వం వైశాలి వీరాంగన లెందరెందరో సేనల్ని నడిపారు; దుర్గరక్షణలో పాటుపడ్డారు; కాని, యిప్పుడక్కడ స్త్రీలకు యుద్ధ విద్య నేర్పటంలేదు."

"ఏం, నేర్పక పోవటానికి కారణం?"

"అందుకు కారణా లనేకమున్నై; అయితే వైశాలిలో దాస-దాసీ విధానము, అనార్యుల సంఖ్యాధిక్యతలే ప్రధాన హేతువులని నా విశ్వాసం. తక్షశిలలోని నిరాడంబర జీవిత సరణి తొలినాడే నన్నాకర్షించింది. ఆచార్యులవారి వలె విస్తారంగా భూములు, పశుసంపద, వ్యాపారము కలిగియున్న వారివలె వైశాలిలో దాస-దాసీజనంతోను, నౌకరులతోను కలసి సహపంక్తిని భోంచెయ్యరు. నృత్య-గానములం దసలే కలసి పాల్గొనరు. అక్కడ స్వాభావికమైన నిరాడంబరత

శ్రమజీవితము అంతరించి పోయినై. సైనికజీవితం తప్పని సరియగుటవల్ల మాత్రమే ప్రజలకు శ్రమజీవితం తప్పకున్నది."

"ప్రియతమా! నేనప్పుడప్పుడు అనార్యులు మాయింటికి రావటంచూచాను. ఒకదఫా ఇంద్రప్రస్థపురాన్నుంచి తిరిగివచ్చిన మా బిడారు పెద్దతో నలుగురు నల్లటి మనుషులుకూడ మా యింటి కొచ్చారు. నాన్నగారు వారి సరసనే భోంచేశారు. మేలైన ద్రాక్షరసం, లేగదూడ మాంసాలతో వారిని సంతృప్తులను గావించారు. ఇది నీవు వచ్చేప్పటికి ఏడాదిక్రితం జరిగింది. వారినిగూర్చి నేను అడిగిన ప్రశ్నలకు గాంధార, మద్రాది రాజ్యాలన్నీ పూర్వం అనార్యులవే ననీ, మా పూర్వులు పశ్చిమాన్నుంచి హయారూఢులై వచ్చునప్పటికి మహాసింధు పడమటి భూభాగమంతా వారి ఆధీనంలోనే వున్నదనీ, యుద్ధంలో అశ్వారోహకులైన మా పూర్వులే జయించి యీ భూమి నంతనూ భుక్తించేనుకున్నారనీ నాన్నగారు చెప్పారు; కాని, సింహా! ఇంతకూ నే నెన్నడూ దాస-దాసీలను చూళ్ళేదు. వా రెలా వుంటారో?"

"నువ్వు చూడకపోలేదు రోహిణీ! ఆనాడు సుదత్తుని మనిషివెంట మరొక నల్లని వ్యక్తికూడ నాకోసం రాలేదూ?"

"అవునవును, నేనతణ్ణి చూచాను. అతనిజుట్టు, ఒళ్ళు నల్లగా ఒకేమాదిరి వున్నై. అతనికళ్లు ఎర్రగా చింతనిప్పుల్లాగున్నాయి. వెడల్పైన ముక్కు, పొడుగాటి గోళ్ళూను. అతడు మోటుగా దుక్కలాగున్నాడు. దాసులు అలాగే వుంటారా?"

"కాదు, దాస-దాసీ జనానికి ప్రత్యేకంగా ఒక రంగంటూ వుండదు; అయితే వారిలో ఎక్కువమంది కరిరంగే కలిగివుంటారు. మీరు గుర్రాలను, పశువుల్ని యిష్టమైనప్పుడు అమ్మి కొనుక్కున్నట్టే అమ్మి కొనుక్కోబడే వారిని దాసులంటారు."

"అమ్మి, కొనుక్కోవటమా?"

"అవును రోహిణీ! ఇక్కడ తక్షశిలలోకూడ ఆర్యులు అడుగుపెట్టినప్పుడు వెయ్యి వెయ్యిన్నర సంవత్సరాలకు ముందు మీ వారుకూడ పరాజితులైన అనార్యులెందరినో బానిసలుగా వుంచుకొనేవారు; అయితే కాలక్రమాన భీతిల్లి ఆ విధానానికి స్వస్తిచెప్పారు."

"వారికి భీతి ఎందుకో?"

"రక్తస్పర్శచే జాతి సంకరమవుతుందని మొదటి భయం. ఒకవేళ వారి రక్తం అనార్యరక్తంతో కలిసిపోయి వుంటే- ప్రియరోహిణీ!- నీ యీ సువర్ణ కేశాలు నేను మరొకవర్ణంలో కన్పించేవి. సైనిక జీవితంలోని కష్టసహిష్ణుతను కోల్పోయి సుకుమారశరీరులుగా మారిపోవచ్చుననేది వారికి కల్గిన మరొక భయం. పొరుగువారి తోడినిరంతర యుద్ధాల్లో నిమగ్నులైవున్న సమయంలో యిండ్లవద్ద

అన్ని విధముల దాసుల ప్రభావం పెరిగిపోతుందేమోనని అన్నిటిని మించిన అసలు భీతి."

"సరేగాని, మరి దీని ప్రభావం లిచ్ఛవీక్షత్రియ కాంతలపైన యెలా పని చేసింది?"

"భూముల్లో పనిచేయటానికి, పశువులను మేపేందుకు వారికడ తగినంత మంది బానిసలున్నారు. వంటచేయటానికేమి, వడ్లుదంచటానికి, పిండి విసరటానికేమి వారికి దాసీలకొరతలేదు. నువ్వేచెప్పు, తక్షశిలలో కూడ అవే పరిస్థితులున్నట్టయితే యీ రోహిణీస్థానంలో నువ్వెలా వుండేదానవు?"

"నువ్వే చెప్పు ప్రియా!"

"నీచేతులు ఎర్రని పద్మములవలెను, అతికోమలంగాను వుండేవి."

"కోమలంగానా! అయితే నేను ఖడ్గచాలనం చేయగలిగేదానను కాదన్నమాట; మరి గునపంకూడ పట్టుకోలేనన్నమాటేగా. ఇక వింటి నారిని ఎక్కుపెట్టి లాగితే వేళ్ళు బొబ్బలెక్కటంలో అనుమానమే వుండదు."

"అంతేనా? నీ చెక్కిళ్ళు మరింత యెర్రగా వుండేవి; ఉష్ణంలో కడితే నల్లబడేవి కూడాను."

"కాబట్టి నే నెల్లప్పుడు కదలకుండ యింటిలోపలనే వుండవలసివచ్చేది కాబోలు!"

"కొంచెందూరం నడిస్తేనే నీకు రొప్పువచ్చేది."

"మరి నేను తటాకంలో యీదుట, జలక్రీడ లాడుట సంభవించేదే కాదన్నమాట!"

"పైగా నువ్వు ప్రతి చిన్న - పెద్ద పనికి దాసీలపైన ఆధారపడి వుండేదానవు."

"మరి నాకీ కాళ్ళు - చేతులువున్న ప్రయోజనం? ఆ గతి వద్దమ్మాటికి నా కొద్దుబాబూ!"

"మీ అవ్వలు, మునిఅవ్వలు అలాగేచేసివున్నట్టయితే నీవూ యిష్టపడి వుండేదానివి."

"కాని, ప్రియా! ఆ విషయాలనుగూర్చి ఆలోచించినంతమాత్రాన్నే నాకు భయంకలుగుతోంది. 'పనికి దొంగలయినవారికి కొవ్వుపెరుగుతుం'దన్న నాన్న గారిమాట విన్నావుగా. నిజానికి దాసీలతో పనిచేయించుకొనేవారు బద్ధకొద్దులయిపోతారు. మీ లిచ్ఛవీయాణులు అలాగే వుంటారేమో?"

"లేదు ప్రియా! సోమ నీలాగానే వుంటుంది. లిచ్ఛవులంతా దాస - దాసీలతో పనిచేయించుకోగలిగినంత శ్రీమంతులు కారు. నేను చెప్పింది భాగ్యవంతులనుగూర్చి మాత్రమే. వారినిచూచి మొత్తంమీద తతిమ్మావారికికూడ

ఆ కోరికే వుంటుంది. పురుషులు సుకుమారజీవితం గడపటానికి సైనికశిక్షణ బాధాకరంగావుంది. ఈ జాడ్యము స్త్రీలలో మరి ఎక్కువగా వ్యాప్తి చెందింది."

"అయితే వైశాలికి వెళ్ళినతర్వాత నేనుకూడ అలాగే తయారుకావలసి వస్తుందా ఏం?"

నే నామె స్నిగ్ధకపోలానికి నా నుదురాన్చి "అవసరం లేదు నా ప్రియ రోహిణీ! నీ వక్కడి స్త్రీలకు గాంధారరమణీ జీవితపాఠాన్ని బోధించు. అమ్మ నీ వలెనె శ్రమపడి పనిచేస్తుంది."

"మరి సోమ?"

"సోమకింకా పెళ్ళికాలేదులే. ఆమె అందంగా వుంటుంది. భాగ్యవంతుడైన యే లిచ్ఛవి యువకుడైనా ప్రేమించితే ఆమెకూడ మిగతా భాగ్యశాలినులవలెనె తయారుకావలసివస్తుందేమొ!"

"అల్లాకాకూడదు. నేను నా మరదిని అలా కానివ్వను. లేకపోతే ఆమె కూడా సరస్వతిలాగా బక్రగొడ్డయి పోతుంది."

"సరే, యిక నీ విషయాన్ని వదిలేద్దాం రోహిణీ! నామేనుకీ కవచం చక్కగా అతికిందంటావా చెప్పు?"

"కొంచెం వెనక్కి తిరుగు" అని ఆమె నా వీపువైపుచూచి ఉత్సాహంతో అంది - "ఇది అచ్చంగా నీ కోసమే తయారు చేయబడినట్టుగా వుంది. ప్రియా! నేనిదివరకు నీ వక్షమింత విశాలమైన దనుకోలేదు సుమా!"

"నువ్వు నిత్యము చూస్తున్నదేగా. రోజురోజుకు నాలుగేసి అంగుళాలు పెరగటంలేదే!"

రోహిణి కనుబొమలాడింపుతూ అంది - "కాదు, రోజూ ఏమిటి, ప్రతిక్షణం పెరుగుతోంది. ఈ కవచం ఎవరిదో తెలుసా? మా తాతబొమ్మతో పోల్చదగినంత వెడల్పైన ఛాతీగలవారే లేరు. యిది ఆయనదే."

"మీ తాతగారిదా!" నేనాశ్చర్యంగా అడిగాను.

"అవును, యిది ఎల్లప్పుడు జయశ్రీనే వరించేది. నువ్వుకూడ ప్రియసింహా!- యీ కవచధారివై రణరంగాన్నుంచి విజయోపేతుడవై తిరిగి వస్తావు."

"రోహిణీ! (వుల్లాసంతో) వికసించిన నీ మోముగాంచి నాకు పరమానందంగా వుంది."

"నా మొగ మేల వికసింపదు? గాంధారకాంతలకు తమప్రియులు యుద్ధభూమినుంచి విజయదర్పంతో, రక్తసిక్తమైన కరవాలములతో తిరిగివచ్చునప్పటి కంటె ఆనందదాయకమైన సమయం వేరేముంటుంది? నేను నా నెచ్చెలులతో నీచేతి ఖడ్గ చాలనాన్నిగూర్చి సాభిమానంగా చెప్పుతూంటాను. వీరహస్తానికి కృపాణానికి మిన్నయైన భూషణమేలేదు, అంతకు మించిన మాననీయవిషయమూ వుండదు.

నేను నా హస్త రక్షణాచ్ఛాదనములను తొలగించి రోహిణి ముంగురులను పైకెసర్ది, ఆమె శిరమును చేతులతో పట్టుకొని "ప్రేయసీ! తక్షశిలలో మేము నేర్వదగిన సంగతులింకను పెక్కుగలవని యిప్పుడు తెలుసుకొన్నాను. నీబోటి యువతీలలామలు తమ ప్రియులగు తరుణుల నుత్సాహపరచి వారికెంతగా గుండె బలాన్ని చేకూర్చుతున్నారో!"

"అవును, గాంధార పడతులము చావుకు భీతిల్లము. మరణమంటే భయ మెందుకు? ముందే చావునూహించి భీతిల్లుట కేవలం మూర్ఖం. ఇక చావు సంభవించిన తర్వాతనో, అప్పుడు భయపడడానికి ఆవ్యక్తి వుండదేలేదు. మాకు ప్రతిక్షణం జీవితానంద మనుభవించటానికే వుపయోగపడాలను కుంటాము. జీవితం అంతమవుతుందనే తలంపుకే మాకు తీరుబాటు వుండదు."

"కాని, మృత్యువు ప్రేమాస్పదుల వియోగాన్ని కలిగిస్తుందిగదా."

"అయితేయేం? చావుకు జడిసేవారిని మేము మా ప్రియులుగా స్వీకరించుతామనా? కాదు, ప్రియా! మేము నిర్భయులు, వీరులనే ప్రేమించుతున్నామంటే ఆ విలువను చెల్లించటానికూడ మేము సిద్ధమే."

ఈ మాటలు అంటూండగా రోహిణిమోము గాంభీర్యతను దాల్చింది. నే నామె నోటినుండి వెలువడుతున్న ప్రతి అక్షరాన్ని ముగ్ధుడనై ఆలకించుతున్నాను. ఇలాంటి స్త్రీలు - తల్లులు - అక్క - చెల్లెళ్ళే మా వైశాలిక్కావా లనిపించింది. అక్కడ యిలాంటివారు లేనేలేరని కాదు; కాని, అందరూ అలాంటివారు కాదు. ఈ ఆలోచనలోనుండి తేరుకొని నే నన్నాను—"రోహిణీ! నేనునిన్నెంతగా ప్రేమించుతున్నానో మాటలతో చెప్పలేను. నిజానికి ప్రేమలో జీవితానికేగాని, మృత్యువుకు తావులేదు."

"ప్రేమ అహరహం సజీవంగానే వుంటుంది సింహా! ప్రేయసి ప్రియులలో ఏ ఒకరో జీవించి వున్నంతవరకే కాదు; ఆపిమ్మట మన తాత ముత్తాతలున్న దివ్యలోకంలో కూడాను."

అమ్మ పిలుపువిని రోహిణి దౌడుతీసింది. ఆచార్యులు తమగదిలో వున్నట్టు అలికిడివిని నేను వారివద్దకు వెళ్ళాను. ఆయన నా కవచధారణను గమనించి "సింహా! నీ కిది చాల పొందికగా అమరింది సుమా!" అన్నారు.

నేను 'ఔ'నన్నట్లు తలాడించాను. కొంతసేపటివరకు మేము యుద్ధ సన్నాహాన్ని గురించే మాట్లాడుకున్నాము. ఇందాక రోహిణి అన్న 'పితృలోకం' జ్ఞాపకంరాగా నేను ఆచార్యుల నడిగాను- "గురూ! యోధులు మరణానంతరం పితృలోకానికి చేరుతారన్న విషయాన్ని తమరు విశ్వసించుచున్నారా?"

"నా నమ్మకాన్ని గూర్చి అడగవద్దు వత్సా; నేనావిషయాన్నొక మధుర కల్పనామాత్రంగా భావించుతాను. ఈ కల్పన తమ ప్రజానీకాన్ని అంధకార బంధురంలో వుంచటానికి తూర్పున నిరంకుశరాజులు కల్పించినదే; కాని,

కపటముని—జైవలి తూర్పున ప్రచారం చేయటానికి తీవ్రకృషిచేసిన కల్పన కంటె మేలైనదే. పితృలోకాన్ని గూర్చిన కల్పనలో ప్రియుల నిత్యసమాగమముల భావన పనిచేస్తుంది. కాని- ఈ లోకంలోనే మరల మరల పునర్జన్మించుతారని కల్పనచేసి తూర్పున తెగ ప్రచారంచేశారు. అందులో వారి నీచస్వార్థం అంతర్గర్భితమై వుంది. వారా కల్పనద్వారా యీ ప్రపంచంలో తమ అధికార, భోగ - భాగ్యార్హతలను ఋజువుచేసుకోవాలనుకుంటున్నారు. ఈ దాస - దాసీవిధానం తాము తెచ్చిపెట్టిందికాక, మానవుల పూర్వజన్మ కర్మఫలితంగా వచ్చిపడ్డదేనని వారి అభిప్రాయం."

"గురూ! మానవజీవిత విలువను కల్పనగానే యెంచుతూండేవారికీ, జీవిత నియమాన్ననుసరించకుండా బ్రతుకుతున్నవారికీ ఆ కల్పన అవసరమవుతున్నదని నేను భావించుతున్నాను."

"అవును నాయనా! ఊడిగము చేయించుకోటానికే అలవాటు పడిన పనిదొంగలు బుద్ధిమందగించి, జీవితానంద మనుభవించటానికే పనికిరాకుండా పాడయి పోతారు. పరిశ్రమ, వ్యాయామము, నృత్యములు మనలో క్షుత్తును రేకెత్తించుతాయి. అందుచే మనం ఆహార రసాస్వాదనం చేస్తున్నాం. ఆ రసాన్ని జీర్ణంచేసి కొని మళ్ళీ శ్రమ, వ్యాయామ, నృత్యాదులకు తగినట్టుగా శరీరాన్ని శక్తివంతం చేసుకొంటున్నాము. ఆకలిని కల్గించుట కవసరమగు శ్రమచేయక పనిదొంగలమైతే మన మెంతకాలమో రసాస్వాదనచేయగల వాళ్ళంగా వుండలేకపోవటం నిశ్చయం. దాసుల కష్టార్జితంతో పోషితులగు వారు జీవిత రసానుభవార్హత లేకుండా చేసుకుంటారు. అందువల్లనే అట్టి వారొక్కొక్కప్పుడు జీవిత సారస్యాన్నే ఈసడించు తూంటారు; మరొకప్పుడు దానిసవిధానాన్ని న్యాయయుక్తమని సమర్థించటానికి పునర్జన్మ విషయాన్ని ఎలుగెత్తి చాటుతారు. జీవిత రహస్యాల్లో చాలమట్టుకు అజ్ఞాతంగానే వుంటై; అయితే అసలు జీవితాన్ని వదలి జీవిత వ్యాఖ్యానం చేయబూనటం వంచనే అవుతుంది."

"తక్షశిలకోసం ప్రాణ పరిత్యాగానికైనా మేము సంసిద్ధులమై వుండుట జీవితసత్యమే గురూ!"

"నువ్వు చెప్పింది యథార్థమే వత్సా! జీవిత సత్యాన్ని తిరస్కరించిన తరువాత మనలో మానవత్వమే మృగ్యమౌతుంది. మనమూ క్రిమి - కీటకాలతో సమానమవుతాము. అలాంటివాడు తన ప్రజాతంత్రానికేమి, బంధుజనులకేమి, తుదకు తనకూడా ఆ పురుషు కావాలను. అట్టివ్యక్తి లోకులయిండ్లు, సంపదలను దోపిడిచేసి స్వాయత్తం చేసుకోవాలనుకొనే ఆ క్షత్రుని వంటి చోరునికి మాత్రమే మిత్రుడు కాగలుగుతాడు."

"తక్షశిల చిరయౌవన......"

★

# 7. రణరంగంలో

'కూ' అన్న కూత మువ్వురు వినపడింది. మేమందరము మెలకువకలిగి మా మావిల్లు ఎక్కుపెట్టి సింధునదీప్రవాహంపైన దట్టంగా అలముకొనివున్న గాఢాంధకారాన్ని చీల్చుకుంటూ చూడటానికి ప్రయత్నించసాగాము. నలుగడలా నిశ్శబ్దం తాండవించుతోంది; మేము పరస్పర ఉచ్ఛ్వాస-నిశ్వాసలను స్పష్టంగా వినగల్గుతున్నాము. కాని, అందరము సింధు ప్రవాహంవేపు చెవులు రిక్కించి వింటున్నాము. కొద్దిసేపట్లోనే నీటిలో 'తపతప' మన్న సవ్వడి వినపడసాగింది. అక్కడ సింధు ప్రవాహం రాతినేలమీద వెశెల్పు చాల తక్కువగావుంది. రాత్రి పూట కాఱుచీకట్లో పారసీకసైనికులక్కడే నదినిదాటి రా ప్రయత్నించుతారని మేము ముందే అనుమానించాము. నది అవతలివేపున అరణ్యాలో దాగియున్న మా గూఢచారే మమ్మల్ని హెచ్చరించేందుకు 'కూ' అని కూత వేశాడు. చూస్తూండగానే 'థప థప' ధ్వని సమీపించసాగింది. అలాంటి చీకట్లో నడక ధ్వనినిబట్టి మాత్రమే మేము బాణాలను గురిపెట్టి వదలకల్గుతాము. అప్పుడు మాగురి కొంతవరకు పనిచేసినట్లేతోచింది. ఒకసారి దండు వెనక్కిమళ్ళినట్లు ధ్వనినిబట్టి గ్రహించాము. ఇక ఆ రాత్రి శత్రుమూక యివతలికి రావటానికి ప్రయత్నించదనే అనుకున్నాం. అంతలో మళ్ళీ 'కూ' అన్న కూత వినవచ్చింది. ప్రమాదం అప్పుడే తొలగలేదు; శత్రువులు మరింత కట్టుదిట్టాలతో రాబోతున్నారని సూచించుటకే ఆ కూత.

వారికి నావల కొదవలేదని మాకు తెలుసు. మహాసింధు ఎగువతట్టునవున్న పడవలేకాక, కుభా (కాబూలు) నదీతీరాన వందలాది నావలు నిర్మించబడుతూన్న వార్తలుకూడ మాకుచేరాయి. శత్రుపక్షం తనసర్వస్వం ఒడ్డి అయినాసరే యివతలికి రా ప్రయత్నించుతారని నాకు ఘట్టి నమ్మకము. మే మివతలి ఒడ్డున ఆరితేరిన విలుకాండ్రను సమీకరించి వుంచాము; అయినా శత్రు నావ లీవేపుకు చేరిపోవచ్చనే అదటుకూడవుంది. అందువల్ల ఖడ్గధారులును యువవీరులును శత్రువుల రాకను నిరీక్షించుతూ కాచుకొనివున్నారు; అంతేకాదు. చిదుగులు, ఆకులలములేరి తీరస్థలాన పోగులుపెట్టి వుంచాము. నావలు త్వరితగతిని యివతలి వేపుకు వస్తూండగా మాధనుర్ధారులు బాణవర్షం కురిపించసాగారు; కాని, వరదలాగా వచ్చిపడుతూన్న నావలను వారటకాయించలేక పోయారు. వాటిలో చాలవరకు మాగట్టును చేరుకున్నై. అప్పుడొక ప్రక్కన మా భటులు కొందరు ఎండాకు కుప్పలకు, నిప్పంటించి మంటచేశారు. వైరి సైనికులు నావలనుండి దిగుతూండగానే

ఆ మంటలు పైకి లేచాయి. ఆ మంటల వెలుగులో మేము శత్రువుల ఆకృతులను స్పష్టంగా చూడగలుగుతున్నాము. ఒడ్డున నున్న మా ధనుర్ధారులప్పుడు శత్రువులకు గురిపెట్టి కొట్టడానికి బాగా వీలుగా వుంది; అయితే పారసీకులను వెనక్కి మళ్ళించడానికి మావారిశక్తి చాలకుండా వుంది. శత్రువులలో పెక్కుమంది కవచధారులై వున్నారు. వారు గట్టుపైకెక్కబోతూండగా నేను నా భటులకు వారిని ప్రతిఘటించుట కానతిచ్చాను. మిన్నంటుతూన్న మంటల వెల్తురులో తళతళలాడే కరవాలములు, భీకర సంఘర్షణ, ఒడ్డునుంచి క్రిందికి దొర్లుతున్న శవాలు - యివే ఆ హడావుడిలో కన్పించుతున్నవి. జయ జయ ధ్వానాలతో చెవులు గింగురుమంటున్నాయి. పోరాట ప్రదేశం మాకే వాటంగా వుంది మా వాళ్ళు గట్టుమీద వున్నారు. శత్రువులు నదిలోనుంచి నిలువుగా వున్న ఒడ్డుపైకి ఎక్కిరావాలి. పాదాలక్రింద జారుతున్న రాతిబండలు వారి యిడుములకు దోహదం చేస్తున్నై. నేను ఒక ప్రక్కనుండి రెండోవేపుకు పరుగుతీస్తూ మా భటులకు హుషారు కల్పించుతున్నాను. అడుగడుక్కి శత్రువులు పలచబడుతూండడము మా వాళ్ళు గమనించుతూనే వున్నారు. అప్పట్టున నా దృష్టి కవచధారియగు నొక బలాసిపైనపడింది. అతగాడు వెనకనున్న నావవైపుకు చల్లగా జారుకుంటున్నాడు. నేను గట్టుక్రిందికి యెప్పుడు దిగాలనుకున్నానో నాకు తెలియదు. బలశాలియగు ఆ వ్యక్తి బలమైన నా గదాఘాతంచే విరుచుకొని కుప్పగా కూలుటమాత్రం నే నెరుగుదును; కాని, అంతలోనే పారసీక సైనికులు నా చుట్టూ క్రమ్ముకొని రావటం చూచాను. వెంటనే మెలకువకలిగి అతికష్టంతో నా ఒడ్డచేతినికూడ కుడిచేయిలా త్రిప్పసాగాను. మా ఆచార్యులు - బహు శాశ్వని శిక్షణ ఒకేవ్యక్తిని యిద్దరి కీడుగా చేస్తుంది. పారశీక సేనాపతి - నాచే కూల్చబడినవ్యక్తి - సైన్యాధిపతియని నాకు దర్మిలా తెలిసినది - కవచధారియై వున్నందున నేను గదా ప్రహారంతోనే కూల్చివాను; అయినా అప్పుడు నా వద్ద బల్లెముకూడ లేకపోలేదు.

శత్రువులచే చుట్టుముట్టబడిన యీ విషమావస్థలో నేను వెనుకముందు లాలోచింపక సమీపించినవారిని గదతో కూల్చుచు, యెడంగా వున్నవారిపైకి శూలాన్ని ప్రయోగించుతున్నాను. నే నెటు లంఘించితే అటువేపున్నవారు త్రోవనిచ్చినవారివలె చెదరిపోసాగారు; కాని వెనుకపాటునుండి నాకవచంమీద దెబ్బపైనదెబ్బ పడుతూనేవున్నై. నే నా ప్రహారాలను లెక్కపెట్టడానిగ్గాని, వెనుదిరిగి చూచుకొనేందుగ్గాని అవకాశం లేదు. ఒకరొకరుగా క్రిందకూలి దొర్లుతూన్న శత్రుసైనికులను చూస్తుంటే నా వుత్సాహం అతిశయించుతోంది. మా పక్షంవారు నన్ను చేరవస్తున్నట్టు కేకలు వినవస్తున్నాయి. అదేసమయంలో బల్లెమొకటి నా కుడితొడలో బలంగా నాటుకుంది. నేను క్రిందపడకుండ తమాయించుకుంటున్నంతలోనే శత్రుసైనికు డొకడు నా నెత్తిమీదకు గదను

విసరబోతూండడము నాకంటపడింది. నేను తక్షణమే అభ్యాసానుసారిగా వానిపైకి ఆయుధాన్ని విసిరాను. అంతే, అటుపైన నా కళ్ళు బైర్లుకమ్మాయి.

నేను స్పృహతప్పి పడిపోయిన తర్వాత మొదటిసారిగా కళ్లు విప్పినప్పుడు పొద్దు నెత్తిమీద వుంది. అక్కడొక విశాలవృక్షం; దాని పచ్చని ఆకులు గాలికి రెపరెపలాడుతూన్నై. పైన ఆకులు మినహా మరేమీ కనుపించటంలేదు. నేనెక్కడున్నదీ వూహించలేకపోయాను. ప్రక్కనెవరైనా కనపడతారేమోనని ఒత్తిగిలబోయాను; కాని, అప్పుడు నా రోమరోమాన తీవ్రమైన బాధగా వున్నట్టు గ్రహించాను. అపలంగా పళ్లు కదనొక్కకొని యథారీతిని పడివుండగా పరిచిత మోహ మొకటి నాపైకి వంగుతూండడం చూచాను. అప్పటికింకా నాకు బాహ్యజ్ఞానం పూర్తిగా రాలేదు. మైమరపుగానే వుంది. తరతరాలనాటి వీరులంతా చిరయౌవనంలో వుండే పితృలోకంలోనే వున్నాననుకుంటున్నాను. అంతలో నా వీనులకీమాట వినపడింది.

"ప్రియా! ఒంట్లో ఎలావుంది?" ఆ స్థితిలోకూడ రోహిణి కంఠస్వరాన్ని యిట్టే గుర్తించాను. ఆమెకూడ పితృలోకానికే వచ్చిందని భ్రమపడ్డాను. ఆ క్షణంలో నా బాధనే మరచి ఆనందపారవశ్యంతో అడిగాను. —

"రోహిణీ! నువ్వా? ఎక్కడ?"

"నీ ప్రక్కనే ప్రియతమా!"

"మనిద్దరికి మళ్లీ పితృలోకంలో సమాగమమా"

"కాదు ప్రియా! ఈ లోకంలోనే. ను వ్యాధికంగా మాట్లాడవద్దు. మూన్నాళ్ళ కిప్పుడొచ్చింది స్పృహ నీకు. వివరాలన్నీ నేను చెపుతాను. నువ్వు మహాసింధు రేవురుదాపులోనే—పారసీక ప్రధాన సైనిక దళాన్ని నువ్వు ఓడించిన ప్రదేశమందే — వారి సేనాపతిని నువ్వు చెరపట్టిన ప్రాంతంలోనే ఉన్నావిప్పుడు."

"చెరపట్టటమా!"

"అవును, బందీగా పట్టుకున్నావు. నీ గదాఘాతం అతణ్ణి మూర్ఛాగతుని గావించింది. అనంతరం మేమతణ్ణి బందీగా తీసుకొచ్చాము."

"రోహిణీ! నువ్విక్కడ కెప్పుడొచ్చావు?"

"నేనంతా చెపుతాను; నువ్వు శాంతంగా విన"మని రోహిణి నా లలాటం మీద చెయ్యేసి చెప్పనారంభించింది.- "నీ శరీరంలో రక్తం చాల తక్కువగా వుంది. నీ యెర్రని మొహం పాలిపోయింది. ప్రియసింహా! అట్టే మాట్లాడే దుకు ప్రయత్నించబోకు. మనసుకుకూడ ఏమాత్రం శ్రమ కలుగనీయరాదని వైద్యుడు చెప్పాడు. నీ మదిలోగల సందేహాలను నేను నివృత్తిచేస్తాను. జ్ఞాపకంతెచ్చుకో. నిన్ను గాఢాలింగనం చేసికొని నీ పెదవుల్ని, కళ్ళను నేను ముద్దాడినప్పుడు 'ప్రియా! తుదార్తునికి శాశ్వత సంతృప్తిని' మ్మనలా నువ్వు, అలాగే చేశాను. నేను

స్వయంగా నీకు కవచం తొడిగాను; శిరస్త్రాణం అమర్చాను. కవచధారివైన తర్వాత నిన్ను మరొకసారి బిగిగా కౌగిలించుకున్నాను. తరువాత నీ కడమ ప్రక్కన ఒరను, కుడివేపున గదను అలంకరించాను. అప్పుడు నువ్వు అమ్మ నాన్నగార్ల ఆశీస్సులు పొంది, హయారూఢుడవై రణరంగానికి ప్రయాణమయ్యావు. నే నారోజునే సరస్వతిదగ్గరకు వెళ్ళటానికి నాన్నగారి అనుమతిని కోరాను. పొలంలో పనిచేస్తూండే సరస్వతిదగ్గరకు కాదు — మన కెదురుగా వున్న యీ సరస్వతి — మహాసింధు వద్దకు రావటానికి అదిగో మళ్ళీ మాట్లాడబోతున్నావు. ప్రియా! నువ్వు నన్నభినందించాలను కుంటున్నావని నాకు తెలుసు; కాని, ఇప్పుడు కాదు. ప్రస్తుతం నీ సందేహాలను మాత్రం తీర్చనివ్వు."

భావావేశంతో మాట్లాడాలను కున్నా, దేహం నీరసంగా వున్నట్టు గ్రహించుకొని, మెడలుకుండ లోహ ముఖత్రాణంలోనుండి అక్కడకూడ కనబడు తూన్న రోహిణి అరుణముఖా న్నవలోకించుతూ వుండిపోయాను. ఆమె మళ్ళీ చెప్తోంది.

"నే నీ కవచా న్నెలాగో సంపాదించాను. అంతకు ముందే ఆయుధాలను సేకరించుకొని వుంచాను. మన తరుణరోహిత్ నధిరోహించి నే నారాత్రే మహాసింధునదీతీరానికి చేరుకొన్నాను. కొండ చరియల్లో మేస్తున్న మీ గుర్రా లలో నా గుర్రాన్ని కూడ విడిచిపెట్టాను. అప్పుడే రణదుందుభి మ్రోగింది. ఆ యుద్ధ ఘోషలోకూడ నీ గంభీర కంఠస్వరాన్ని గుర్తించటానికి నా కింతో సేపు పట్టలేదు. నేను దౌడుతీసుకొని వచ్చి సమరస్థలిని చేరాను. కాని, మరి నీ స్వరం విన్పించటంలేదు. నదిగట్టున ఒకప్రక్కగా నిలబడి మంటల వెలుతురులో వీరుల ప్రహారాలను చూస్తున్నాను.నదిలో నీటిపైన తేలియాడుతూన్న నావలవైపు నా దృష్టిపడింది. గట్టుక్రింద దృఢకాయులగు వీరులిద్దరు ఒకరిపై నొకరు గదలతో తారసిల్లుట నా కంటబడింది. నే నే నిశ్చయానికి రాకముందే శత్రువులు నిన్ను చుట్టివేయుట కూడ గమనించాను. తక్షణం నా శూలాన్ని సంబాళించుకొని హోరా హోరి పోరాడుతూన్న వుభయ పక్షముల సైనికులబారును చీల్చుకుంటూ క్రిందికి పరుగెత్తాను. కాని, నే నక్కడికి చేరునప్పటికే మూర్ఛా గతుడైయున్న పారసీక సైన్యాధిపతి ప్రక్కన నీవుకూడ ఒరిగావు. నీపై ప్రహారం చేయబోతూ వున్న వైరి వీరునిపైకి లంఘించి నేను బల్లెముతో పొడిచాను. అంతలో మన సైని కులు చాలమంది అక్కడికి వచ్చేశారు.

"శత్రువులు పూర్తిగా దెబ్బతిన్నారు. ఇక్కడే కాదు—యితరరంగాల్లో కూడాను. ఒకచోటమాత్రం వారు సింధునదిని దాటివచ్చి కొంత ముందుకు చొచ్చుకొని రాగలిగారు; అయినా మన మద్రయోధులు వారిని ప్రతిఘ టించి వెనక్కి తరిమి కొట్టారు. ఇప్పటివరకు చేరిన సమాచారములనుబట్టి పారసీకరాజు ఎక్కడికక్కడ పూర్తిగా పరాజితు డైనట్లే తెలియవచ్చింది.

శత్రుసైనికులలో చాల తక్కువమంది మాత్రమే ప్రాణాలతో తిరిగి పోగలిగారు. వారి సర్వసైన్యాధ్యక్షుడు — మజ్జదాత్ నీ గదచే కూల్చబడి, మనకు బందీయైనాడు. మన సేన లిపుడు సింధునుదాటి పుష్కలావతివేపు పలాయనంచేస్తున్న శత్రుమూకలను వెంటాడుతున్నాయి. కుభా, సువాస్తునదీతీరప్రాంతాలవారు మన కిప్పుడు బాసటగా నిలబడ్డారు. మన ప్రధాన సేనాపతి యివాళ వుదయాన్నే వచ్చి నిన్నుచూచి వెళ్లారు. 'తక్షశిలవైశాలికి శాశ్వతంగా ఋణపడి పోయిం'దన్నా రాయన. తక్షశిలకే వర్తమానం పంపారటకూడాను. నిన్ను కాపాడుతుండగా కపిల్ తీవ్రంగా గాయపడినాడనికూడ ఆయన చెప్పారు".

'తక్షశిల వైశాలికి ఋణపడివుంటుం' దన్నమాట చాలసేపటివరకు నా చెవుల్లో ప్రతిధ్వనించుతూనే వుంది. అరవై యోజనాల దూరానవుండిన్నీ నేను నా వైశాలికి రవంతైనా గౌరవం సంపాదించగలిగాను గదాయన్న అభిమానంతో నా రోమరోమము పులకాంకితమైంది. నా గాయములకదే పరమౌషధంగా భావించాను. నా పైకి వంగిచూస్తున్న ముఖాన్ని రెప్పవాల్చకుండా చూడసాగాను. జంకుతూనే "నే నధికంగా మాట్లాడనులే రోహిణీ! ఒకసారి నీ ముఖత్రాణాన్ని తీసివేద్దూ" అన్నాను.

రోహిణి తక్షణ మట్లే చేసింది. నిమ్మళించుతూన్న నా దేహస్థితి ఆమెకు ముదాన్ని కల్గించినట్లు ఆవిడముఖమే చెప్తోంది. 'అతిసుకుమారియగు రోహిణిలో యెంత సాహసంవుందీ! ఇలాంటి రమణీమణులుండగా యే దేశప్రజలూ దాస్యశృంఖలాబద్ధులు కాజాల'రని నేను యోచించుకుంటున్నాను.

రోహిణి కపిశాయనం (ద్రాక్షరసం)తో నా పెదవులు తడిపింది. ఆమె హస్తంతో అందించబడ్డ ఆ మధురసం మరింత మధురంగా వుంది. ఆవిడ కళ్ళలోకి చూస్తూంటే నాలో అనేక ఆలోచనలు బయలుదేరాయి. మెల్లమెల్లగా నా కనురెప్పలు బరువెక్కుతున్నై. క్రమంగా కళ్లుమూతలుపడి, కూరుకుపట్టింది.

నా దేహంలో - ముఖ్యంగా కంటికి క్రిందుగా బలమైన గాయాలున్నై. వాటికి మందువేసి గట్టిగా కట్టుకట్టారు. ఎటుకదిలినా విపరీతంగా సలుపు కల్గుతోంది. ఆస్థితిలో వెంటనే నన్ను తక్షశిలకుతీసుకువెళ్లటం ప్రమాదకరం. అందువల్లసమీపంలో వున్న సరిహద్దురక్షకుని నివాసానికి చేర్చబడ్డాను. అక్కడ చాలరోజులు వుండవలసి వచ్చింది; ఎంతో బాధ ననుభవించాను; కాని, అదంతా నాకు జ్ఞాపకంలేదు. నాకు జ్ఞప్తి వున్నదల్లా విడువకుండా ఎల్లప్పుడు నావద్దకనిపెట్టుకొని కూర్చున్న రోహిణి ప్రఫుల్లవదనము, ఆమె చేతుల్తో నా నోట్లోపోసిన అత్తిపండురంగు మధురసమూ మాత్రమే. మానవస్వభావం ఎంతవిచిత్రమైనది! అతిఘోరాగ్నికీలల మధ్య కూడ చల్లని చోటును గాలించుకుంటుంది; అది కాలుచేదులో కూడ కమ్మదనాన్ని కల్పించుకుంటుంది. నేను మృత్యుగహ్వరాన్నుండి బయటపడ్డాను; గాయాలింకను పూర్తిగా నయంకాలేదు. రోజులు గడచేకొద్దీ కోలుకోగలను.

కాని, నేనింకా అలాగే మంచంమీద పడివుండాలనీ, రోహిణి ఆ తీరుగానే నా ప్రక్కన కూర్చొనివుండాలనీ నా వాంఛ!

వారం తిరక్కముందే ఆచార్యులు నన్ను చూడటానికి వచ్చారు. మూడు వారాలు గడచిన తర్వాత నేను డోలీలో తక్షశిలకు బయలుదేరాను. రోహిణి, కపిల్ ప్రభృతులు అశ్వారూఢులై నా వెంట వచ్చారు.

గుమ్మంవద్ద గురుపత్ని నాకు స్వాగతమిచ్చింది. నా నొసలు చుంబించుతూన్నప్పుడు ఆమె నేత్రాలు బాష్పపూరితములై వున్నాయి. ఆమె ఈ ఒక్క మాట మాత్రం అనగలిగింది.

"వీరపుత్రా! నీకు స్వాగతం!"



# 8. ఉత్తరకురు యుద్ధం

నా గాయాలు పూర్తిగా మానటానికి మూణ్నెల్లుపట్టింది. తక్ష వీరయువకుడు - రోహిణితోపాటు తన ప్రాణానికి తెగించి నన్ను కాపాడిన కపిల్‌తో నాకు మంచి మిత్రత్వ మేర్పడింది. మా వైశాలినుంచి విద్యార్థులుగా వచ్చి యుద్ధంలో పాల్గొన్న యువకు లయిదుగురూ చెక్కు-చెదరకుండా మరలిరావటమే గాక, వారు తమ సేనా నాయకుల మెప్పుపొందారని విని నేను మహదానంద మనుభవించాను. నేను మంచమెక్కియుండగా నిరంతరం నావద్ద కనిపెట్టుకొని యున్నవారిలో రోహిణి తర్వాత ముఖ్యుడు కపిలుడే. అతనితో మాట్లాడుతూంటే బలేహుషారుగా వుంటుంది. కపిల్ పెక్కు సంగతులు వినికిడిచే తెలిసికొన్నవాడేగాక స్వయంగా దేశాటనచేసి చూచినవాడు కూడాను. అతనుకపిషా (ఆఫ్ఘన్), ఉత్తర కురు (ఆమూదరియాతీరం), పశ్చిమ ఇరాన్, బవేరు మొదలగు దేశాలం పర్యటనచేశాడు. బిడారుతో కలిసి అనేక చిక్కులతోగూడి, ప్రమాద భూయిష్టాలైన మార్గాలలో పయనించాడు. ఒకనాడు అతను చూచిన వివిధదేశ విశేషాలు తెలిసికోవాలన్న కుతూహలంతో కపిల్‌ని అడిగాను —

"మిత్రమా కపిల్! నీవు చూచిన వాటిలో ఎక్కువ స్వయంసమృద్ధమై సుఖదాయకంగా వున్న దేశమేది?"

"ఏదైనా మా తక్షశిల తరువాతే. ఇక్కడిలాగా శాంతిదాయకమైన పరిపాలనావిధానం మరెక్కడా కన్పించలేదు. మా ప్రజాతంత్రరాజ్యంలో చోరులు, పందలు వెతికి చూద్దామన్నా లేరు; కాని, ఆ దేశాల్లో ఆ రెండు తరహాల మనుష్యులు అధికంగానే కన్పించుతారు. అయితే ఒక్క ఉత్తర కురుదేశంలో మాత్రం అలా కాదు. అక్కడి స్త్రీ-పురుషులింతకంటె ఉదాత్తులూ, వీరులూను. పారసీకులు వారిని పరాధీనులను గావించేందుకు యెంతైనా ప్రయత్నించారు; కాని అక్కడి పర్వతాలలో వారివంటి ప్రజలు సజీవులుగావున్నంతవరకు వారస్వతంత్రులు కావటం అసంభవం."

"మరి సంపద్భాగ్యముల విషయమో?"

"సంపద్భాగ్యాలంటే శరీరావసరాలు సులువుగా తీరటమే అయితే - మిత్రమా! - ఉత్తర కురుదేశ మత్యంత సంపన్నము, సమృద్ధిశాలిని కూడాను. అక్కడి వారు ముఖ్యంగా వేట, పశుపాలనలే ఆధారంగా జీవనం చేస్తారు. వ్యవసాయ కృషి అతిస్వల్పం. ఉత్తర కురుపర్వత ప్రదేశాల్లో ద్రాక్ష, గోధుమలు

తమంతటవే పెరిగి పండుతాయి. ఆ ద్రాక్ష కపిశా ద్రాక్షంత పెద్దవీకావు, అంత తియ్యగానూవుండవు; అయితే పుష్కలంగా లభిస్తాయి. ప్రజలు చర్మంతో కుట్టబడ్డ వుడుపుల్ని ధరించుతారు. ఆవు, గొర్రె, గుర్రాల మాంసమే వారికి ప్రధానమైన ఆహారం."

"నిత్యాహారంగా అశ్వమాంసమా ?"

"అవును, గుర్రపు మాంసమే; గోమాంసంకంటె మిన్నగానే. వారు గుర్రాలను పెంచడంకూడఎక్కువే. పూర్వం మా ప్రాంతాల్లోకూడ గుర్రపుమాంసాన్ని తినేవారు. వసంతాగమనోత్సవంనాడు నువ్వు తినలా?"

"తినకేంగాని, మిత్రమా! తూర్పున కొన్ని ప్రత్యేక యజ్ఞ - క్రతువుల్లో మాత్రమే అశ్వమాంసం భుజిస్తారు. ఆ యజ్ఞ - యాగాలు బోలెడంత వ్యయంతో కూడుకొన్నవవడంవల్ల ఏ రాజులోమాత్రమే వాటిని చేయగలుగుతారు. మా పంచాయితీవంటి ప్రజాతంత్ర రాజ్యాల్లో అసలట్టి యజ్ఞాలే చెయ్యం."

"ఉత్తర కురుదేశంలో మరో ముఖ్య విశేషంకూడా వుంది. అక్కడ 'నీ-నా' భావమేలేదు."

"ఆశ లేనేలేదా ?"

"ఆశ లేకపోవటమే కాదు. ఆశకలిగే హేతువేలేదు. రాజుల ఏలుబడిలోని ప్రజలంతా రాజశాసనానికి లోబడి వుండాలి. పారసీక చక్రవర్తి ఆనతికి గ్రీకు సముద్రం లగాయతు సింధు నదీతీరం వరకు తిరుగులేదు. ప్రజా స్వామ్యమనుభవించుతూన్న మేము ఒకరి రాచరికాన్ని అంగీకరించేందుకు సిద్ధంగాలేము; కాని, యిక్కడకూడ ఒకరికి భూములధికంగా వుండటం, మరొకరికి తక్కువగా వుండటం మొదలైన హెచ్చుతగ్గు లున్నాయి. పశుసంపద ఒకనివద్ద అమితంగా వుంటే, వేరొకనికి స్వల్పం. మేము వాణిజ్యంవల్లకూడ మా సంపద్భాగ్యాలను పెంపొందించుకోవచ్చును; కాని, ఉత్తర కురులో యీ అసమానతనే ఆలోచించరు."

"ఏమిటీ, ఆలోచించరూ ? అయితే అక్కడ గృహస్థులొకరికి మించి వేరొకరు అధికభాగ్యం కలిగి వుండరాదా ?"

"అక్కడ యీ సమస్యకే ఆస్కారంలేదు. అస లెవరిక్కాని, స్వంత ఆస్తి వుంటే కదూ. ఉత్తర కురుప్రజల భాగ్యమంతా వుమ్మడిగానే వుంటుంది. పెంపుడు పశువులు, వేటాడిన మృగాలే వారి ప్రధాన సంపద, భాగ్యమూను. అందులో అందరి శ్రమ యిమిడి వుంటుంది; మరి యీ సంపద ననుభవించటానిక్కూడ ఎల్లరికి సమాన హక్కే వుంటుంది."

"అంటే సోమరులకు, కష్టపడే వారికీకూడ అనుభవించటంలో సమానాధికారమన్నమాట. అలాంటప్పుడు సోమరులు సమాజంలో దుర్గుణాలని వ్యాపింపచెయ్యరూ ?"

"లేదు మిత్రమా! వారి మనస్తత్వమే వేరు. శక్తివంతుడెవడూ పనిచేయటానికి బద్ధకించడు. మా ప్రాంతంలో భోజనానంతరం చెయ్యికడుక్కోనే అలవాటుంది. మీ వైశాలిలోను అంతేకదూ?"

"ఇంకా కొంచెమెక్కువకూడాను. అక్కడ తోలుచేతులు తొడుక్కోవలసినంత చలి యెన్నడు వుండదు."

"మరి- మిత్రమా సింహా!- ఎంత సోమరి అయినా · అన్నం తిన్న తర్వాత చెయ్యి కడుక్కుంటానికి బద్ధకించడు గద; కాని, అన్ని దేశాల్లోను అలాగే ననుకోవద్దు. కంబోజ (కాఫిరిస్తాన్) దేశంలో చెయ్యే కడుక్కోరు. ఎంగిలి చేతిని చొక్కాకు తుడుచుకుంటారు."

"అయితే బాల్యంనుండి అలవాటు చేస్తే పనికి దొంగ అయ్యేవాడెవడూ వుండడనే మీ అభిప్రాయమా?"

"అవును, ప్రతివ్యక్తి వల్ల అతని ఓపాసశక్తిని బట్టి మాత్రమే శ్రమ నపేక్షించి, సోమరి పోతులను సమాజం చులకనగా చూస్తే అంతే."

"సరే, వుత్తర కురు ప్రజల్ని మీరు స్వయంగా చూచి వచ్చినప్పుడు యింకా సందేహానికి తావెక్కడిది? కాని, నాకు మాత్రమది యొక అద్భుత దేశ మనిపించుతోంది."

"అద్భుతం! మొదట్లో నాకళ్ళని నేనే నమ్మలేకపోయాను. అసలు ఉత్తర కురు భూమిమీద కాలు మోపటమే దుస్తరం."

"ఎందువల్ల?"

"వారు అన్యుల్ని తమదేశంలోకి రానివ్వరు. ఇతరులొస్తే తమ భూమిని, గాలిని అపవిత్రం చేసివేస్తారని వారి తలంపు. ఇక ఆ దేశంలోకి వెళ్ళే కాలిబాటలన్నీ యిరుకు, హానికారకములైన కొండలోయలగుండా వున్నాయి. వారా మార్గాల మొగల్లో నిరంతరం కాపువేసి వుంటారు. ఎవడైనా చాటుమాటుగా ఆదేశంలో చొరబడితే వాడికి చావు మూడినదన్నమాటే."

"మరి నువ్వెలా వెళ్ళగలిగావు?"

"అదృష్టవశాత్తో. పశ్చిమ గాంధార ప్రజాతంత్రం విధ్వంసం చేయబడినప్పటినుండి పారసీకులపట్ల మా తూర్పుగాంధార ప్రజలందరి హృదయాల్లోను తీవ్ర ద్వేషాగ్ని రగులుతోంది. నేనొక బిడారుతో కలసి వక్షునదీ (ఆమూదరియా) ప్రాంతానికి వెళ్ళాను. అప్పుడే బాహ్లీక క్షత్రపుడు వుత్తర కురుదేశం పైకి దండెత్తగోరుతూన్నట్టు నాకు తెలియవచ్చింది. నేను ఉత్తర కురుదేశాన్ని గూర్చి విన్న సంగతులు నమ్మలేకపోయాను. ఉత్తర కురుదేశం దేవతల కానాసమనీ, యీ భూవలయంమీద యిప్పటికీ దేవతలు నివసించుతూన్న దేశమదొక్కటేననీ, వారి దేశంలో—అయిదు యోజనాల విస్తీర్ణంలో మానవమాత్రుడు డుగు పెట్టిన తక్షణం చెట్టయిపోతాడనీ—యిట్టివే యింకెన్నో వదంతులు విన్నాను.

ఆ దేవత లాకాశంలో ఎగురగలరని కూడ చెప్పారు. ఈ వింత వదంతులన్నిటినీ నమ్మటానికి నేను పసిబాలుణ్ణికాదు; కాని, నా కప్పట్లో నమ్మటము, నమ్మకుండుటతో ప్రసక్తిలేదు. నా బుర్రకెక్కినదల్లా నీచపారసీకులొక స్వతంత్రజాతిని పరాధీనులను గావింపబోవుటె. ఉత్తర కురుప్రజలకు శక్తికొలది తోడ్పడి పారసీకులయొద్దు గాంధారప్రజలకు గల కక్షను తీర్చుకోవాలని నిశ్చయించుకున్నాను. వక్షునదీతీరాన పండ్లు, ఫలాలు దండిగా దొరుకుతాయనీ, ఆ ప్రదేశమంతా ముంజగడ్డి బీడనీ విన్నాను. వాడి బాణములతో నిండివున్న రెండు తూణీరాలు, ఖడ్గ-శల్యమాదిగా గల ఆయుధాలను చక్కబెట్టుకొని, లేగదూడ ఎండు మాంసాన్ని సంగ్రహించుకొని, కాంభోజదేశంలో ఒక ఉత్తమాశ్వము నెక్కి వక్షు నదీతీరాన ఎగువ వేపుకు బయలుదేరాను."

"ఒంటరిగానా?"

"అవును, ఒక్కడినే. కరవాలం మినహా తతిమ్మా ఆయుధాలన్నిటినీ కన్పించకుండా దాచాను."

"ఎన్నడూ ఎరుగని కొత్తదేశాని కా తీరున ఏకాకిగా ప్రయాణంచేయటం సాహసమే."

"ఉత్త సాహసమేకాదు, తెలివితక్కువకూడాను. అట్టి అనాలోచిత అవివేకపు పనులు మానవు డప్పుడప్పుడు చేస్తూనే వుంటాడు. మిత్రమా! నీవుమాత్ర మేమిచేశావు? ఆనాడు ఒక్కడివే శత్రువుల నట్టనడిమికి దూకి సేనాపతి మజ్దదాత్ మీద విరుచుకుపడటం దూరాలోచనలేనిపని కాదూ?"

"అవునవును, నే నొప్పుకుంటున్నాను. సేనానాయకు డెప్పుడూ వుద్రిక్తుడు కారాదు. ప్రశాంత చిత్తుడై మెలగాలి. అప్పుడు నేను నా బలహీనతను ప్రదర్శించిన మాట వాస్తవమే."

"అలాగేననుకో. పైగా నేను సేనానాయకుడిని కూడకాను. మా బిడారులోని ముఖ్య ఆరుగురిలో నేను ఒకడిని మాత్రమే. మేము వ్యాపారం నిమిత్తం కలసి బయలుదేరాము. ప్రదేశం అపరిచితమైనదే; కాని, వక్షునదివెంట పడపోతే ఎగువను ముంజబీళ్ళలో కొండచరియల వద్ద ఘుమంతులనబడే వారు పశువులను మేపుతూంటారని విన్నాను. వారికి ఉత్తర కురుదేవతలు ప్రత్యక్ష మవుతూంటారని కూడ తెలిసింది. నిగనిగలాడే మృదువైన కదళీమృగ చర్మాలను బాహ్లిక వ్యాపారులవద్ద చూచాను. వాటిని ఘుమంతులుండే ముంజబీటి ప్రదేశాల నుండే తెప్పించామని చెప్పారు. దైవికంగా నా కొక ఘుమంతుడు కనిపించాడు. అతడు కూడ ఆ దేవతలను గూర్చి పుక్కిటి పురాణం చెప్పకొచ్చాడు. లేగమాంసము, ద్రాక్షరసముల నారగించటానికి ఆహ్వానించుటతో కొద్దిసేపటిలోనే నా కతడు మిత్రుడైనాడు. అప్పుడతడు ఆ చర్మాలు తమకు ఉత్తర కురుదేశాన్నుంచి వస్తా

యనీ, తమకు దేవతలు వాటిని లోహానికి బదులుగా యిస్తూంటారనీ చెప్పాడు. దేవతలు చర్మాలకు బదులుగా లోహం తప్ప అన్యమేమీ పరిగ్రహించరట."

"దీన్నిబట్టి ఉత్తర కురుదేశవాసులు దేవతలుకారనీ, మానవులేననీ నీకు తెలిసిపోయిందన్నమాట?".

"అవును, నిస్సందేహంగా తెలిసిపోయింది. కాకపోతే - మిత్రమా! - దేవతలకి మానవసహాయంతో నిమిత్తమేమిటి? నేను ముంజకొండల్లోని ఘుమంత గుంపులవైపుకు సాగిపోయాను. శత్రువుని సేనకూడ వేరొక త్రోవను అటే వస్తూంది. నేనొక కన్ను వారిపైనుంచియే ప్రయాణం చేస్తున్నాను. ఇక్కడి నుంచి టూకీగా చెపుతాను. పారసీక సైనికులు పర్వతంపైకి చేరారు. నేనావాడు ఒక కొండజాతి గుంపును చేరి అక్కడే మకాం చేశాను. పారసీక సైనికులలో ఆకతాయిలు కొందరా గుంపుమీదికొచ్చి స్త్రీలను చెరచబోయారు. అట్టి దుండగాలను నిషేధించే వుత్తరువులున్నా ప్రాణంమీది ప్రీతి విడనాడి యుద్ధానికి బయలుదేరిన సైనికులనెట్టి శాసనంకూడ అదుపులో వుంచలేదు. వారిఅఘాత్యం చూచి సహించలేక నేను తక్షశిల కరవాలపు మెరుపును ప్రదర్శించి దుర్మార్గులకు ఆసైనికులను తరిమివేశాను. నేను తమ స్త్రీల కవమానం జరుగకుండ కాపాడుట చూచి ఆ కొండజాతి వారు నాకు కృతజ్ఞత చూపుతూ చనువిచ్చి ప్రవర్తించసాగారు. మే మున్నచోటును వదలి ఆ రాత్రికి రాత్రే పశువులను తోలుకొని అరణ్యంలో కొన్ని యోజనాల దూరం వెళ్లాము పారసీకులపట్ల నాకుగల ద్వేషాన్ని తెలిపి, నేను ఉత్తర కురు ప్రజలకు సహాయపడగోరుతున్నట్లు చెప్పాను. ముందుగా వారు మా మూలు దేవతా వర్ణనే చేయబోయారు; కాని, వారినిగూర్చి నాకూ కొన్ని వివరాలు తెలుసునని చెప్పి, నన్నా దేశానికి చేర్చే వుపాయం చెప్పాలని పట్టు పట్టాను. వారు నా ప్రయత్నాన్ని విరమించుకోమనీ, లేకపోతే నన్ను చూడగానే దేవతలు చంపివేస్తారనీ, స్నేహితుడను కాబట్టి నా మేలుకోరి అలాచెపుతున్నా మన్నారు. నేను నవ్వుతూ అలాంటి చావు చెడుగు కాదనీ, ఐనా అయ[illegible]గుడు పారసీకులైన్నా హతమార్చనిదే నేను చావననీ చెప్పగా వక్షునది యొడను తట్టున తాము యినుముకు కదళీచర్మాలను బదలకాచేసుకొనే రహస్యప్రదేశందాకా నన్ను చేర్చటానికి ఒప్పుకున్నారు."

"భేష్, నువ్వుదేవతల భూమి పొలిమేరవరకు చేరుటలో కృతకృత్యుడ వయినా వన్నమాట!"

"అక్కడికి చేరుటతోనే వారు దేవతలన్న భావంకూడ నా మనసులో నుండి మాయమైంది. అట్టైదూరం గుర్రాలమీద వెళ్ళటానికి వీలులేక పోయింది. వున్న కొద్దిపాటి సామాను గొర్రెలమీద వేసుకొని కాలినడకనే వెళ్లాం. ఆ కొండ జాతివారు కూడ మావలె గౌరవర్ణం కలిగి దృఢంగా వుంటారు. వారికి స్నానం చేసే అలవాటు మాత్రం అంతగాలేదు. మేము వారం రోజులపాటు వక్షునది

మొగ్గకేసి అనేక సింధుశాఖలను దాటుతూ వెళ్లి ఒక చోట ఆగాము. అక్కడ నది చాల సన్నంగావుంది. అయితే అపరిమితమైన వడి. నది కిరుప్రక్కల కొండ గుట్టలున్నై. అవి పైన నదిలోకి వంగి రెండూ కలిసి పోయినట్టుగా వున్నై. నా మార్గ దర్శకుడు తానంతవరకే యెరుగుదుననీ, కురుప్రజ లారాతి బండలపైన తాగాడి వేసి, యివతలికిదాటివచ్చి తమ చర్మాలకు ఇనుమును బదిలీచేసికొని వెళ్తారనీ, తా మవతలి వేపుకి వెళితే చావుమూడక తప్పదనీ చెప్పాడు.

"పారసీకులు వక్షునదికి కుడివేపున చాలాదూరాన వున్నారు. నే నిక నా భావికర్తవ్యాన్ని నిశ్చయించుకోవల్సివుంది. నన్నక్కడికి చేర్చిన కొండజాతివాడు నిప్పు రాజేయవద్దనీ, పొగచూచినంతనే, దేవతలు వచ్చి నన్ను భస్మంచేసివేస్తారనీ హెచ్చరించి వెళ్ళిపోయాడు. నా బొక్కిసాలో యెండు మాంసం దండిగానే వుంది. పండిన ద్రాక్షగుత్తులు అడవిలో అనంతంగా వేలాడుతున్నై. అందుచే క్షుద్బాధభయం లేకపోయింది.

"మర్నాడు వేకువఝామున నేను కొంచె మెడంగా పోయి ఒక రాతిబండ చాటున నక్కి కూచున్నాను. నదికిరుప్రక్కలవున్న యెత్తయిన రాతిబండలవేపు నా దృష్టిని నిగిడ్చి చూస్తున్నాను. కొంతసేపటికి యేదో కదలుతూన్నట్టుంది. తర్వాత ఆ కదలుచున్నది మనుషులేననీ, అందొకరు పురుషుడు, రెండో వ్యక్తి స్త్రీయనీ గ్రహించాను. వారు ఆకుపచ్చని చర్మదుస్తులు ధరించివున్నారు. ఆరంగు కొండలమీది చెట్టు - చేమల రంగులో కలిసిపోతున్నది. వారు తలలకు చెవుల టోపీలు తగిలించుకొని, ఒడలుపైన తోలుదుప్పట్లు కప్పుకొనివుండగా కుడిచేతులు జందెములవలె కన్పిస్తున్నాయి. ఎడమభుజాలకు అదేరంగు అంబులపొదులు తగిలించుకొని, చేతిలో ధనుస్సులు కలిగివున్నారు. కాళ్ళకున్న చెప్పులకూ అదేరంగు. నే నెవరితరఫున పారసీకులతో పోరాడాలని అక్కడికి వెళ్ళానో ఆ కురుజాతి వారే ఆ స్త్రీ పురుషులని గ్రహించాను. ఆ జోడు అతి మెలకువతో అటూ యిటూ పారజూస్తూండటము, మధ్య మధ్య ముక్కుగోళాలను పెద్దవిచేసి వాసన చూడటము నేను గమనించాను. వాళ్ళు నన్నెక్కడ పసిపట్టుతారోనని నిజంగా నాగుండె పీచుపీచుమంది. భయంతో నేను మరింత ముడుచుకొని రాతిబండ మాటున ఒదిగాను. తరువారివారు చీమలవలె క్రిందికిపాకిపోతూండటం చూచాను.

"వారి మొదటి రక్షణస్థావరం యింకా దిగువనే వున్నట్టు నేను గ్రహించేందుకు ఎంతోసేపు పట్టలేదు. సాయంత్రం వరకు అక్కడే వుండి, రాత్రి చీకటి పడిన తరువాత నా ఆయుధాలను, కొంత మాంసాన్ని తీసికొని దిగువకు దేకనారంభించాను. ఒక యోజనం దిగువకు రాగా భీకర గర్జనతో వురుకుతూన్న వక్షునది ఒడ్డున వందలకొద్దీ గజాల ఎత్తున నిటారుగా వున్న పెద్దచట్రాయి కన్పించింది; దాని వెనకప్రక్కన కురువాసులు మంటచేసి మాంసాన్ని ప్రేల్చుకుంటున్నారు.

గుప్పుమని వస్తూన్న వాసన నా నాసికాపుటాల్లో ప్రవేశించి నోరూరించుతోంది. ముంజజాతి గుంపును వదలివచ్చిన పిమ్మట నా కగ్నిదర్శనం యిదే.

నేను రెండుమాంసపు ముక్కలు కడుపార మెక్కి వాగులోని నీళ్ళు తాగాను. తదుపరి మళ్ళీ ఒక మరుగు చూచుకొని సూర్యోదయానికై నిరీక్షించుతూ మేలుకొన్నాను. కనుచీకటుండగానే లేచి ఆకలితో పగలు బాధపడకుండా వుండేందుకు అప్పుడే మరికొంత మాంసాన్ని తిని రాత్రి దేవతలు మంట చేసినచోటు వున్న చట్రాతిబండ వేపుచూస్తూ ఒక తుప్పలో దాక్కున్నాను. వెలుతురు వస్తూండగా పచ్చని ఉడుపులు దాల్చిన ఆకృతులు కొన్ని నిట్టనిలువుగా వున్న ఆ రాతిబండ కటిభాగంమీదుగా బల్లులవలె ప్రాకుతూ దాటిపోయారు. వారు పరస్పర మేమేమో చెప్పుకుంటున్నారు; కాని, ఆ మాటలు నాకు సరిగా విన్పించలేదు. దేవభాషకి మా తక్షశిలభాషకి అట్టే తేడా వుండదు. కొంచెం మించుమించుగా మేము అర్థంచేసుకో వచ్చును. వెలుతురు బాగా వచ్చిన తర్వాత దేవీ - దేవుల ముఖాలు కూడ స్పష్టంగా అగపడసాగాయి. వారి హావభావాలను బట్టి బయభీతులై వున్నట్టు తెలుసుకున్నాను.

"మిట్టమధ్యాహ్నం రెండుఝాములప్పుడు పారసీక సేనావాహిని మూరాన్నంచే పొడకట్టింది. దారి ఒకనికి మించి నడవటానికి వీల్లేనంత యిరుకుగావుంది. పారసీకులు రాతిబండను సమీపించుటతో నా గుండె కొట్టుకోసాగింది. హుటాహుటీని వచ్చిన సైన్యమక్కడ టక్కున ఆగిపోయింది. ఒకడు జోడు వదలి ఖడ్గాన్ని నడుమునకు వ్రేలాడకట్టుకొని ఆరాతిబండపైన ప్రాకసాగాడు. దేవతలు శత్రువుల పదధ్వని నాలకించి కత్తులు, విల్లమ్ములు సవరించుకొని పోరు కాయత్త మయ్యారు. రాతిబండ కటి నదిలోకి నిటారుగా వుండుటేగాక అది ముందుకు చొచ్చుకొనిపోయి ఒకచోట కోణంగా కూడ వుంది. ఒక వేపునుంచి ప్రాకివచ్చేవారా కోణం దాటితేనేగాని రెండో వేపునున్న వారికి కనిపించరు. ఆ కోణంవద్ద అతి మెలకువతో నింపాదిగా ప్రాకి దాటవలసివుంది. ఆ కోణం దాటితే ఆపైన పరుగుతీయవచ్చునుకూడాను. శత్రుభీతి నాకున్నంతగా కూడ కురువాసులకున్నట్టులేదు. వారు రెండువందలకుమించిలేరు; కాని, పారసీకులు రెండు వేలకు మిగిలినట్లే కన్పిస్తున్నారు. వారా రాతిబండను దాటగలిగితే యిక తమ సంఖ్యాబలంతో కురుయోధులను ఓడించుటలో అనుమానంలేదనుకొన్నాను.

"దట్టంగావున్న పొదలో కూచుని నేను నా ధనుస్సు నెక్కుపెట్టి కోణం వద్దకు ప్రాకి వచ్చేవారికొరకు యెదురు చూస్తున్నాను. పారసీకులా కోణందాటి రావటమాలస్యంగా గురితప్పని నా బాణాల దెబ్బలు తిని తలక్రిందుగా వక్షునదీ ప్రవాహంలోపడి కొట్టుకొని పోతున్నారు. కోణందాటి వచ్చినవాడు క్రిందికి కూలుతూంటే అవతల నున్నవారికేమీ కన్పించేదికాదు. ఆ దృశ్యాన్ని నాతో పాటు దేవతలు మాత్రమే చూడగల్గుతున్నారు. కొన్ని గంటల పర్యంతం ఒకని

తరువాత ఒకడుగా పారసీకభటులు విగతజీవులై వదీగర్భంలో కలిసిపోతున్నా అవతలివారికి అనుమానమైనా కలుగలేదు. ఆ విచిత్ర దృశ్యాన్ని గాంచి అసలు సంగతి తెలియక కురువీరులు కొంతసేపటివరకు ఆశ్చర్యచకితులవుతున్నారు. తరువాత అసలు విషయాన్ని తెలిసికొని నేను దాగియున్న పొదవేపు దృష్టినిసారించి చూస్తున్నారు. వారికళ్ళల్లో క్రోధంకాక మిత్రభావమే ద్యోతకమవుతోంది. అప్పుడు నా కనలేని యానందం కలిగింది. దేవతలు నన్ను కనీసం తమ సహాయుడనని అయినా గుర్తించారు కదాయని నా సంబరం.

"తుదకు పారసీకులు తమ సైనికులు వందలాదిగా కుప్పకూలి ప్రవాహంలో కొట్టుకొని పోతున్నట్టు కనిపెట్టారు. అయితే వారు తమ సైనికులు నాచేగాక దేవతలవల్లనే కూల్చబడుతున్నట్టు భావించారు. అంతట సేనాపతి కోణంవద్ద మెల్లగాకాక వడిగా ప్రాకిపొమ్మని తన భటులకాజ్ఞాపించాడు. ఆ విధంగా చకచకా దాటుతూంటే కోణంవద్ద కాలుజారి కొందరు పడిపోయినా, మరికొందరవతలికి రాగల్గుతూన్నారు. బిరబిరా వచ్చేవారందరినీ కూల్చుట నా ఒక్కనికి సాధ్యపడలేదు. ఆ విధంగా తప్పుకొని రాగలిగినవారిని ఢీకొనుటకు కురువీరులు సంసిద్ధంగానే వున్నారు. నేనూ ప్రయత్నాన్ని వదలక వీలయినంతమందిని కూలవేస్తూనే వున్నాను. మునిమాపువేళకు దాటివచ్చిన శత్రువుల సంఖ్యనుచూచి ఇక ఆ శ్రేణివద్ద వారిని జయించటం దుస్తరమని నిశ్చయించుకొన్నాను.

"చీకటి పడగానే నేనా తావును వీడి ఎగువకు వెళ్లాను. దేవతలుకూడ పోరు విరమించి అటువేపే బయల్దేరారు. వారి ప్రథమ రక్షణశ్రేణి శత్రువుల వశమయింది; అయితే తమ జనం యింకను యివతలికి రావలసి వున్నందున పారసీకులు వెంటనే కురుదేవతలను వెంబడించలేకపోయారు.

"నేను తిరిగి నదికిరుప్రక్కల ఎత్తుగా రాతిబండలున్న ప్రదేశానికి చేరుకున్నాను. ఒక రాతిబండ చాటునుండి అదాటుగా ఒక వ్యక్తివచ్చి నాముందర నిలబడ్డాడు. నా ఒళ్లు ఝల్లుమంది. ఆ కురువీరుని ప్రహారం నా నెత్తిమీద పడుతోందనే తలిచాను; కాని, కొద్దిసేపటికే ఆ వ్యక్తి "ఓయి మానవుడా! భయపడకు. దేవజాతీయులం నిన్ను మా మిత్రునిగా ఆహ్వానించుతున్నాము" అని నా భుజంమీద చెయ్యేసి తట్టుటతో యథాస్థితికి వచ్చాను.

"అతని మాటలతో నాకు ధైర్యంవచ్చింది. అది నా అదృష్టమే ననుకుంటాను. 'కిరాతులగు పారసీకులు దేవలోకంపైకి దండెత్తిరావడంచూచి నేను మీకు సహాయంచేయాలన్న నిశ్చయంతో యిక్కడికి చక్కావచ్చాను; కాని, మీ కుపయోగపడకముందే వారికి చిక్కి చంపివేయబడతానేమోనని భయపడ్డాను అని నేననగా అతడు 'అవునవును, మేము మా గడ్డమీది కితరులెవ్వరినీ రానివ్వము. మానవులొచ్చి మా భూమిని కళ్మలం గావించుతారని అడుగైనా పెట్టనివ్వము; కాని, నీ ప్రవర్తనతో నువ్వు మాకు ఆప్తుడవని బుజువైంది.

అందుచే నిన్ను మేము మా గడ్డమీదికి ఆహ్వానించుతున్నాము' అని చెప్తుతూంటే నే నెక్కడలేని సంతోషంతో పొంగిపోయాను.

"తర్వాత అతడు తాను దేవసేనానాయకుడననీ, పేరు మఘవంతుడనీ చెప్పాడు. పారసీకులసైన్యం యింకా చాలా వుందనీ, అక్కడికిచేరినది అత్యల్పమే ననీ, అతనికి తెలియజేశాను. అప్పు డతడు నాపై పూర్తి నమ్మకంతో, 'మా యీ మొదటి రక్షణశ్రేణి అతిసామాన్యమైనది. తర్వాతశ్రేణు లొకదానికంటె మరొకటి అధికబలవత్తరంగా వుంటాయి. మేము పారసీకుల్ని పరాజితులను గావింపగోరుటే కాదు; వారిలో ప్రతిఒక్కడిని హతమార్చితీరుతాము. ఏ ఒక్కనిని సజీవంగా తిరిగిపోనివ్వకుండుటే మా నిశ్చయం. పారసీకులనుగూర్చే కాదు, మానవులెవరి విషయంలోను మాకేమాత్రం తెలియదు. మాగడ్డపైన అడుగిడినవాడు ప్రాణంతో బయటబడటం క్షంతవ్యంకాదు. ఈ విషయంలో నిన్ను మాకుసలహాదారుగ వుండ గోరుతున్నాము' అన్నాడు.

"సేనానాయకుని మాటలతీరులో అద్భుత ఆకర్షణవుంది. ఆ భాష మా భాషనే పోలివున్నది; కాని, మాటలు చాలవరకు కొత్తవి. ఉచ్చారణలోకూడ భేదమున్నది. ఆయన మాట్లాడుతూంటే సంగీతం పాడుతున్నట్లే వుంది. దేవ భాషను అర్థం చేసికొనుటలో నాకు చిక్కేమీ లేకపోయింది. నే ననేక ఆర్య భాషలను నేర్చివుండుటే అందుకు కారణం కావచ్చు. వేరే అత్యవసర కార్యమేదీ లేకపోతే శత్రువులను ప్రతిఘటించే విషయమై ముందాలోచించుదామని నేను సేనానాయకునితో అన్నాను. అతడున్ను అంతకుమించిన ముఖ్యకార్యం లేద న్నాడు. దేవభాషల్లో యెంత నిరాడంబరుడైనా సేనాపతి సూక్ష్మగ్రాహియని యిట్టే గ్రహించాను. వారి రక్షణశ్రేణులలో కొన్నిటి మధ్యగల త్రోవలు ఒక్క మనిషిమాత్రమే నడచుటకు వీలైన, అత్యంత ప్రమాదకరములైన యిరుకు మార్గాలనీ, అట్టి బాటలబడి వచ్చు శత్రుసైనికులపైకి పైనుంచి రాతిబండలను దొర్లించుట కనువుగా అక్కడక్కడ కొన్ని స్థానముల నేర్పరచుకొన్నట్లును మఘవంతుడు తెలిపాడు. కృపాణము, ధనుస్సు, బల్లెము, గదకూడ వారుపయో గింతురని తెలిసింది. అవన్నీ వా రితరులనుంచి బదులీగా తెచ్చుకున్న ఇనుముతో దేవశిల్పులు తయారుచేసినవేనట. అవి చక్కని పనితనంతో చేయబడ్డవే. ఎంద రేవైపుకుపోయి శత్రువుల మైనబడి ఎలా దెబ్బతీయాలో ఆరాత్రే నిర్ణయించాము."

"మిత్రమా సింహా! తరువాత పారసీక సేనాసంహారం యెలాముగిసిందో వినుటకంటె ఆ దేవతల గడ్డపై విశేషాలు తెలిసికోవాలన్న కుతూహలమే నీ కిప్పుడు మిక్కుటంగా వుంటుందనుకుంటాను. ఏఁ కాదూ?"

"నాకా యుద్ధవృత్తాంతమంతా వినాలనేవుంది; కాని, కపిల్! ఆ సమ రంలో నీవు ప్రదర్శించిన శౌర్య - ప్రతాపాలను నీ నోటితో వర్ణించుట కిష్టంలేక అలా అంటున్నావులే. సరే, నీ యిచ్ఛానుసారమే చెప్పు."

"వారికున్న యుద్ధసాధనాలతో పారసీకుల నెట్లు తుడిచిపెట్టివుంటామో నీవు సులభంగానే వూహించగలవు. స్వదేశ - స్వాతంత్ర్య రక్షణకు పురుషులతో పాటు స్త్రీలును యుద్ధంలో సమానంగానే పాల్గొంటారు. నీకొకసంగతి చెప్పటం మరచాను ఉత్తరకురుప్రజలు తమది దేవజాతియని చెప్పుకుంటారు; అయితే అలా చెప్పుకోటంలో ఆ దేవశబ్దాని కేదో నిగూఢమహత్తున్నదనేభావం వారికి కించిత్తయినాలేదు. పైగా యేళ్ళతరబడి వారిమధ్యవుండి వారు స్వాతంత్ర్యాన్ని ప్రాణాధికంగా ప్రేమించుతారనీ, ఆ స్వాతంత్ర్య రక్షణకు పైదైవికశక్తితోనో కాక, సాయుధులై పోరాడటంకూడ నేను స్వయంగా చూచాను. వారు సాధు స్వభావులు; సత్యసంధులు; భయ, విచార, దుఃఖభావములు వారి హృదయాల్లో నీటిపై వ్రాతలవలె ఎంతో సేపుండవు."

"దేవతా శబ్దాన్ని మనం ఎంచినట్లే తాము దేవతలమన్న స్వాభిమానం వారి కుండదా ?"

"లేదు మిత్రమా! వారి దృష్టిలో దేవశబ్దం కేవలమొక జాతినామం మాత్రమే.

"సరే, యుద్ధానంతరం వారి మానసికస్వభావమెట్లున్నదీ, యితర విశేషాలూ చెప్పు."

"దేవజాతీయులు యుద్ధంలో పాల్గొన్న శత్రువులను నిశ్శేషంగా హతమార్చారు. యథాశక్తిని నేనున్ను వారికి తోడ్పడ్డాను. ఆ పోరాటంలో దేవీ-దేవులెందరో అసువులను కోల్పోయారు. వైరుల నిశ్శేషంగావించిననాటి మధ్యాహ్నమే వారు వక్షునదీశీతల తోయాల్లో పడి తమ తమ దేహాలను, చర్మ వసనాలను శుభ్రపరచుకొన్నారు. వారి దేహచ్ఛాయ నేమని వర్ణించగలను! వారి వర్ణం కొంతవరకు మన రోహిణిరంగుతో పోల్చవచ్చు. వారు పసుపువన్నె వెంట్రుకలు, నీలనేత్రాలు కలిగి మనలో ఆజానుబాహువులవలెవుంటారు. క్షురకర్మ వారికి తెలియనే తెలియదు. శత్రుప్రహారములను డి కాపాడుకొనేందుకు ఉక్కు నుపయోగించుటవారిటీవలనే నేర్చుకున్నట్టు తోచింది. అస్థికాయుధాలను వారిప్పటికీ వాడుతూనేవున్నారు."

"మరి ఉడుపులో ?"

"దుస్తులను గూర్చి యిదివరకే చెప్పాను. వారు చర్మాలను వసనాలుగాకప్పుకుంటారేగాని, కంచుకాలుగా కుట్టుకోరు. ఉక్కగావున్నప్పుడు దేవజాతి స్త్రీలేమి, పురుషులేమి తమ దేహములపైన ఏమాత్రం దుస్తులనుంచుకోరు. నగ్న శరీరులై వున్నప్పుడు పురుషుల కేశములు, గడ్డములును, స్త్రీల శిరోజాలు అగ్ని గుండమునుండి వెలువడే జ్వాలా శిఖలను పోలివుంటై. మరి వారి సౌందర్యమో! ఆదేవకన్యలనే చూడాలి! వారితో పోల్చదగ్గ చక్కదనం మానవులలో మచ్చు

కైనా కనిపించదు. దేవజాతి స్త్రీలంతా రోహిణిలే ననుకుంటే మనం వారిసౌందర్య శోభను కొంతమట్టుకు వూహించగల్గుతాము.

"విజయోపేతులయిననాటి సంధ్యాసమయాత్పూర్వమే దేవకన్యలు, యువకులు మధు-క్షీర మృగమాంసాదులతో ఒక పర్వత పృష్ఠమున విశాలమైదాన మందలి పసిరికపైన గుమికూడసాగారు. జాగ్రత్తగా నిప్పునుకూడ తెచ్చారు. దేవజాతి అగ్నినతిభద్రంగా వుంచుకుంటారు. ఆరిపోతే రెండుపుల్లల ఒరపిడితో నిప్పు పుట్టించుతారు. ఆ తెచ్చిన నిప్పులో చిదుగులను మండించి కొందరు మాంసాన్ని కాల్చుతున్నారు. ఒకప్రక్కన మెత్తనిచర్మంపైన కూచుని ఒకరిద్దరు రాతిమీద పచ్చని గంజాయిని నూరుతున్నారు. ఆ పర్వతప్రాంతంలో ద్రాక్ష కొల్లలుగావున్నా వారు సురాపాన మెరుగరు. వారికి మద్యపాన మందిష్టమే వుండదు. ఆహారపానీయములు తయారగునంతలో యువతీ - యువకులు నృత్య - గానముల నారంభించారు. అల్పాహార, సోమపానములు ముగించినపిమ్మట - ఆ రాత్రి నేను గాంచిన దేవీ-దేవుల నృత్యము చిరస్మరణీయము. గాంధారులము - మేమున్నూ నాట్య, సంగీతప్రియులమే; గాని, అందులో వారిదే శ్రీ; మాది చుక్క.

"సేనానాయకుడు అక్కడచేరిన వారందరితో నాకు పరిచయంచేశాడు. నన్ను గురించి విన్నతర్వాత దేవకన్యలంతా నన్ను నట్టనడుమవుంచి చుట్టూ తిరుగుతూ నాట్యం చేయసాగారు. నే నలసినప్పుడెల్లా క్షీరసమ్మిళిత పానీయాన్ని తెచ్చి దేవాంగనలెంతో ప్రేమాదరపూర్వకంగా నాచే త్రాగించేవారు.

"ఆ ఒక్కనాటి నృత్యగానములతో వారి హృదయాల్లోని యుద్ధ - గ్లానిని కడిగివేసుకొన్నట్టు నాకు బోధపడింది. మరునాడు వారు వేలాదిగా తమ నర - నారీమణుల నాహుతిగాగొన్న మహా యుద్ధాగ్ని కీలలనుండి బయటపడినట్లేలేరు; కాని, వారా భయంకర సంఘటనను అంత త్వరగా విస్మరించేందుకొక బలమైన కారణం వుందిలే.

"అది వారి హృదయ కాఠిన్యతేనా?" అని అడిగాను.

"ఛీ! అదికాదు సింహా! దేవతలసలు కఠోర హృదయులు కాగల అవకాశాలే తక్కువ. వారు జీవితాన్ని - కేవలం జీవితాన్నిమాత్రమే తమదిగా భావించుతారు. వారికి సోమరసమత్యంత ప్రీతిదాయకమైనమాట నిజమే; కాని, వారు దాన్ని త్రాగి, అమరు లవుతారన్నదిమాత్రం పొరపాటు. నే నిందాక సూచించినట్టు వారు వ్యక్తిగత మమతా రహితులు కావడం, వ్యక్తిసంబంధం లేకుండుటే దేవతల చిరానంద మయ జీవితంలోని నిగూఢరహస్యం. దేవజాతిలో వేర్వేరు కుటుంబాలుండవు."

"అట్లయితే వారి పరివారాలన్నీ కలిసేవుంటాయా?"

"అలాకాదు. వారిలో అసలు పరివారవిధానమే వుండదు. జాతి అంతా ఏక పరివారంగా వుంటుంది."

"మరి పెళ్ళిళ్ళో?"

"ఆ విషయంలో దేవజాతి ఆచారాన్ని వింటే మానవులు ముక్కు, మూతీ విరుస్తారు; అయితే దేవభూమిపై వారిజీవితాన్ని స్వయంగా కళ్లతో చూచినవారికి అందులో ఎలాంటి దోషమూ కానరాదు. అక్కడి ప్రతి స్త్రీ స్వేచ్ఛామూర్తి. ఏ ఒకనికీ భార్యగా కట్టుబడి వుండదు. ప్రతి లలన పద్మసరంలో విహరించే భ్రమర సమానమే. భ్రమరము యేపద్మమందలి మధువునైన స్వేచ్ఛగా గ్రోలునట్టే, దేవకన్య ఏనాడే మగవానితోనైనా ప్రేమానుబంధమై యుండగలదు; అయితే దేవసమాజ నియమానుసారం ఆ స్వేచ్ఛకుకూడ ఒక హద్దువుంది. వేర్వేరు సమయాల్లో వివిధ ప్రియుల అంకశాయినియైన పడతికి జన్మించిన బిడ్డ ఫలానా పురుషుని సంతాన మవడానికి వల్లకాదు. కాబట్టి ఏ పురుషునికీ స్వసంతానమని వుండదు. ఫలానా శిశువు 'నాబిడ్డ' అని చెప్పుకోనలేదు. అయితే అంతమాత్రాన ఏబిడ్డా పితృప్రేమనుండి వంచింపబడదు. పైపెచ్చు ఎన్నో రెట్లధిక ప్రేమకు పాత్రమవుతుంది. నేను దేవగడ్డమీద రెండున్నర సంవత్సరాలున్నాను. ఆ వ్యవధిలో ఒకరకంటె ఎక్కువమంది దేవకన్యల ప్రేమకు పాత్రుడనయ్యే అవకాశాలే నాకు లభించాయి. ఆకాలంలో జన్మించిన బిడ్డలలో ఎవరో ఒకరు నా సంతానమై వుండాలి. అయితే ఆ నా బిడ్డను ఫలానా అని తేల్చి చెప్పేందుకు వుపాయమేమీలేదు. దేవపురుషుడెవడూ కనపడిన శిశువునెత్తుకొని ముద్దాడి లాలించనిదే ముందుకు అడుగుపెట్టడు. అలాంటప్పుడు తన కన్నబిడ్డను ముద్దాడు మానవునివలెనే దేవపురుషుడును ఒళ్ళు పులకరించి ఆనందపరవశుడౌతాడు. మొదట్లో నాకీవిషయం విచిత్రంగానే వుంది; కాని, కాలక్రమాన అది అతి సహజంగానే తోచింది."

"వారి ఉమ్మడి పెళ్ళిళ్ళు పశుప్రాయంగా తోచుటలేదూ?"

"ఇక్కడవుండి వింటే అది పశుత్వంగానే తోచవచ్చును; కాని మిత్రమా! అక్కడికి వెళ్ళి స్వయంగా చూచినపిమ్మట అదొక దివ్యదృశ్యంలా వుంటుంది. యువకులెల్లరు ఏకోదరులుగాను, యువతులందరు అక్కచెల్లెళ్ళవలెను ప్రతిశిశువు వయస్కులగు ప్రతివారికి బిడ్డవలెను, ప్రతి ముసలి వృద్ధుడు తాత- ముత్తవల వలె వుంటారు. ఇక దేవజాతి తరుణీ- తరుణులు మామూలుగా అన్న- చెల్లెళ్ళ వలెను, కామోద్రేకులైనప్పుడు మాత్రం ప్రేయసీ- ప్రియులుగాను ప్రవర్తించుతారు. ఇరుపక్షములనుండి ప్రేమ సమ్మేళనమయి నప్పుడే అట్టిసంయోగము సంభవమవుతుంది. అసత్యము, బలాత్కారము దేవలోకంలో క్షమింపరానివి.

"ప్రేమలో బలాత్కారానికేగాక, లోభానికిన్నీ స్థానంలేదు. నిజానికక్కడ ప్రలోభనాసాధనమేలేదు. పశుపాలన, వేట మధుసంచయములవల్ల లభ్య ౩

పడేవన్నీ సమిష్టి సూపడే. ఆ దేవజీవిత మాధుర్యాన్ని మాటలతో వర్ణించటం నా కలవి కానిపని; కాని ఆ దేవభూమి, దేవజీవిత చిత్రాన్ని మనోవీధిని చిత్రించు కొని దర్శింప ప్రయత్నించినట్లయితే నీ వా దివ్యత్వాన్ని కొంతవరకైనా వూహించ గల్గుతావు."

"సరేగాని, కపిల్! మరి నీ వలాంటి దేవభూమిని విడిచివచ్చావేం?"

"ఆ దేవభూమి దివ్యజీవితాన్ని మానవులముందు పెట్టడానికి ఆత్రపడ్డాను. అదీగాక మానవులనుండి వారు అర్థించేలోహం (ఇనుము)మీదనే దేవలోకం ఉనికి ఆధారపడివుందనీ, అది పునాదిలేని గోడయనీ తోచింది. ఆ గోడ త్వరలో— నా జీవితంలో పడేదిగా లేకపోయినా మానవశక్తి - శౌర్యాలను మారు కొండలు, నదుల సహజరక్షణతో నిలచియున్న ఆ జీవితం తరువాత నా కంత ఆకర్షణీయంగా లేకపోయింది. బాల్యమాదిగా ఆత్మీయులకు బంధుజనానికి అలవాటుపడి యున్నందున వ్యక్తిగత మమతకూడ నన్ను వ్యాకులపరచసాగింది. ఇవన్నీ మేళవించి నా కా జీవితంమీద విరక్తిని కలిగించాయని చెప్పొచ్చు; అయితే నే నక్కడినుంచి దొంగతనంగా పారిపోయిమాత్రం రాలేదు."

"మరి—మిత్రమా!—వారు నిన్నుండమని బలవంతం చెయ్యలా?"

"ప్రేమతో బలవంతంచేసినమాట నిజమే; అసలు బలాత్కారంచేయటం వారి స్వభావానికే విరుద్ధం. ముఖ్యంగా మిత్రులపట్ల అలా అసలే ప్రవర్తించరు. తమ మానవమిత్రుడు జన్మభూమికి మగిడిపోగోరుతున్నాడని విన్నతరువాత దేవ కన్యలు పన్నిన ప్రేమజాలములను గూర్చిన వివరాలు నన్నడగొద్దు. వారు నన్ను పుష్పవనంలోకి తీసికెళ్ళేవారు. వనకుసుమాలతో తమ శిరోజాలనలంకరించుకొని నాచుట్టూ మూగి, ఒకతె నాచెవుల్లో పూలుపెడితే, మరొకతె నాజుట్టుకు మాల తురిమేది. వేరొకతె నాభుజానికి తన చెంపనానించి 'ప్రియా! నిన్ను మానుంచి రప్పించుకుంటూన్న మీపడుచులెలావుంటారు?' అని అడిగేది. వారి ప్రశ్నలకు నాకు సమాధానాలే తోచేవికావు. నాకు ప్రత్యేకంగా ఒక దేవకన్య కావాలని గాని, స్వంతబిడ్డలు-స్వగృహాలపై కాంక్షవున్నదనిగాని, ప్రత్యేకంగా పొయ్యి అవసరమనిగాని వారితో ఎలా చెప్పగలను? ఇక్కడ అలాంటి పరివారాన్ని సృష్టించ ప్రయత్నించడం నిష్ప్రయోజనమని తెలిసికూడ నే నా దేవపరివారాన్ని మాచి ఈర్ష్యపడేవాడిని. ఇప్పటికీ నాకట్టిభావమేవుంది. ఆ సుందర - శాంత మూర్తులు, వారి స్నేహ-వాత్సల్యాలు నెలలపర్యంతం మాతృదేశానికి తిరిగి రావా లన్న నాసంకల్పాన్ని విరమింపజేశాయి. పురుషులకు కూడ - ముఖ్యంగా నా మిత్రుడు మఘవంతునికి నేనాదేవభూమినివదలిరావటం సుతలామున్నంలేదు.

"ఎట్టకేలకు అక్కడినుంచి వచ్చివేయటానికే నిశ్చయించుకొన్నమీదట దేవభూమి రక్షణవిషయంలో సేనాపతితోను, దేవజాతి పెద్దలగు స్త్రీ - పురుషుల తోను వారాలతరబడి సంప్రదించాను. ఉత్తర కురుదేశంలో చదువుట, వ్రాయుట

అంటే ఏమిటో యెవరికీ తెలియదు. నేను నా వుద్దేశాలను రాసియిచ్చినా వారికి ప్రయోజనం శూన్యమే; అయినా భావిదేశ సంతానంకోరకు నేను దేవపెద్దలతో చెప్పినదంతా భోజపత్రాలమీద రాసి ఒక గుహలో వదలివచ్చాను. అందులో ముఖ్యంగా దేవజాతీయు లిప్పటికీ పరవస్తువుగా భావించే లోహమే వారిపైకి దండెత్తివచ్చిన దరయసు నెదిరించి పరాజితుని గావించుటలో మిక్కిలి వుపయుక్తమైనట్లు లిఖించాను. ఆ లోహమే లేకుంటే వారు తమ ఎముకల, కొయ్యశిలా ఆయుధాలతో పారసీకులను ప్రతిఘటించగలిగేవారు కాదు. అదే వారిపైకి తుది దాడికాదు. కదళీ మృగావాసమగు ఆ గడ్డమీద మరల మరల మానవదృష్టి ప్రసరింపకమానదు. కాబట్టి దేవజాతీయులు మానవనిర్మిత ఆయుధాలను సేకరించుకొనక తప్పదు. అయితే ఆయుధాలనిమిత్తం బాహ్య ప్రపంచంతో సంపర్కమధికమగుటద్వారా దేవభూమియందలి దేవసమాజవ్యవస్థ రూపుమారి కళంకితమూ కావచ్చు. అల్లా కాకుండాచేసే వుపాయమేదీ నాకు తోచలేదు. ఈ విధంగా నేను భోజపత్రాలమీద సూచించిన ఉపాయము భావిలో సోకనున్న జాడ్యాన్ని నివారించగల ఔషధము కాదనే చెప్పాలి."

"అయినా నీ శక్తివంచన లేకుండా వారి శ్రేయస్సుకు ప్రయత్నించావుగా."

"అవును, హృదయపూర్వకంగా ప్రయత్నించాను. ఇప్పుడది స్వప్నలోకమనిపిస్తోంది; కాని, మూడేళ్ళక్రితం నా యీ కళ్ళతో స్వయంగా చూచాను. అప్పుడది స్థూలంగానే కన్పించినా యిప్పుడేదో దివ్యదృశ్య మనిపిస్తోంది. అక్కడ ఆనందమేగాని, కాముకత్వంలేదు. అలాగని అక్కడి స్త్రీ - పురుషులు కేవలం పరస్పరం కంటిచూపులతోనే ఆనందించే వారనుకోకేవు. వారు ఆలింగనం చేసికొనేవారు. ప్రేయసీ ప్రియుల ప్రణయ పారవశ్యంలో మైథునమూ వుంటుంది; కాని, మానవుల్లో - అంటే మనలో కన్పించే 'నా, నీ' అన్న నీచభావం వారిలో మచ్చుకైనాలేదు. ఆ ఈర్ష్యారహిత, కపటశూన్య సమాజంలో హద్దుల్లేకుండానే మర్యాద కట్టుబడివుంది. అది ప్రతిపనిని, ప్రతివాని మనోభావాన్ని పతనం కాకుండా కాపాడుతూంటుంది. అక్కడున్నప్పుడు నాకీ విషయాలన్నీ స్వానుభవాలే. అయినప్పటికీ దేవభూమిని వదలివచ్చే సంకల్పాన్నిమాత్రం ఎందువల్లనో త్యజించలేక పోయాను."

"పారసీకులపైనున్న ప్రతీకారభావం నిన్నీడ్చుకొచ్చిందేమొ ?"

......బహుశ నీవుచెప్పింది నిజమేకావచ్చు. పారసీకుల పేరెత్తితేనే నా చెవుల్లోశూలంలా నాటుతోంది. హృదయంలో తేలుకొండెలా గుచ్చుకుంటోంది. ఆ క్రూరులు మా గాంధార దేశంలో సగభాగాన్ని పరతంత్రం గావించారన్న విషయాన్ని ఎంతప్రయత్నించినా మరువలేకున్నాను. దేవగడ్డమీద వుండగాకూడా పారసీకులపైనగల ప్రతీకారవాంఛ అపుడపుడు నా హృదంతరాళంలో రేగు

తూనే వుండేది......... నేను దేశభూమిని విడిచి వచ్చేటప్పుడు ఆబాల గోపాలం- దేవ- దేవాంగనలు తమ ఆత్మీయుడు దూరమవుతున్నట్టే కంట నీరు పెట్టారు. నేను గనుక చచ్చిపోయివుంటే వారు అంతగా విచారించేవారు కాదు. వారికి జీవితమందే ప్రేమ. దేవవృద్ధులు తమ భావితరాలవారికి కపిల్ నామధేయంతో తక్షశిల పేరునుకూడ కలిపి చెపుతారని ఇప్పటికీ నాకుసంతోషమే. నాపేరు శీఘ్రంగానే మరువ బడవచ్చును, గాని తక్షశిలాక్షరములు వారిస్మృతి చిత్రంలో స్థిరస్థాయిగా అంకితమవడం మాత్రం ధ్రువమే."

"మిత్రమా కపిల్! ఉత్తర కురుభూమి అత్యంత మనోహరంగా వుంటుంది కదూ?"

"దేవకన్యలు కూడాను కపిల్!" అంది వెనుకనుంచి రోహిణి. ఆమె గప్‌చిప్‌గా కురుకథను ఆదినుంచి విన్నట్టుంది.



# 9. తక్షశిల పౌరస్వత్వము, వివాహము

తక్షశిలలో నాకు ఘనంగా వీరసన్మానం చేయనున్నట్లు ముందుగానే విన్నాను. నేను పూర్తిగా కోలుకొనేటంతవరకు నాకు వేచివుండవలసివచ్చింది. అస్వస్థగా వున్నప్పటికి నేను కొన్ని విశేషాలను గమనించుతూనే వున్నాను. మా ఆచార్యదంపతు లిద్దరూ నన్ను తమ బిడ్డవలెనే ప్రేమించుతూ, స్వకుటుంబంలో ఒకనిగా ఆదరించుతున్నారు. తక్షశిల ప్రజాతంత్రాధిపతి (రాష్ట్రపతి) లగాయతు సామాన్యపౌరులవరకు యెందరెందరో నా యెడల స్నేహ-వాత్సల్యాలు కలిగి సానుభూతి ప్రకటిస్తూవచ్చారు.

పారసీకులు మా విజయాన్నంగీకరించి తమ సేనాపతి - మజ్దదాత్ - ను, అన్య సైనికులను (ఖైదీలుగా చిక్కినవారు) విడిపించుకొని తక్షశిలతో సంధిచేసుకొన గోరుతున్నారు. మొదట మేము పశ్చిమ గాంధారాన్ని విముక్తిచేయుట కదే సదవకాశమని భావించాము. మా సేనలు పశ్చిమగాంధార రాజధానినగరం - పుష్కలావతి - లో ప్రవేశించి కార్యాన్ని కొంతవరకు సానుకూలం చేశాయి; అయినా మేము అక్కడి ప్రజామోదము, యితర విషయాలను గూర్చి యోచించగా పారసీకుల శక్తిని క్రుంగదీసేవరకు కేవలం తక్షశిల సైనికబలంవల్లనే పశ్చిమ గాంధార విముక్తి సంభవంకాదని విదితమయింది. తుదకు పారసీకులు తక్షశిలకు కొంత నష్టపరిహారమిచ్చుటతో ఒడంబడిక కుదిరింది. యుద్ధఖైదీలెల్లరు విముక్తులయ్యారని వేరే చెప్పనక్కరలేదు.

కొన్నాళ్ళకు నాకు స్వస్థత చిక్కింది. కండపట్టి తిరుగుతున్నానుకూడాను. అప్పుడొకనాటి సాయంకాలం ఆచార్యులు నన్నుచూచి యిలా అన్నారు :

"వత్సా సింహా! రేపు నువ్వు ప్రజాతంత్ర భవనానికి రావాలి సుమా. అక్కడ తక్షశిల తరఫున నీకు సన్మానం జరుగుతుంది."

"గురూ! నేటివరకు తక్షశిల పౌరులు నాపట్లచూపిన గౌరవాదరములు నన్ను సన్మానించడం కాదూ?" అన్నాను నేను.

"అదే సరిపోదని మావాళ్ళభావం. నీ వక్కడికి వీరవేషధారివై రావాలి. నేను నీ కవచము, ఆయుధాలు తుడిపించి, మెరుగుపెట్టించి వుంచాన్లే."

నేను వారి ఆదేశానికి సమ్మతి సూచకంగా తలూపాను.

ఆరాత్రి రోహిణితో మరునాటి సన్మానాన్ని గూర్చే ముచ్చటించుతున్నాను. అప్పుడామె యేదో విషయాన్ని నాకు తెలియనీకుండ హృదయం

లోనే అణచిపెట్టుకోటానికి ప్రయత్నించుతూన్నట్టు తోచింది. కాని, అదేమిటో చెప్పమని నొక్కి నేనామెనడగలేదు. వెంటనే కాకపోయినా నెమ్మదిమీద రోహిణి నాది కాబోయే సంగతే ఆమె బయటికి చెప్పలేకుండా వున్న విషయమని మాత్రం గ్రహించాను. రోహిణి నాకవచ ఖడ్గాదులను తెచ్చి చూపింది. అవన్నీ సరికొత్త వాటివలె తళ్తళలాడుతున్నవి. వాటిని చూపించి "నువ్వు రేపు పెందలాడేలేచి సిద్ధంకావాలి; యిక నిద్రపొ"మ్మని రోహిణి తుర్రున పారి పోయింది.

మర్నాటిప్రొద్దున రోహిణి తలంటిపోసుకొని తన నిడివైన తడికుంతలాలను పొడిగుడ్డతో తుడుచుకుంటూ స్నానాలగదిలోనుంచి రావటంచూచాను. ఆనాడామె ప్రవర్తన మామూల్లాగాలేదు; అయినా నే నామెను కారణమడిగేఅగత్యం లేకపోయింది. నేను కాలకృత్యాలను ముగించుకొని మంచంమీద కూచొని కవచం ధరించుదామనుకుంటూండగా రోహిణి నాగదిలోకివచ్చింది. ఆమె సిల్కు లంగా, పట్టు పమిట, రవికను సింగరించుకొనివుంది. ఆమె స్నిగ్ధశిరోజాలు వీపుమీద పడబడివున్నై; కాని అవి తాజా పూలతో అతి రమణీయంగా అలంకృతమై వున్నవి, ముఖానికి పల్చగా రంగు పొడుమును పట్టించింది. మెడలో ఒక ముత్యాలసరము, చెవులకు స్వర్ణకుండలాలుమాత్రం ఆభరణాలుగావున్నై. వెంటనే లేచి నేను దగ్గరకొచ్చిన రోహిణిముఖంలోకి రెప్పవాల్చకుండా చూస్తున్నాను. ఆమె అరుణాధరాలపైనచిరునవ్వును చిందులుత్రొక్కిస్తూ, వాల్చూపులతో అడిగింది— "వింతగా చూస్తున్నావు, కొత్తేముంది ?"

"రోహిణీ! నువ్వు నాకు నిత్యనూతనంగానే కన్పించుతావు. నిన్నెన్నడు పాతదనం అంటదు. అయినా యివాళ యేదో విశేషమున్నట్టే వుంది."

"విశేషం లేకేం వుందిగా. తక్షశిల నిన్నివాళ సన్మానించబోతోందిగా. మరి నాకుమాత్రం పండుగకాదూ ?"

"కాని, రోహిణీ! నువ్వు యీ ముత్యాలహారము కుండలాలు అలంకరించుకోగా నేను చూళ్ళేదే ?"

"ఇవాళ అమ్మ యిచ్చింది వీటిని."

"సరేగాని, నేను నీ దరికి రావచ్చునా ?"

"రోజూ నువ్వు నన్నడిగి ఆ పని చేస్తున్నావా ?"

"నే నూపిరి వదలితే నీ కేశాలెక్కడ చెదిరిపోతాయోనని - నా కర్కశ - కలుషితహస్త స్పర్శచే నీ కండువా మరకలవుతుందోనని - నా శరీరమాని నీ అలంకారం వికృతమైపోతుందేమోనని జంకుగావుంది."

"నీ కవితాధోరణినిక చాలించుమూ" తన చెంపలు మరింత యెరుపెక్కుతూండగా రోహిణి అన్నది— "నేను శృంగారించుకోవాలనుకోలేదు. నా కిష్టం

లేకపోయినా, అమ్మే తన చేతుల్తో నా కివన్నీ అలంకరించింది. నీ కిదంతా బాగుండలేదులాగుంది ?"

"బాగుండకేం. బలే చక్కగావుంది; కాని, కేవలం కళ్ళతో చూచినంత మాత్రాన తనివితీరటంలా."

"అయితే ఏంచెయ్యాలని నీ కోరిక ?"

"నా కోరికేమిటో నీకూ తెలుసు, ముందొక కమ్మని ముద్దు, ఆపైన గాఢాలింగనము."

రోహిణి నాతలమీద చెయ్యేసి మెల్లగా నా పెదవులకు తన అధరమాన్చి ముద్దుమీద ముద్దుపెట్టి "ముద్దులెన్నైనా పెట్టుకో; కాని, కౌగిలి యిప్పుడు కాదు. అమ్మ చేసిన యీ అలంకారమంతా మాసిపోతుంది. నేను మహోత్సవంలోకి వెళ్ళాలికదూ?" అంది.

నేను మరలమరల ముద్దుపెట్టుకోవటంతోనే సంతృప్తిచెందాను.

తర్వాతనేను కవచంతొడిగి, ఆయుధధారినై బయలుదేరుటకు సంసిద్ధ మయ్యాను. ఆచార్యులు, గురుపత్నికూడ అక్కడికేవచ్చారు. వారున్నూ శిష్టా చారాన్ననుసరించి వుత్సవానికి తగిన ఉడుపులనుధరించారు. ఆచార్యుడు నా చేతిని, గురుపత్ని రోహిణి కరకమలాన్ని పట్టుకోగా, అందరము గదిలోనుంచి బయటికి వెళ్ళాము.

గురుకుల వాసులగు విద్యార్థులు, భృత్యులు వుత్సవంలో పాల్గొనేందుకు అలంకరించుకొని వచ్చారు. మేము పంచాయతీ భవనానికి బయలు దేరగానే స్త్రీ-పురుషులెల్లరు మమ్మను సరించారు. ఆ భవనమల్లంత దూరాన వుండగానే గణపతి (ప్రజాతంత్ర అధ్యక్షుడు) రోహితాశ్వుడు సైన్యాధిపతితోను, యితర మంత్రుల తోను ఎదురువచ్చి నాకు స్వాగతమిచ్చాడు. అనంతరం భేరీ మున్నగు వాయి ద్యాలు మ్రోగుతూండగా, సాయుధభటులు వెంటరాగా మేము ప్రజాభవనంలో ప్రవేశించాము. అక్కడ సమావేశమైవున్న వేలాది పంచాయతీ సభ్యులు తక్షశిల, సింహుని జయనాదములతో నన్నాదర పూర్వకంగా ఆహ్వానించారు. ఆ సువిశాల భవనంలో క్రిందపరచబడ్డ తివాచీమీద ఎల్లరము ఆసీనులమైనాము. ఒక ప్రక్కన యెత్తుగావున్న అధ్యక్ష పీఠాన్ని అలంకరించుతూ గణపతి తనకు కుడిప్రక్కన నన్ను కూచోమని ఆదేశించాడు. నా ప్రక్కనే ఆచార్య లాశీనులయ్యారు. కవచ ధారి వీరాసనంలో మాత్రమే సుఖాసీనుడు కాగలడని ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరం వుండదు

గణపతి- రోహితాశ్వుడు లేచి నిలబడగానే సభలో నిశ్శబ్దం తాండ వించింది. ఆయన సభికుల నుద్దేశించి యిలా చెప్పారు:

"గౌరవనీయులారా ! వినండి, చిరంజీవి సింహుని పరాక్రమం మీ రెరుగనిది కాదు.తక్షశిల శత్రువులను పరాభూతులను గావించిన దీయనే. ఈయన సాహసం,

చాతుర్యముల వల్లనే పారసీక సేనాపతి సజీవంగా మన చేతికి చిక్కాడు. నేడు సింహుని యశోగాన మింటింట చేయబడుతోంది. ఈవీరగాధ అఖిలగాంధారంలో వేనోళ్ళ కీర్తించ బడుతోంది. మన కాప్తుడగు అట్టి యోధాగ్రేసరుని పట్ల కృతజ్ఞత ప్రకటించుట మన కర్తవ్యం. ఈ సమావేశం అందుకే ఏర్పాటు చేయ బడినదని మీ కెల్లరకు విదితమే. మీ ప్రజాతంత్ర నాయక వర్గము ప్రజల మనో భావాన్ని గుర్తించి కృతజ్ఞతా ప్రకటన కొక తీర్మానము (సన్మాన పత్రిక)ను తయారుచేసింది. దానినిప్పుడు మన సైన్యాధిపతి- ప్రియమేధుడు గౌరవసభ్యుల ముందు ప్రవేశపెట్టుతాడు. సభ్యులెవరైనా ఈ విషయంలో యింకేమైనా సూచించదలంచుచో అట్లే చేయవచ్చును."

గణపతి కూచున్న తరువాత సేనాపతిలేచి "గౌరవ సభ్యులారా! ఆల కించండి" అని తీర్మానపాఠము నిలాచదివాడు:

"చిరంజీవి సింహుడు మన ప్రజాతంత్ర రాజ్యానికి చేసిన సేవకు మన మాయనకు ఋణపడివున్నాము. ఆ ఋణభార విముక్తికి కృతజ్ఞతా సూచకంగా గాంధార ప్రజాతంత్రము సింహుని తన పౌరునిగా స్వీకరించుతోంది. గాంధార పుత్రులకు సర్వసాధారణంగా వుండే సర్వహక్కులు నేటినుండి సింహునికి లభ్యమవుతాయి. దీనితోపాటు ఈ ప్రజాతంత్రసభ (పార్లమెంటు) చిరంజీవి సింహుని మన ప్రజాతంత్రసంఘ శాశ్వత సభ్యునిగాకూడ ఎన్నుకుంటోంది."

తీర్మానాన్ని ఉపపాదించి సేనాపతి కూచున్నాడు. గణపతి మళ్ళీ చెప్ప నారంభించాడు.

"గౌరవ సభ్యులారా! వినండి. చిరంజీవి సింహుని తక్షశిల పౌరునిగాను, పంచాయితీ సభా సదస్యునిగాను స్వీకరించుతూన్నట్టు మన సేనాపతి సూచించిన తీర్మానాన్ని గౌరవ సభ్యులెల్లరు విన్నారు. సేనాపతి తీర్మానాన్ని అంగీకరించే వారు మాట్లాడనక్కరలేదు. దీనితో ఏకీభవించనివారు తమ అభిప్రాయములను చెప్పవచ్చును."

ఎవరూ మాట్లాడలేదు. గణపతి రెండోపర్యాయం "గౌరవ సభ్యులారా! వినండి, చిరంజీవి సింహునికి పౌరస్వత్వ ప్రదానం చేయడాన్ని గురించీ, పంచా యితీ ప్రతినిధిగా స్వీకరించుటనుగూర్చి మన సేనాపతి ప్రతిపాదించిన తీర్మాన పాఠాన్ని మీరంతా విన్నారు; అందుకు అనుకూలురు మాట్లాడ నగత్యంలేదు. ప్రతికూలురు తమ అభిప్రాయాన్ని తెలుపవచ్చును" అని చెప్పాడు.

ఈసారికూడా అందరు మిన్నకుండుటచే పంచాయితీ అధ్యక్షుడు మూడవ సారి మళ్ళీ అదేవిధంగా హెచ్చరించాడు.

"గౌరవ సభ్యులారా! చిరంజీవి సింహునికి తక్షశిల పౌరస్వత్వాలిచ్చి మన యీ పంచాయతీ సంఘసభ్యునిగా స్వీకరించుతూన్నట్టు సేనాపతి ఉపపాదించిన ప్రస్తావన మీ కెల్లరకు అవగతమే. ఈ విషయంలో సేనాపతితో ఏకీభవించే

వారు మాట్లాడ నక్కరలేదు. అందుకు సమ్మతించని వారిప్పుడు తమ అభిప్రాయాలను విప్పిచెప్పవచ్చును."

మూడు సార్లు అడిగినా ఎవరూ మాట్లాడనందున గణపతి సభ నుద్దేశించి అన్నాడు — "గౌరవసభ్యులందరూ మౌనంగావున్నారు. అందుచే చిరంజీవి సింహుని తక్షశిలపౌరుడుగాను, ప్రజాతంత్రసంస్థ సభ్యుడుగాను స్వీకరించుటకు మీరంతా సమ్మతించినట్లే నిశ్చయమయింది."

తీర్మానం ఏకగ్రీవంగా అంగీకరించబడినందుకు సభలో హర్షధ్వనులు చెలరేగినై. గణపతి నన్నుద్దేశించి "చిరంజీవి సింహా! నీవీ గౌరవాన్ని నీపరాక్రమంతోను రక్తధారలతోను సముపార్జించుకున్నావు. ఇప్పటినుండి నీవు మాలో ఒకడివి. ఈక్షణం నుంచి తక్షశిలవాసులకుండు పౌరసత్వాలు, మా పంచాయితీ సభ్యులకుండు అధికారములు నీకు సంప్రాప్తమైనవి. ఇప్పుడు నీవేమైనా గౌరవసభ్యుల ఎదుట చెప్పదలచినచో మాట్లాడవచ్చు"నని చెప్పాడు."

సామాన్యసైనికుడనైన నా కీరీతిని సన్మానం జరుగుతూంటే ఆనందాతిరేకంచే నా హృదయంలో ఏవేవోభావాలు తుపానులా చెలరేగాయి. అంత నిండు సభలో నిగ్రహంతో మాట్లాడలేనేమోనని జంకు కలిగింది. కానీ, నన్నాతెరగున సన్మానించినవారికి సమాధానమీయకుండవుండేదెలా? మెల్లగా లేచి నిలబడ్డాను. సభికులెల్లరికి కైమోడ్చి యిలాగో నోరువిప్పాను.

"గౌరవసభ్యులారా! నేను తక్షశిలలో అడుగుపెట్టి ఏడేండ్లు దాటిపోయినవి. తదాది తక్షశిలద్వారం నాకు తెరువబడే వుంది. నేనిక్కడ వాత్సల్యంతో కూడిన మీ స్నేహ-ప్రేమలను పొందుతూనే వున్నాను. ఇన్నాళ్ళుగా మీ మధ్యనున్నా నాకొక్కక్షణమైనా కటువుగా తోచలేదు. తక్షశిలలో నాపట్ల మీరు చూపిన ప్రేమాదరములు నా వైశాలి వియోగవ్యథనే విస్మరింపజేశాయి. కాలంగడచినకొద్దీ 'వైశాలి తూర్పుతక్షశిల' యన్న ఆచార్యసూక్తిలోని సత్యాన్ని విశ్వసించాను. నాకు తక్షశిల వైశాలివలెనే కన్పించసాగింది. నేను హృదయపూర్వకంగా తక్షశిలను నా మాతృభూమిగానే తలచుచున్నాను. నాజన్మభూమి వైశాలికొరకు ప్రాణత్యాగంచేయుట కెట్లు ఉవ్విళ్ళూరుతానో అట్లే తక్షశిలకై బలియగుటనా కర్తవ్యంగా భావించుతున్నాను. గౌరవసభ్యులారా! తూర్పున కురు, వత్స, కోసల, మగధాదిదేశాల్లో రాజ్యపాలన అనార్యపద్ధతిని చేయబడుతూన్నట్లు మీలో పెక్కుమందికి అవగతమే. దేవసభనుబోలిన ఇలాంటి ప్రజాపరిషత్సభ ఆదేశాలలో మచ్చుకైనా కన్పించదు. అక్కడిరాజులు పర్షియాచక్రవర్తి వలెనే తమ యిచ్ఛానుసారంగా నిరంకుశశాసనంచలాయించుతున్నారు; అయితే వాటికిమధ్య మాలిచ్ఛవీ ప్రజాతంత్ర మొకటివుంది. అక్కడొక్కచోట ఆర్యులు సర్వస్వతంత్రులై రాజులేకుండా సమిష్టి శాసనంతో ప్రజాతంత్ర పాలన సాగించుతున్నారు. నేను కోసలదేశంలో, కురురాజ్యంలో పరాయివాణ్ణిగానే

వున్నాను; కాని, ఇక్కడ - తక్షశిలలో ప్రవేశించినతర్వాత నేను వైశాలిలో వున్నట్టేవుంది. అందుచే నే నేమి చేయగలిగినప్పటికీ అది వైశాలి ప్రేరణవల్ల నేనని గౌరవ సభ్యులు గ్రహింతురుగాక. ఈ కీర్తి, గౌరవాలు వైశాలికే చెందాలి. ఇప్పుడు తమరు నాకుచూపిన గౌరవం, ఇచ్చిన పౌరసత్వమును వైశాలికి గౌరవచిహ్నాలుగా స్వీకరించుతూ, నేను తమకు చిరకృతజ్ఞుడనై వుంటాను. ఇంతే కాదు, ఇక ముందుకూడ తక్షశిలకు సేవచేసే ఏ అవకాశమూ నా చేతినుండి జారి పోకూడదనే నే నాశించుతున్నాను."

అని నేను ముగించి కూచున్నపిదప మళ్ళీ హర్షధ్వనులు విన్పించినై. అప్పు డొక ప్రముఖ గౌరవసభ్యుడులేచి "గౌరవసభ్యులారా! మన కధికార మున్నంతవరకు మన వీరుని గౌరవించి, సన్మానించాము. తూర్పు తక్షశిల యన దగు వైశాలిపట్లకూడ మనం గౌరవాన్ని ప్రకటించవలసివున్నది. అందు నిమిత్తం మనమొక సౌహార్ధసంఘాన్ని వైశాలికి పంపాలనీ, తద్వారా వైశాలి యెడల మనకుగల దుహృద్భావాన్ని ప్రదర్శించి ఉభయ ప్రజాతంత్ర రాజ్యాల మధ్య శాశ్వతసన్నిహిత సంబంధ—బాంధవ్యాన్ని యేర్పరచుకోవాలనీ మీకు వినతిచేస్తున్నా"నని మరొక ప్రస్తావన చేశాడు.

గణపతి ఈ తీర్మానాన్ని కూడ సభముందు పెట్టగా ఏకగ్రీవంగా ఆమో దింపబడింది.

పంచాయితీ సభ్యులు తమలో తాము మెల్లగా ఊసులాడుతూన్న సమ యంలో ఆచార్యబహుళాశ్వుడు గణపతిని సమీపించి ఆయన చెవిలో ఏదో చెప్పారు అంత గణపతిలేచి "గౌరవ సభ్యులారా!" అన్నంతనే సభలో సద్దణిగి నిశ్శబ్దం తాండవించింది." నే నిప్పుడు మీకొక సంతోషవార్త వినిపించు తున్నాను. మన ఆచార్య తనయ - పారశీకులతోడి యుద్ధంలో స్వయంగా పరాక్రమాన్ని ప్రదర్శించి వీరాంగన యనిపించుకొన్న రోహిణి చిరంజీవి సింహుని తన ప్రేమపాత్రునిగా యెంచుకున్నది. ఆచార్యు డిప్పుడు వారిప్రేమ కామోదము తెల్పుటవిని నాకు సంతోషంగావుంది."

అప్పుడు సభలో నాలుగు ప్రక్కలనుండి "రోహిణీ సింహుల పాణి గ్రహణం మా యెదుటనే జరగాలి" అన్న కేకలు విన్పించాయి.

అప్పటివరకు రోహిణి తక్కిన కాంతలతోపాటు ప్రేక్షక స్థానంలో కూచునివుంది. ఆనందము, సిగ్గులచే ఆమె మోము మరుణవర్ణం దాల్చింది కొద్ది సేపట్లో గణపతి వెనకాలవున్న ద్వారంలోనుంచి రోహిణి తన జనని ననుసరించి అధోముఖియై వస్తూండడం గమనించాను. సంస్థాగారంలోవున్న రెండువేలమంది దృక్కులభారం భరింపజాలక ఆమె కృంగిపోయి నట్టుంది. పుష్పాలంకృతులైన సువర్ణకేశాలింకను ఆమె వీపుమీదగా పిరుదులక్రిందకి వేలాడుతున్నై. ఎంత నింపాదిగా అడుగులేస్తూ వస్తున్నప్పటికీ ఆమె కర్ణకుండలాలు అల్లనల్లన ఊగు

లాడుతూనే వున్నై. భావావేశంచే ఊపిరి ఆగిఆగి వదులుతూన్నందున ఆమె వక్షమెగసి దిగపడుతూన్నట్టు స్పష్టంగా కన్పిస్తోంది. దినదిన ప్రవర్ధమానమవుతూ వచ్చిన రోహిణి అపురూప సౌందర్యాన్ని కొన్ని ఏండ్లతరబడి నిత్యమూ చూస్తున్నప్పటికీ నిజంగా నాకు ఆనాడామె మానవాంగనవలెకాక ఉత్తరకురు దేశంలోని అప్సరసలా వుంది. దరిద్రుడనగు నాకాదివ్య మోహిని లభ్యమవుతూన్న దని తలచుకొని నా అదృష్టానికి ఉప్పొంగి పోయాను.

రోహిణి గణపతి ఆసనానికి చేరికలోకొచ్చి నిలబడింది. గణపతి, ఆచార్యులు లేచి నిలబడుతూంటే నేనూ నుంచున్నాను. ఆచార్యు డప్పుడు రోహిణిచేతులను నా హస్తాల్లోపెట్టారు. సభలో మరొకమారు హర్షధ్వానులు రేగినై. తక్షశిల, వైశాలి జయనాదాలు మిన్నుముట్టాయి. గణపతి మరుసటి రోజునే వివాహోత్సవదినంగా ప్రకటించి నాటికి సభను ముగించాడు. గణపతి వెనుక నేను, రోహిణితరువాత ఆచార్యులు, యితరసభ్యులు ఒకరొకరుగా బయటి కొచ్చాము. వెలుపల గుమిగూడిన జనాన్ని చూస్తే తక్షశిల ప్రజలంతా అక్కడే వున్నట్టనిపించింది. ఊరేగింపుతో నగరవీధులుదాటి మా నివాసానికి చేరుకొన్నాము. మమ్మక్కడ దిగబెట్టి అందరూ వెళ్ళిపోయారు.

ఆనాటి సాయంత్రం నగరంలోని యువతీ - యువకులు జట్లుజట్లుగావచ్చి మా ప్రాంగణంలో పోగయ్యారు. మమ్మల్నిద్దరిని మధ్య పెట్టుకొని పెళ్ళివేడుక జరుపసాగారు. కమ్మని మాంసంతో భోజనము, శ్రేష్ఠమైన సురాపానము అయిన తర్వాత నృత్య- గానము లారంభమైనాయి. అక్కడికి వచ్చిన యువతు లొకరికి మించి మరొకరు సౌందర్యవతులు. సౌందర్యమంతా అక్కడ పోగుపెట్టబడి వట్టుంది. వారిలో నా ఆరాధ్యదేవి - రోహిణి షోడశకళా ప్రపూర్ణుడగు సుధా కరునివలె మెరిసిపోతోంది. నృత్యంలో వధూవరులము కూడ పాల్గొనక తప్పలేదు. అందులో వెనుదీసే వాళ్ళం కాకపోబట్టి మేము సిగ్గుపడవలసిన పనిలేకపోయింది. తరుణీతరుణులు నాట్యం చేసిచేసి అలసిపోయారు. రెప్పలు వాలుతున్నాయి. అప్పటికి తెల్లవారుట కింకంతో ప్రొద్దులేదు. సురకూడ తన ప్రతాపాన్ని చూప సాగింది. ఆ స్థితిలో ఆట-పాటలు కట్టిపెట్టబడి మాకూ విశ్రాంతి లభించింది.

రోహిణి కనురెప్పలు బరువెక్కాయి. నాకళ్ళు కూడ మూతపడుతూండగా మేము మా శయనాగారంలో ప్రవేశించాము.



# 10 తక్షశిలనుండి ప్రయాణం

రిపుంజయునికి పద్దెనిమిదో నెల వచ్చింది. పరుగులుతీస్తూ తిరుగుతున్నాడు. జననీ-జనకుల కంటె తాత-ముత్తవలతోనే వానికి చెలిమి ఎక్కువ. తల్లియెదుటనే ముత్తవను 'అమ్మా' అని పిలిచేవాడు.

వైశాలికి వెళ్ళవలసిన సౌహార్దసంఘం నాకోసం ఆగివుంది. ఆ సంఘానికి నాయకుడు నా మిత్రుడు కపిలుడే. ఇదుగో రేపు, యిదుగో ఎల్లుండి అంటూనే రెండేండ్ల నాలుగు నెలలనుండి నాకోసం ఆగిపోయాడు. ఇంకా వాయిదావేస్తే కపిల్ స్థానములో మరొకని-నియామకం తప్పదు. అదీగాక సంచారం చేయకుండా ఒకేచోట ఏండ్లతరబడి వుండే స్వభావం కాదు కపిల్ది. ఇక మా ప్రయాణంసంగతి ఆచార్యునితో-ముఖ్యంగా అమ్మ (రోహిణి తల్లి)తో ప్రస్తావించటం గడ్డు సమస్యగా వుంది. నే నందుకు సాహసింపలేకున్నాను. మొదట యీ విషయాన్నెలా సూచించుదామా అనుకుంటూండగానే రోహిణికి గర్భచిహ్నాలు కన్పడినై. తర్వాత రిపుంజయుడు పసివాడై వుండగా కూడ సందేహించాల్సి వచ్చింది. వాడికి ఒక ఏడాది నిండినపిమ్మట నేను చల్లగా మా ప్రయాణాన్ని గూర్చి ఆచార్యునితో ముచ్చటించాను. ఆయన దూరదృష్టిగలవారు. ఎదుటివారి మనోగతాభిప్రాయాల నిట్టే వూహించగలవారు. నేను మొదటిసారి ప్రస్తావించినప్పుడాయన "వత్సా! నేను నీతో యేకీభవించుతున్నాను. నువ్వు పదేళ్ళుగా యిక్కడ నేర్చిన విద్య అవసరతరణంలో వైశాలికి వుపయోగపడటానికే గదా. కాని, మిమ్మిక్కడనుంచి వీడ్కొలిపేందుకు మమత మమ్మడ్డగించుతోంది. అయితే దీనిని దరిచేరనివ్వక రణవిముఖుని గావించే పత్నీప్రేమను తిరస్కరించినట్టు మా యీ మమతను త్యజించక తప్పదు. నువ్వు మీ అమ్మకు నచ్చజెప్పి ప్రయాణానికి యేర్పాట్లు పూర్తి చేసికో" మన్నారు.

అమ్మను ఒప్పించటం సులభంకాదు. వారి ఏకైక సుతనాతో వచ్చివేస్తే ఆ మహాభవంతి అమ్మకెంత భీతావహంగా వుంటుందో నాకు-నాకంటె మిన్నగా రోహిణికి-కూడ తెలుసు- మేమిద్దరము ఎన్నోసార్లు మా ప్రయాణాన్ని గూర్చి అమ్మతో చెబుదామని రాత్రిళ్ళు అనుకొనేవాళ్లం; కాని, ఆమె యదుటికి వెళ్ళేటప్పటికి మేమసలు విషయాన్ని ప్రస్తావించడానికే సాహసించలేకపోయేవాళ్ళం. ఇక ఆపని మావల్లకాదని మేము కపిల్ని దూతగా చేసుకొన్నాము.

కపిలుడొకనాడు మాటల సందర్భంలో అమ్మతో యిల్లా అన్నాడు- "అమ్మా! మన ప్రజాసంస్థ సింహుని సేవకు తగినట్టు సన్మానించి గౌరవించింది; కాని, అది తలపెట్టిన మరొక కార్యం అల్లాగే వుండిపోయింది. వైశాలిపట్ల తనకు గల కృతజ్ఞత, సుహృద్భావాలను మాద్వారా తెలియజేయడానికి ఆతురతగావుంది. కానుకలుగా పంపేందుకు మంచి మంచి గుర్రాలు, రత్నకంబళ్లు, కపిశాసురా భాండములు, యింకా యితర వస్తువులెన్నో సమకూర్చుతోంది. ఈ వివరాలు మీచెవినికూడ పడివుండొచ్చు."

"లేదు నాయనా! నేను వినలా. రిపుంజయుడు నన్నే పనీ ముట్టనివ్వడు సరికదా, కాస్సేపు ఎవరైనా। చెప్పేకబుర్లయినా, విననిస్తేగా. అయితే - వత్సా వైశాలికి వెళ్లవలసింది నువ్వేకదూ?"

"అవునమ్మా! సౌహార్ద సంఘానికి ముఖ్యుడుగా నన్నే ఎంచారు."

"మంచిదే, మరెప్పుడు ప్రయాణానికి నిశ్చయించావు!"

"ఇంకా ఆరునెల్లు పోయిం తర్వాత. వర్షాలు తగ్గాలికదూ అప్పుడైతే మార్గాలేర్పడుతాయి. నదుల రేవులుకూడ సరిగా వుంటాయి. అప్పటినుంచే బిడారులుకూడ ప్రయాణం చేస్తుంటాయి.

"నువ్వన్నట్టు ప్రయాణానికి, అప్పుడే బాగుంటుంది. ఇంతకూ ఏర్పాట్లన్నీ పూర్తి అయినట్టేనా?"

"దాదాపు పూర్తి అయినట్టే; కాని, అసలీ రెండేండ్లనుంచీ మే మెందుకు తాత్సారం చేశామో అదిమాత్రం ఇంకా తేలనేలేదు."

"ఏమిటి బాబూ! ఆ అడ్డంకి ఏమిటి?"

"సింహుని ప్రయాణం సంగతే. మేము ఆయనతో కలిసి వెళ్ళాలనేగా ఆగింది అమ్మా!"

ఆ మాటతో ఆమె గ్రుడ్లనిండ నీరు కమ్మింది. అశ్రుబిందువులు టప టప క్రిందపడినై. ఆమె ఒడిలో రిపుపడుకొని వున్నాడు. గురుపత్ని వానినిముద్దుపెట్టు కొని గద్గద స్వరంతో "వత్సా! నాకు భయంగానే వుంది. రోహిణి పెళ్ళి అయిన సంవత్సరమే మీరు వెళ్ళకపోవడంవల్ల నాకప్పుడే కారణం తెలిసిపోయింది. ఇన్నాళ్ళూ మిమ్మల్ని ఆపి వుంచక తప్పిందికాదు; నేనప్పటినుంచి ఆలోచించు తూనే వున్నాను. రోహిణీసింహులు వెళ్ళిపోవడం నాకెంత దుస్సహమో నువ్వు సులువుగానే గ్రహింపగలవు. మీ ఆచార్యులవారితో కూడ ఈ విషయం ఎన్నోసార్లు సంప్రదించాను. వారి వాదనతో నానోరు మూతపడేది; కాని, ఎంత ప్రయ త్నించినా మనసొప్పటంలేదు నాయనా!" అని మరి మాట్లాడలేకపోయింది.

"అమ్మా! మీరుచెప్పింది వాస్తవమే. ఒక్కగాని ఒక్కకూతురు అత్త వారింటికి వెళ్లిపోతే ఆ వియోగవ్యథను భరించటం కష్టమే."

"చాలా కష్టం నాయనా! కాని, తప్పదు; సహించడానికే గుండెనిబ్బరం చేసుకున్నాను. ఈ యేడాది రోహిణీ సింహుల ప్రయాణానికి అనుమతించి పంపాలనీ, యీ రిపుని భిక్షగా అడిగి వుంచుకొని దుఃఖోపశమనంగా చూచుకుంటూ వుండాలనీ అనుకుంటున్నాను."

పై సంభాషణా సారాంశాన్ని కపిల్ చెప్పినప్పుడు పెద్ద బరువు తీసివేయబడినట్లుగా నా హృదయం తేలికయి సంతృప్తి చెందాను. "రిపు అమ్మకీ బిడ్డేగా వాడిని బిచ్చమెత్తి వుంచుకోవాలా" అంది రోహిణి.

మర్నాడు మే మిద్దరము తిన్నగా అమ్మ యెదుటికి వెళ్ళాం. మా రాకకూ క్రితం నాటి కపిల్ సంభాషణకీ సంబంధ మున్నదని ఆమె గ్రహించింది. ఒక్క త్రుటిపాటు ఆవిడ ముఖంమీద విషాద ఛాయలు అలముకున్నై; కాని ఆమె అతి కష్టంతో తన దుఃఖాన్ని దిగమ్రింగి లేని నవ్వు తెచ్చిపెట్టుకొని "బిడ్డ లిద్దరూ యేదో పనిమీద వచ్చినట్టున్నారు?" అన్నది.

నేను సాహసించి "అమ్మా! నిన్న కపిల్ మీతో మాట్లాడిన సంగతులు మాతో చెప్పాడు. మే మిద్దరము మీ వాళ్ళం; మీరు మమ్మల్ని భిక్ష అడగాల్సిన పనేముంది? మీరు రిపుని అట్టే పెట్టుకోవాలనుకూంటే అభ్యంతర మేముంది. అసలు మమ్మల్ని వెళ్ళకుండా యిక్కడేవుండిపొమ్మనడానిక్కూడా మీకుహక్కుంది. మీ ఆజ్ఞ మా యిద్దరికీ శిరోధార్యమే, అయితే ఇప్పుడుమగధరాజు వైశాలిపై కన్నెర్ర జేస్తున్నట్టు తెలిసి, నా కర్తవ్యం నన్ను వెంటనే వైశాలికి ప్రయాణం కమ్మని వేగిర పెడుతోంది. ఆచార్యుని అభిమతంకూడా యిదే" అన్నాను.

అమ్మ నా మాటలు పూర్తి అయ్యేవరకు ఓపిక వహించి తర్వాత రెండు చేతులూ చాచి రోహిణిని ఒళ్ళోకి తీసుకొన్నది. రోహిణి ఆమె మాతృదేవికింకా చిన్నప్పటి పాలుతాగే బిడ్డలాగా వున్నట్టుంది. తనయను ముద్దుపెట్టుకొని కంట తడిపెట్టి "వత్సా! నా చేష్టలుచూచి గాభరా పడబోకు. నాకు మాతృ హృదయం వున్నట్టే, కర్తవ్యాన్ని గుర్తించగల వివేకంకూడావుంది. నా మాతృ హృదయం పొంగి పొరలినప్పుడు నా చేష్టల్లో నా వివేకం మందగించినట్టు కనపడుతుంది. ఈ ఆర్నెల్లు నే నా వివేక శూన్య జీవితాన్ని గడిపేందుకు మీ రిద్దరూ ఒప్పుకుంటారనే 'ఆశించుతాను. నా కిప్పుడు అరవయ్యో సంవత్సరం గడుస్తోంది. రోహిణి యిక నాకు..." అని ఆమె ఆ పైన చెప్పలేక పోయింది. ఆమె కళ్ళనుండి బాష్పధార ప్రవహించుతోంది. ఒక్కింత సేపాగి "నాయనా, నా దగ్గర కొచ్చి కూచో" అన్నది.

నేను సమీపంలోకెళ్లి కూచున్నాను. రోహిణి యింకా ఆమె ఒడిలోనే వుంది. అమ్మ నా లలాటంమీద ముద్దుపెట్టుకుంటూంటే అశ్రుబిందువులు నా మొహంమీద రాలినై. అనంతరం మంచులాంటి తెల్లని వెంట్రుకలను ముఖం మీదనుంచి తొలగించుకొని నా మూర్ధముపైన చెయ్యివేసి అమ్మ అన్నది-"బిడ్డా!

మీ యిరువురకు మారుగా మీ ప్రతిబింబమైన రిపుని చూచుకుంటూంటాను. రోహిణివద్దకంటె నా చంకలోనే ఎక్కువగా వుంటూండడంవల్ల అంతగా బెంగ పెట్టుకోడు. నాకుబాగా మాలిమి అయ్యాడు. ఆకలైనప్పుడు చనుబాల కెగబడటంతప్ప వాడికి రోహిణితో వేరేపనేలేదు. ఈమధ్య నేను మేకపాలు తాగించటం మొదలుపెట్టిన లగాయతు వాడు తల్లిని మరచిపోతున్నాడు కూడాను."

మేమెంతో జటిలమనుకొన్న సమస్యను అమ్మ యిట్టే సుళువుగా విడదీసింది.

ఒకవేపున తక్షశిలకు అక్కడివారి స్నేహపూరిత హృదయాలకు దూరమవడాన్నిగూర్చిన ఖేదభావంతో మనస్సు వ్యాకులమవుతూంటే, మరోప్రక్కన వైశాలియందలి బాల్యస్మృతి ఆకర్షించుతూ హృదయోల్లాసం కల్గిస్తోంది. రోహిణికి ఆ తుది ఆరుమాసాలూ అతిదుర్లభాలై వేగంగా పరుగెడుతున్నాయి. ఆమె తన నెచ్చెలులతోను, బంధు-మిత్రులతోనేగాక, తరు-లతాగుల్మములతో వుద్యానవనములందు ఏకాంతంగా గడపగోరుచున్నది. అందువల్ల నేనున్న ఒక్కొక్కప్పుడు ఏకాంతంగా వుండవలసివచ్చేది; అయినా రోహిణికా స్థితిలో ఏకాంతమవసరమనే నేనూ భావించాను. తుది రెండునెలల్లోను మేమిద్దరము ఎన్నిసార్లో రెండు-మూడేసిరోజులు పొలాల్లోనే వుండిపోయేవాళ్ళము. జయుడు అమ్మమ్మ లాలనపాలనలో మమ్ము తలిచేవాడేకాదు.

క్రమంగా వానలు తగ్గాయి. తక్షశిల పరిసరప్రాంతంలోని పర్వతాలమీద పెరిగిన పసిరిక, మొక్కలు ముదురు హరితవర్ణాన్ని కోల్పోయి పండెత్తసాగాయి. పొలాల్లో పైర్లు పొట్టకర్రమీదవుండి వెన్నుకక్కటానికి సిద్ధంగావున్నై. ప్రజలు యిండ్లను శుభ్రపరుచుకోసాగారు.

కపిల్ నాయకత్వాన పదిమంది సభ్యులుగల సౌహార్దసంఘం వైశాలికి బయలుదేరబోతూంది. కానుకలుగా మేలుజాతి అశ్వాలు పది, రత్నకంబళ్లు వగయిరా యితర వస్తువులు సమకూర్చబడినాయి. తక్షశిల ప్రజాతంత్రరాజ్యం తరపున ఒక సువర్ణఫలకంమీద క్రింది వాక్యాలు చెక్కించి వైశాలి ప్రజాసంస్థకు సమర్పించమని సంఘనాయకుని కిచ్చారు.

"వైశాలి తక్షశిలల సంబంధం అతి ప్రాచీనమైనది. పూర్వమెప్పుడో కొంద రార్యులు గాంధారం వేపునుండే తూర్పుకు వెళ్లినట్లు మా పూర్వులద్వారా వింటూ వచ్చాము. ఇక్కడినుంచి వెళ్ళిన ఆ ఆర్యులే వైశాలిలో ప్రజాతంత్ర రాజ్యస్థాపన చేసినట్టుకూడ విన్నాము. ఏమైనప్పటికి మన ఉభయనగరాలకు, ప్రజలకు పోలికలనేక మగపడుతున్నవి...

"వైశాలి తక్షశిలవలెనే వీరులకు పుట్టిల్లు. వైశాలి వీరపుత్రుడు - సింహుడు తన శౌర్య-సాహసాలతో అద్భుత చాతుర్యంతో పారసీక సేనలను విధ్వస్తము గావించిన ఘటన మాకు చిరస్మరణీయము. మేమా యోధాగ్రణిని అర్హరీతిని సన్మానించితిమి. అట్టి వీరపుత్రునికన్న వైశాలిధన్య. ఆ పరా

క్రమశాలి వీరగాథలు విన్నవారెవరూ వైశాలివైపు లోలుప దృష్టితో చూడలేరని మా దృఢ విశ్వాసము......

"తక్షశిల, వైశాలి అక్క-చెల్లెళ్ళవలె శాశ్వత సంబంధం కలిగివుండాలనీ, గాంధారులు, లిచ్ఛవులు అన్న-దమ్ములవలె మెలగుచుండ వలెననీ మా ఆకాంక్ష."

మేమిద్దరము, సౌహార్ద్ర సంఘమువారు పదకొండుగురు కాక, వైశాలి నుంచి వచ్చి తక్షశిలలో రణవిద్యా పారంగతులైన లిచ్ఛవీయువకు లయిదుగురు కూడ ప్రయాణ సన్నద్ధు లయినారు. అందరం కలసి పద్దెనిమిదిమంది మయ్యాము. తక్షశిలనుంచి హాస్తినాపురందాకా భూ మార్గమున బిడారుల వెంటవెళ్ళడానికీ, ఆ పైన నావలమీద ప్రయాణం చేయడానికీ నిశ్చయింప బడినది. కానుకలు, దారిలో బత్తెఖర్చులకు సరిపడు కొన్ని మారకపు వస్తువులు ఆరుబండ్లమీదవేసి బండ్లు తోలుకొని రావడానికి ఆరుగురిని మినహాయించి లతిమ్మా పన్నెండు మందిమి ఆశ్వారూఢులమై ప్రయాణం చేయుటకు ఏర్పాటుచేసుకొన్నాము. నాకు రోహిణికి ఆచార్యులు తమ వుత్తమాశ్వములు రెండింటి నిచ్చారు.

ప్రయణానికి క్రితం రోజు సాయంత్రం మమ్ము కలుసుకోటానికి స్నేహితులు, బంధువులు, రోహిణిచెలికత్తెలు వచ్చారు. తుదిసారిగా ఆనందోత్సవం ఏర్పాటు చేయబడింది; కాని, అందులో ఉల్లాసం లేక చప్పచప్పగావుంది. ద్రాక్ష రసం విషంలాగుంది. కమ్మని పదార్థాలు వెగటుతోచాయి. ఆట - పాటలమీదికి మనసుపోనేలేదు. కాలమంతా విషాదంతోకూడిన కబుర్లతోనే గడచిపోయింది. రోహిణినెచ్చెలులు అశ్రుధారలతో ఆమెమోమును కడుగుతూ సెలవుపుచ్చుకొంటు న్నారు. నా మిత్రులు పునః దర్శనాభిలాషను వెలిబుచ్చిగాని నన్ను విడువరైరి.

తెలతెలవారక మునుపే మేము తక్షశిల తూర్పుద్వారం దాటిపోవాలి. అమ్మ రాత్రి తెల్లవార్లూ ఏమేమిటో పిండివంటలు చేస్తూనేవుంది. మేమిద్దరం పెందలాడే లేచి దంతధావనంచేసి దుస్తులు మార్చుకున్నాం. అమ్మ స్వయంగా వండిపెట్టిన క్షైమావుండలు, పూరీలు తిన్నాము. రిపు మైమరచి నిద్రపోతు న్నాడు. తలిదండ్రులు ఒకనాటి వేకువఝామున లేచి తన్నొదిలిపెట్టి వుడా యించారని వాడు గ్రహించడానికి కొన్ని సంవత్సరాలు గడవాలి. నేను రోహిణి మెల్లగా జయుని ముద్దుపెట్టుకొన్నాము. ఒకసారి, దొండపండులాంటివాని పెదవులమధ్య తెల్లని పాలపళ్ళు కన్పించగా రిపు నవ్వుతున్నా డనుకున్నాను; కాని, అది నా భ్రమ మాత్రమే. మా జయుడు నిశ్చింతంగా నిద్రపోతూనే వున్నాడు. దీపపు వెలుగులో రోహిణి కంటతడిపెట్టడం చూచాను. నేను అశ్రువులు రాల్చకపోయినా నా హృదయమూ వికలమవుతూనే వుంది.

బిడారుశకటములతో మా బండ్లుకూడ నగర బాహ్యద్వారం దాటిపోయినై. మా తోడి ప్రయాణీకులును ముందుకు సాగిపోయారు. రోహిణి తలిదండ్రులను

నగరద్వారందాక వెంబడించి రాకుండ బలవంతంమీద ఆపివేశాను. తలవాకిట వారిద్దరిని కౌగలించుకొని సెలవడిగాము. వారు మా లలాటములపై ముద్దుపెట్టు కొన్న తర్వాత నమస్కరించి గుర్రములపై కెక్కాము.

ఒక మైలుదూరం వెళ్ళేసరికి మా బండ్లను కలసికోగలిగాము. వైభవోపేత మైన తక్షశిల ఆ ప్రొద్దుపొడిచేవేళ బాలార్కుని రజిత కిరణకాంతులు ప్రసరింప అత్యంత శోభాయమానమై దేవనగరం కన్పిస్తోంది. మేము తక్కిన పదిమంది అశ్వారూఢులతో మా బండ్ల ననుసరించి వెళ్తున్నాము. తక్షశిలాదృశ్యం దృక్పథంలో నుంచి అదృశ్యమయ్యే తావున మేమిద్దరము గుర్రములనాపి దిగాము. మమ్ము గాంచి ముందున్న కపిల్ వగైరాలును ఆగిపోయారు. నేను తక్షశిలవేపు తిరిగి చేతులు జోడించి "బహుశ యిదేనా తుది నమస్కృతి కావచ్చు. మంగళదాయక మగు తక్షశిలా ! నీ ఒడిలో నేను గడపిన పదేండ్లుమాత్రం యెన్నడూ మరువలేను" అన్నాను.

రోహిణికూడ నమస్కరించింది. కాని, ఆమె నోటిమాటలకు ప్రత్యామ్నాయంగా నేత్రములనుండి అశ్రుధార ప్రవహించుతోంది. అప్పటి మా స్థితిని గాంచి మా సహచరులు ఖేదపడినారు. మా వైశాలి యువకులు బండ్లను తోలుకొని ముందువెడుతున్నారు. ఆ తావున వారి మనోభావమెట్లున్నదో నేను చెప్పజాలను.

రోహిణి యింకను అశ్రుపూరిత నేత్రాలతో తక్షశిలవేపే తేరిచూస్తోంది. నేను ఆమె గుర్రాన్ని తీసుకెళ్ళి తన ప్రక్కన నిలబెట్టినట్టుకూడ ఆమెకు తెలియదు. నేను "రోహిణీ! యికపద" అన్నప్పుడామె గాఢనిద్రలోనుంచి ఆకస్మికంగా మేల్కొన్నట్టు తలెత్తిచూచింది.

అశ్వముల నధిరోహించి అదలించాము. అవి పరుగుతీయుటతో మేము మా బండ్లను అందుకున్నాము.



# 11. వైశాలిదారిలో

పదేండ్లక్రితం తక్షశిలకు వెళ్ళేటప్పుడు నేను మద్ర, మల్ల ప్రజాతంత్ర రాజ్యాలగుండా ప్రయాణం చేశాను. నాకప్పుడవి అపరిచిత దూరప్రదేశాలుగా వుండేవి; కాని, యిప్పుడు పరిచిత మిత్రరాజ్యాలుగా తోచినవి. ఈ రాజ్యాలలో మార్గాలన్నీ సురక్షితాలై, యెక్కడా చోరభయమన్న మాటేలేదు. వానలాగిపోవడంతోనే ప్రజలు దారులను సరిచేశారు. చంద్రభాగ మున్నగు నదులకు అక్కడక్కడ వంతెనలు వేశారు; మరికొన్ని తావులందు నావలను ఏర్పాటు చేశారు వర్తకదళాలు (బిడారులు) పంచాయితీరాజ్య సరిహద్దులుదాటి లోపలికి ప్రవేశించేటప్పుడు స్వల్పంగా సుంకం చెల్లించాల్సివచ్చేది. ప్రతినగరానికి వెలుపల బిడారల మకాములకు అనువుగా ప్రత్యేక స్థానములు యేర్పాటు చేయబడి వుండేవి. అట్టితావులందు మనుషులకు, పశువులకు ఆహారము, గడ్డిగాదముల యేర్పాటు వుండేది. పట్టణంలో ఏవేని సరుకులు అమ్ముకోదలిస్తే కొద్దిపాటి పన్నులు యివ్వవలసివుండేది.

మల్ల, మద్రవీరులు తక్షశిలా రక్షణకువచ్చి యుద్ధంలో పాల్గొని వున్నందున వారికి నన్నుగూర్చిన వివరాలు బాగానే తెలుసు. మద్రరాజధాని సగాల్ కోటకు మేము వస్తున్నామని ముందుగానే తెలిసి సంస్థాగారంలో మాకు స్వాగతమివ్వడానికి ఏర్పాటు చేసుకొన్నారు. గాంధార కాంత - రోహిణి మద్రసుందరులను కలసికొని ఆ కాస్సేపు తక్షశిలనే మర్చిపోయింది. 'తూర్పు దేశాలలో మద్రభూమి సుందరీమణుల కాటపట్టు' ని నేను చెప్పినప్పుడు రోహిణి అధరము లరుణవర్ణము దాల్చుచుండ ప్రాచ్య ప్రాంతాలవారికి మద్ర, గాంధారముల తారతమ్యము తెలియదు కాబోలన్నది.

"నిజమే, మద్ర, గాంధారములలో ఒకరెక్కువ, మరొకరుతక్కువని చెప్పలేము" అన్నాను.

మేము శతద్రు (సట్లెజ్), సరస్వతీ నదుల దాటి తూర్పు భూభాగంలోకి ప్రవేశించుటతో అంతవరకున్న నిశ్చింత,నిర్భీతి భావాలను వదలవలసి వచ్చింది. ఇకముందరి మార్గాలు ప్రమాద రహితములుకావు. ఇటువేపున పట్టణాలు దూర దూరంగా కూడ వున్నై. అందుచేత మేము ఎక్కువగా అడవులందే మకాము చేయవలసి వచ్చింది. పట్టణాల్లో చోరుల భయంలేకపోగా అక్కడ పాలు, వెన్న

మొదలగు ఆహార పదార్థాలు సమృద్ధిగా లభించేవి. ఆ ప్రదేశాలన్నీ నిరంకుశ రాజుల పాలనలోనివి అందువల్లనే అక్కడి ప్రజల ప్రవర్తనలో కృత్రిమం అధికంగా కనపడింది. హెచ్చు-తగ్గుల తారతమ్యం ఎక్కువ. ప్రజాతంత్ర పాలనలోకంటె అక్కడి ప్రజ లధిక పేదరిక మనుభవించుతున్నారు. బానిసల సంఖ్య కూడ మిక్కుటమే.

అడవుల్లో వేటాడటానికిమాత్రం చక్కని సౌకర్యాలున్నవి. మాకు ప్రతి నిత్యం యేదో ఒక మృగం చిక్కుతూండేది. దుప్పి, లేడి, పంది, నెమలి మొదలగు వాటిలో దేనిలో ఒకదాన్ని పట్టుకొనేవాళ్ళం. ఆ రీతిని కమ్మని మాంసపు వేపుడో, సూపో లభ్యమయ్యే అవకాశం వుండేది. అయితే రోజూ అందరికీ సూపు నివ్వగలిగేవాళ్లంకాము. కృష్ణమృగం (ఒకజాతి అడవిలేడి) చేజిక్కిననాడు మా బిడారులో మహానందంగా వుండేది. మావద్ద ఎడ్లు అదనంగాకూడ వుండేవి. ఏదైనా బండిలాగలేకపోతే వెచ్చుగావున్నదాన్ని మార్చికట్టి పనికిరాని ఎద్దును ఆహారంగా వుపయోగించుకోవడంకూడా కద్దు. తరువాత మార్గంలో వుండేవూళ్లో తరుగైన ఎడ్లసంఖ్యను భర్తీచేసుకొనేవాళ్లం. గ్రామాలకు, పట్టణాలకు చేరినప్పుడు సుష్టుగా మాంసాహారము, తనివితీర సురాపానములకు అవకాశముండేది. మాబిడారులోని యావన్మందికి మూడుఎడ్ల మాంసమయితేగాని సరిపొయ్యేదికాదు. చోర భీతిగల తావులందు బిడారు పెద్ద మస్తుగా మద్యపానం చేయటానికి అనుమతి యిచ్చేవాడు కాదు.

ఇంద్రప్రస్థపురానికి మరి అయిదురోజులకు చేరుతామనగా మమ్మొక దొంగలగుంపు వెంబడించి వస్తూన్నట్టు తెలిసింది. వెంటనే మా బిడారొక సైనికదళంగా మారిపోయింది. ఆ విషయంలో రోహిణి ఏ ఒకనికీ తీసిపోలేదు. రాత్రివేళ అయినా విశ్రాంతి తీసుకొమ్మని కపిల్ చెప్పినప్పుడామె ఒడాయి వేసుకున్నది. అసలామెది జగడమాడే స్వభావం కాకపోయినా ఆనాడామె మోము ఉక్రోషంతో జేవురించింది. నేనామె క్రోధమూర్తి కావడంచూచినది ఆనాడే.

ఇంద్రప్రస్థపురంవద్ద యమునానదినిదాటి గంగఒడ్డువెంటపోయి హస్తినాపురము చేరుకొన్నాము. మార్గంలో మేము కల్మాషదమ్య రాజధానిని దాటాము. మే మక్కడ మకాంచేసియుండగా మే మొకనాడు వృద్ధకురురాజు రథంమీద నగరం వెలుపలికి వెళుతూండగా చూచాము. అతనిచుట్టూ వందలాది అంగరక్షకులు నడుస్తున్నారు. తక్షశిలమిత్రు లంతకు పూర్వమెన్నడు ఏరాజును చూచెరుగరు. కాబట్టి వాహ్యాళికిపోతున్న రాజునుగాంచి వారు యుద్ధానికి వెడుతున్నాడనుకున్నారు. రాజు వుద్యానవన విహారానికి వెళ్తున్నాడని నేను చెపితే వారు ఆశ్చర్యచకితులయ్యారు. వాహ్యాళికి వెళ్ళేటప్పుడు అంతమంది సాయుధభటులతో

జరూరేమిటని వారి సందేహం. "రాజతంత్రంలో రాజనువ్యక్తి ఒక్కడే సర్వాధికారియై గొప్ప బాధ్యతను వహించుతాడు. తన నిరంకుశపాలనతో ఎందరెందరినో శత్రువులను గావించుకుంటాడు. అధికారాన్ని హస్తగతం చేసుకోటానికి వారను లొక్కొక్కప్పుడు తమమార్గంలో అడ్డుగావున్న రాజును కడతేర్చ ప్రయత్నించుతుంటారు. అందుచే రాజనే వాడికి ప్రతిక్షణము ప్రాణభీతి వుంటుంది. కాబట్టి రాజు అప్పుడే చెట్టునుంచి కోసితెచ్చిన తాజాపండునైనా తన కళ్లముందు మరొకడు రుచిచూడనిదే నోటపెట్టలేడు. తన ముందున్నది నూతిలోని స్వచ్ఛజలమైనా అది విషాక్తం కాదని నిరూపింపబడనంతవరకు, పిపాసతో పీడింపబడుతూనే వుంటాడు; ఇంక వంటపదార్థాలను గురించి చెప్పవలసిన అవసరమే లేదు. రాత్రులందు నైమరచి సుఖంగా నిద్రపోలేడు.. రాత్రులందధికభాగము పీడకలలతోనే గడిచిపోతాయి" అని రాజుల స్థితినిగూర్చి నేనుచెప్పగా భద్రుడు "ఇన్ని ఆపదలతో కూడుకొనివున్న ఆ అధికారభారాన్ని రాజులేలవహించుతారో"? అన్నాడు.

"రాజు సర్వభోగాలు అనుభవించగల స్వతంత్రుడు. రాజ్యంలో అందరికంటె రాజే ధనికుడు. వ్యాపారంగాని, వాణిజ్యంగాని లేకుండానే రాజ్యంలోని సంపదయావత్తు అతనివద్దకు నడచివస్తుంది. అతనికి అపారంగాభూములుంటాయి. అంతులేని దాస-దాసీలకు అధినేత. తన అంతఃపురాన్ని నిత్యనూతన నవయౌవనవతులగు సుందరీ లలామలతో నింపుతూంటాడు. ఇవిగాక యింకెన్నెన్నో భోగవిలాసాలను అనుభవించేందుకే రాజ్యనిర్వహణ భారాన్ని వహించుతాడు."

"కాని ప్రజ లివన్నీ ఎందుకుసహించుతారు?"

"ప్రజలెప్పుడు తాము పరాధీనులమనుకుంటారో అప్పుడే రాజు వారిపైన నిరంకుశాధికారం చలాయింప నారంభించుతాడు."

"మే మట్టి నిరంకుశరాజులనెంతమాత్రం సహించలేము."

"మరి పశ్చిమ గాంధార ప్రజలు పారశీక ప్రభువు పాలకీని మోస్తూనే వున్నారు. రాజు కేవల మొక్కజాతిని పాలించుటతోనే తాను సురక్షితుడుగా వుండలేడు. ప్రజాతంత్ర ప్రభుత్వం అన్యజాతిపైన శాసనంచలాయించుట సంభవం కానట్టు, రాజు ఒకే ఒక జాతిని అధీన మందుంచుకొనుటకూడ సంభవంకాదు. రాజు పరిపాలన సాగించగలుగుటకు ఒకటికి మించిన జాతులు అవసరం. అతడు తన అధికారాన్ని నిలబెట్టుకోటానికి ఆయా జాతుల పరస్పర వైషమ్యాల కారణంగావారి సహకారం సంపాదించగలిగివుండాలి. ఒకేజాతిని పాలించడానికి రాజు తనకు సహాయులుగా బానిసలను కలిగివుండాలి. రాజు తన స్వప్రయోజనంకోసం ఏకజాతిలోనే ముసలం నాటి విచ్ఛిన్నం గావించుతాడు. ఆర్యావర్తంలోని ప్రజాస్వామిక రాజ్యాల్లో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యాది వర్ణభేదాలు కన్పిం

చవు. ఆ రాజ్యాలలో దేవతాపూజ నిమిత్తం ప్రత్యేక మొకవర్గాన్ని యేర్పరచి వుంచలేదు; కాని, యిక్కడ యీ రాజుల ఏలుబడిలో బ్రాహ్మణ, క్షత్రియాది వర్ణభేదములు యేర్పరుపబడినవి. ఈ జాతిభేదం కేవలం రాజు నిరంకుశ శాసనచక్రస్వేచ్ఛావిహారం నిమిత్తమే కల్పించబడ్డది."

మేము కొద్దిరోజులపాటు హస్తినాపురంలో ఆగిపోవలసివచ్చింది. అక్కడినుంచి నదిలో నావప్రయాణంచేసే బిడారులజత దుదురుట తేలికే. హస్తినాపురంనుంచి కాంపిల్య, కన్యాకుబ్జం, అలవిక, ప్రయాగ, కాశీ పట్టణాలకు తఱుచుగా నావలు బయలుదేరుతూవుంటాయి; అయితే మా గుర్రాలకోసం ప్రత్యేకంగా నిర్మింపబడ్డ పడవలు కావలసివచ్చాయి. అట్టివి ఏ బిడారుకూ లేనందున మేమే స్వయంగా ఏర్పాటుచేసుకోవలసివచ్చింది.

హస్తినాపురంలో మాకు రాజగృహానికిచెందిన జోతీయుడను వణిక్పుంగవుని బిడారుతో జతకుదిరింది. మమ్మల్ని వెంటతీసు కెళ్ళటానికి అనేక బిడారులవారు ఉబలాటపడ్డారు. కొందరు కానుక లర్పించడానికూడ సంసిద్ధులైనారు. పదిహేడుమంది ఆయుధధారులగు యోధులు తోడుగా వుండటం ఏ బిడారుకైనా స్వల్పప్రయోజనకరం కాదు. జోతీయుని బిడారుకు పెద్దయగు భీముడు చతురమతియే కాక దేశదేశాలు చూచినవాడు. అతడు తూర్పు, పశ్చిమసముద్రాల్లోనే కాక దూరద్వీపాలకూడ యాత్రచేసిన వ్యక్తి. గాంధారాన్నికూడ చూచాడు. అతని నలభైనావలు గాంధారంలోను, మంచుప్రదేశాల్లోను లభ్యమయ్యే వివిధ వస్తుసముదాయంతో నిండివున్నై. అందులో ఉత్తరకురుదేశాన్నుంచి వచ్చే కదలీమృగచర్మాలుకూడ కలవు. ఈ పుణ్య (అమ్మకపు) వస్తువులు మగధాది తూర్పురాజ్యాలకేకాక, బ్రహ్మదేశానికి (బర్మా), తూర్పుసముద్రంలోని ద్వీపాలకూ ఎగుమతిచేయబడేవి.

భీమునిద్వారా మగధనుగూర్చి అనేక సంగతులు తెలిశాయి. బింబిసారుడు మళ్ళీ సైనికసన్నాహం ఆరంభించాడట. ఉత్తరాపథంనుంచి వేలకొద్దీ గుర్రాలను కొని తెప్పించాడు. ఈ తడవ యే రాజ్యంమీదికి దండయాత్ర సాగించేదీమాత్రం భీముడు స్పష్టంగా చెప్పలేకపోయాడు. వాణిజ్యవేత్త జోతీయుని వర్తకప్రతినిధులు జంబూద్వీపమంతటా వ్యాపించుటేగాక సముద్రానికవతలకూడ వున్నారు. అందుచే వారికి ప్రతిరాజ్యంలోని శాంతి, యుద్ధ పరిస్థితులు ఆకరమై వుంటాయి. ఆయా రాజ్యాల్లోని శాంతిభద్రతలపైనే వారివాణిజ్యం ఆధారపడివుంటుంది. కోసల, వత్సరాజులు, లిచ్ఛవీ ప్రజాతంత్ర ప్రభుత్వముకూడ సైనిక సన్నాహంలో నిమగ్నమైయున్నట్లు తెలిసింది. మాసి లిచ్ఛవీనామ మాకర్ణించినంతనే నా హృదయారాటము హెచ్చినది. బింబిసారుడు లిచ్ఛవీ దెబ్బ నింతలోనే మరచి పోయాడా?

నదీయానంలో ఎడ్లతో పనిలేనందున గడ్డి - గాదాముల చింతలేదు సరికదా, చీమలవలె నెమ్మదిగా బండ్లవెంట నడవాల్సిన అవసరమూలేదు. గంగానదిలో

వాలు ప్రయాణం చేసేటప్పుడు నావలు అత్యంత వేగంగానే నడుస్తాయి. అప్పుడు పడమటిగాలి వీచుటచే తెరచాపల సాయంతో పడవలు మరింత వడిగా పరుగెత్తుతున్నాయి. మా గుర్రాలకు అవసరమైన ఎండుగడ్డి, పచ్చిమేతలకు కొరత లేదు. అరణ్య ప్రాంతంలో అక్కడక్కడ నావలను కట్టివేసి బిడారు సిబ్బంది పుల్లలు, కట్టెలు యేరితెచ్చేవారు. అటువంటప్పుడు మేము గుర్రాలను క్రిందికి దించి కాళ్ల గుదుళ్ళుతీర స్వారీచేసేవాళ్ళం. ఒక్కొక్కప్పుడు వేటాడేవాళ్ళం కూడాను. మాకు ప్రతిదినము బిడారు నావికులు పట్టిన చేపా - జెల్లా లభ్యమయ్యేవి. మేము కూరనారలకోసం ఖర్చుపెట్టేది అతిస్వల్పమే.

వెన్నెల రోజుల్లో నావలు రేయింబవళ్లు ప్రయాణించేవి. చీకటి రాత్రులందు నదిమధ్యలో లంగర్లు దించి ఆగిపోయేవాళ్లం. దివిటీలు వెలిగించి నావికులు మద్యపానం చేసేవాళ్లు. ఆ తర్వాత చేపలుపట్టేవాళ్లు. కాంపిల్య, కన్యాకుబ్జం మొదలైన తీర్థ స్థానాల్లో జ్యోతీయునికి పణ్యాగారాలున్నై. అట్టిచోట్ల బిడారు తాను తెచ్చిన సరకులు కొన్ని దించి, ఆయా తావులందు లభ్యమయ్యే వస్తువులను యెగుమతి చేసుకోవలసివచ్చేది. కాబట్టి అట్టి తావులందు మేమొకటి రెండు రోజులు ప్రయాణం ఆపవలసివచ్చేది. అప్పుడు మేము వంతులవారీగా వెళ్లి పట్టణాలు చూచి, తీర్థ స్థానాలను దర్శించి, మా వద్దనున్న వస్తువులను విక్రయించుకొని, నిత్యజీవితావసర వస్తువులను, ఆహార పదార్థాలను కొని తెచ్చుకొనేవాళ్లం. అది నడిశీతాకాలం. అయినా రోహిణి తక్షశిలలో కంటె చలితక్కువేనంది. ప్రాచ్య పట్టణాల్లోని పణ్యవీథులు, అంగళ్లు, దివ్య సౌధాలు, సుందరోద్యానవనవాటికలు చూచినపుడు రోహిణి వుల్లాసంగా వుండేది; కాని, అంటరానివారివి, దాసులవి, పాటకపుజనం గుడిసెలను, వాటిలో కాపురముండే డొక్కెండియున్న దీనుల్ని జూచినంతనే ఆమె హృదయం క్షోభించి, తరుక్కుపోయేది. దాస్యమెంత క్రూరమైనదో, దారిద్ర్యమెట్లసహ్యమో రోహిణి యిప్పుడు ఆర్థంచేసుకుంటోంది.

కన్యాకుబ్జంలో మే మిద్దరము రాజోద్యాన వనంలోకి వెళ్ళాము. అందులో మధ్యగా వికసిత పద్మాలతో, సరోజాతతో శోభిల్లుతూన్న కోనేరువుంది. అందులో హంసలు జలక్రీడలతో నీటిని కల్లోలం చేస్తున్నవి. కోనేటికి నలు ప్రక్కల నాటబడియున్న మొక్కలు, అంటులు వివిధవర్ణముల పుష్పములతో, సుమసౌరభముల వెదజల్లుతూ అత్యంత రామణీయకంగా వున్నై. మధ్యమధ్య నేల పసిరికతో పచ్చని తివాసీ పరచినట్టుంది. ఆ పుష్పవాటిక యందొకచో కొందరు నవమోహనాంగులగు తరుణీమణులు చెండ్లాట ఆడుతున్నారు. మరికొందరు సరససల్లాపములలో లీనమై యున్నారు. రోహిణి మేనుమీద కుండలాలకు మించి ఆభరణమేదీలేదు. ఆమె దుస్తులు కూడా అతిసామాన్యమైనవే ధరించివుంది; అయినా గాంధార సౌందర్యమామెలో మూర్తీభవించి

యుండుటచే చూపరులదృష్టినిట్టే ఆకర్షించుతోంది. మేము రాజోద్యానవాటికలో వుండగా పాంచాల రాకుమారి అక్కడికి వచ్చింది. ఆవిడ తన చెలికత్తెలవల్ల రోహిణినిగూర్చి విని మావద్దకు వచ్చింది. మేమప్పుడొక చలువరాతిబండమీద కూచుని పుష్కరిణీశోభను తిలకించుతున్నాము. రాకుమారినిగాంచి మేములేచి నిలబడ్డాము. ఆమె నెచ్చెలి యొకతె మాకు పరస్పర పరిచయంచేసింది. రోహిణి నామెతో కాసేపు కాలక్షేపం చెయ్యమన్నాను.

ఒకరినొకరు కలుసుకొనినప్పుడు చేసుకొనే శిష్టాచారం వారిద్దరికీ తెలియదు. ఏకన్యనుగాని, పడుచునుగాని కలసినప్పుడు తనకు సమానురాలుగా ఎంచి ప్రవర్తించుట మాత్రమే రోహిణికి తెలుసు. రాకుమారి సమవయస్కులందరితోను తన పరిజనుల మాదిరిగానే కలిసికొనుటెరుగును. రోహిణి సోయగాన్ని చూచి ఆమెనొక రాకుమార్తెగా భ్రమపడింది. అందుచే రోహిణి 'స్వాగత' మనగానే ఆమెకూడా 'స్వాగతం రాకుమారీ!' అన్నది. కొద్దిదూరంలోవున్న నేను వారి ప్రవర్తనను కనిపెడుతున్నాను. వారిద్దరికీ క్రింది సంభాషణ జరిగినట్లు రోహిణి తరువాత దారిలో చెప్పింది.

రాకుమారి : సఖీ! నువ్వీదేశానికి చెందినదానిలా లేవు; అందుచే నేను వివరాలు అడుగుతున్నందుకు మన్నించాలి.

రోహిణి : అల్లా అనవద్దు రాకుమారీ! మిమ్ము కలనుకొనినందుకు నా కత్యంతానందంగా వుంది.

రా : ఆయన నీ కేమవుతారు?

రో : నా భర్త.

రా : నీ జన్మభూమి పేరు?

రో : గాంధార దేశంలో తక్షశిలానగరం.

రా : మా అవ్వ గాంధారంలోనే పుట్టింది. మరి మీ నామధేయం?

రో : రోహిణి. మీపేరో?

రా : విద్యావతి. ఏం సఖీ! మనం కొంచెంసేపు పాదరింట విశ్రాంతి తీసుకోడానికి నీ కేమైనా అభ్యంతరమా? నేను మీ ఆయన్నుకూడ అక్కడికి పిలుద్దా మనుకుంటున్నాను. మా గాంధార అతిథులకు స్వాగతమివ్వటం నా ధర్మం కదూ.

రో : 'ఈ విషయంలో నా భర్తను అడిగి వచ్చి చెప్పటానికి అనుమతి యివ్వండి' అని రోహిణి నా చెంతకు వచ్చింది. మేము మకామును చేరడానికి యింకా వ్యవధి వుంది. కాబట్టి రాకుమారితో పాదరిల్లుచేరి మధ్యాహ్నం గడిపేందుకు మా కభ్యంతరం లేకపోయింది.

మే మిద్దరము ఆమెవద్దకు వెళ్లాము. రాకుమారి తనువెల్లా ఆ మణిమయాలంకారములతో నిండివుంది. ఆమె కర్ణములకు రత్నఖచిత కుండలాలు వ్రేలాడుతున్నవి. వాటిభారంచే చెవులు భుజముల నంటుతూన్నవి. మెడలోవున్న పెద్ద పెద్ద హారములు వక్షస్థలమంతా క్రమ్ముకొని వున్నై. నడుమున వివిధ సరములుగల వడ్డాణంవుంది. దానికి గజ్జెలు వేలాడుతున్నాయి. కంకణములు, గాజులు మోచేతులవరకు కప్పివేశాయి. తలమీద వినీలకుంతలాలు శిరోభూషణాలంకృతమై వున్నవి. కాళ్లకు పాంజేపట్టాలు, గజ్జెలువున్నై. మా వైశాలిలోను స్త్రీలకు నగలయందు మోజెక్కువే; కాని, నే నక్కడ యిన్ని ఆభరణా లెవరికీ చూళ్లేదు. ఇన్నినగలతో రాకుమారి నడవటంకూడ కష్టమే. నా కవి భూషణాలుగా కాక గుదిబండలనిపించాయి. మేము సమీపించుటచూచి రాకుమారి "అతిథులారా! స్వాగతం. తమరు పత్నీసమేతంగా మధ్యాహ్నం మా ఆతిథ్యాన్ని స్వీకరింప కోరుతున్నాను" అన్నది.

"అలాగే. తమ ఆజ్ఞ మాకు శిరోధార్యం. మా కింకను వ్యవధి వున్నదిలెండి" అని నే నన్నాను.

"మీ రిక్కడ (కన్నౌజీలో) కొన్నిరోజు లుండరా?" అన్నది రాకుమార్తె.

"లేదు రాకుమారీ! మే మొక వర్తకదళంతో కలిసి నదీప్రయాణం చేస్తున్నాము. ఇవాళమాత్రమే యిక్కడవుండి మగధకు బయలుదేరుతున్నాము.

"అయితే మీరు మగధరాకుమారు లన్నమాట? మరి సఖిరోహిణి గాంధార రాజపుత్రియేగద?"

"కాదు రాకుమారీ! నేను రాకుమారినీ కాదు, ఈయన రాజపుత్రుడూ కాదు. మేము క్షత్రియులము. నా పతి వైశాలికిచెందిన క్షత్రియవీరకుమారుడు. తక్షశిలలో విద్యాసముపార్జన చేసికొని, నన్ను వెంటగొని స్వస్థానానికి వెళుతున్నారు" అన్నది రోహిణి.

మాట్లాడుతూనే ముగ్గురము పొదరింటిలో ప్రవేశించాము. దాసీ లప్పటికే పీటలువేసి భోజనపదార్థాల వడ్డనకు సిద్ధంగా వున్నారు. మేము కూచున్న తరువాత రాకుమారి అన్నది. —"మేమూ క్షత్రియులమే. రాజకుమారి నైనంత మాత్రాన అధికమేముంది. సరే, సఖీ రోహిణీ! సుందరాంగివైన నీ శరీరాన్నలంకరించటానికి ఆభరణాల అవసరమేలేదు; కాని, చేతికొకకంకణమైన ధరించలేదేమమ్మా?"

"ఆభరణాలు మాపనికి యిబ్బందిని కలుగజేస్తాయి రాకుమారీ!" తన అరచేతులను, చూపుడు-బొటనవ్రేళ్లకు మొద్దుబారియున్న కాయలను చూపుతూ రోహిణి అన్నది- "మేము విల్లు యెక్కుపెట్టాలి; ఖడ్గం త్రిప్పాలి; పొలాల్లోను, తోటల్లోను కృషిచెయ్యాలి; అట్లాంటప్పుడు నగలు ఆటంకం అవుతాయి."

రోహిణి హస్తములను పరిశీలించి రాకుమార్తె ఆశ్చర్యపడింది. ఆమె దృష్టిలో శిరీషకుసుమంలా కోమలంగా వుండటమే స్త్రీకి సహజ సౌందర్యము. శీత - తాపముల కేమాత్రంకూడ స్త్రీ సుకుమార శరీరం తాళజాలక వాడి పోతుందని ఆమె తలంపు. ఆవిడ తన కోమలాంగుళులతో రోహిణి కర్కశ హస్తాలను తడిమిచూచి "మీ వేపున రాకుమార్తెలుకూడ యింత కఠిన పరిశ్రమ చేస్తారా ?" అని అడిగింది.

"నేను రాకుమారినికాను సఖీ, క్షత్రియ కాంతను."

"కాదులే, నీ మాటలతీరు, నీ నిర్భయత్వం నువ్వు రాజవిష్టవనే చెపుతున్నాయి."

"అందుకు కారణాలు వేరేవున్నాయి రాకుమారీ ! అసలు మాగాంధారంలో రాజే వుండడు. దాస-దాసీలుకూడ వుండరు. అందరూ క్షత్రియులే. హెచ్చు తగ్గులేక అందరూ సమానఫాయాలో వుంటారు."

"మరి మా అవ్వని గాంధారరాజకుమారి అంటారే !"

"ఇక్కడికి వచ్చిన పిదపవారి నల్లా పిలిచివుంటారు. మాది ప్రజారాజ్యం రాకుమారీ ! మా రాజ్యంలో రాణి, రాకుమార్తెలు వుండరు. అందుచే మేము సమవయస్కులందరిపట్ల సమభావంతో ప్రవర్తించటంమాత్రమే యెరుగుదుము."

రాకుమారి యీమాటలను ఆశ్చర్యంతో వింటోంది. ఆమె రోహిణి కథ నాన్ని విశ్వసించలేకపోతోంది. కాని, రోహిణి నీలిపాపల్లోకిమాస్తే అంతా సత్యమేననిపిస్తోంది. అప్పటికి వడ్డన పూర్తికావటంవల్ల రాకుమారి మమ్ము భోజనానికి రమ్మంది. ప్రస్తుతం శూరసేన, వత్సరాజులకు సాటికాకపోయినా పాంచాల ప్రభువంశము ప్రాచీనమైనదీ, ప్రసిద్ధి చెందినదే. కురు - పాంచాల రాజవంశాలవారు యితర భూపాలకులకు రాజుల ఆచార-వ్యవహారాలను గరపుతూం[illegible]. పాంచాల రాజభోజనం విషయంలోకూడ ప్రసిద్ధివుంది. నేను, రోహిణి వారి ఆతిథ్యాన్ని భోంచేసేటప్పుడు మెచ్చుకున్నా, మొత్తంమీద ఆ పదార్థాలు మాకంతగా మనస్కరించలేదు.

భోజనానంతరం రాకుమారి, ఆమె నెచ్చెలులు వీణ వాయించుతూ పాటలు పాడారు. రోహిణికూడ వారితోకలిసి పాడింది. తిర్వాత నృత్యం ప్రసక్తి రాగానే మా కింకవ్యవధిలేదనిచెప్పి సెలవుతీసుకున్నాము ఒకరాకుమారితో కొన్ని ఘడియలుగడిపే అవకాశం లభించటంవల్ల రోహిణిజిజ్ఞాస తీరిపోయింది. ఆఘటనతో రాజాంగనలపట్ల ఆమెకేమాత్రం గౌరవమూ వృద్ధికాలేదు. ఉద్యాన వనంలోనుంచి బయటికి వస్తూనే రోహిణి నాతో "ఈమె సరస్వతిలాగా 'బ్రె గొడ్డ'యి పోతుంది."

"ఎందువల్లేమిటి ?" నేనడిగాను.

"పదారు - పదిహేడేళ్ళ యీడులోనే ఆమె చుబుకము క్రింద ఎంత కండ పెరిగిందో చూడలా? ఆ నగలని చూచి నా కామెపై జాలి కలుగుతోంది. గాడిద మోతలాగా అంతబరువా! కొంచెం పనిపాటలు చేసి, స్వచ్ఛమైన గాలి, వెల్తురులలో తిరిగితే ఆమె కావికృతరూపం వచ్చేదికాదు. కళ్ళ కాకాటుక యెంత మోటుగా వుంది!"

"రోహిణీ! అయితే నీకివాళ రాజకుమార్తె ఎలా వుంటుందో తెలిసింది కాదూ?"

"ఆ, తెలిసింది. మా గాంధార కాంత 'ఉఫ్' అని వూదితే యెగిరిపోయేలాగుంది."

"అట్లా యెగిరిపోయేటట్లు వుండడంలోనే వుంది రాజకన్యల గొప్పతనం."

"కావచ్చు, కాని, అందువల్ల స్త్రీత్వమే కళంకితమవుతోంది."

"రాజులకు నారీత్వంతో పనిలేదు. వారాడుకోటానికి ఆటబొమ్మలు కావాలి; ఒకటికాదు, అనేకం."

"ఒక్కతెకంటె యెక్కువ మందా?"

"అవును, వందలకొద్దీను. వారికి నిత్యమూ కొత్తకొత్త బొమ్మలు కావాలి."

"అయితే వారిముందు స్త్రీకి విలువేలేదా?"

"లేకేం, వుంది. రాకుమారి ఒంటినిండా ఎన్ని విలువైన నగలున్నాయో చూచావుగా!"

"గుదిబండ వేసినట్టున్న ఆ బరువుకు విలువా! అవి శిక్ష."

"కాని, రాచపడతులు దానిని దండన అనుకోరు."

"అందరూ తెలివితక్కువ వారేనా?"

"ప్రేయసీ! రాకుమారిని స్వయంగా చూచిన నీవే అందుకు జవాబీయగలవు."

"ఆమె మాటలు చాలమట్టుకు అసహజంగావున్నా నా కావి[illegible]యంద మతిలా తోచలేదు."

"ప్రియరోహిణీ! రాజతంత్రం (ఏకాధిపత్య) స్త్రీపురుషుల బందిఖానా, రాజుయెదుట వ్యక్తికెట్టి విలువా వుండదు. అతని దృక్పథంలో స్త్రీ ఒక ఆటవస్తువు - కామక్రీడాయంత్రం మాత్రమే. రాజతంత్రంలో స్వేచ్ఛా ప్రకృతిగల మానవునికి తావేలేదు."

"అందువల్లనే రాజులపాలన అంటే నీకంత యేవగింపు."

"నిజమే. నేను రాజతంత్రాన్ని మానవత్వానికే కళంకంగా భావిస్తాను. నేను దాన్ని అసహ్యించుకోటానికి మరొక హేతువు కూడా వుంది. మా వైశాలికి భయంకర శత్రువులు రాజులే."

"ప్రియా ! ఆయాదేశాల్లో రాజతంత్రాలు అనాదినుంచీ వున్నయ్యా ?"

"లేదు రోహిణీ ! కురు, పాంచాల, కాశీ, కోసల, చేది, వత్స మొదలగు దేశాలన్నింటిలోను పూర్వం ప్రజాస్వామ్యమే విలసిల్లుతూండేది. కాలక్రమేణ బానిసలు, యజమానులు యేర్పడి ఆర్య అసురవర్ణ సంకరంతో చెలరేగినఅంతరంగిక కలహాల నుపయోగించుకొని జననాయకులు తమ ఆధిక్యతను స్థాపించుకున్నారు; ఇదీ నేను పూర్వులద్వారా విన్నదాని సారాంశం."

"మంచి గిరాకీచేరమే !"

"అవును, సందేహ మేముంది ?"

"అయితే—ప్రియా !—తక్షశిలలోకూడ వర్ణసంకర మేర్పడి, ఆర్య-అనార్య, బానిస యజమానుల వైషమ్యం తీవ్రరూపందాల్చితే అక్కడి ప్రజాతంత్రంకూడ విచ్ఛిత్తిఅయిపోతుందంటారా ?"

"వైశాలిలో యీచిక్కులన్నీ ముమ్మెదుర్కుంటూనే వున్నాయి రోహిణీ! మాదీ పంచాయితీపాలనే. దానిని సుస్థిరంగా నిలబెట్టుకోటానికి ప్రతిలిచ్ఛవీబిడ్డ తన సర్వస్వం త్యాగంచేసేందుకు సంసిద్ధమే; కాని, అక్కడ వేళ్ళుబారిన ఆర్య-అసుర, బానిస - యజమానులనే భేదభావాలు ఎప్పటికైనా మా పంచాయితీ వునికికే అరిష్టదాయకంకాక తప్పవని మే మెరుగుదుము. ఈ సంగతి నాకు వైశాలిలో వుండగా తోచనేలేదు. తక్షశిల పంచాయితీరాజ్యం వైశాలికంటె చిన్నదయ్యు, యెంతో బలీయంగా వుండటానికి గల హేతువును కన్గొనుటతో నే నీ పరిణామానికి వచ్చాను."

మే మిల్లాగే మాట్లాడుకుంటూ గంగ ఒడ్డుకు చేరేప్పటి కింకా జాము పొద్దుంది. కన్యాకుబ్జంలోకొన్న సరకులను బిడారుసిబ్బందిపడవలమీద కెక్కించింది. వారు పాన-గానాల యేర్పాటుచేస్తున్నారు. ఒక చెంప పందిమాంసం వేల్చు[illegible]తూంటే మరోచెంప మసాళాదినుసులు నూరుతున్నారు. వేరొకప్రక్క మద్య[illegible]త్రలు చేర్చబడుతున్నాయి. మా ముఠాకూడ అదే ప్రయత్నంలోవుంది. లిచ్ఛవీ యువకుడు శుభుడు మృదంగం వాయించటంలో ప్రవీణుడు. అతను మృదంగాన్ని సర్దుకుంటున్నాడు. భీముడు నిర్నిమేష దృష్టితో తనవీణవంక చూస్తున్నాడు. కపిల్ విసుగు చెందిన ట్లున్నాడు. నన్నుచూడగానే భుజంమీద చెయ్యేసి "మిత్రమా ! మా గాంధారి (రోహిణి) కారణంగా నీవేదైనా ఆపదలో చిక్కుకున్నావేమో ననుకున్నాను" అన్నాడు.

"ఆపదా ?"

"అవును మరి, రాజులు మహాఘోరాలు చేస్తారనీ, పరదార - పరధనాపహరణం వారికి పరమధర్మమేననీ భీముడు చెప్పాడు. మరి రోహిణిలాంటి చక్కదనాల కుప్ప - నారీరత్నం....

"రత్నం !" చురచుర చూస్తూ రోహిణి మధ్యలో అందుకున్నది-"నేను నిర్జీవరత్నాన్ని కాను. కామాంధుడగు రాజెవడైనా నాపైన కన్నువేస్తే వాడికి నారీత్వమంటే ఏమిటో చవిచూపేదాన్ని."

"నీసత్తా నాకు తెలుసు సోదరీ! నీవలా చేస్తావనటంలో సందేహంలేదు; కాని, భీముడి మాటలువిని ఒకవంక రాజులపట్ల నా కసహ్యం కలుగుతూంటే, మరోవేపున మీ రెంతసేపటికి రాకపోవటంవల్ల యేమి మూడిందోనని గుంజాటనగా వుంది."

"నిజమే, నువ్వన్నట్టు కొంచె మాలస్య మయింది. మేము స్నేహంతో కట్టుబడిపోయీ యింతసేపూను" అంది రోహిణి.

"ఇక్కడ—పాంచాల రాజధానీనగరం—కన్యాకుబ్జంలో స్నేహంతో బంధింపబడటమా? వైశాలి వాసులుగాని, తక్షశిలమిత్రులుగాని యెవరైనా కనిపించారా?"

"వారెవరూ కాదు అన్నా!" రోహిణి కపిల్ భుజంమీద చేయివేసి అతని ముఖంలోకి చూస్తూ చెప్పింది—నే నొక రాకుమారిని చూచాను."

"రాజు కూతురును చూచావా? వింతమృగంలా వుందా?"

"వింతమృగంకంటె విచిత్రంగా! కాని, నా కామెపై జాలికలిగింది కపిల్!"

"జాలి!"

"అవును, జాలే. ఆమెలో మన గాంధారకన్యలందరివలె సజీవత్వంలేదు. ఆమె ఆభరణాలతో కప్పబడి నిర్జీవప్రతిమలాగుంది. ఆధారంలేని లతలాగున నిరాశ్రితగా కనపడుతోంది; అందుచేతనే నా కామెయందు జాలికలిగింది?"

"అయితే మరి నన్నెందుకు పిలుచుకెళ్ళకపోయావు? నేనామెకాశ్రయమయ్యేవాడినిగా. అట్లయితే నువ్వు జాలిపడవలసిన అవసరమే లేకపోయేది" అన్నాడు కపిల్ నవ్వుతూ.

రోహిణి గాంభీర్యతవహించి అన్నది—"కాదన్నా! నవ్వద్దు. యిక్కడి స్త్రీల స్థితావస్థ, మందమతిచూచి నాకు విచారం కలుగుతోంది."

కపిల్ తన వ్రేళ్లను రోహిణి కేశాల్లోనికి పోనిచ్చి చిక్కుతీస్తూ "పిచ్చిపిల్లా! నేను మాత్రం ఎంతమంది స్త్రీ లవమానితులవడం చూళ్లేదు? పర్షియా (ఇరాను) బవేరు (బాబుల్) మొదలైన పశ్చిమ స్త్రీ కేవలం కాముకుల ఆటవస్తువుగానే యెంచబడుతుంది. స్త్రీలకు వారి కర్హమైన గౌరవం చూపబడేది ఒక్క మన పంచాయితీ రాజ్యాల్లోనే."

ఆనాడు రాకుమారి అవస్థనుచూచి రోహిణి నిజంగానే ఆవేదనపడింది. నలుగురితోపాటు కూచుని యెలాగో యెంగిలిపడ్డాననిపించింది; కాని, నృత్య-గానములు సాగుతూన్నప్పుడు ఆమె శిరోవేదనా పీడితఅయి వుపాకగాలేదు.

అందుచే నేనామెను పడవలోకి తీసికెళ్ళాను. కాసేపటిదాకా ఆమె నుదురును గంగానది శీతలోదకంతో తడిపిన మీదటతలనొప్పి కొంత తగ్గింది. పిండారబోస్తున్నట్టు కాస్తున్న వెన్నెలలో గంగాప్రవాహం మధ్య నిలబడియున్న నౌకలో పడుకొన్న రోహిణి ప్రక్కనేకూచొని నేను ఆమె బాధను మరపించేందుకు ప్రయత్నించుతున్నాను; కాని, రోహిణి మధ్యమధ్య రాకుమారి స్వరూపం జ్ఞప్తికొచ్చి యేదో అంటూనే వుండేది

"పాపం, అమాయికపిల్ల! నా మొద్దుబారిన చేతులనుచూచి నీరుకారిపోయింది. రూపమే స్త్రీకి బ్రతుకుతెరువనుకుంటోందా. ఛీ!"

"కాని, ప్రియా! ఇరిదులో స్త్రీ దోషం అంతగాలేదు. వారుకూడ మహా సింధుతీరాన పారసీకులతో పోరాడవలసి వుంటే తామూ గాంధార పడుచుల్లాగే తయారయ్యేవారు" అన్నాను.

"కాని, స్త్రీకి వివేకముంది; తన రూపంయొక్క మంచిచెడ్డలను గ్రహింపవచ్చునే?"

"ఈ రాజుల యేలుబడిలోని వేలాది ప్రజలకే వుంది తెలివి! అయినా వారంతా రాజుచేతి కీలుబొమ్మలుగా తయారవలా?"

ఈ విధమైన భావనా పరంపరతో ఆమె పరిపరి విధాల వ్యాకుల పడుతూంటే నేనామె మనసును వేరేవిషయానికి మరల్చదలచి రోహిణి తలపై చేతితో నిమురుతూ అన్నాను. "ప్రేయసీ! మనమిప్పుడు తక్షశిలకంటె వైశాలికే దగ్గరలో వున్నాము."

"అప్పుడే దగ్గరకొచ్చామా? నువ్వు వెనక ఎనిమిది నెలలకిగాని తక్షశిలకు చేరుకోలేదుగా?"

"నేను సరాసరి కాలినడకనే ప్రయాణం చేయవలసి వచ్చినందున అంత కాలం పట్టింది. మనం తక్షశిల నుంచి బయల్దేరి రెండు నెలలు దాటిపోయినై. ఇంకొక్క మాసంలోపుగానే మనం వైశాలికి చేరుకోవచ్చు ననుకుంటున్నాను."

"ఇంత త్వరగానా?"

"అవును, మననావలు అతివేగంగా రేయింబగళ్ళు నడుస్తున్నై."

"అయితే, ఇక నెలలో వైశాలికి చేరి నేను అమ్మను చూస్తానన్నమాటే?"

"అంతే, సోమని కూడాను. నేను మన పెళ్లి సమయంలో నిన్ను గురించి అమ్మకి జాబురాశాను; కాని, అది చేరివుంటుందనుకోడానికి వీల్లేదు."

"అయితే మరి నే నకస్మాత్తుగాపోయి వాకిట్లో నిలబడితే అమ్మ యేమనుకుంటుంది?"

"బంగారంలాంటి కోడలు దొరికినందుకు వుబ్బితబ్బిబ్బవుతుంది; కాని, అల్లాబరగదులే రోహిణీ! గంగాగండకీసంగమందగ్గరకు వెళ్ళగానే మనం వైశాలికి

మనిషిని పంపాలి. మనతో వస్తున్న తక్షశిల సౌహార్ద్రసంఘానికి స్వాగతపు ఏర్పాట్లు చేసేందుకు లిచ్ఛవులకు వ్యవధి వుండాలిగా.''

''మరి మనమందాక గంగ ఒడ్డున తిరుగుకబురుకు కాచుకొనివుండాలా ? అట్లయితే నన్ను శుభుని వెంట ముందే పంపించు."

''ఆ సంగమస్థానంనుంచి వైశాలికి రెండుదారులున్నై. గంగకు యెడమతట్టున వున్న ఉల్కాచేలంనుంచి స్థలమార్గం వుంటుంది. గండకీనదిలో పడవమీద మరి కొంతదూరం పోయి అవైన కాలిదారినికూడ వైశాలికి చేరవచ్చు. అయితే, రెండో మార్గాన ప్రయాణం కొంచెం యెక్కువసేపు పడుతుంది."

''మన పద్దెనిమిదిమందికీ వున్నవి పన్నెండు గుర్రాలేగా ?"

"ఆ విషయంలో చింతిల్లవలసిన అగత్యం లేదు. మనకి కావలసిన అశ్వాలను ఉల్కాచేలంలో అడిగి తీసుకోవచ్చు. తక్షశిల బహూకరించినగుర్రాలను ఖాళీగానే తీసుకెళ్ళాలి. మనందరికీ అక్కడ గుర్రాలు చులాకనగానె లభిస్తాయి."

''అట్లయితే మరి దారిలో జాగుచెయ్యటం దేనికి ?"

"మనమిత్రులకు చక్కని స్వాగతం యేర్పాటుచేయించటానికి, నీ కింత ఆత్ర మెందుకు రోహిణీ ?".

''అమ్మనీ, సోమనీ చూడాలని వుబలాటంగా వుంది."

"చూడొచ్చులే, కాస్తఓపికపట్టు. దారిలో వజ్జిదేశ సౌందర్యాన్ని చూపుతూ తీసికెళ్తాగా. అయిదారురోజు లాలస్యంగా మన మెలాగూ వైశాలికి చేరుకుంటామాయె. ఈలోగా నువ్వు మామిడి, అరటితోటలతో నిండియున్న వజ్జిభూమి మనోహరదృశ్యాలు చూడవచ్చు. నిన్ను గోపాలకుల గోష్ఠాల్లోకి తీసికెడతాను. ఈ అయిదారురోజులూ వజ్జిదేశ దృశ్యాలను చూట్టంవల్ల వైశాలి కొంతవరకు నీకు పరిచితమౌతుందికూడాను."

"అల్లాకాదు, కానపరిచితలాగే వెళ్లాలనుకుంటున్నాను. అట్లయితేనే అధిక ఆకర్షణీయంగానూ, అద్భుతంగానూ వుంటుంది."

రోహిణి తలనొప్పి పత్తాలేకుండా పోయింది. ఆమె వైశాలికి త్వరగా చేరుకోవాలని ఆత్రపడుతోంది. నేనామె పెదవులను ముద్దాడి "సరేగాని, ప్రియా ! నన్నొదిలిపెట్టి నువ్వొక్కదానవే ముందు వెళ్ళాలను కుంటున్నావా?" అనడిగాను.

"మరి నువ్వెలాగూ సౌహార్ద్ర సంఘంతో కలిసిరావాలి గదూ?"

"నిన్ను మాత్రమా సంఘంలో సభ్యురాలివని యెందుకనుకోకూడదు?"

"ఇప్పుడనుకుంటే అవుతానేమిటి ?"

"పోనీగాని, రోహిణీ! మనిద్దరమూ ఒకేసారి అమ్మయెదుట పడాలని నా కోరిక. అయినా నీ కిష్టమైతే నువ్వు శుభునివెంట ముందే వెళ్ళు. నా గుర్రాన్ని శుభునికిస్తాలే. మీ రిద్దరూ ఆ మరునాడే వైశాలికి చేరుకుంటారు."

"అలాగే ప్రియతమా!" రోహిణిలేచి కూచుని నన్ను కంఠాలింగనంచేసి అన్నది— "నేను ముందెళ్ళి మనకోసం ఒక యిల్లు యేర్పాటు చేస్తాను."

"అమ్మ మన్నెలాగూ తన యింట్లోనే వుండమంటుంది; కాని, ప్రేయసీ! మనం మన స్వగృహం-మా నాన్న యింటినే చక్కబెట్టుకోవాలి."

"తండ్రిగారి యిల్లా?"

"అవును, నేను విడిచిపెట్టి వచ్చినప్పుడది బాగానే వుంది. దానిని అమ్మే కనిపెట్టి చూస్తోంది. వైశాలికి వెలుపల మనకు కొద్దిపాటి పొలంకూడ వుంది."

"తోటకూడానా?"

"అవును, మన పొలంలో మామిడితోపుకూడా వుంది. నా తండ్రి పెద్ద భాగ్యవంతుడు కాకపోయినా తిండికీ, బట్టకీ చాలినంత భూవసతి మాత్రం వుంది.

"తండ్రి ధనవంతుడు కాదని నువ్వు కించపడుతున్నావా ప్రియా?"

"ఎబ్బే! అదేమీలేదు. నాన్న నన్ను బాగా ప్రేమించేవాడు. ఆయన గొప్ప భాగ్యవంతుడు కాకపోవటమే మేలయింది. అందువల్లనే నాకుసాహసమూ, కష్టసహనమూ అబ్బినై."

"అయితే యిక మనం మన యింటిని, భూమిని వృద్ధిచేసుకోవాల్సిందే."

"అంతటితో సరిపోదు, వైశాలికి సేవచేసేందుకు నడుంకట్టాలి."

"ప్రియా! బింబిసారుడు వైశాలిపైకి దండెత్తివస్తాడనే అనుకుంటున్నారా?"

"వైశాలిని జయించనిదే మగధ యిక ముందుకొక్క అడుగైనా వేయలేదు. చూచాయగా తెలిసినదాన్నిబట్టి దాని సైనిక సన్నాహమంతా వైశాలిమీదికేనని నా తలంపు."

"అయితే మనం మంచి తరుణంలోనే చేరుకొంటున్నాము."

"నేనూ అలాగే భావించుతున్నాను."

"నేనుకూడ కత్తిచేపట్టాల్సిన అవసరముండేనా?"

"అవసరం కావచ్చు. లిచ్ఛవీకాంతలు యుద్ధంలో పాల్గొనటం అరుదు. అయినా నువ్వు మెలకువతో సంచరించాలి. రాజులు అతి నీచులు. ముఖ్యంగా స్త్రీలవిషయాలలో మరీను."

"అల్లాగని నేను పంజరంలో పిట్టలాగుండాలా?" అంది రోహిణి స్వరం మార్చి.

నేనామె మూర్ధాన్ని ఒళ్ళోకి తీసికొని "కాదు ప్రియా! నువ్వలా అర్థం చేసుకోకు. నువ్వు యుద్ధరంగంలో మాకేముందు నాకు సూచించాలనిమాత్రమే నాభావం." అని బుజ్జగించాను.

"అందుకు నేను సిద్ధమే. నా కరము కరవాలచ్యుతము కాకుండుటే నాక్కావలసింది."

చాలసేపు మాట్లాడుకున్న తర్వాత రోహిణి నిద్రపోయింది. నేనొక కంబళితీసి ఆమెకు కప్పాను. గట్టుమీద యింకా నృత్యం జరుగుతూనేవుంది. అందరూ తన్మయులయి వున్నారు. తెల్లవారగట్టే పడవలువిప్పి వదలాలి. మరి వారు తెల్లవార్లూ నృత్యంలోనే లీనమై వుంటారేమోనని నేను భయపడ్డాను; కాని, అర్థరాత్రి కాకమునుపే నావికు లొకరొకరే మత్తిలిపడి పోసాగారు. అట్టి వారిని తతిమ్మావాళ్ళు పడవల్లోకి చేర్చుతున్నారు. నిద్రాదేవికి నే నెప్పుడు వశమయ్యానో నాకు తెలియదు. నిద్రలో నాకొక కలవచ్చింది. ఘోరయుద్ధం జరుగుతోంది. నేను సమీపంలో నిలబడి చూస్తున్నాను. లిచ్ఛవు లొకప్రక్కన పోరాడుతున్నారు. ఊరుకోలేక నేను ఒక అశ్వాన్ని అధిరోహించాను. మహాసింధు తీరాన పారశీకులతో పోరాడుతూన్నప్పుడున్న ఆయుధాలన్నీ నావద్ద వున్నై. నేను శత్రువుల బారును చీల్చుకుంటూ ముందుకెళ్ళాను. నాకభిముఖంగా ఒక హస్తి వస్తోంది. అది దూరాన తొండియెత్తి వుంది. అంతపైకి నా బల్లెంతో పొడిచే దెలాగా అని యోచించుతున్నాను. అంతలో నా గుర్రం నేలమీద కాక గాలిలో కెగిరి ● పరుగు నారంభించింది. అది నా కిరణసంకేతంతో చెట్లకుపైగా పరుగిడుతోంది. నేను తిన్నగా కరిపైకి చేరాను. దానిమీద మగధపాలకుడు బింబిసారుడు తిష్టవేసికూచునివున్నాడు. నన్ను చూచి అతడు గడగడవణుకుతూ దయాభిక్షనర్థింపసాగాడు. నేనుద్రేకంతో "నిన్నిదివరకొకసారి ఓడించి వదిలాము. ఈ పర్యాయం శాస్తిచేయందే విడిచి పుచ్చము" అని నా బల్లాన్ని విసరబోయేసరికి నాకు మెలకువవచ్చింది. నావికు లప్పుడే పడవలను విప్పబోతున్నారు. సుధాకరుడు అస్తాచలమును చేరబోతున్నాడు.

మా నావ మళ్ళీ నిర్విరామంగా సాగిపోతోంది. మార్గంలో రెండుమూడు చోట్ల మకాంచేసి క్రమంగా కాశికి చేరాము. గంగా యమునల సంగమస్థానంలో విలసిల్లిన వారణాసివద్ద గంగాతీరం అత్యంత రమణీయంగా వుంటుంది! వారణాసి కాశీవస్త్రాలకు, చందన-గంధములకేకాక అనేక యితరవస్తువులకు ప్రపంచ ప్రసిద్ధిచెందినది. అందుచే మాతోవచ్చిన బిడారు కాశీపురంలో నాలుగురోజు లాగిపోతామన్నారు. అక్కడినుంచి మార్గం ప్రమాదరహితమైనందున రోహిణికి కాస్సేపటిలో కాశీని చూపించి, మేము పద్ధెనమండుగురము మా రెండునావలను విప్పుకొని ముందుకు బయలుదేరాము.

గంగాతీరం పొడుగునా పచ్చపచ్చని పైరులతో కళకళలాడుతూంది. అక్కడక్కడ పశుపాలకుల కుటీరాలు, బెస్తవారి గుడిసెలు వున్నవి. వీటన్నిటినీ మించి గంగానది గభీర నిర్మలప్రవాహం రోహిణి నెక్కువగా ఆకర్షించింది. ఆమె నీటిబయట యిసుకమీద పడివుండి వొళ్ళెండబెట్టుకుంటూన్న మొసళ్ళను చూచి అనేక తడవలు నల్లటి మ్రాని మొద్దులనే అనుకున్నది; కాని, నావ సమీపించగానే అవి చరచర నీటిలోకి పారిపోవటం చూచి ఆశ్చర్యపడేది. అవి మనుష్యులను పట్టుకొని నదీగర్భంలోకి యీడ్చుకొనిపోయి మ్రింగివేస్తాయని నేను చెప్పినప్పుడామె భీతావహయై గజగజ లాడింది. మేము జాము ప్రొద్దెక్కేసరికి గంగా - గండకీ సంగమ స్థానమందున్న ఉల్కాచేలను (హాజీపూరు) చేరుకున్నాము.





# 12. లిచ్ఛవీ గడ్డమీద

ఉల్కాచేలం చేరుకోవటంతో లిచ్ఛవీయువకులం ఆరుగురమూ మహదానంద మనుభవించాము. మాతోపాటు రోహిణికూడ ఆనంద మనుభవించింది. తుదకు మేము అనేక చిక్కులతో కూడిన మూణ్ణెల్ల ప్రయాణాన్ని ముగించి వజ్జిదేశంలో అడుగుపెట్టాము. నావనుంచి దిగి ఒడ్డెక్కుతూండగానే శాయరీ వసూలుచేసే అధికారి వచ్చాడు. నే నతనికి తక్షశిలనుంచి మా వెంట వచ్చిన సౌహార్ద సంఘాన్నిగురించీ, వారు తెచ్చిన బహుమానవస్తువులనుగూర్చీ టూకీగా వివరించి చెప్పాను. అతడు సంతోషం వెలిబుచ్చి తక్షణమే నన్ను సేనానాయకుని వద్దకు తీసుకెళ్ళాడు. గంగానది అవతలితీరం మగధరాజ్యంలోనిదికావటంవల్ల ఉల్కాచేలంలో సరిహద్దురక్షణ సైన్యం ఎల్లప్పుడూ తైనాతుగా వుంటుంది. ఆ సేనానాయకుడు నాకపరిచితుడు కాదు. నా జనకునిమిత్రుడు రోహణుడేనని తెలిసినప్పుడు, నేను మరింత సంబరపడ్డాను. నన్ను చూట్టంతోటే ఆయన నేత్రాలానందబాష్ప భరిత మైనాయి. నన్ను కౌగలించుకొని నొసట ముద్దాడి "మంచి అదనులో వచ్చావు నాయనా! ఇప్పుడు వైశాలికి నీవల్ల ఎంతైనా అవసర ముంది" అన్నాడు.

నాగురించి క్లుప్తంగా చెప్పి, తక్షశిల సౌహార్ద సంఘాన్నిగూర్చి వివరంగా తెలిపాను. అప్పుడాయన "అయితే, కుమారా! వైశాలికిప్పుడే మనిషిని పంపుతాను. రెండుగంటలలో మన జాబక్కడికి చేరుతుంది. నీవుకూడా రాయాలనుకుంటే యివిగో! తాటాకు, కలము, మసిబుడ్డీని. మనకింకేమేమి [illegible]లి?" అన్నాడు.

"బహూకరణములను ముందు బండ్లమీద పంపాలి. గుర్రాలుకూడ ముందే వెళ్ళాలి. లేకపోతే అవిచేరడానికి జాగుకావచ్చు."

"అంతేకాదు నాయనా! వారికి స్వాగతపు ఏర్పాట్లకుకూడ వ్యవధి వుండాలి. నేనైతే తక్షశిలకు పోలేదు. గాని, అది మనలిచ్ఛవులకు చిరపరిచితమే. తరతరాలనుంచి మనవాళ్ళు తక్షశిలను పినతల్లిగానే భావించుతున్నారు. గాంధార మిత్రులను సన్మానించే సదవకాశం మనకిప్పుడే తొలిసారిగా లభ్యమవుతోంది. ముందు జాబురాయి. తరువాత తతిమ్మా అవసరాలు చెప్దువుగాని."

నేనూ ఒకటి మాపంచాయితీ అధ్యక్షునికీ, మరొకవుత్తరం మా అమ్మకూ రాశాను. అమ్మకు రాసినదానిలో నాతో రోహిణికూడ వస్తున్నట్లు తెలిపాను.

ఉల్కాచేలంనుంచి వైశాలికివెళ్ళే మార్గంలో ప్రతి యోజనందూరాన అశ్వికభటులు తైనాతుగావుంటారు. వార్తాహరులు అంచెలంచెలుగా మారటంవల్ల జాబులు అతిశీఘ్రంగా చేరటానికి వీలుపడుతుంది. సేనానాయకుడు వివరంగా వుత్తరంరాసి పైన తనముద్రవేశాడు. అనంతరం తాళపత్రాల్ని మడిచి గ్రాటితో కట్టి ముడిపై బంకమట్టివుండనతికించి ఇంకోముద్ర వేశాడు. ఆలేఖ నొకభటునకిచ్చి తక్షణం వైశాలికి పంపమని ఆజ్ఞాపించాడు. ఆపని పూర్తిఅయిన తర్వాత నాతో అన్నాడు—"ముందు మధ్యాన్న భోజనానికి యేర్పాటుచేస్తాను. మొత్తం అంతా ఎంతమంది?"

"తక్షశిల మిత్రులు పదిమంది-ఒక దళాధిపతి, తొమ్మండుగురు సైనికులూ. తక్షశిలలో విద్యాభ్యాసం ముగించుకొనివచ్చిన లిచ్ఛవీ యువకులు మరో ఐదుగురు. మరి నేనూ, నా భార్య రోహిణి."

"నీ భార్యా ? మా కోడలే ! గాంధార పడుచా!" అంటూ ఆయన నన్ను మరొకసారి కౌగలించుకొన్నాడు. "అబ్బాయ్ ! నువ్వు వైశాలి తక్షశిలల సంబంధాన్ని బాంధవ్యంతో మరింత దృఢంచేశావురా. వాటికీ మనకీ మధ్యనున్న అరవై యోజనాలదూరం మన గాఢస్నేహానికేమాత్రం ఆటంకం కాకుండా చేసుకోవలసిందే. సరే మా కోడలికి స్వాగతమిచ్చే ఏర్పాటు చెయ్యమని మీ పిన్నితోచెప్పి యిప్పుడే వస్తానుండు. పద్దెనిమిదిమందికి వంటచెయ్యమని పురమాయించుతాను. అన్నంలోకి పందిపిల్ల మాంసం బాగుండదూ ?"

"బలే బాగుంటుంది - బాబాయ్ !"

"పది గుర్రాలకు పదిమంది రౌతులుకావాలి. మరి సామానుకు బళ్ళెన్ని కావలసొస్తాయి ?"

"ఐదు సరిపోతాయి."

"అయిదు బళ్ళకు అయిదుగురు తోలేవాళ్ళుకూడ అవసరమన్నమాటే. అశ్వా[illegible] నా సారధినికూడ పంపుతాను. వారుపంపిన హయాలు సైంధవాశ్వజాతిలా [illegible]యెన్నికైనవేనా ?"

"తక్షశిలలో మెఱుగు తేలిన రకం బాబాయ్ !"

"బండ్లతో ఐదుగురు మనుషులతోపాటు సేనాని తిష్యునికూడ పంపుతాను. ఆ తర్వాత మీరెక్కి వెళ్ళటానికి గుర్రాలు, రధాలు యేవికావలసినా కొదువలేదు. పడవలనుండి అశ్వాలను, సామాను దింపించి బండ్లపై కెక్కించి వైశాలికి తోలించుకొని పొమ్మని నేనుపోయి తిష్యునితో చెప్పొస్తాను. నువ్వీలోగా మీ పిన్నితో మాట్లాడుతూండు. తర్వాత యిద్దరం రేవులోకెళ్ళి అతిథులకు స్వాగతం యిద్దాం.

సేనానాయకుడు వంటవానితో భోజనపు టేర్పాట్లు చెయ్యమని చెప్పి బయటికి వెళ్ళాడు. నేను "పిన్నీ!"అని కేకవేస్తూ లోపలిమండిగంవద్దకెళ్ళాను.

అప్పటికే నా రాక పరిచారికలద్వారా ఆమెకు తెలిసిపోయింది. నాకేక వింటూనే ఆమె గబగబ బయటికొచ్చింది. నన్ను కౌగలించుకొని, లలాటాన్ని ముద్దాడుతూ గద్గదికంగా అన్నది:

"బిడ్డా! సంవత్సరాల తరబడి నీ కబురే తెలియలా. ఈ మధ్యనే గణ మహోత్సవానికి వైశాలి కెళ్ళారు. మల్లిక అక్కయ్య విచారపడుతూ నీక్షేమమే తెలియలేదని చెప్పింది. ఒరే అబ్బాయీ! నువ్వు యిల్లు విడిచిపెట్టిపోయి ఒక పుష్కరం అయిందికాదూ?"

"లేదు పిన్నీ! పదేళ్ళే."

"పదేళ్లైనా ఒక యుగమే నాయనా! సోమకూడ దిగులుగానే వుంది". బిడ్డా! నీవు వర్తమానం చెయ్యటానికి వీలుపడలా; మల్లిక అక్కయ్యకూతురు నాకు కోడలయింది. శూరసేనుడు, సోమ పెళ్ళాడేందుకు మమ్మల్ని అనుమతి కోరినప్పుడు నేనూ, మీ బాబాయి పొందిన సంతోషానికి మేర లేకపోయిందంటేనమ్ము. సోమ, శూరసేను లిద్దరూ నీకు వైశాలిలోనే కన్పిస్తారు. సరేగాని, నాయనా! నీ ముఖం వాడిపోయిందేం! ఒసే కాళీ! మా అబ్బాయి డస్సిపోయి వుండటం కనపడటంలేదటే? తొందరగావెళ్లి లడ్లు, పాలు — "

ఇంతలోనే బాబాయి వచ్చాడు. ఆయన మధ్యలో అందుకొని "కొడుకు కొక్కడికి లడ్లు పెట్టుకోవటమేనా, కోడలుసంగతికూడ ఏమైనా ఆలోచించు తావా?" అన్నాడు.

"కోడలు! ఏం బిడ్డా! పెళ్లాడి, కోడల్ని కూడ తీసుకొచ్చావా?"

"మరి? అబ్బాయి పెళ్లిచేసుకొని పిల్లనికూడా తోడుకొచ్చాడు. మేమిద్దరం కోడలికి, మిగతా అతిథులకు స్వాగత మివ్వటానికి వెడుతున్నాము. మధ్యాన్నపు భోజనాది ఏర్పాట్లనుగూర్చి సునీథునితో చెప్పాన్లే. అయినా పని నీది శుక్లా! కోడలికి ఏం మర్యాదచేస్తావో! మనం వెళ్దాంరా అబ్బాయి! వారు యెదురు చూస్తుంటారు. సుంకాధికారి వారిని గౌరవించి విశ్రమింపజేసేవుంటాడు; వారినిక్కడికి తీసుకొచ్చి మర్యాద చెయ్యాలిగా."

మే మిద్దరము సేనానాయకుని సౌధాన్నుంచి బయల్దేరి రేవుకు వెళ్లాం. మేం వెళ్ళేసరికి సుంకాధికారి తన పూరిపాకలో సుఖాసీనులను గావించి పాలు, మిఠాయిలతో తక్షశిల మిత్రులను సత్కరించుచున్నాడు. ఒకప్రక్కన సేనాని తిష్యుడు నావలనుండి సామాను దింపించి బండ్లకెక్కించు తున్నాడు. సైంధవాశ్వములు తీరమున నున్న పచ్చని గోధుమ నతి ఆప్యాయంగా మేస్తున్నాయి. అక్కడ మిత్రులు అల్పాహార మారగించుతూండటంచూచి సేనానాయకుడు "అయితే వత్సా! నీ పని రెండింటికీ చెడిన విధమైందే! అక్కడ పిన్ని పెట్టిన

ఫలాహారమూ చెయిజారిపోయింది. ఇక్కడ మనోరథుని విందులోనూ పాల్గొన లేకపోయావు” అన్నాడు.

మనోరథుడు - సుంకాధికారి - సేనానాయకుని మాటలువిని “లేదు మహాశయా! కోడలిని భామ లోపలికి తీసుకొని వెళ్ళింది. ఆడవాళ్ళకు ఆడవారియందె అభిమాన మెక్కువగదూ! చిరంజీవి సింహునికిగూడ అక్కడే విందు” అన్నాడు.

“మరి మా ఆవిడ లడ్లూ పాలూ అలాగే వుండిపోతాయే. సరే! అబ్బాయ్! నువ్వు లోపలికెళ్ళు” అని తక్షశిల వీరులవైపు తిరిగి “ఆప్తబంధువులారా! సేనానాయకుడు - రోహిణుడు లిచ్ఛవీగడ్డమీదికి మిమ్మాహ్వానించుతున్నాడు. మీరు మా ఈ వజ్జిభూమిని తమ గాంధారభూమిగానే భావించండి. ఇక్కడ తమ కేవిధమైన కష్టంకలుగలేదుగద?” అని పరామర్శచేశాడు.

పాలు తాగటం పూర్తిఅయింది. నేను సేనానాయకుడికి కపిలునితో పరిచయంచేశాను. రోహిణుడతన్ని కౌగలించుకున్నాడు. తర్వాత ఆయన వరుసగా తొమ్మిదిమంది గాంధారవీరులనుకూడ కౌగలించుకొన్నాడు. లిచ్ఛవీ యువకులను ఆలింగనంచేసి, వారి లలాటములను ముద్దాడి అందరిని కుశలప్రశ్న లడిగాడు. మనోరథుడు నన్నింట్లోకి తీసికెళ్ళాడు. వారిది తాత్కాలిక కుటీరమైనా చాల శుభ్రముగాను, సుఖదాయకంగాను వుంది. మాపదధ్వని వీనుల్లోపడగానే భామ రివ్వున యెదురువచ్చింది.

“మరదీ! సుస్వాగతం. రా, చెల్లాయి నీ కోసం నిరీక్షిస్తోంది!” అన్నది భామ.

లడ్లు, పాలు అదివరకే సిద్ధంగా వుంచబడినాయి. మేము నల్గురము ఆసీనులమయ్యాము. మనోరథుడు నాకంటె ఒక ఏడాది మాత్రమే పెద్ద. భామ మర[illegible]సను నాపై అధికారం చెలాయించేది. ఆమె తన కపోలాన్ని నా బుగ్గ[illegible]ంచి అన్నది—“మరదీ! నేను నీకోసం పడిగాపులుండి చూచాను; కాని ఏం లాభం. నువ్వు యెన్నాళ్ళకూ రావైతివి. ఇకముసలిదాన్నయి యింకే లిచ్ఛవీకీ పనికిరానేమోననికూడ భయపడ్డాను. ఏంచేస్తాను? పడివుండి లాభంలేదని మనోరథుని చేయిపట్టుకున్నాను.”

“అయితే మాత్రమేం ఒదినా! మా కుటుంబంలోనే వున్నావుగా!”

“అవున్లే మరదీ! భార్య, ఒదినలలో తేడా ఏముందిలే!”

ఆమె మాటలతో రోహిణి చకితాత్మ అయింది. భామ ఆమె చుబుకాన్ని వ్రేలితో అంటి “చెల్లీ! నీకీర్ష్యగా వుందా? సింహాన్ని నీకుకాకుండా నేను కాజేయటంలేదులే. కాజేద్దామనుకున్నా నీముందు నాలాంటి ముసల్ది ఎవరికావాలి?”

మాటల సందడిలో మేమాలస్యం చేయుటంచూచి సేనానాయకుడు లోపలి కొచ్చి - "నేను అతిథుల్ని యింటికి తీసుకెళ్తున్నాను. మీరు తాపీగా రండి. మధ్యాహ్నం భోజనంవేళకే మాత్రం నిక్కచ్చిగా రావాలి. మీపిన్ని లడ్డూలు, పాలు ముందెట్టుకొని యెదురు తెన్నులు చూస్తుంటుంది కూడాను. నే వెళ్ళి నెమ్మదిగా వస్తారని చెపుతానే అనుకో. మనోరథా! మీరిద్దరూకూడ తప్పక రావాలిసుమా?" అని చెప్పాడు.

బాబాయిని చూచి రోహిణి భామకు ప్రత్యుత్తర మివ్వబోయేదల్లా ఆగి పోయింది. నేనామె చేయిపట్టుకొని ముందల హాలులోకి తీసుకొచ్చాను. ఆమె యెవరైనది బాబాయి సులువుగానే గ్రహించాడు. ఆయన ఆవిడ భుజమ్మీద చెయ్యేసి నుదురు ముద్దాడి "బిడ్డా! నీకిదే స్వాగతం! మీయమ్మ - సోమ అత్త - కుక్ల నీకోసం యెదురు చూస్తోంది. అబ్బాయ్ సింహా! త్వరగారండి" అని వెళ్ళిపోయాడు.

అడకత్తెరలాగా నడిచే ఒదిన వ్యాహార మధ్యలో ఆగి-మళ్ళీ సాగింది.

"కోడలా! తప్పనుకోకు. నాట్యమాడుతూ సింహాబుగ్గల్ని ముద్దెట్టుకొనే టంతవరకూ వచ్చింది మాప్రేమ. ప్రియా, మనోరథా! ఈగుట్టు తెలిసి నువ్వు నన్నిప్పుడేవగించుకోవనే ఆశించుతాను."

"రహస్యమూ, ఏవగింపూనా? లిచ్ఛవీయువతీ-యువకులలో ఎవరు ఎవరి కపోలాలను ముద్దాడకుండావదుల్తారు?" అన్నాడు మనోరథ్.

"నువ్వు ఉదారహృదయుడివి మనోరథ్!"

"భామా నువ్విప్పుడు మరదినివదలి భర్తతో కలియబడగోరుతున్నావా? కోడలు యేమంటుందో చూడు."

"ఏమంటుంది? పాపం, భామ చాలవిచారపడి వుంటుంది; ప్రేమించిన ప్రియుడు తక్షశిలకు పరారైపోతే, ముసలితనంలో దొరికిన మొగుడైనా ఆమెను లక్ష్యపెట్టటం లేదను కొంటుంది."

"ఒదినా!" నే నన్నాను-" నువ్వు ముసలిదాన వెప్పట్నుంచి అయ్యా వేమిటి? నాకంటే ఐదేళ్ళుగా చిన్నదానివి. మహా అయితే రోహిణికంటె మూడేళ్లు పెద్దదానవు."

"ఏళ్ళ దేముందిలే మరదీ!"

"తుమ్మెద రెక్కల బోలిన నీ నీలకుంతలాలు అల్లాగే వున్నై. నీ నీడలు తేలే సున్నని బుగ్గలు- ఏవీ, ఒకసారి ముద్దెట్టుకొని చూడనియ్యి" అని ముద్దాడి "ఆఁ అవును, నీ బుగ్గలు అప్పటిలాగే అదే గులాబీ రంగుతో అచ్చంగా అంత మధురంగానూ వున్నై. వణకటం లేదు సరిగదా నువ్వు కర్ర పుచ్చుకొనిఅయినా నడవటంలేదు. చూస్తే దంత మొక్కటీ ఖాళీకాలేదే! నేను నిన్ను- ఒదినా భామా! నిన్ననే వదలివెళ్ళినట్టుగా వుంది. అల్లాగే కనపడుతున్నావు కూడాను."

"ఆఁ, అలా దాటికిరా. నన్నొదిలిపెట్టి వెళ్ళినట్టు నువ్వుకూడా ఒప్పుకున్నావుగద. మరి మనోరథ్ నిత్యమూ వొదిలిపెడ్తానని బెదిరించుతూనే వుండె."

"భామా! నన్నెందుకు కాడించుతావు! నీ మనోరథుని ఎత్తి కుదెయ్యటానికి నీ వెంట్రుక ఒకటి చాలునని నీవు తెలియనూ ? కోడలేమనుకొంటుంది!"

"ఏమను కుంటుందేఁ?" అని భామ రోహిణిని గుండె కదుముకొని "ఈమె నాచెల్లలే గా, అక్క వాగుడుపిట్ట కాబోలనుకుంటుంది. అంతేగదూ కోడలా ? భామ నీ సింహాని తన వలలో - కాక మనోరథ్ అన్నట్టు జుట్టుతో కట్టి - వేసుకుంటుందని భయంగా లేదుగద ?" అన్నది.

"లేదు అక్కా!" రోహిణి నవ్వుతూ అంది- "నీయందు నాకు గట్టి నమ్మకమే."

"కాదమ్మాయి ! కాదు. తర్వాత మోసపోయాననుకుంటే లాభం లేదు. సింహాని నా చేతికి అప్పగించమాకు."

"నన్ను కూడ నీకే అప్పగిస్తానుగా."

"ఊఁ, నువ్వుబలే జాణవే! నీ స్వర్ణకేశాలే నా నీలకుంతలాలకంటే విలువైనవి."

"కాంచనం ఖరీ దెక్కువే కావచ్చు; కాని గట్టిశక్తి యినుముకే వుంటుంది."

"అయితే నువ్వు భయపడుతున్నావన్నమాటే. నా మాటలతో మనోరథ్ కూడ బెదరిపోతున్నా డనుకుంటాను. భయపడకు ప్రియా!" మనోరథుని పెదవులను ముద్దెట్టుకొని "నిన్ను నా పిగలోనుంచి విడుదలచేస్తాలే. మరి, చూడు చెల్లీ! మనోరథుడంటే నాకు పెడమొగమెందుకనుకున్నావు! ఆయనమీసాలు చూచావుగా. ముద్దెట్టుకోబోతే నా పెదిమలకవి గుచ్చుకుంటున్నై. మరిచూడు, మీసంలేని సింహా పెదిమలెంత కోమలంగా వున్నాయో!"

"సరే, నేను రేపే నా మీసాలు తీయించేస్తాలే."

"విన్నావాచెల్లీ! ఇవాళ లేదుగాని, రేపట! తరాలు యుగాలు దొర్లిపోయినా ఈయనకా 'రేపు' రేపే. ఇంతేకాక ఈయనయందు నాకు మరోకోపం కూడావుంది. ఈయన ఏ సరిహద్దులోనో సేనానిగావుంటే ఎంతరాణింపు! కాక యిక్కడ వచ్చేపోయ్యే సామాన్లుతూస్తూ కూచున్నారు. నువ్వేచెప్పు రోహిణీ! ఈయన చేతిలో రాణించేది కరవాలమా, త్రాసా ?"

అప్పుడు నే నన్నాను- "కాని, ఒదినా! యిందులో మనోరథ్ తప్పేముంది ? మాచేతికి ఖడ్గమిచ్చినా, త్రాసిచ్చినా అది మన పంచాయతీయిష్టం. పంచాయతీ ఆజ్ఞాపాలనలో లిచ్ఛవులకు కరవాలానికీ, కాటాకీ వ్యత్యాసం వుండదు."

"నే నడుగుతున్నది నిన్ను కాదు మరదీ! చూస్తున్నావుగా రోహిణీ! మగవారికి తమ పురుషజాతి యందెంత పక్షపాతమో! మన మిద్దరమూకూడ యేకం కావాలి. లేకపోతే 'యిల్లు' 'ఒళ్లు' కూడ గుల్లే."

"అవునక్కా! నాకూ కూడ అలాగే తోస్తోంది. నేను నీతోనే వుంటాను."

భామ రోహిణిని అక్కున చేర్చుకొని చుంబించి "ఇక మనం తప్పకుండా జయిస్తాము. నాకింకో విషయంలోకూడ నీతోడు కావలసిన అవసరంవుంది. ఈ లిచ్ఛవులు మహా గర్వపోతులు. వీరు మమ్మల్ని లిచ్ఛవియాణులుగానే చూడటం లేదు. కొందరు యువతులము మగధకు వ్యతిరేకంగా పోరాడేందుకు మమ్మలను కూడ సైన్యంలో చేర్చుకోమని అడిగాము; కాని, ఏవేవో నెపాలతో మా కోరికను నిరాకరించుతున్నారు."

"అయితే అన్నా, మనోరథ్! మగధవల్ల యుద్ధంవచ్చే భయమున్నదా ఏం?" నే నడిగాను.

"ఓ, కావలసినంత. లిచ్ఛవీలు యావన్మందీ సాయుధులై విన్యాసాలు జరుపుతున్నారు. ఏ క్షణంలోనైనా యుద్ధప్రకటన జరుగవచ్చు. వాగ్మతి, గంగాతీర ప్రాంతాల్లో మగధగూఢచారుల్ని చాలమందిని బందీలుగా పట్టుకొన్నాము. అందుకు ప్రతీకారంగా బింబిసారుడు మన వర్తకులను నిర్బంధంలో వుంచాడు."

"అయితే నేను మంచితరుణంలోనే వచ్చానన్నమాట."

"నిస్సందేహంగాను. త్వరలో వృద్ధలిచ్ఛవీ నెవరినైనా నా స్థానంలోకి పంపుతారు; ఇక నాకు మళ్ళీ కత్తిని చేతపట్టే అవకాశం లభిస్తుంది."

భామ తనపతి పెదవులను చుంబించి ప్రసన్నవదనయై అన్నది—"ప్రియా! మరి నాకీవిషయాన్ని యిదివరకే చెప్పలేదేం?"

"ఆడుదానవుగా."

"అవున్లే, మా నోటమాట దాగదుకాబోలు. రోహిణీ! చూచావా పురుషుల మనోమాలిన్యం!"

"నేను ఓడి నువ్వే జయించావు భామా! నువ్వు మాటిమాటికి నన్నెత్తి పొడుస్తున్నావు. మరి నాకొక్కసారేనా అవకాశం యివ్వండేవా!"

"ప్రియమనూ! ముందు నవ్వులాట నేర్చుకో."

"నేర్పే గురువో!"

"ఈమాత్రానికి యితరత్రా దేవులాడవలసిన అగత్యంలేదే. ఇంట్లోనే వుండెగా నీభామ. సరేగాని అలాంటి సువార్త నాకు చెప్పకుండా దాచావేం?"

మనోరథ్ చేతులు జోడించి "క్షమించుదేవీ! నీదాసునితప్పు మన్నించు. నాపదవీపరివర్తన వర్తమానం తెలిసి యెంతసేపో కాలేదులే."

భామ అతన్ని ప్రక్కవాటుగా వాటేసుకొని అన్నది—"మనూ, నామనూ! నేనెప్పుడైనా నీపై కోపగించుకుంటానా? నీమాట ప్రకారం వైశాలికి వెళ్ళిన

తరువాత మా మహిళాదళానికి సైనికశిక్షణనిచ్చే విషయంలో అధికారులను ఒత్తిడి చేసి ఒప్పించాలిసుమా. (రోహిణివేపు తిరిగి) ఏంచెయ్యను రోహిణీ! నేను పంచాయతీసభలో సభ్యురాలిని కాదుగాని, లేకపోతే వారితో వాదించి ఒప్పించే దాన్నే. చెల్లీ! సేనలో జొరబడిన దర్మిలా మనం పంచాయతీ ప్రాతినిధ్యాని క్కూడా ఆందోళన సాగించాలి. ఏంరోహిణీ! నీ అభిప్రాయం ఏమిటి?"

"నేనూ నీతోపాటే అక్కా! కాని, ముందు మనం మన సైనికశిక్షణను గూర్చి కార్యం సాధించాలి."

"ఈ విషయంలో మేము పూర్తిగా మీతో సహకరించుతాము" అన్నాం నేనూ, మనోరథుడూ.

భామ తన మగని భుజంమీద చెయ్యేసి అన్నది-"ప్రియా! రణరంగంలో వీర మరణంచెందిన తమ ప్రియ భర్తలయం దపారమైన ప్రేమ వున్నప్పటికీ, లిచ్ఛవీ కాంతలు యుద్ధానంతరం మళ్ళీ పెళ్ళాడి నూతనభర్తలతో కలసి సంతానం కనుటకు విఘ్నలేని వారవుతున్నారు. సతీ - పతులు కలసి జీవించటానికి ఎట్లాధి కార మున్నదో అట్లే కలసి మరణించటానికీ హక్కుండాలి." వేళ మించుతూండ టము గమనించి "సరే, యిక వెళ్దాం రోహిణీ! శుక్లపిన్ని తన కోపమంతా నాపైన చూపుతుంది. "ఆ మాటల పోచికోలే మాటల్తో కట్టివేసింది అంటుంది. మనం జాగు చేయటం చూచి యిక్కడికి వచ్చిపడినా ఆశ్చర్యముండదు."

మేము నలుగురము పటకుటీరంలోనుంచి బయటికొచ్చాము. మనోరథుడు తన భటులకు పనిచెప్పినపిమ్మట పిన్నిగారింటివేపు సాగిపోయాము. మా కోసం వస్తూన్న కాళి మాకు దారిలో యెదురుపడింది. భామకదిన "చూచారా! ఆ దాసి మనకోసమే వస్తోంది. వేగిరం నడవండి" అంది.

ఆనందాశ్రువులు రాలుస్తూ పిన్ని రోహిణిని ఆలింగనం చేసుకొన్నది. ఆమె ముఖంలోకి తేరచూచి పెదవులను ముద్దుపెట్టుకొన్నది. రోహిణి ముఖారుణిమ ఆవిడ మాతృ[illegible]మానుభూతితో పరవశమైనట్లు తెల్పుతోంది.

[illegible]స్వాగతం బిడ్డా! నా బంగారుతల్లి దారిపొడుగునా ఎంత శ్రమపడిందో! పదండినాయనా! మీరిద్దరూ బాబాయిదగ్గరకెళ్ళండి. రా, కూతురా భామా! లోపలికెళ్దాం" అని పిన్ని రోహిణినివాటేసుకొని లోనికి దారితీసింది.

బాబాయి పడగుర్రాలనీ, బండ్లనీ బయల్దేరగొట్టాడు. మా హయాలు రెండూ అశ్వశాలలో విశ్రాంతి తీసుకుంటున్నై. మేమిద్దరం వెళ్ళేసరికి తక్షశిల నుంచి వచ్చినవారి మధ్యకూచుని ఏమిటో చెపుతున్నాడు. అందరూ పకపక నవ్వుతున్నారు. తివాసీపైన ఆసీనుడైవున్న బాబాయి మమ్మల్నిచూచి అన్నాడు.

"రా అబ్బాయి! క్రితం పర్యాయం మనం మగధ సైనికుల ప్రాణాలను యెలా కాపాడిందీ, వాళ్ళు నోళ్ళుతెరచి ప్రాణభిక్షకై మనల్నెట్లు ప్రాధేయ పూర్వకంగా అర్థించినదీ మీనాన్న - అర్జున్ మగధసేన యావత్తుకూ పద్మ

బంధంలో బంధించిన విధమూ చెబుతున్నాను. నేను అర్జున్‌వద్ద వుపసేనానాయకుణ్ణి. యుద్ధంలో మేమే జయించాం; కాని, మాకు బందీగావున్న మగధ సైనికుడొకడు వెనుకపాటున మా సేనానాయకుని పొడిచాడు. వానినైన ప్రేమచూపి మా నాయకుడు అతిచనువిచ్చాడు. అయితేయేం, ఆ నీచుడు కృతఘ్నుడై ఉపకారినే హత్యచేశాడు."

మేము సల్లాపాలాడుతూంటే లోపల పిన్ని కోడలిని మర్యాద చేస్తోంది. ఆ రాత్రి మేము కలసికొన్నప్పుడు "రోహిణీ! నువ్వు వైశాలికి నాతో వస్తావా? లేక ముందే వెడతావా?" అని అడిగాను.

"ముందు వెళ్ళను. నా వుద్దేశ్యాన్ని మార్చుకున్నాను."

"మార్చుకున్నావా?"

"తల్లిపిన్ని కూడ అమ్మవంటిదేగా. అందువల్ల ఇప్పుడే యిక్కడినుంచి వెళ్ళిపోవాలని లేదు"

"అయితే అమ్మలిద్దరినీకూడ గుప్పిట్లో పెట్టుకోవాలను కొంటున్నావన్న మాట!"

"నిజమే ప్రియతమా! పిన్నిస్వభావం చాలా మంచిదీ, మధురమూను. ఆవిడ మాటిమాటికీ ఆనందాశ్రువులు రాల్చుతూ నన్ను ముద్దాడుతూంటే నిజంగా నాకు అమ్మజ్ఞాపకం వచ్చింది. ఈ మూణ్ణెల్ల మాతృవియోగ దుఃఖం యిట్టే ఉపశమించిది."

"ఆఁ! లిచ్ఛవీ గడ్డమీద పన్నెండు ఘటికలు గడిపావో లేదో అప్పుడే మమత యేర్పడిందన్నమాట!"

"ఎందుకాకూడదు; రాత్రింబగళ్ళు నవ్వించటంలో భామక్కయ్య మంచి ప్రవీణ. మరి పిన్ని మాతృసమానంగానే వుండె. ఇక్కడినుంచి గుర్రం మీదనే ప్రయాణంచేద్దా మనుకున్నాను; గాని, యిప్పుడా తలంపుమాని పిన్నితో రథం మీదనే ప్రయాణం చేద్దా మనుకొంటున్నాను."

"రథంమీదనా?"

"అవును, పిన్ని నన్ను తనతోనే తీసుకెడుతానన్నది."

"ఎప్పుడు?"

"ఆమెకిష్టమైనప్పుడు. తక్షశిల సౌహార్దప్రతినిధుల స్వాగత సమయానికి ముందే వైశాలికి చేరాలనుకుంటోంది.

"నువ్వు పిన్నితో వెళ్ళిపోతే మరి నేను—"

"నీకు ఈర్ష్యగా వుందా?"

"పిన్నిమీైన నాకీర్ష్యలేదు; ఉండాల్సింది నాకాదు; మనోరథ్‌కి."

"లేదు ప్రియా! భామఅక్కయ్యని వదలిపెట్టటానికి మనసొప్పటంలేదు. పిన్ని ఆమెను ప్రేమిస్తుంది; అయితే భయపడుతుందికూడాను."

"భయందేనికి ?"

"భామ నోటికి జవాబేలేదంటారు. పని చెయ్యటానికూడ విసుగూ విరామం యెరుగదట మనం రాగానే పందిమాంసం వండింది. మధ్యాహ్న భోజనం అయినతర్వాత మళ్లీ సాయంత్రం భోజన - పాన - గాన - నృత్యాల యేర్పాట్లన్నీ తానే సాగించింది. తానొక్కక్షణం కూర్చోనలేదు సరిగదా, తతిమ్మావాళ్ళనుకూడ కాళ్ళుముడవనివ్వలేదు. ఉల్కాచేలం లిచ్ఛవియాణులు యావన్మందీ ఆమె చేసన్నతో ఏపనైనా చేయటానికి సిద్ధంగావుంటారు. తానురమ్మన్నట్టు ఇంటింటికి కాళీదాసిని పంపిందోలేదో ఒక్కగంటసేపట్లో అమ్మలక్కలంతా వచ్చి హాజరయ్యారు".

రోహిణి రోమరోమాన్నుంచి ఆనందం పొంగి పొరలుతూన్నట్టు కనిపించింది. మూణ్నెల్లపాటు వాడిపోయిన తీగకు శ్రావణమాసపు మేఘం జీవమిచ్చినట్టు రోహిణి ముఖం కళకళలాడుతోంది. సేనానెను బిగియార కౌగలించుకొని "ప్రియా ! లిచ్ఛవీగడ్డ నిన్నాత్మీయను గావించుకొనుటలో కొంతవరకు కృతకృత్య అవగల్గిందని తెలిసి నాకెంతో సంతోషంగా వుంది" అన్నాను.

"కొంతవరకేకాదు ప్రియా ! పూర్తిగానే. కన్యాకుబ్జ రాకుమారిని చూచినప్పుడు యిక్కడివారితో కలసిపోవటానికి కనీసం ఒక యేడాదైనా పడుతుందనుకొన్నాను. అందుకోసం మానసికంగా సంఘర్షణ జరుగుతుందనికూడ తలిచాను."

"మరి?"

"ఒక్కరోజులోనే నేను లిచ్ఛవీకాంతనైపోయాను. "వైశాలి తూర్పు తక్షశిల" అన్న నాన్నగారిమాట నిక్కమే. ఈ మాట నేను పిన్ని, భామలను చూచి మాత్రమే అనటంలేదు. ఇవాళ సాయంత్రం యిక్కడచేరిన లిచ్ఛవీకాంతలనెల్లరిని చూచి పీకు కన్యాకుబ్జ స్త్రీలకు పూర్తిగ భిన్నస్వభావినులని గ్రహించాను [illegible]ని చూచుటతోనే వైశాలిలో కన్యాకుబ్జం వాసనయినా వుండదని తెలిసిపోయింది."

"నిజమే; కాని, దాసీలవిషయంలో నీ భావన ఏమిటి ?"

"కాళీదాసిలాంటివారిని గురించేనా ?"

"అవును, కన్నదాసునివంటివారి విషయంలో కూడాను."

"వీరినేగా అమ్మి కొనవచ్చునని చెప్తూండేవాడివి ?"

"ఊఁ."

"వీరిని చూస్తే జాలికలుగుతోంది. వీళ్లు మానవులుగా చూడబడక హీనంగా చూడబడుతున్నారు. బహుశః మానవులుగా తయారుచేసే తెరవు లేకపోయివుండాలి; లేకపోతే యింత మృదుస్వభావులగు లిచ్ఛవులు వారికొరకు ప్రయత్నించివుండేవారే."

"బలేగా గ్రహించావు! వీళ్ళకోసం ఏంచెయ్యటానికీ శక్యంకాకుండా వుంది. ఏ కొద్దిమందో అయితే యేదైనా చేసేందుకు వీలుండేది. కాని, లిచ్ఛవుల కంటె లిచ్ఛవేతరులే అధికసంఖ్యాకులుగా వున్నారు."

"లిచ్ఛవేతరులా ?"

"అవును వజ్జిదేశంలో వారు లిచ్ఛవులకంటె ఎంతో తక్కువలేరు. వారిలో నౌకరులే కాదు, బ్రాహ్మణులు, వైశ్యులు మున్నగు వారెందరో ధనికవర్గాలవారు ఉన్నారు. వారికి పంచాయతీపాలనలోనూ అధికారంలేదు, యుద్ధంలో మరణించవలసిన భయమూలేదు; అయినా వారికి కావలసినంత భూమివుంది. వ్యాపారం కూడ లక్షలమీదనే. వారు స్వతంత్రులై సుఖజీవనం గడుపుతున్నారు. దాస-దాసీలకు విముక్తి కల్గించాలంటే ముందు వారే అభ్యంతరం చెపుతారు. అంతేకాక మాకు తూర్పున, దక్షిణాన - రెండుప్రక్కల మగధరాజ్యంవుంది. ఎక్కువమంది అక్కడినించి వచ్చి ఇచ్ఛాపూర్వకంగా అమ్ముడు పోయారు."

"ఇంతమంది లిచ్ఛవేతరులు యిక్కడి కెలావచ్చారా అని ఆలోచించుతున్నాను ప్రియా."

"అది లిచ్ఛవుల న్యాయప్రియత్వం, దయాస్వభావాల ఫలితమే. మా పూర్వులు మొట్టమొదట్లో యీ వజ్జిభూమిపైకి వచ్చినప్పుడిదంతా మహారణ్యంగా వుండేది. వారందులో తమ ఆవుల్ని, గొర్రెలను మేపుకొని పోషించేవారు. సింహాలు, వ్యాఘ్రము, ఖడ్గమృగాలు, ఏనుగులతో నిండియున్న ఘోరాటవిని ఛేదించి ఒకగ్రామాన్ని నిర్మించారు. ఊరికి నలువేపులా కొయ్యప్రాకారాలను నిలబెట్టారు క్రమంగా జనం వృద్ధిఅయి, నూతన గృహనిర్మాణానికి ప్రాకారాలలోపల చోటులేకపోయింది. అందువల్ల ప్రాకారాన్ని పెంచి విస్తరింపజేశారు. ఆవిధంగా అనేక తడవలు విస్తరింపబడుటచేత దానికి 'వైశాలి' అని పేరేర్పడింది. వైశాలిలోని లిచ్ఛవులకమతాలుకూడ క్రమంగా అరణ్యంలోకి చొచ్చుకొనిపోయి విస్తరింపసాగాయి. వారి పశువులును తగినంతగా వృద్ధిచెందాయి. పూర్వులరక్తంతోపాటు వారి శౌర్యంకూడ యిప్పటికీ లిచ్ఛవుల ప్రతి రక్తనాళంలోను నిండివుంది. వీరు చుట్టుప్రక్కల రాజులలాగా భోగ - విలాసాలకు అలవాటు పడలా. మా యీ గడ్డమీద సత్య - న్యాయపాలన స్థిరపడింది. శరణుజొచ్చినవారికి అభయహస్తమిచ్చి కాపాడుటే తమ కర్తవ్యంగా ఎంచుతారు. పీడితులగు బ్రాహ్మణ, వైశ్యులనేకులు యిక్కడికిచేరి, వీరిని శరణు వేడారు. లిచ్ఛవులు వారికి అభయదానంచేసి సేద్యానికి భూములు, పశువులను మేపుకోటానికి తమ స్వాధీనంలోవున్న అటవీ ప్రదేశాల్లోనికి ప్రవేశమూ యిచ్చారు. వారి వాణిజ్యాన్ని తమ బాహుబలంతో కాపాడినారు. ఈ విధంగా లిచ్ఛవేతర వంశీయులు యిక్కడ పోగుబడ్డారు. పరిపాలనలో వారు మాకు ఆధీనులే; కాని, మగధ, కోసల రాజ్యాలలోకంటె అధిక స్వతంత్రులు.

ఇక్కడ స్థిరపడిపోయి సుఖజీవితం గడుపుతూన్నవారికి క్రమంగా వజ్జిదేశమందు అభిమానంకూడ ఎక్కువవుతూ వచ్చింది. వీరుకాక కర్మకారులుకూడ చెక్కమంది పరివార సహితంగావచ్చి స్థిరావాసము ఏర్పరచుకొన్నారు. కూలికి స్వేచ్ఛాపూర్వకంగా పనిచేసి బ్రతుకుతారు. లిచ్ఛవులకంటె లిచ్ఛవేతర ధనిక వర్ణములవారికే దాసులతోడి సంబంధం మిన్నగా వుంది. కాబట్టే దాస్యపద్ధతిని నిర్మూలించుట మా వశంలో లేకుండా పోయింది. అయితే దాసులపట్ల అక్రమంగా ప్రవర్తించేవారిని శిక్షించక మానము. మా దేశంలోని బానిసలను బయటి వారికి విక్రయించకుండా నిషేధించాము. అసలిక్కడి బానిసలెవరూ అన్యత్ర అమ్ముడుపోవటానికే యిష్టపడరు. దీనినిబట్టి బానిసలపట్ల లిచ్ఛవులెంత ఉదారంగా వుంటారో నీ వూహింప వచ్చును."

"నిజమే ప్రియతమా! ఇక్కడ వివిధశాఖలు చిలవలు, పలవలువేసి బాగా అల్లుకొనివున్నాయి. గాంధారంలో అట్లాకాక ఒకేజాతి, ఒకేరంగు, ఒక్కటేభాష."

"అందువల్లనే అక్కడ సమానత్వముకల్గివుండటం సులువు; మరి యిక్కడి బానిసలువేరు, స్వతంత్ర కర్మకారులువేరు; బ్రాహ్మణ, వైశ్యాది వర్ణాలు వుండనేవున్నై. ఎల్లరిని లిచ్ఛవులనటానికి వల్లకాదు. అయితే లిచ్ఛవులలోని తొమ్మిది తెగలలోమాత్రం ఎలాటి భేదభావమువుండదు."

"తొమ్మిది తెగలా?"

"అవును, జ్ఞాతృ, దీర్ఘవాశి నవగోత్రాలున్నవి. వీరంతా ప్రథమపూర్వుని తొమ్మండుగురు సంతానపు వంశములవారయి వుంటారు."

"మరి-ప్రియా!-ఇన్ని వివిధ జాతులవారుండగాకూడ లిచ్ఛవుల్లో ఆర్య వర్ణం ఎలా నిలువగలిగిందో?"

"అందునిమిత్తం మా నియమాలు చాల కఠినంగా వుంటాయి. లిచ్ఛవేతర తండ్రికి, తల్లికో కలిగిన సంతానాన్ని లిచ్ఛవులుగా సమ్మతించము. లిచ్ఛవీ దంపతులకు జన్మించి దీప్తివంతమైన గౌర వర్ణము కలిగియున్న బిడ్డలకే వైశాలి యందలి అభిషేక పుష్కరిణిలో అభిషేకార్హత వుంటుంది."

"ఇక్కడి కొచ్చిన లిచ్ఛవీ యువతుల్లో ఎవరి కుంతలాలూ పింగళవర్ణంగా లేవే! ఎక్కువమందివెంట్రుకలు భామ నీలకేశాలనే పోలివున్నాయి; అయితే శరీరచ్ఛాయమాత్రం మన రంగులాగానే వుంది."

"అవునవును; ఇందుకోసం కూడ లిచ్ఛవీ గణము (పంచాయతీ) అతికఠిన నియమాలను అమల్లో పెట్టవలసివచ్చింది. తమ కన్నబిడ్డల విషయంలో కూడ వారప్పుడప్పుడు చాల నిష్ఠురంగా వుండవలసి వస్తోంది. తమ రక్తపారిశుద్ధ్యాన్ని స్థిరంగా కాపాడుకొనేందుకు ఎట్టి కఠిననియమాలను పాటించడానికైనా వెను దీయరు."

"ఇంత నిష్ఠురమైన నియమవిధానం నాకు బాగుండలేదు. ప్రియా! కాళిని 'ఒసేకాళీ' అని పిలుస్తూండగా వినటం నా కెంతో కర్ణకఠోరంగా వుంది."

"అసలు 'కాళి' అన్న దామెపేరే కాదు ప్రేయసీ! దేహం నల్లగా వున్నందువల్లనే స్త్రీని 'కాళి'యనీ, పురుషుని 'కాక' అనీ పిల్వటం జరుగుతోంది. అసలు పూర్వము లిచ్ఛవేతరుల కాశ్రయ మివ్వకుండా వుంటేనే బాగుండేదేమోనని నే నాలోచిం చుతూ వుంటాను."

"అది మరీ క్రూరత్వం!"

"నీవు చెప్పేది యథార్థమే. ఈ సమస్యను మనంకాదు—చరిత్రే విడదీయాలి. పోనిద్దూ, యీ సారంలేని విషయాన్ని. ప్రేయసీ రోహిణీ! ఇవాళ నృత్యం ఎలా వుంది?"

"భామక్కయ్యే - ప్రియతమా! - అన్ని విద్యల్లోను ఆరితేరిన చెయ్యి లాగుంది. నీతో చేసిన నృత్యం పేరు?"

"త్రిపది!"

"అవును, త్రిపదే. ఆవిడ కటి, కాలుసేతుల విన్యాసం చూస్తుంటే నిజంగా నాకు ఈర్ష్య కలిగింది. నువ్వు చెమటతో తడిసి ముద్దయినా ఆ భూతం సిన్నొదలందే!"

"భూతం ఎవరు?"

"అది ప్రేమతో పెట్టుకున్న పేరులే. ఇంకా అక్కయ్యని ఎదురుగా ఆ పేరుతో పిలువలేదుగాని, ఆమె నన్ను నెత్తిమీనెక్కించుకొంటున్న చనువును బట్టి ఎప్పుడో ఒకప్పుడు పిలువకమానను."

"అయితే ఆమె భూతమనిపించుకొనేందుకు ఒప్పుకుంటుందీ? భామ సామాన్యస్త్రీ కాదు రోహిణీ! ఆమె 'అసామాన్య' పదవిని స్వీకరించడానికైతే సిద్ధంగానే వుంటుంది. సరేగాని మరి ఆవిడ రూప-సౌందర్యాలో?"

"భామ తక్షశిలలోని ఏ సుందరాంగికీ తీసిపోదు."

"ఇది పక్షపాతం రోహిణీ! ఆమె మూడేండ్లక్రితం వరకు మాత్రమే వైశాలిలో అందగత్తె లందరిలోను మణిగా వుంది."

"ఏమిటి ప్రియా! సౌందర్యంలో సర్వప్రథమురాలా! అవును, ఆమె కుంతలాలెంత నల్లగా, కాంతివంతంగావున్నై!"

"అందుకు నూనెరాయటం కారణమై యుంటుంది."

"నా శిరోజాలకు కూడ తైలం రాసుకోమని చెపుతోంది. అది జిడ్డుజిడ్డుగా వుంటుందే, ఎట్లారాసుకుంటారో!"

"తలగడ మురికైపోతుంది కూడాను రోహిణీ! తానమాడేముందు రాసుకొని, శికాయతో తోమితే నష్టమేమీ వుండదు."

"కాని, నా వెంట్రుకలుకూడ నల్లబడతాయేమొ?"

“నలుపెక్కుతాయని భయంగా వుందా?”

“భామ వెంట్రుకల్లాగా అంత నల్లబడితే నాకేమీ అభ్యంతరంలేదు.”

“నా బంగారుపుబొమ్మ!” అని నవ్వుతూన్న ఆమె అధరాన్ని ముద్దాడి నేనన్నాను— “మనం యింకా ఐదురోజులవరకు యిక్కడే వుండాలి.”

“ఈ ఐదురోజుల్లోను యిక్కడి వారితో బాగా పరిచయం చేసుకుంటాను.”

“నీ గాంధారస్వరానికి, నృత్యానికి వీరి మెప్పు పొందాలని చూస్తున్నావులే! వైశాలినుంచి వుత్తరం వచ్చింది. అక్కడ సన్మానానికి ఏర్పాట్లు మొదలెట్టారు. సౌహార్దసంఘానికి ఆదరసత్కారాలవిషయంలో ప్రత్యేక శ్రద్ధవహించవలసినదిగా సేనానాయకునికి తెలిపారు. మనం బయల్దేరవలసిన తిథిని గురించి రేపు మళ్ళీ జాబువస్తుంది. నువ్వు పిన్నితో రథంలోనే ప్రయాణం చేస్తావుగదూ?”

“అవును, నేను పిన్నితోనే వెడతాను. ఈలోగా వృద్ధసుంకరివస్తే భామ కూడ మాతో బయల్దేరుతుంది.”

“అయితే నువ్విక్కడినుండే ఒక సైన్యాన్ని తయారుచేసుకొని బయల్దేరుతావన్నమాట!”

“మీరీర్ష్యపడకండి. భామ, నేను చల్లగావుంటే అచిరకాలంలోనే మీరు లిచ్ఛవియాణుల సైన్యాన్నిచూస్తారు. ఆడవాళ్ళు కేవలం పిల్లల్నికనటానికే కాదని గ్రహించుతారు.”

“సంతానాన్ని కనటం చెడ్డపనికాదు రోహిణీ! పిచ్చుకలజంట బిడ్డలను కనటానికి చేసే సన్నాహం నీ వెప్పుడైనా చూచావూ! వాటి ప్రణయలీల, కిచకిచలు, తర్వాత తల్లిదండ్రులు కావటానికి సన్నాహం! పెంటి, పోతుపిచ్చుకలు రెండూ ముక్కులతో గడ్డిపరకలు, నార, పీచు యేరి తెస్తాయి. కొత్తగా గూడు నిర్మిస్తాయి. అందులో ఆడపిచ్చుక గుడ్లు పెడుతుంది. పొదుగుతుంది. మగది వాటి[illegible] కాపాడుతూంటుంది. యథాసమయానికి గుడ్లు చిట్లి చిన్ని చిన్ని పిల్లలు బయటికొస్తాయి. ‘చేవ్ చేవ్’ అంటాయి. పిచ్చుకలజంట ఆనందంతో పొంగిపోతాయి. పిమ్మట బయటికి ఎగిరిపోయి పిల్లలకోసం వంతులవారీగా గింజలనో, క్రిములనో తెస్తాయి. తలిదండ్రుల్నిచూచి పిల్లలు కేరింతలు కొడతాయి. పెద్దపిచ్చుకలు తమ ముక్కులతో ఆహారాన్ని పిల్లలనోళ్లకందించి, మళ్ళీ ఎగిరిపోతాయి. చిన్న జీవాలయినా, పిచ్చుకలజంట దాంపత్య జీవితాన్నిగూర్చి మనకు చక్కని పాఠం నేర్పుతున్నాయి.”

“అంతేనా? శత్రులెవ్వరైనా వస్తే అవి రెండూ ప్రాణానికి తెగించి, ఎదిరించి పోరాడవూ?”

“అవును, ప్రియరోహిణీ! ఆ విషయంలో నేను నీతో పూర్తిగా ఏకీభవించుతాను. నువ్వు యిచ్ఛాపూర్వకంగా ఒక తీయనిముద్దిస్తే_నేను పంచాయతీ

సభలో లిచ్ఛవీ స్త్రీ సైన్యాన్ని తయారు చేయటాన్ని గూర్చిన ప్రస్తావనను శాయ శక్తులా సమర్థించుతాను."

రోహిణి నా పెదవులను ముద్దాడుతూ "తుదకు లంచం పుచ్చుకొనేగా!" అంది.

"లంచం కాదు ప్రేయసీ! నీచుంబనం నా కా వాగ్యుద్ధంలో జయిం చేందుకు శక్తిని చేకూర్చుతుంది."

చాల ప్రొద్దుపోయిన పిమ్మట మేము శయనాగారంలోకి చేరుకున్నాము. అక్కడ కూడ మళ్ళీ చాలసేపు కబుర్లుచెప్పుకొన్నాము. తర్వాత పట్టినగాఢ నిద్ర వల్ల పొద్దున నేను లేచేసరికి ప్రొద్దు బారెడు పైకెక్కింది. అప్పటి కింకా రోహిణి నిద్రపోతూనే వుంది. నేను గప్‌చిప్‌గా మంచంమీద నుంచిలేచి బయటి కొచ్చాను.

మేము మూడోనాడు బయలు దేరవలసినట్టుగా మర్నాడే జాబు వచ్చింది.

మిగతా మూడురోజులు ఉల్కాచేలంలో మాకు తెలియకుండానే గడిచి పోయినై. ఒకనాడు ఒకరి ఇంటివద్ద విందయితే, మరోపూట వేరొకరి గృహంలో ఫలహారం. ప్రతిరాత్రి బాబాయిగారి యింట నృత్య, గానముల కోలా హలం. భామలాగా మాటలు గుప్పకపోయినా కొత్తదనంపోయి రోహిణి నలుగురితోను చనువుగా మెలగుతోంది. భామ రోహిణికి ప్రియసఖి అయింది. వారి యీ స్నేహం ఆజన్మాంతం వర్థిల్లుతూనే వుంది. గాంధారపడుచు ఆగమన వార్త చుట్టుప్రక్కలనున్న కమతాలకు కూడ వ్యాపించింది. మూడోనాడు ఆ కమతాల్లో కాపురముండే తరుణీమణులందరూ గుంపులుగావచ్చి గుమికూడారు. ఆనాడు ఉల్కాచేలం సుందరీమణుల నృత్య - గాన ప్రదర్శనశాలగా మారి పోయింది. బయటినుండి వచ్చిన ఆ అందగత్తెలలో ఉల్కాచేలానికి క్రోసు దూరాన తూర్పుగా వున్న 'దీర్ఘి' అనే గ్రామానికి చెందిన పడుచొకతె అందరి దృష్టినీ ఆకర్షించింది. నల్లగా వుంగరాలు తిరిగిన ఆ యావనాంగి నేలపాటి కుంతలాలు, నీలికాంతులీనుతున్న చారడేసికళ్ళు, తీర్చిదిద్దినట్టున్న కోమలాంగ ములు, బిగువైన కుచద్వయము, చతురపాదయుగళము ప్రత్యేకాకర్షణీయములు. ఆ లతాంగితో ఆవిడ పతికూడ వచ్చాడు. ఆమె మనోరథునివలెనె తనమగడు - చంద్రుని కేశబంధంలో బిగించగలదని తోచింది. ఆ తరుణి యెంతచలాకీ అయినదో, ఆవిడ భర్త అంత బద్ధకస్తుడు; అయితే అతని దృష్టిమాత్రం అతి నిశితమైనది. అతని పడుచుపెళ్ళాము తన నృత్య - సంగీత కళాకౌశలమును చూపించేందుకే వచ్చింది; కాని, చంద్రునికి తనయర్ధాంగి సామర్థ్యంలో సందేహంగా వుంది. ఆమె నాట్యం చేసి ప్రేక్షకుల యెగతాళికి గురిఅయ్యేదే; కాని, కపిలుడామెనే తనకు జోడుగా యెంచుకున్నాడు. వారిద్దరూ రంగస్థలంలో ప్రవేశించిన తర్వాత చంద్రుని వాలకం చూడవలసినదే. అతడు మధ్యమధ్య చాటుమాటుగా ప్రక్కచూపులను

వారిపైకి ప్రసరింపజేస్తూండేవాడు. ఈ గుట్టును భామ యిట్టే కనిపెట్టింది. ఆమె దబ్బునవెళ్లి చంద్రునిచేయి లంకించుకొన్నది. అతడు తన చేతగానితనాన్ని బాగా ఎరిగి వున్నందున తన్నొదిలిపెట్టమని భామను కాళ్ళావేళ్ళాబడి బ్రతిమలాడ సాగాడు. భామ చెయ్యివదలక లాగుతూండటం చూచి సుభుడు, మనోరథుడు అన్నారు—"అన్నా చంద్రా! నువ్వు నాట్యం చేసితీరవలసిందే. కపిల్ ముని మోహినికి నృత్యంచేసే అవకాశం కల్పించినప్పుడు నువ్వు భామకోరికకు సమ్మ తించక తప్పదు."

భామ చంద్రునిచేతిని పట్టుకొనే "వజ్రభూమిపైన నాతో నృత్యంచేయగల వాడీ నా ప్రియచంద్రుడే" నని చంద్రుని బుగ్గలను ముద్దెట్టుకున్నది. చంద్రుని యీ అవస్థకు మునిమోహిని సంతోషించినట్లే కన్పించింది. చంద్రుడు తన్ను నీడవలె వెంటాడటం ఆమెకిష్టంలేదు. తన చుట్టూ జనం గుంపు కూడటంగాంచి చంద్రుడు దిక్కుమొగంతో లేస్తూ అన్నాడు—"భామా! నీమోటుతనం బాగా లేదు. నాట్యం తెలియని నన్ను బలవంతంగా యీడ్చి నవ్వులపాలు చేయాలను కున్నావా?"

"మిత్రమా చంద్రా! భామలాంటి త్రిలోకసుందరి నా సరసకొస్తేనా, యింద్రసింహాసనం లభించినట్టే భావించేవాణ్ణి" అన్నాడు కపిల్.

"మిత్రమా కపిల్! నీకా సౌభాగ్యం కలిగినప్పుడు మునిమోహినితో నృత్యం చేసే అదృష్టం యీ నిర్భాగ్యసుభునికి కల్గించుతావని ఆశించనా?"

మనోరథు డప్పుడు చంద్రునికి సానుభూతిని చూపుతూ అన్నాడు- "సోదరా చంద్రా! మన యిద్దరి అదృష్టము ఒకలాగేవుంది. చూడు మరి! ముని మోహిని కపిల్ కుడిహస్తాన్ని చేతబట్టి అతని పార్శ్వంగా నిలబడింది. భామ కూడ నన్నిక్కడ ఏడ్చుకుంటూ కూచోమని నీ సరసను చేరింది. ఏం చెప్పను? దీన్నే కాబోలు అదృష్ట మంటారు!"

సుభుడన్నాడు- "కాని, మనోరథా! నువ్వు కూడ వాళ్ళని దొంగ చూపుల్తో చూస్తేనేగాని మీ యిద్దరస్థితీ ఒకటేనని అతనికి బోధపడదు."

భామ మనోరథునివేపు ముఖంత్రిప్పి "విచారంలో చక్కని సమభాగు లయ్యారు! ఇప్పుడేగా రోహిణితో నాట్యం చేశావు అంది?"

"మేము జతగా నృత్యంచేయటం నీకు అనూయగా వుందా భామా?"

"నేను చంద్రునితో నృత్యం చేయటానికి అభ్యంతరం కల్పించితే అంతే."

"నా అభ్యంతర మెందుకుంటుంది. మీరిద్దరు యిచ్ఛాపూర్వకంగా వెళ్లి నృత్యంచెయ్యండి; కాని, భామా! ఒకమాట. ఇష్టంలేనివారి నెవరినైనా సరే గత్యంతరం లేకుండా చేయటం బలాత్కారంకాదూ?" - మునిమోహిని కపిల్ ప్రక్కనజేరి అనురక్తయై నాట్యమాడుతోందనీ, మనుషులను అడ్డంగా చూచు కొనికపిల్‌కిఎన్ని ముద్దు లిస్తోందోననీ అసలే నా మిత్రుడు వుడికిపోతూంటే—"

"చాలెందుకు?" అని మునిమోహిని కపిల్ కపోలాన్ని వరుసగా ముమ్మారు ముద్దెట్టుకుంది పాపం చంద్రుని మొహం మాడిపోయింది.

శుభుడు మనోరథుని చెంతచేరి "చంద్రునికి సానుభూతి చూపేవాడివి మహాబుద్ధిరావ్‌లే! భామకూడ కపిల్‌ని కౌగలించుకొని జంకుగొంకుల్లేకుండా ముద్దులు పెడుతూంటే అప్పుడుగాని నీకు నాటదు. మునిమోహిని కపిల్‌కి అంటు పడిందంటే ఎక్కడి దీక్ష, ఎక్కడి తక్షశిల! కాస్త ఏమారితే చంద్రుని కిక పత్తాకూడ చిక్కదు. పైగా లిచ్ఛవుల శాసనరీత్యా ఏవిషయంలోనైనాసరే స్త్రీ యింగితానికి విరుద్ధంగా ఏమాత్రం నిర్బంధించరాదు కూడాను!''

భామ కన్బొమలు చిట్లించి శుభునివేపు చుర చుర చూస్తూ "శుభా! కొంచెం తమాయించు. నేను కపిల్‌ని ముద్దెట్టుకోబోతే ఈలోగా నా ప్రియ చంద్రుణ్ని తరిమివేద్దామనా నీ తలంపు?" చంద్రుని రెండో బుగ్గపైకూడ ముద్దెట్టి అన్నది— "ప్రియచంద్రా! అప్పుడే నువ్వు కనపడితే ఎంత బాగుండేది? నే నీ మనోరథుని పాలపడేదాన్నే కాదుగా."

వారిని సమీపించుతూ రోహిణి అన్నది— "అలాగే జరిగివుంటే నువ్వు నృత్యంతోనే చంద్రుని చంపివేసే దానవు అక్కా!"

"ఆ పని జరిగిన తర్వాత మళ్ళీ మనోరథుని చెట్టుపట్టేదాన్ని; కాని, అయినా యిందులో చంపటానిగ్గాని, బ్రతికించటానిగ్గాని ఏముందిపిల్లా! ఆ పిల్ల-మోహిని నా ప్రియచంద్రుణ్ని ఎందుకూ కొరగానివాణ్ణిగా చేసివేసింది. చంద్రుడు నాట్యమే నేర్చుకుంటే మరి నేను ఎన్నడూ కొత్తజోడాకోసం దేవులాడ ననుకొన్నది. నే నెలాగైనా యివాళ నా చంద్రునికి గంతెయ్యటం నేర్పితీరుతాను. పద ప్రియా! అందరూ యిక్కడే గుమికూడుతున్నారు. ఢంకా మీద దెబ్బ పడబోతోంది కూడాను, రా."

''ఒద్దు, ఒద్దు వదినా! నాట్యమంటే గాభరాపడను; అయినా ఇవాళ్టికి చంద్రుణ్ణి ఒదిలెయ్యి."

భామ కూచొని చంద్రుని పాదాలు నిమురుతూ "ఈ పాదాలు నాట్యంతో యెంత అందంగా తయారైనాయి!" అంది.

''అవును, చంద్రుడన్నయ్య శరీరంలోని ప్రత్యంగము నృత్యంకోసమే సృష్టింపబడింది. ఇప్పుడు రంగంలోకి వురకటంలేదంటే పాపమతనికి తల నొప్పో, మరేబాధో వుండివుంటుంది" అన్నాను నేను.

చంద్రునికి సందుదొరికింది. నిట్టూర్చుతూ అన్నాడు — ''అవును మిత్రమా! తలనొప్పుతోంది. గుండెల్లోకూడ—"

"ఆఁ, అల్లాచెప్పు. గుండెల్లో గుబగుబలాడుతోందని చెప్పు'' అన్నాడు శుభుడు చంద్రుని మాట పూర్తి చెయ్యనివ్వకుండానే.

"నాకు గుండెనొప్పి ఎప్పుడూ రాదు'' అన్నాడు మనోరథ్.

శుభుడు — ''అందరికీ ఒక మాదిరి నొప్పే రావాలని ఎక్కడుంది?''

మనోరథ్ — ''అయితే నేనీ తగాయిదా పరిష్కారానికి వుపాయం చెప్పనా?''

''చెప్పు చెప్పు'' అన్నారు అందరూ.

''చెప్పమని తర్వాత కాదంటే లాభంలేదు. ముందు చంద్రుడన్న ఒప్పు కుంటేనే చెపుతాను.''

"అదేమిటో తెలియకుండానే కట్టుబడాలా? బలేజేరగాడివి!"అన్నాన్నేను.

"నేను ఒప్పుకో తగ్గమాటే చెపుతాగా."

"ఒకరికి సమ్మతము కా తగ్గది మరొకరికి అంగీకారయోగ్యం కాదు." అన్నాను.

మనో-"అయితే-సింహా !-నీ అభిప్రాయం తల నొప్పితో వున్న చంద్రుణ్ని భామ తెయితెక్కలాడించాలనేనా ?"

నేను-"సరే, మిత్రమా చంద్రా! ఆ చెప్పేది అనుచితం కాకపోతే నీ అభ్యంతరం లేదని చెప్పు."

చంద్రుడు-"సరేలే" అన్నాడు.

మనో-"ఇప్పు డిక్కడ వున్న సుందరులంతా చంద్రుని ముద్దు పెట్టు కోవాలి."

శుభుడు—''అంటే పెళ్లికిచేరిన కన్యలందరూ తెరపిలేకుండా వరుని ముద్దాడినట్లున్నమాట! చంద్రునికిప్పుడు మళ్ళీ పెళ్ళి అవుతుందికాబోలు! ఇంతకూ యిది చంద్రునికి శిక్షా లేక బహుమతా?''

నేను—''చంద్రా! వెంటనే 'ఊ' అను. లేకపోతే అందరూ యిక్కడే గుమిగూడుతారు.''

చంద్రుడు సరేనని అంగీకరించాడు.

మనోరథుడు ''అంతటితో సరతు పూర్తికాదు. చంద్రునిపని సమాప్తమైన తర్వాత యువకులందరూ మునిమోహినినికూడ ముద్దుపెట్టుకోవాలి'' అన్నాడు.

చంద్రుని ముఖం జేవురించింది. అతడు పెదవి విప్పకముందే ''వజ్జియువతులు రేయింబగళ్ళు ముద్దాడుతూనే వుంటారు. ఇందులో నీకు శిక్షేముంది ? చంద్రా ! ఆ ప్రకారమే కానిమ్మను '' అన్నాను.

చంద్రుడు కాదనలేక పోయాడు. తలూపాడు; కాని, అప్పుడు ముని మోహిని కళ్ళలో హాసచిహ్నాలు చూచి ఉక్రోషాన్ని దిగమ్రింగాడు.

చంద్రుని ముద్దాడుటలో భామే బోణీచేసింది. పిమ్మట యువతులందరూ తమవంతు తీర్చుకున్నారు. కడపట మునిమోహిని ముందుకు రాబోతూంటే భామ ఆమె నడ్డగించి ''నువ్వు నిత్యము ముద్దులాడుతూనే వుంటావు; కాబట్టి నీ కివాళ

వంతులేదమ్మాయ్?" అన్నది; కాని, కపిల్ మోహినిని చంద్రునిపైకి త్రోయగా ఆమె చంద్రునిముద్దాడింది.

రెండో అంకం ప్రారంభమయింది. యువకులందరూ తనివితీర ముని మోహినిని ముద్దుపెట్టుకున్నారు. నృత్య-సంగీతాలకంటే ఈ చుంబనోత్సవమే ఎల్లరికి మహావినోదాన్ని కల్గించింది.

ఆనాడు చాల ప్రొద్దుపోయేదాక ఆట-పాటలు సాగాయి. తుదకు మే మిద్దరము మంచమెక్కేసరికి మా దేహాలు అలసిసొలసి సొక్కిపోయాయి.



# 13. వైశాలిలో స్వాగతము

మేము ఉల్కాచేలానుంచి వుదయాన్నే బయలుదేరి ప్రయాణంచేశాము. రాత్రికి 'కోటి' గ్రామంలో మకాంచేశాము, మర్నాడు ప్రొద్దునపూట వైశాలికి చేరుకోవచ్చుగదా అని. మేము బయలుదేరిన నాడే రోహిణి పిన్ని, భామలతో రథంమీద పయనించి వైశాలికి చేరింది.

పిన్ని రోహిణిని తమ యింటికే తీసుకెళ్ళింది. సోమ అక్కడేవుంది. శకట చక్రధ్వని చెవినిపడగానే ఆమె వాకిట్లోకొచ్చి నుంచున్నది. పిన్ని ఆజ్ఞాపించే స్వరంతో "సోమా! నోరెళ్ళబెట్టి చూస్తూండకపోతే మీ వదినెను దించి తీసుకొని పోరాదూ?" అన్నది.

సోమ రథాన్ని సమీపించిందో లేదో భామ మొదలుపెట్టింది - "రా పిల్లా! రా, మన మిద్దరం సాయంచేద్దాం. పాపం, మీ ఒదిన పాదం -"

ఇంతవరకు వినేప్పటికే సోమ వెల్లపోయింది. రోహిణికాలి కేదో ప్రమాదం సంభవించిందనుకున్నది. దబ్బున తేరువద్దకుపోయి రోహిణి కాలు పట్టుకున్నది.

భామ నవ్వాపుకుంటూ, "జాగ్రత్తగా పట్టుకోవాలి సుమా! ఒత్తిడి తగిలితే నెప్పెడుతుంది మరదలా!" అంది.

అతి జాగ్రత్తగా పాదాన్ని స్పృశించుతూ సోమ అన్నది - "భామా! నువ్వుకూడ పట్టుకుంటే యిద్దరం నిమ్మళంగా దించుదాం."

భామ మరీ నాటకమాడుతూ, "పిల్లా! భద్రం సుమా! కాలేమాత్రం కదిలినా మీ వజ్రాల ఒదిన దక్కదు. లోపలికి తీసుకెళ్ళే దెట్లాగో? ఆఁ వుండు, నన్నుకూడ రానీ, నేను వీపుమీద వుప్పెక్కించుకుంటాను" అంది.

ఆ కపటనాటకం తెలియని సోమ వొంగి "నే నెక్కించుకుంటానులే భామా! నా వీపెక్కటానికి నువ్వు కాస్త వూతమియ్యి" అన్నది.

భామ రోహిణిని దించటానికి చెయ్యందించబోతూండగానే పిన్ని ముందు నుంచి దిగి శకటచోదకునితో వెనక్కి వచ్చింది. భామ కిలకిల నవ్వుతోంది. సోమ వెనక్కి తిరిగిచూచి లజ్జపడింది. పిన్ని భామ కొంటెతనాన్ని పసిపట్టి కోప్పడ సాగింది.

"భామా! ఏళ్ళొచ్చినకొద్దీ నీ చిలిపిచేష్టలు మితిమీరుతున్నాయే!"

"కాదు పిన్నీ!" భామ మెల్లగా అంది - "వైశాలికి కొత్తకోడలు వచ్చినప్పుడు మరదళ్ళామెను వీపుమీద మోసుకొనిపోయి సింహద్వారం దాటించటం ఆచారమేగా!"

"నీ మొహం, నేనుమాత్రం వైశాలి కోడల్ని గానూ ?"

"మీ రోజుల్లో ఈ రివాజులేదేమో పిన్నీ ! ఇప్పు డందరూ యిలాగే చేస్తున్నారు. మరదలు సోమని అడిగి చూడు !"

భామసంగతి తెలిసికూడ సోమ ఆమె వలలో చిక్కుకొన్నది ఇప్పుడు సిగ్గుతో ముఖం మరింత ముడుచుకొనిపోయింది. అంతలో రోహిణి రథంనుంచి దూకి రెండు చేతులతో సోమను ఆలింగనం చేసుకొని ముద్దాడుతూ అన్నది—

"నా ముద్దు మరదలా ! భామ అక్కయ్య సంగతి నీకు తెలియదూ?"

సోమ నేత్రాలనుంచి ఆనందాశ్రువులు చిందినై. ఆమె సంకోచము అదృశ్యమైపోయింది. కొత్త వదినను తేరిపారచూస్తూ "భామ నెరిగినవాళ్ళుకూడ ఆమెమాయలో పడిపోతారు" అంది.

అప్పుడు భామవచ్చి సోమ మెడను పెనవేసుకొన్నది. "పో ఒదినా ! ముందు ముద్దిగిల్లి తర్వాత జోకొడతావు నువ్వు" అంది సోమ.

"ఉసిరికాయ ఒగరే ఐనా తిన్నతర్వాత — సోమా ! — మంచినీళ్ళు ఎంత తీపిగా వుంటయ్ !"

రోహిణి ఆగమనవార్త వాడవాడలా వ్యాపించింది. ప్రతి యింటినుంచి ఆడంగులు రాసాగారు. ముసలమ్మలు కొత్త కోడలికి దృష్టితీసి, వేలాలు చిమ్ముతూ లోపలి పంచాదిలోకి తీసికెళ్ళారు. నేలమీద పరచివున్న కంబళిపైన నట్టనడుమ రోహిణిని కూచోబెట్టారు. అంతలో మల్లికకూడా వచ్చింది. అక్కడ చేరిన అమ్మలక్కలు వైదొలగి ఆవిడకు దారి యిచ్చారు. పిన్ని రోహిణి చెవిలో "ఈబిడే మీ యత్త" అని వూదింది. చప్పున రోహిణి లేచి నిలబడింది. మల్లిక కోడలిముఖంలోకి చూస్తూ లలాటాన్ని ముద్దాడింది. "నా ప్రియమైన బిడ్డా! వైశాలిలో నీకు స్వాగతం అమ్మాయ్!" అన్నది.

అందరూ చతికిలబడిన పిదప కోడలికి మధుపర్కాలు, వేయించిన లేగదూడ మాంసము, ద్రాక్షరసము అందించారు. కొద్దిగా చవిచూచి రోహిణి రివాజును పూర్తి చేసింది.

భామనాయకత్వాన లిచ్ఛవీ అంగనలు మంగళగీతాలు పాడారు. చీకటి పడుతూండగా స్త్రీ లొకరొకరె తమ తమయిండ్లకు వెళ్ళిపోసాగారు. ప్రతివారు గాంధారపడుచు రూప, సౌందర్యాలనే వర్ణించుతున్నారు. ఒకావిడ రోహిణి కన్దోయి విశాలమైనదని మెచ్చుకుంటూంటే, వేరొకతె ఆవిడ కోమలాధరములను ప్రశంసించుతోంది; ఒకర్తుక పసిడివన్నెపు నిడుపుకేశాలను పొగడుతూవుంటే వేరొకామె రోహిణి ప్రశస్త ఫాలము, దీప్తివంతమగు ముఖబింబమును గూర్చి ప్రస్తావించుతున్నది. వైశాలికెల్ల సర్వోత్తమ సుందరి రోహిణేనని ఎల్లరి ఏకాభిప్రాయము.

మర్నాడు రెండుఘడియల ప్రొద్దెక్కేసరికి మేము సౌహార్ద్రసంఘంతో సహా వైశాలిదక్షిణద్వారాన్ని చేరుకొన్నాము. కొంతదూరంలో వుండగానే లిచ్ఛవు లెదురువచ్చి మాకు స్వాగతమిచ్చారు. ఊరేగింపుతో ముందుకుసాగాము. ముందు ముందు సైనికవాయిద్యాలు మ్రోగుతున్నాయి. తర్వాత తక్షశిలనుంచి వచ్చిన దశాశ్వములు నడుస్తున్నవి. వాటినంటి బహూకరణ సామగ్రితో బండ్లున్నవి. ఆ వెనుక తక్షశిలలో విద్యార్జనచేసి వస్తున్న ఆరుగురు యువకులము తురగారూఢు లమై యున్నాము. చివర లిచ్ఛవీ ప్రజలు, సేనానాయకుడు - సుమనుడు - శకటములపై నధిరోహించి వచ్చుచుండిరి.

దక్షిణద్వారందాటి మేము ముఖ్య నగరవీధులగుండా సంస్థాగారము అంటే పంచాయతీ భవనం ముందుకు చేరాము.అక్కడ గణపతి (పంచాయతీఅధ్యక్షుడు) తోడి సచివులతో ముందుకొచ్చి సౌహార్ద్రసంఘానికి స్వాగతమిచ్చాడు. మాతో వున్న సైన్యాధిపతికూడ గణపతి ప్రక్క కెళ్ళి నుంచున్నాడు. గణపతి ఒక పర్యాయము అశ్వాలను, ఇతర కానుకలతో నిండియున్న బళ్ళను తేరిపారజూచి, పంచాయతీ భవనంలోకి దారితీశాడు. మా ఆరుగురికి ప్రత్యేకాసనా లిచ్చారు. పంచాయతీసభ్యులు 999 లో 900 లకు పైగా అక్కడ హాజరయివున్నారు. గణపతి చేయెత్తుటతో హాలారంలో నిశ్శబ్దమావరించింది. సౌహార్ద్రసంఘ నాయకుడు - కపిల్ లేచినిలబడి యిలా చెప్పాడు :

"పూజ్యులార ! వినండి. వైశాలి తక్షశిలలు చిరకాలంనుంచి పరస్పర పరిచితములై గౌరవించుకుంటున్నవి; అయితే తక్షశిల తన ప్రాచ్య సోదరిపట్ల హృదయపూర్వక ప్రేమాదరములను ప్రదర్శింప సౌహార్ద్ర సంఘాన్ని పంపుటకిదే మొదలు. గాంధార ప్రజాప్రతినిధిసంస్థ (పంచాయతీ)కు వైశాలియందేమి, లిచ్ఛవులపట్లనేమి ఎట్టి సుహృద్భావ మున్నదీ మాటలకుబదులు గాంధారసుతులము పదిమందిమి లిచ్ఛవీ నాయకమ్మన్యులమధ్య వుండుటే తార్కాణము. మరి మాటల రూపంలో యీ స్వర్ణపత్రమే ప్రకటింపగలదు" అని కపిల్ స్వర్ణపత్రమొక దాన్ని గణపతిచేతికందిచ్చి మళ్ళీచెప్పాడు-" "ముగించేముందొకదు నాతరఫున ఒకటిరెండు మాటలు చెప్పదలిచాను. అవి లిచ్ఛవీకుమారుడు తక్షశిల వైశాలిలమధ్య సన్నిహిత సంబంధ మేర్పరచుటలో కృతకృత్యుడైన విధమునుగూర్చి మాత్రమే. శతాబ్దాలనుండి తక్షశిల కితరతూర్పు విద్యార్థులవలె లిచ్ఛవీ కుమారులను వంద లాదిగా విద్యాసముపార్జనకు వస్తూనేవున్నారు. తక్షశిల వారిపట్ల వాత్సల్యాన్ని చూపుతూనేవుంది. ఆ వచ్చినవారును తక్షశిలయందపారమైన గౌరవమును ప్రదర్శించుతూవచ్చారు; కాని, లిచ్ఛవీకుమారుడు-ఈసింహుడు చేసినపనిఅంతకంటె గొప్పదీ, అసాధారణమైనదీని. తక్షశిల విపద్గ్రస్తయై యున్నప్పుడక్కడ వున్న యే లిచ్ఛవీ యువకుడైనా ఈ వీరులవలెనే గాంధార సంరక్షణకై తమ రక్తాన్ని ధారపోసి వుండెడివారని నా తలంపు. గతమునం దట్టి యవకాశము లేకుండుటవల్లనే యిట్టి

వుదాహరణ లేకపోయింది. రెండేళ్ళక్రితం లిచ్ఛవీ కుమారులు తక్షశిల నిమిత్తం అపూర్వ ధైర్య - సాహసాలతో కత్తులు దూసి, కదనరంగంలో వురికి, పోరాడినది సామాన్యవిషయం కాదు. ఆ యుద్ధంలో నా గాంధారభూమికై పోరాడిన వారిలో స్వయంగా నేనొకడను. శుభ డాదిగాగల యీ అయిదుగురు లిచ్ఛవీ పుత్రుల పరాక్రమాన్ని నా కళ్ళారా చూచాను. వీరి పరాక్రమానికి ఏ ప్రజా రాజ్యమైనా గర్వించగలదు. చిరతప్రాయంలోనే వారు ప్రదర్శించిన శౌర్య-ప్రతాపాలనుబట్టి భవిష్యత్తులోకూడ మేము వారివలన యెంతో ఆశించవచ్చును. ఇక సేనానాయక పదవీ విభూషితుడైన సింహుని విషయంలో మా గాంధారగణ మెట్టి యభిప్రాయమును కల్గియున్నదీ సువర్ణపత్రమే తెలుపగలదు! నే నీయనకు ఉపనాయకుడుగా వుండియుండుటచే, చేరికలోనుండి ఈయన పరాక్రమాన్ని దర్శించే సదవకాశం లభించింది. సింహునివంటి సాహసోపేతుని సేనానాయకునిగా బడసి ఏదేశమైనా గర్వించుతుందని నేనేకాదు, మా తక్షశిల ప్రాత, కొత్తసేనాపతులు, సేనానాయకులు, యుద్ధ విద్యావిశారదులు ఎల్లరు అభిప్రాయపడుతున్నారు. ఈయన కీయబడిన యుద్ధరంగం అన్నిటిలోకి కీలకస్థానం. పారశీకులు భయంకరమైన దాడి సల్పినది అక్కడేనని మే మెరుగుదుము. మా మాజీ సర్వసేనాపతి-తక్షశిలకు వల్లడల పేరు-ప్రఖ్యాతులు గడించిన యుద్ధశాస్త్రప్రపూర్ణులు - బహుళాశ్వులవారికి సింహుని బల-పరాక్రమములు సుపరిచితములు. వారి సలహాననుసరించియే మా సైన్యాధిపతి అత్యంత ప్రాముఖ్యతవహించిన ఆ మహాసింధురంగానికి సింహుని సేనానాయకుడుగా నియమించినాడు. సేనానాయకుడచ్చోట ఎట్లు వ్యూహములు పన్నినదీ, సైనికుల నెట్లునడపినదీ, శత్రుగమనము నెప్పటికప్పుడు ముందే యెట్లు తెలుసుకున్నదీ మొదలగు వివరాలను నే నిప్పు డిక్కడ ఏకరువు పెట్టదలచలేదు. గౌరవనీయులగు లిచ్ఛవీనాయకులారా! పారశీక చక్రవర్తి మహాసేనలో ప్రధానభాగాన్ని తొలిదెబ్బతోనే మట్టుబెట్టి సేనాపతిని బందీని గావించుటనుబట్టి మీరు సింహుని సామర్థ్యాన్ని వూహించగలరు. ఆ సమరంలో సింహుడును క్షతగాత్రుడయినాడు. ఆచార్యబహుళాశ్వుని తనయ - ప్రస్తుతము సింహుని అర్థాంగి - రోహిణి తన కృపాప్రావీణ్యతను చూపియుండకున్నచో విజయాన్ని సాధించిన ఈ వీరసింహుడు మాకు దక్కియుండేవాడు కాదనుటలో సందేహంలేదు."

కపిల్ తన భాషణమును ముగించి కూచున్న పిమ్మట "మేము రోహిణీ సింహులను చూడా"లన్న కేకలు సభికులనుండి చెలరేగినై. ఒక మూలనుంచి రోహిణి తీసికొనిరాబడింది. గణపతి యాదేశంతో సింహుడు ఆయనవద్దకు వెళ్లాడు. వీరదంపతులిద్దరు సభికులమ్రోల నిలబడ్డారు. సభికులు వారినిగాంచి ఆనందోద్రేకంతో,

'జై గాంధారగణానికీ జై!'

'జై లిచ్ఛవీ గణానికీ జై!'
'తక్షశిల వర్ధిల్లుగాక !'
'వైశాలి వర్ధిల్లుగాక !'
'లిచ్ఛవీకుమార్ సింహ్ చిరంజీవి యగుగాక !'
'గాంధారపుత్రి రోహిణి చిరంజీవి యగుగాక !'
అని జయ జయ ధ్వానాలు చేశారు.

సువర్ణపత్రాన్ని పఠించేముందు గణపతి యిలా అన్నాడు—

"గౌరవనీయులగు సభ్యులారా ! ముందుగా నేను మీ యందరి తరఫున మన తక్షశిలమిత్రులకు స్వాగతం చెపుతున్నాను. చిరంజీవి కపిల్ ! మీరు మీ సహచరులు దారిపొడుగున యెన్నెన్నో కష్టాలనుభవించి వైశాలికి చేరగల్గిన విషయం మాకు తెలుసు; అయితే మీ కా శ్రమ, చిక్కులు లేకుండాచేయుట మా చేతిలోని పనికాదు; కాని, మా యీ వజ్జిభూమిపైన అందేమాత్రం శ్రమను బాపి మిమ్మానందపర్చగలిగినా మా అదృష్టంగా భావించుకుంటాము. మీరు లిచ్ఛవీ గడ్డను గాంధారముగను, వైశాలిని తక్షశిలగాను భావింతురుగాక ! ఇయ్యది మీ స్వగృహంగానే యెంచి మా యీ సన్మానమును మీ స్వజనుల సత్కారంగా భావించి స్వీకరింతురుగాక !"

పిమ్మట గణపతి తక్షశిలనుంచి పంపబడ్డ స్వర్ణపత్రికను చదివి విన్పించాడు. మధ్యమధ్య సభికులు 'భళీ ! భళీ!' 'వహ్వా ! వహ్వా ! అని హర్షధ్వనులుచేశారు. అప్పుడు కోశాధ్యక్షుడు తక్షశిలనుంచి పంపబడిన హయములు, యితర వస్తువుల జాబితాను చదివి వినిపించి, గుర్రములను అశ్వశాలయందును, సామగ్రిని కోశాగారమందును చూడవచ్చునని ప్రకటించాడు. తదనంతరము పంచాయతీ అధ్యక్షుడు సభ సమాప్తమైనట్లు ప్రకటించుటతో ఎల్లరు జయనాదములుచేయుచు తమతమ యిండ్లకు బయలుదేరారు.

సంఘ భవనానికి వుత్తరంగావున్న పాంథగృహం కపిల్ ప్రభృతులకు విడివిడిగా యేర్పాటు చేయబడింది.

నేను రోహిణితో బయటికి వచ్చునప్పటికే పిన్ని, అమ్మ వచ్చి అక్కడ వున్నారు. నేను గబగబ వారివద్దకు వెళ్లాను. అమ్మ నన్ను కౌగలించుకొని ముద్దాడుతూ బాష్పధారచే నా ముఖాన్ని తడిపివేసింది. కొంచెం శాంతించిన పిమ్మట అమ్మ "రా బిడ్డా! నిన్ను చూచే అదృష్టం నా కింక లేదనే అనుకున్నాను" అని మాత్రమే అనగలిగింది.

మేము పిన్నిగారి యింటికే వెళ్ళవలసి వుంది. తాత్కాలికంగా మేము వుండటానికి అక్కడే యేర్పాటు చేశారు. నా పితృగృహాన్ని చూడాలన్న కోర్కను తెలుపగా అమ్మ నన్నక్కడికి తీసుకెళ్ళింది. ఇంటి మరమ్మతుకు ఏర్పాటు చేయబడింది. అమ్మ మా భూములు సాగుచేయబడుతూన్నట్టు కూడ చెప్పింది. అక్కడి

నుంచి మేము మారుటి తండ్రి యింటికి వెళ్ళాం. ఆయన దూరదేశానికి వెళ్ళి చిరకాలానికి వచ్చిన కన్నపుత్రునివలెనే నాకు స్వాగతమిచ్చి, ఆలింగనం చేసుకున్నారు. సోమ అత్తవారింటికి వెళ్ళిపోయిన తర్వాత ఆ యింట్లో అమ్మ, ఆయన మాత్రమే వుంటున్నారు. నేనేదో అడుగబోగా "ఆయన కిప్పుడు బిగ్గరగా చెపితేనేగాని వినపడ"దని అమ్మ చెప్పింది. అమ్మ దేహంలో చాల పరివర్తనం జరిగింది. జుట్టు సగభాగం నెరసిపోయింది. మారుటితండ్రి నడుము వంగిపోయింది. ఆయన నిట్టూర్చి "సోమ పెళ్ళి అయిపోవటంతో ఆమెనుగూర్చి నిశ్చింతగానే వున్నాను. ఇక నీ రాకకోసమే ఎదురుచూస్తూ బ్రతుకుతున్నాను. నువ్వుకూడ వచ్చేశావు" అన్నారు.

"బాబా ? మీ కోడలు కూడ వచ్చింది" అని నేను రోహిణిని ముందుకు లాగాను.

అశ్రుపూరిత నయనాలతో చూస్తూ ఆయన రోహిణిని ముద్దాడి 'యిప్పుడే వస్తాను వుండండి' అని తన పడకగదిలోకి వెళ్ళారు. ముసలాయన ఏమిచేస్తారో నని మేము నిరీక్షించుతున్నాము. ఆయన త్వరగానే వచ్చి, నల్లని వున్ని వస్త్రంలో నుంచి ముత్యాలు - పగడాలు కూర్చిన ఒక హారాన్ని తీసి స్వహస్తాలతో రోహిణి మెళ్లోవేసి "కుమారీ! నేను మల్లికకు కూడ తెలియనీకుండా దీన్ని సింహుని వధువుకోసం గోప్యంగా దాచివుంచాను. ఇప్పుడు నా తుదికోరికకూడ తీరిపోయింది" అన్నాడు.

"బాబా! మీ రింకా కొన్నాళ్ళపాటు జీవించాలి" అన్నాను.

"వద్దు నాయనా! ఎల్లాగో యింతవరకు యీడ్చుకొచ్చాను. నువ్వుకూడ నా కళ్ళముందు కొచ్చావు. ఇక నిర్విచారంగా ప్రాణం వదుల్తాను. డెబ్భైయేళ్ళు నిండినై. చెవుడుకూడ వచ్చింది. ఇలాంటి నిరర్థక జీవితం లిచ్ఛవీకి శోభించదు నాయనా!"

తన ఆయువు సరిపోయిందనే నమ్మకం ఆయనకు గాఢంగా ఏర్పడింది. ఆయన వృద్ధాప్యంలో మళ్ళీ బాల్యం తిరిగిచూస్తోందనుకొన్నాను; కాని, నాలుగో రోజున ఆయన పడుకున్నవాడు పడుకున్నట్టే శాశ్వతంగా కళ్లు మూశాడు.

అక్కణ్నుంచి అమ్మ, మేము పిన్ని గారింటికి వెళ్లాము. లోపలి వరండా లోనించి పెక్కుమంది పకపక నవ్వటము, భామ ప్రాశ్య కంఠస్వరము వినిపించు తున్నాయి. లోపల యువతీ సమ్మేళనాన్ని చూచి అమ్మ "భామ మళ్లీ యేదో వుపద్రవానికే కూచుంది" అని సరాసరి పిన్ని గదిలోకి వెళ్లిపోయింది. మమ్మల్ని చూడగానే భామ మరి నలుగు రయిదుగురు సుందరాంగులతో కలసి గంతులేస్తూ మా వద్ద కొచ్చింది. రోహిణి కంఠసీమనున్న హారాన్ని గాంచి "రోహిణి! నీ కీ మాల చాల సొంపుగా వుందోయ్!" అని ఆమెని ముద్దు పెట్టుకొన్నది. నా వైపు

చూచి "మరదీ! నీకు స్వాగతమిచ్చేందుకు వైశాలిలోని సుందర జవ్వనులంతా యిక్కడికొచ్చారు" అని చెప్పింది.

నేను నవ్వుతూ "స్వాగతానికేనా, మరింకెందుకైనానా వదినా?" అన్నాను.

భామ మారు పల్కకుండానే రోహిణిచేయి పట్టుకొని నన్నుకూడ అనుసరించమన్నట్టు కనుసన్న చేసి వసారాలోకి దారితీసింది. అక్కడ ఒక ప్రక్కగా పరచివున్న ఆసనంమీద మమ్మల్నిద్దరినీ కూచోబెట్టింది. యువతీమండలిలో కొందరు వీణ, మృదంగాది వాయిద్యాలను చేతబట్టారు. వధూవరులు స్వగృహానికి వచ్చినప్పుడు పాడే మంగళగీతాన్ని అక్కడున్న యావన్మందీ కోకిలకంఠాలతో పాడారు. అనంతరం భామ ఒక్కొక్క సుందరిని రోహిణితో పరియం చేసింది. భామ లిచ్ఛవీవంశాల్లోని యావత్తు కుటుంబాలకు చెందిన తరుణీమణులను ఆహ్వానించింది.

పరస్పరపరిచయం చేయటం పూర్తికాగానే వసారాలో ఒకసారి నిశ్శబ్దమావరించింది. అప్పుడు భామ గొంతు సవరించుకొని మొదలెట్టింది—

"అక్కలార! ఒదినలార! కన్యలార! కోడళ్లార! సింహకుమారునికి, అతని వధువు - గాంధారసుందరికి స్వాగతమిస్తున్న ఈ శుభసమయాన మనందరికీ అత్యంతానందంగావుంది. సింహకుమారుడు మన యెల్లరిప్రేమకు పాత్రుడు. మనలో యెందరమో ఈయన చుంబనమాధుర్యాన్ని చవిచూచివున్నాము; ఈయనతో నాట్యమాడాము; పానగోష్ఠిలో పాల్గొన్నాము. స్వప్నతుల్యాలైన ఆరోజులెంత మనోహరంగావుండేవి! ఇప్పుడా బాధాకరమైన మధురదృశ్యాలను స్మృతికితేవలసిన అగత్యంలేదు. మన మిప్పుడిక్కడ ఆయనకి శుభాకాంక్షను ప్రకటించటానికే గుమికూడాము. మనసోదరి - రోహిణిని చూచారూ? అచ్చంగా స్వర్ణప్రతిమలావుంది. వైశాలిలో యీగాంధారసుందరితో పోటీచేయగల సొగసుకత్తెయేదీ? ఒకవేళ పోటీకి నిలవాలన్నా మన అందాలరాణి క్షేమ ఒక్కతే. ఒసేపిల్లా, క్షేమా! ఒకసారి ఇటురా." అనగానే పద్ధెనిమిదేళ్లపడుచొకతె - మేలిమిరంగుచాయ, చారడేసికళ్ళు, నల్లనికురులు కలిగిన నిరుపమానసుందరి సిగ్గుచే దిగబడినముఖంతో అపరాధినివోలె భామనుసమీపించి నిలబడింది. రోహిణి రెప్పలార్చకుండా ఆమెవంక చూస్తోంది. ఆ తరుణిని బోలిన నవమోహనాంగులు తక్షశిలలోనైనా అరుదే. భామ మళ్ళీ సాగించింది-"సోదరీమణులారా! చూచారుగా! క్షేమలాంటి కామినినిగూర్చి వైశాలి గర్వపడటంలో అనుచితమేమీలేదు; కాని, మన యీరూపరాశిలో రోహిణికేసర్వోత్తమస్థానమివ్వటంకూడ ఏమాత్రంఅనుచితము కాదనే నాతలపు. అందాలపోటీలో క్షేమచే ఓడింపబడినందున కసితీర్చుకోటానికే నేనిలా అంటున్నా ననుకోకేరు ఎవరన్నా. ఇప్పుడు మనం వైశాలిలో అందాలరాణిని ఎన్నుకోబోవటంలేదుగా మనక్షేమకు నష్టంకలిగేందుకు! ఇక్కడ

నేను మీకు మరొకసంగతికూడ చెప్పదలిచాను. ఈమధ్య లిచ్ఛవీ తరుణీమణు లంతా సౌందర్య కళోపాసిను లయిపోతున్నారు. ఆ టక్కులాడి వుండే— అంబాపాలి—దుకాణం తెరచుకొని కూచున్నప్పటినుంచి ప్రతి యువతికి తన కాపర మెప్పుడు గంగలో కలిసిపోతుందో నన్న భీతి కలిగింది. తదాది ఎల్లరూ వేష - భూషణాలంకారాల్లో, సౌందర్య కళారాధనలో వేశ్యాంగన - అంబా పాలిని తమ ముందర దిగదుడుపుగా తీసెయ్యాలని పట్టుదల వహించారు. నే నీ పట్టుదలను చెడుగా భావించను. అందరి భర్తలు మనోరథునివలె ఒకే కేశ పాశంలో చిక్కుకొని వెంటబడి తిరుగుతూంటూ రనటానికి వల్లకాదు. అయితే లిచ్ఛవీయువతు లొకప్రక్కన అంబాపాలిని తమ సౌందర్య కళాదర్శంగా యెంచి, ఒక్కొక్క రాత్రికి వేలాది కార్షాపణములు ఆ పాడుముండకు పోకుండా కాపాడుకుంటూనే వేరొకవంక ఒక అపరాధం - అది గొప్పదేకాదు - మహాప రాధం కూడాను - చేస్తున్నారు.

"నేనీ మాటలు బాగా యోచించే చెప్తున్నాను. లిచ్ఛవీకాంతలు తమ సౌందర్యోపాసనలో లీనమై తాము లిచ్ఛవియాణుల మన్న విషయాన్నే విస్మ రించుతున్నారు. చెల్లీ "రోహిణీ! ఏదీ, నీ చేతు లిటు చూపు" రోహిణి తన హస్తాలను భామ కందించింది; కాని, ఆమె గుండె దడదడలాడుతోంది. భామ మళ్ళీ చెప్పసాగింది— "మీ రంతా ఆత్రపడొద్దు. పదేసి మందిని పిల్చి చూపి స్తాను. ఈమె చేతు లెంతో ముచ్చటగా వున్నై. అందమైన హస్తా లెట్లా వుంటయ్యో మీ రాలోచించుకొని వుండండి. సరే, యిప్పుడు దగ్గరలో వున్న పదిమందీ రండి. వచ్చి రోహిణి చేతుల్ని చూడటమే కాదు. వాటిపైన చెయ్యి వేసి చూడండి! కఠినంగా లేవూ? నిజం చెప్పండి." అందరూ కఠినంగానే వున్నా యన్నారు. భామ పదేసిమంది చొప్పున పిల్చి రోహిణి చేతులు చూపి, అదే రీతి నడిగింది. ఒట్టిచేతులను చూడటానికే అయితే అందరూ తొక్కిస లాడుతూ వచ్చేవారు కాదు; కాని గాంధార పడుచును దగ్గరలో నుండి చూచి, స్పృశించవచ్చు నన్న కోరికతో ఎల్లరూ వచ్చి రోహిణి చేతుల్ని పరీక్షించి చూచారు. అందరివంతు అయిన తర్వాత భామ తిరిగి ప్రారంభించింది.

"అక్కలారా! రోహిణి అందంలో మనలో ఏఒకరికైనా తీసిపోతుందా? మొహమోటం లేకుండా యథార్థం చెప్పేయండి."

అందరూ "మనందరికంటె అందంగా వున్నది; శ్రేష్ఠకం టేకూడాను" అన్నారు.

"అయితే - సోదరీమణులారా! - రోహిణిచక్కదనంలో ఒక గొప్ప కళంకం వుంది. ఆమె కరకమలాలు శిరీషకుసుమాల్లాగా కోమలంగా లేవు. అంబా పాలి సౌందర్య కళాదృష్టిలో యివి అందమనిపించుకోవు; కాని, మరి మనం అలాంటి కఠిన కర్కశ హస్తముల కారణంగా రోహిణిని సుందరి కాదని చెప్ప

వచ్చునా? అంబాపాలి శిష్యురాండ్రైతే అలాగే అంటారు; కాని నేను వైశాలిలో నాకు పూర్వపు సర్వోత్తమ సౌందర్యవతులు అంబాపాలి శిష్యురాండ్రవాదమే తప్పంటాను. సోదరి రోహిణి చేతు లింత కర్కశంగా వున్నా అందంగా వున్నాయనటానికి హేతువేమిటనుకున్నారు? లిచ్ఛవీ అంగనల కట్టిహస్తాలే రాణింపతాయి. మగధరాజు - ప్రమాదాన్ని గణింపక అంబాపాలి సౌందర్య సుధాపానం నిమిత్తమై వైశాలికి వచ్చిన బింబిసారుడు - ఎప్పుడో ఒకప్పుడు మన వజ్జిభూమిపైకి దండెత్తి రాకమానడు. మన అన్న - దమ్ములు, భర్తలు, మరదులు, మామలు, తండ్రులు, పిన తండ్రులు యెల్లరు అతడి నెదిరించటానికి సమాయత్తమౌతున్నారు. ఆ సమయంలో మన అవ్వలవలె మనంకూడ శత్రువు నెదిరించవలసివస్తే లిచ్ఛవీకాంతలమైన మనకి అంబాపాలి తయారుచేసిన ఈ కోమలకర కమలము లేపాటి వుపకరిస్తాయో యోచించండి. ఈ మృదు హస్తములు బల్లెమును పట్టగలవా? కృపాణాన్ని త్రిప్పగలవా? డాలు తాకిడికి తట్టుకొనగలవేమో చెప్పండి? అప్పట్టున మనకరకమలాలు నిరర్థకాలవటంలో సందేహం లేదు. కాని, సోదరి రోహిణి చేతులో? మీరిప్పుడు చూచిన యీ కఠిన కర్కశ హస్తాలే నూరుమంది బింబిసారులపెట్టయిన పారశీక చక్రవర్తి మద-అహంకారాలను పటాపంచలు గావించాయి. కాబట్టి నేను మీయందరికి చెప్పేదేమంటే - అంబాపాలి ననుకరించి తయారుచేసికొన్న మృదుహస్తాలకు స్వస్తి చెప్పండి. అవి అతి ప్రియం. మనకి లిచ్ఛవియాణులకు యోగ్యమైన చేతులే కావాలి. రోహిణివి అట్టిచేతులే. ఆమెను నేను కలసికొని ఐదురోజులు మాత్రమే అయింది! కాని, మేము ఎన్నో జన్మలనుంచి అక్కచెల్లెళ్లమా అనిపిస్తోంది. నా చేతులుకూడ రోహిణిహస్తాలను పోలివుండటం నిజంగా నా అదృష్టమే. సింహా, మనోరథులు కృపాణధారులై రణరంగంలోకి వెళ్ళేటప్పుడు మేమిద్దరంకూడ కరవాలములను చేబట్ట నిశ్చయించుకున్నాము. సోదరీమణులారా! మీరుకూడ ఖడ్గధారిణులు కాగోరుతున్నారా? మీ వుద్దేశ్యమేమిటో చెప్పండి."

పెక్కుమంది "అవును, మేముకూడ కత్తిచేతపట్టుతాం" అన్నారు.

భామ - "అట్లయితే ముందుగా మీ చేతుల్లో పరివర్తనం తీసుకురాండి. నేనీ సంగతి కోమలకరపల్లవములవారికే చెపుతున్నాను. మార్పు తెచ్చుకొనే వుపాయంకూడ చెపుతున్నాను. చేతులను గట్టిపర్చే పనులు - దంచటము, విసరుట, వంట చేయుట మున్నగువాటిని కేవలం దాసీలకే వదలకండి. డాలు, బల్లెము, కత్తి, ధనుస్సులతో ప్రతి నిత్యము అభ్యాసం చెయ్యండి. పొలాల్లోకి వెళ్ళి గొడ్డలి, పలుగు, పారలతో పని చెయ్యండి. ఎండలో తిరగటం అలవాటు చేసుకోండి. నాట్యము, ఇతర క్రీడలతో కొవ్వును కరిగించుకోండి. ఇవాళ నేను చాలా దూరం చెప్పుకొచ్చాను. ఇందుకు నన్ను క్షమించండి. ఇక ఆనందోత్సవం ప్రారంభించుదాము."

తరువాత మాంసపుదాకలు, సురాభాండములు తేబడ్డాయి. మధ్య మధ్య మధువానుతూ మాంసం నములుతున్నారు.

"ఒదినా! నువ్వుకూడ తాగు" నేను భామతో అన్నాను.

"తాగుతాలే".

"మరి గ్లాసు తెచ్చుకో".

"ఇంకో టెందుకు? నీ గ్లాసుతో తాగుతాలే".

"నా గ్లాసుతోనా?"

"అవును, దానితోనే నీ పెదవుల స్పర్శచే దానిలోది మరీ మధురంగా ఉంటుంది"

నాకు బలే అనుమానం కలిగింది. భామ గంభీరోపన్యాసం ముగియుటతో నేను బ్రతికిపోయాననుకొన్నాను; కాని భామ మాటల్లో నా మీదకేదో తెచ్చి పెడుతుందనుకున్నాను. నేను మిన్నకుండటం చూచి భామ అన్నది.

"ఏం మరదీ! నీ సరసనచేరి ఒక్క గుక్క సురాపానం చెయ్యటానికూడా నీ యీ వదిన కధికారం లేదా?"

ఆమె తరుణీమండలి నుద్దేశించి "సోదరీమణులారా! విన్నారా? తనతో కలసి కొంచెం మధురసం పీల్చటానికే మరది ఒప్పుకోవటంలేదు. ఇది బొత్తిగా దురన్యాయమని నా అభిప్రాయం."

శ్యామ - (పచ్చని కనుకొలకుల్లో ఎరుపు పరుగెత్తింది.) "అవునక్కా! ఇది దురన్యాయమే. సింహకుమారునికి బాల్యంనుంచీ అన్యాయం చేసే అలవాటుంది. ఈయన ఎందరెందరి హృదయాలనో నొప్పించాడు. నామట్టుకు నేను మామిడితోపుల్లో యీయనతో చెట్టపట్టాలు వేసుకొని తిరిగినదానికి అంతుందీ? నన్నెత్తుకొని పంటబోదు లెన్నిసార్లు దాటించాడో! మేము జతగా నృత్యము చేసినదానికి లెక్కలేదు. నన్ను ఆలింగనం చేసికొని పెట్టిన ముద్దులెన్నని చెప్ప గలను? ఇంతేనా? - 'శ్యామా! నా హృదయంలో నీకొక్కదానికే స్థానముం'దని యెన్నిపర్యాయాలో చెప్పి నమ్మించాడు. నువ్వుచెప్పక్కా! సింహుడు తన మాటతప్పి నాకు అన్యాయం చేశాడంటావా లేదా?"

"ఇంతా అంతానా? సాంతం అన్యాయమే" అంది భామ.

"మరిందుకు శిక్షేమిటి?"

"మరదీ! ఒంటికాలుమీద నుంచొని చేతులు జోడించి శ్యామని క్షమాపణ వేడుకో. లేకపోతే—" కొంచెమాగి "ఇది పారసీకసైన్యంకాదు; విచ్ఛవియాణుల సేన. ఏకాకివైన నీకేగతి పడుతుందో వూహించుకో."

చప్పున నల్గురు యువతులువచ్చి నా చేతులు పట్టుకున్నారు. ఒకామె నా కాలెత్తి పట్టుకొని "ఊఁ, క్షమాపణ కోరుకో"అంది.

"జాగుచేస్తే సహించం. ఇది మా సేనానాయకి ఆజ్ఞ. క్షమాభిక్ష వేడుకో" అన్నది మరొక యువతి.

నేను రోహిణివంక చూచాను. ఆమె నవ్వుతూ మోము ప్రక్కకు త్రిప్పు తుంది. అప్పుడు నేను "సరే, మీరు చెప్పినట్టే క్షమాపణ కోరుతా" నన్నాను.

శ్యామ నా దరి కొచ్చికూచుంది. నేను ఆయువతులు చెప్పినమాట ఉచ్చ రించి క్షమాపణ కోరాను.

అంతట నోరు పెద్దదిగా చేసకొని ఉష అన్నది—"సఖీ భామా ? నా కూడ న్యాయం చెయ్యి. ఇది ఎన్నాళ్ళనాటి సంగతో, సరిగా జ్ఞాపకంలేదు. నేనూ, సింహుడూ షికారుచేస్తున్నాము. అప్పుడు సింహుడు 'ఉషా! నువ్వు యిదు ముద్దులియ్యి. తర్వాత నేను బదులు తీర్చివేస్తానన్నాడు. నీయున్న ముద్దు పెట్టుకోనిచ్చి యన్నాళ్ళయిందో, కాని, యింతవరకు నాకాబాకీ ముట్టనేలేదు."

భామ నన్నడిగింది—'ఏం! నిజమేనా ?"

"అది చిన్ననాటిసంగతి ఒదినా! మే మప్పుడు నాలుగైదేళ్ల వాళ్లమై యుంటాము."

"అంటే అప్పు చాలాకాలంనాటిదని నీవూ అంగీకరించావన్నమాట. అయితే వడ్డీ చాలా పెరిగివుంటుంది."

"అయితే ?"

"అయితే ఏమిటి ? ఉషకు నిన్నిప్పుడు పదిసార్లు ముద్దు పెట్టుకోటానికి హక్కుంది. మన రాజ్యంలో వడ్డీ అసలుకు రెట్టింపుకంటె మించకూడదుగా. సరే, ఉషా, నీ బాకీ వసూలు చేసికో" అన్నది భామ.

మళ్లీ నలుగురు పడుచులు నా చేతులు గట్టిగా పట్టుకోగా, ఉష ఐదుసార్లు నా చెక్కిళ్ళని ముద్దుపెట్టుకుంది. అప్పుడు నా భయం ఎక్కువయింది. ఈ విధంగా పాత అప్పులన్నీ తీర్చవలసివస్తే నా జీవితమంతా ఋణ తీర్మానంతోనే సరిపో తుంది.

భామ మరల బిగ్గరగా చెప్పింది- "సఖులారా! భామ న్యాయ పీఠాన్నధి ష్ఠించి వుండేది ఈవాళమాత్రమే. నీళ్లకు నీళ్ళు, పాలకు పాలుగా న్యాయం జరగాలంటే మీ మీ ఫిర్యాదులను నేడే చెప్పుకోండి."

రమ తన ఫిర్యాదును చెప్పబోతూండగా బయటనుంచి వాయిద్యాల ధ్వని వినవచ్చింది. అంతలో ఒక దాసి వచ్చి నృత్యవిలాసార్థం అందరూ వచ్చేశారనీ, తక్షశిలనుంచివచ్చిన యువకులుకూడ అరుదెంచినారని చెప్పింది. భామ అకస్మి కంగా "సోదరీమణులారా! నృత్యశాలలో - " అని చెపుతూంటే 'బ్రతుకు జీవుడా!' అనుకొన్నాను. నేను, రోహిణి, భామ కలసి మా ముందున్న మాంసాన్ని అవజేశాము. రెండు మూడు గ్లాసుల సురను గొంతులో గుమ్మరించు కొని అక్కడ్నుంచి నిర్గమించాము.

నాట్యమందిరం పిన్నిగారింటికి దాపులోనే వుంది. అక్కడికి పోయి చూడగా వైశాలిలోని లిచ్ఛవీ యువతీ-యువకులంతా వచ్చియున్నారు. వారిలో నా బాల్యమిత్రు లనేకులున్నారు. వారందరినీ అక్కడ చూడగలిగినందుకు నే నపరిమితానంద మనుభవించాను. ఎనిమిది, పది సంవత్సరాల వయస్సులో వాళ్ళను విడిచి వెళ్ళాను. ఇప్పు డందరూ పెద్దవాండ్రయి దుక్కల్లావున్నారు. రివాజు ననుసరించి నే నా నాడు రోహిణితోనే నృత్యంచెయ్యాలి. వైశాలి అందాలరాణి-క్షేమ - నా మిత్రుడు కపులుని తన జతగా ఎంచుకుంది. సమూహ నాట్యం, జంటనృత్యం మొదలైనవి ఒకటొకటిగా సాగుతున్నాయి. నాటి నృత్యంలో వైశాలియందేగాక వజ్జిదేశం మొత్తంమీద పేర్వడసిన యువతీ - యువకులు పాల్గొన్నారు; మరి వారి నృత్యాన్నిగూర్చి నేను ప్రత్యేకంగా ప్రశంసించట మెందుకు?

అలసిపోయినవారు పోయి కూచుంటూంటే కొత్త జోళ్లు రంగంలోకి వచ్చే వారు. విశ్రాంతి సమయంలో సేవించేందుకు మధు - మాంసాలను పంచాయతీయే ఏర్పాటు చేసింది. ఆ నృత్యమహోత్సవం ముఖ్యంగా తక్షశిల నుంచి వచ్చిన అతిథుల గౌరవార్థం ఏర్పాటుచేయబడింది.

మే మిద్దరము మా బసకు మగిడి వచ్చునప్పటి కిం కెంతో ప్రొద్దులేదు.



# 14. లిచ్ఛవీ అభిషేకము

నా మారుటితండ్రి గణసంఘ (పార్లమెంటులో)లో సభ్యుడు. ఆయన మరణించినందున యేర్పడ్డ ఖాళీస్థానంలో మరొకరిని యెన్నుకోవల్సి వచ్చింది. మా వంశంలోని పెద్దలంతా నన్నే ప్రతినిధిగా నిలబడమని ప్రోత్సహించారు; మా పినతండ్రి కొడుకు—అజిత్ కి పంచాయతీ (గణసంఘ)లో సభ్యత్వం సంపాదించాలని మహా ఉబలాటంగా వుంది. మా వంశంలో అతనికే యెక్కువగా భూములు, పశువులు వున్నై. అందుచే తనకే సభ్యత్వం పొందే అర్హత కలదని మా అజిత్ ఉద్దేశం. మాలో అభిప్రాయభేద మున్నందున గణసంఘ యెన్నిక జరుపవలసి వచ్చింది. నేను యెన్నికకు నిలబడకుండా తప్పుకోవాలనుకున్నాను; కాని, గణపతి (పంచాయతీ ప్రభుత్వాధ్యక్షుడు), సైన్యాధిపతి మా పంచాయతీ రాజ్యాన్ని ప్రమాద మెదుర్కొనబోతూన్న ఆ విషమస్థితిలో సభ్యుడుగా వుండ నిరాకరించటం స్వార్థత్యాగం కాదనీ, లిచ్ఛవీకర్తవ్య విముఖుడను కావటమేననీ నిష్ఠురంగా మాట్లాడసాగారు. తప్పనిసరియై తుదకు నేను అభ్యర్థిగా నిలబడటానికి ఒప్పుకోవలసివచ్చింది. అజిత్ కి అనేకమంది చెప్పిచూచారు; కాని, అతను 'ససేమిరా' అన్నాడు. తన మామ సేనాపతీ, పలుకుబడిగల యితరులూ తన్ను బలపరుస్తారనీ, పేదవాడనైన నాతో పోటీలో తనకు జయం ధ్రువమనీ అతనికి పూర్తి విశ్వాసం.

ఒకరోజున సంస్థాగారంలో గణసంఘ సమావేశమయింది. పిన్ని, అమ్మ, రోహిణికూడ ప్రేక్షకులుగా వచ్చారు. సమావేశ కార్యక్రమా న్నారంభించుతూ గణపతి సునందు డిల్లా చెప్పాడు.

"గౌరవసభ్యులారా! నేటి సమావేశానికి కారణం మీకు తెలుసు. ఖాళీఅయిన జ్ఞాతవంశీ సభ్యత్వస్థానానికి ప్రతినిధిని యెన్నుకోవలసివుంది. ఎన్నికకు నిలబడ్డ అభ్యర్థులపేర్లు చెప్పేముందు నేనొక విజ్ఞప్తిచేయదలచాను. మనమీది కొక అవాంతరంవచ్చి పడబోతోంది. మనం దాన్ని దృష్టిలోవుంచుకొనే యే ఒక్కఅడుగైనా ముందుకెయ్యాలి. మనం మన గణసంఘను దృఢతరము, శక్తివంతము గావించుకొనే విషయా న్నెప్పుడూ విస్మరించకూడదు."

"గౌరవ సభ్యులారా! ఎన్నికకు నిలబడిన అభ్యర్థులపేర్లు రెండు. ఒకటి సింహుడు, రెండు అజిత్. ఇద్దరూ జ్ఞాతవంశీకులే. వీరిలో ఒక్కరినిమాత్రం మన మెంచుకోవాలి. ఈ సభాసదులెల్లరూ ఏకపక్షంలో వున్నారో లేక

ద్వివిధాభిప్రాయాలు కల్గివున్నారో నేను ముందు తెలుసుకోగోరుతున్నాను. చిరంజీవి సింహునిపక్షం వహించగోరేవారు 'వున్నాం' అని చెప్పండి." అనగానే నలుగడలనుండి 'వున్నాం' 'వున్నాం' అన్న కేకలు వినిపించాయి. తర్వాత అశ్లే అజిత్‌నికోరే సభ్యులనుగూర్చి అడ్గా మొదటికంటె తక్కువే అయినా అన్ని వేపులనుంచి 'వున్నా'మన్న కంఠధ్వనులు వినవచ్చినై. అంతట అధ్యక్షుడు మళ్ళీ చెప్పాడు.

"గౌరవ సభ్యులారా! మీలో అభ్యర్థులిద్దరిని కోరేవారూ వున్నట్టు తేలిపోయింది. కాబట్టి యిప్పుడు ఒక సమ్మతి సూచక కాష్ఠశలాకలను (చువ్వలు) చేపట్టించక తప్పదు. ముందుగా యీ సమావేశానికి ఎంతమంది గణసంస్థ సభ్యులు వచ్చారో మన గణకునిద్వారా వినగోరుతున్నాను."

గణకుడు హాజరైన సభ్యుల సంఖ్య 872 అని చెప్పాడు.

గణపతి— "వజ్జిదేశంలోవున్న ప్రతి సభ్యునికి నేటి యీ సమావేశ సూచన అందజేయబడింది. కాబట్టి, గౌరవ సభ్యులారా! ఇక్కడికి హాజరుకాగల సభ్యులందరూ వచ్చారు. ప్రస్తుతం హాజరైన గణసంస్థ సభ్యుల్లో వున్నాడు లెవరూ లేరనుకొంటాను; కాక, ఉన్నట్టయితే ప్రక్కనున్న సభ్యులు వారు తెలిపెదరుగాక!" కొంచె మాగి "ఎవరూ మాట్లాడనందున యిందున్నాడు లెవరూ లేరనే అభిప్రాయపడుతున్నాను. మద్యపానంచే మత్తిల్లిన వారెవరైనా వుంటే ప్రక్కనున్న సభ్యులా వివరం చెప్పండి" మళ్ళీ ఆగి "ఎవరూ మాట్లాడ నందున తాగి కైపెక్కి వున్నవారెవరూ లేనట్లే భావింఛుతున్నాను" అని రెండు కఱ్ఱ చువ్వలను చేతితో ఎత్తి పుచ్చుకొని "గౌరవ సభ్యులారా! ఈ ఎఱుపు నలుపు చువ్వలలో ఎఱ్ఱది 'ఔ' ననటానికి అంటే అంగీకారానికీ, నల్లటిది 'కాద'నటానికి అంటే అనంగీకారం తెలుపడానికీను. చువ్వలు పంచిపెట్టేవారు రెండు ప్రత్యేక బుట్టలతో చెరి 872 చువ్వలు మీ వద్దకు తీసుకొస్తారు. నేను పేర్కొన్న అభ్యర్థికి అనుకూలంగానో ప్రతికూలంగానో మీ యిచ్ఛానుసారం అందుకు నిర్ణయింపబడిన రంగు చువ్వలను తీసుకోండి. రెండో అభ్యర్థి పేరు చెప్పినపుడు కూడ అల్లాగే తీసుకోండి. ఏ ఒక్కరూ ఒకటికి మించి ఎక్కువ చువ్వలను తీసుకోకూడదు. ఎక్కడైనా బుట్టలోనుంచి జారి చువ్వలు క్రిందపడితే చూచిన వారు చువ్వలను పంచేవారికి అందజేయండి."

"గౌరవ సభ్యులారా! ఇదివరకు మన సమావేశాల్లో శలాకలను పంచుతూండిన పదిమందే యిప్పుడూ పంచుతారు. వారిలో ఎవరియందైనా ఎవరికేమాత్రం అవిశ్వాసమున్నా చెప్పివేయండి. ఆక్షేపణ లేకపోతే మౌనం వహించండి......రెండోసారి అడుగుతున్నాను. చువ్వలను పంచేవారిలో ఎవరియందైనా విశ్వాసం లేకపోతే చెప్పండి. అందరియందు నమ్మకముంటే మాట్లాడ నక్కరలేదు......మూడో పర్యాయం మళ్ళీ అడుగుతున్నాను. ఎవరికైనా

అనుమాన ముంటే చెప్పండి. అనుమానం లేకపోతే మౌనం దాల్చండి."...... గౌరవసభ్యు లందరూ మౌనముద్ర వహించినందున చువ్వలనుపంచే పదిమంది యందు గణసంస్థకు పూర్తి విశ్వాసం వున్నట్లు నిర్ణయించుతున్నాను."

"గౌరవ సభ్యులారా! వినండి, నేను ముందు చిరంజీవి సింహుని పేరు మీ ముందుంచుతున్నాను. చువ్వలను పంచేవారు మీ మధ్య కొచ్చారు. వారుమీలో ప్రతిఒకరిచెంతకు చువ్వలను తెస్తారు. అందరూ తమ తమ స్థానాల్లోనే కూచొని వుండండి. చిరంజీవి సింహునికి ఓటివ్వదలచినవారు తలొక ఎర్రచువ్వను తీసి కోండి వ్యతిరేకించగోరేవారు నల్లచువ్వలను పుచ్చుకోండి. ఇకమీరు నిశ్శబ్దంగా చువ్వలను గ్రహింతురుగాక. ఎవరికైనా ఏదేని సందేహంకల్గిన యెడల చువ్వలను పంచువారి చెవిలో అడుగవచ్చును."

చువ్వలను పంచేవారు రెండు రంగుల చువ్వలు రెండు ప్రత్యేక బుట్టలతో తీసుకొళ్లి ప్రతి సభ్యునిముందు పెడుతూ వెడుతూంటె సభ్యులు తమ కిష్టమైన రంగుచువ్వలను తీసుకున్నారు. పంచటం పూర్తి అయిన తర్వాత పంచేవారు గణపతి వద్దకు చేరుకున్నారు. అప్పుడు గణపతి చెప్పాడు – "గౌరవ సభ్యులారా! సమ్మతులను (ఓట్లు) సూచించే చువ్వలు పంచబడినవి. ఎవరికైనా చువ్వ అందక పోయినా, ఒకటికి మించి ముట్టినా, యింకే పొరబాటు వాటిల్లినా తెలుపగోరు తున్నాను. ఏ ఆక్షేపణాలేనివారు మొదలుకుండ కూచొనివుండండి. రెండోసారి కూడా అడుగుతున్నాను...మూడో తడవకూడాను...అందరూ మౌనంగా వున్నం దున ఎల్లరికి చువ్వ లందినట్లే భావించుతున్నాను."

అప్పుడు గణపతి తిరిగి తేబడిన బుట్టలలోని చువ్వలను విడివిడిగా లెక్క పెట్టాడు. ఎర్రచువ్వలయిదున్నూ, నల్లటిచువ్వలు 867 న్నూ మిగిలివున్నై. గణపతి యిల్లా ప్రకటించాడు—"గౌరవసభ్యులారా! ఇప్పుడు నావద్ద అయిదు ఎర్రటివి, ఎనిమిదివందల అరవయ్యేడు నల్లటిచువ్వలు మిగిలివున్నై. అంటే మీలో 867 మంది తమ సమ్మతులను చిరంజీవి సింహునికి అనుకూలంగా యిచ్చారు. అయిదుగురు వ్యతిరేకాభిప్రాయాన్ని తెలిపారు. తటస్థంగా ఒక్కరూ లేరు. ఇక మీ చెంతకొచ్చినవారికి చువ్వలను తిరిగి యిచ్చివేయండి."

చువ్వలన్నీ తేబడినపిదప మళ్ళీ అన్నిటినీ లెక్కపెట్టి బుట్టలలో పెట్టారు. గణపతి మరల చెప్పాడు—''గౌరవసభ్యులారా! వినుడు; నేనిప్పుడు చిరంజీవి అజిత్‌ను మీముందు కోర్కొంటున్నాను. అజిత్‌కి అనుకూల సమ్మతినీయ గోరేవారు ఎర్రటిచువ్వలను, అసమ్మతి తెలుపదలంచువారు నల్లటిచువ్వలను తీసుకోండి......"

తిరిగి తేబడ్డ చువ్వలను లెక్కించగా యెర్రవి 872 అల్లాగే వున్నై. నల్లటివి పొంతంఅయిపోయి ఖాళీబుట్టమాత్రమే మిగిలింది. గణపతి మళ్ళీ ప్రకటించాడు,

"గౌరవ సభ్యులారా! నల్లటి చువ్వ ఒక్కటీ నావద్దకు తిరిగిరాలేదు. ఎఱ్ఱటివి ఎనిమిదికందల డెబ్భై రెండు వున్నాయి. దీనిభావం మీలో ఒక్కరూ చిరంజీవి అజిత్‌కి ఓటివ్వలేరన్నమాట.

"గౌరవ సభ్యులారా! చిరంజీవి సింహునికి, చిరంజీవి అజిత్‌కి జరుపబడిన ఎన్నికలో తేలిన చువ్వల లెఖ్ఖనుబట్టి మన గణసంస్థ చిరంజీవి సింహుని తన సభ్యునిగా స్వీకరించినట్టు నిర్ణయించుతున్నాను. గౌరవనీయులైన సభ్యులారా! మరి కొంచెంసేపు ఓపికతో వుండండి. నే నిప్పుడే కార్యనిర్వాహక వర్గంతో సంప్రదించి చిరంజీవి సింహుని అభిషేక తిథిని తెలియపరుస్తాను."

గణపతి మంత్రివర్గంతో ప్రక్కగదిలోకి వెళ్ళి అనతికాలంలోనే తిరిగివచ్చి "గౌరవసభ్యులారా! నేటి కయిదవరోజున చిరంజీవి సింహునికి అభిషేకం జరప టానికి నిశ్చయింపబడింది" అని చెప్పాడు.

సభామందిరమునుండి బయటికి రాగానే ముందుగా నన్నాలింగనంచేసి అభినందించింది అజితుడే. "అన్నా సింహా! నీకు నా అభినందనాలు. యోగ్యునికే ఓట్లు లభించినందుకు నాకు చాల సంతోషంగా వుంది"అన్నాడు.

నేనూ అతన్ని కౌగలించుకొని కృతజ్ఞత తెలియజేశాను. నా ప్రక్కకొచ్చి నిలబడిన రోహిణికికూడ 'వదినా, నీ కివే నా అభినందనా' లన్న అజిత్ శిరాన్ని ఆమె ముద్దాడింది.

అజిత్ మళ్ళీ నాతో "అన్నా! ఇవాళ సాయంత్రం మీరు మా యింటికి రావాలి. అక్కడికి మన జ్ఞాతవంశపు యువతీ-యువకు లంతా వస్తారు. నీ గౌర వార్థం నేను చేయబోతూన్న ఆ విందుకు తక్షశిల సౌహార్దసంఘంవారినికూడ ఆహ్వానించుతాను" అని చెప్పాడు.

వెంటనే రోహిణి అందుకొని "మరి భామ అక్కయ్యో?" అనడిగింది.

"భామ జ్ఞాతవంశపు పడతికాదు వదినా! అయినా నువ్వు చెప్పావు కాబట్టి యిప్పుడే ఆమెనుకూడ పిలుస్తాను. అయితే నన్నామె బారినుంచి కాపాడే భారం నీది సుమా!" అన్నాడు అజిత్.

"ఏమిటీ! భామక్కయ్య మనుషుల ప్రాణం తీసేస్తుందా?" అన్నది రోహిణి నవ్వుతూ.

"ప్రాణంతీస్తే నయమే వదినా! భామ వుడికించి వుడికించి మరీ చంపు తుంది. దురదృష్టవశాత్తు నే నొకసారి ఆమెవుచ్చులో పడ్డవాడినే. నీ తోడు రోహిణీ! నీ మాట తీసెయ్యలేక నే పిలుస్తున్నాను. మరి నువ్వు కాదనకుండా నన్నామె వాగ్బాణాల నుండి కాపాడాలి."

"అల్లాగేలే మరదీ!" అని రోహిణి అభయహస్త మిచ్చింది.

జనసమితి (గణసంస్థ) సభ్యులంతా నన్నభినందించారు. అభినందనా లందు కోవడంతోను, కౌగలింతలతోను కొంతసేపు జరిగిపోయింది.

మేము యింటికి చేరుకొనేటప్పటికే భామవచ్చింది. ఆమె యెగిరి గంతేసి నావద్దకొచ్చింది. నాకు భయంవేసింది నాకప్పుడు భామనుగూర్చి అజితుడన్న మాటలు జ్ఞాపకంవచ్చినై. భామ నన్ను తన బాహువల్లరితో బంధించి నా లలాటము, కన్బొమలు, చెంపలమీద ఒకేవరసని ముద్దులు పెట్టింది. అప్పుడు నన్నొదిలి రోహిణిని చేరదీసుకొని హర్షాతిరేకంచే చెమ్మగిలిన నేత్రాలతో చూస్తూ ఆమెను ముద్దులాడింది. రోహిణి కళ్ళుకూడ చెమ్మగిలినై. ముందు భామే నోరు విప్పింది—

"రోహిణీ! ప్రియరోహిణీ!! నేనపరిమితానందంలో ఉబ్బి తబ్బిబ్బవుతున్నాను. గర్వపడుతున్నానుకూడాను. ఇంత అల్పవయస్సులో జనసమితిసభ్యులవగల్గినవారు చాల తక్కువగా వుంటారు. మన సింహుడు దాని కంత్రైసా అర్హుడు. సరేగాని, రోహిణీ! అజిత్ నవ్వుతూ నీతో చెపుతున్నా డేమిటి?"

"నవ్వుతూ కాదక్కా! బిక్కమొగంతో."

"అదేమిటో నేను వినవచ్చా?"

"నేను వినదగింది నువ్వూ వినొచ్చునక్కా!"

భామ రోహిణీమోము ముద్దాడి "నీకు నాయందున్న విశ్వాసానికి ధన్యవాదాలు రోహిణి!" నాకు తోబుట్టువు లెవరూలేరు భామక్కా! అందుకోసం నే నెంత తపించాను! స్నేహపాత్రురాలివి నువ్వొక సోదరివి దొరికావు. అలాంటి అక్కవు నీ ముందునాకు దాపరిక మెందుకు?" అంటూంటే రోహిణికళ్లు మెరిశాయి.

భామ రోహిణిని యెదకదుముకుంటూ, ఆనందబాష్పబిందువులు రాలుస్తూ అంది— "చెల్లీ! నువ్వెంత మంచిదానవే! నిన్ను కాస్సేపుచూడకపోతే నా మతి మతిలో వుండక, బాగుండటంలేదు. సొంతసోదరికైనా లభించని స్థానాన్ని నువ్వు నా హృదయంలో సంపాదించావు రోహిణీ!"

"అక్కా! నువ్వు అజిత్‌ను గురించి అడిగావుకదూ? అతడు నన్ను, సింహుని వాళ్లింటికి విందుకు ఆహ్వానించాడు. సాయంత్రం అక్కడ జ్ఞాతవంశ తరుణీ - తరుణులంతా సమావేశమవుతారట."

"జ్ఞాతవంశంవాళ్ళు మాత్రమేనా?"

"అవును, అంతేనట. కాని, నువ్వు లేకుండా వెళ్లటానికి నేను అంగీకరించలేదు. నిజం అక్కయ్యా! నిన్నుకూడ పిలవమని నే నంటే పాప మతను బిత్తరపోయాడు."

"ఏమిటీ, బిత్తరపోయాడా?"

"మరే, నిన్ను పిలవటానికి ఒప్పుకున్నాడు; కాని, నీ నిశిత వాగ్జాలం నుంచి తన్ను నేను తప్పించాలట. అల్లాగేనని అభయదాన మిచ్చేవరకూ వదల్లేదుగా."

"బలే మగాడివోయి అజిత్! భామ మాటలధాటికే తట్టుకోలేనివాడివి నువ్వా ఒక పురుషుడవే! అయితే - రోహిణీ! నువ్వు మాట యిచ్చావా?"

"ఇచ్చా నక్కా!"

"ఇస్, మాట జారకుండా వుంటే ఎంత బాగుండేది? ఆ మొనగాడు భామ చేతులు పట్టుకొని, బ్రతిమాలి పిలుచుకువెళ్ళకుండా యెల్లా వుండేవాడో చూచేదాన్ని."

"నిన్ను పిలవడానికిముందుగా సరేనని, తర్వాత బ్రాధపడ్డాను; అంచేత వాగ్దాన మివ్వక తప్పలే దక్కా!"

అమ్మ, పిన్ని - యిద్దరూ సంతోషంగా సేవున్నారు. వారు వేరేగదిలో దర్బారు సాగించారు. అక్కడ వృద్ధ లిచ్ఛవియాణులు నాకు పదవిలభించినందుకు సంతసాన్ని వెలిబుచ్చుతున్నారు. శూరసేనుడు (సోమపతి) నా రాక తెలిసి వుత్తర సరిహద్దునుంచి నేడే వచ్చాడు. మా మాటల సవ్వడి విని గబ గబ మాచెంత కొచ్చాడు. వెంట సోమ కూడవుంది. అతని నేత్రాలింకను జోత్తుల్లా వుండటం వల్ల రాత్రంతా నిద్రలేకుండా ఏకాయెకీని ప్రయాణంచేసి వచ్చినట్టు తెలుస్తూనే వుంది. కొంతసేపు నిద్రపోనిదే అత డేపనీ చేసేస్థితిలోలేడు. అయినా మావద్ద కొచ్చి రోహిణిలలాటం మీద ముద్దుపెట్టుకున్నాడు. నన్ను కౌగలించుకొని "సింహా! నిన్నుచూచే దుకు ఎంత ఆత్రపడ్డాను! నిన్నవుదయం కబురు అందగానే ఆపళంగా బయలుదేరి వచ్చేశాము" అన్నాడు.

కుశలప్రశ్న లయిన తరువాత "శూరసేనా! వుత్తర సరిహద్దులో భయ మేమీ లేదుగద?" అనడిగాను.

"లేదు, అక్కడ ఏనుగులు, ఖడ్గమృగాలు, సింహాలభయం మాత్రం వుంది. ఈ మధ్య రెండు ఏనుగుల్ని చంపాను. ఒక్కొక్క దంతం నాలుగుమూరల పొడుగుంది. హడావుడిగా బయలుదేరటంవల్ల తేలేకపోయాను. వాటిని రోహిణొడినకి బహూకరిస్తాను."

భామ మధ్యలో అందుకున్నది— "రోహిణికా? సింహునికేమీ లేదా? ఏమిటీ పక్షపాతం?"

శూరసేనుడు — "నేను వాటిని అన్నయ్యకే యిస్తే 'ఏమిటీ పురుష పక్ష పాత బుద్ధి' అని భామ యెత్తిపొడవదూ?"

భామ— "రోహిణికి దంతాలు సమర్పించుకొని ఉత్తిచేతులు సింహునికి చూపిస్తావా?"

శూర— "ఉత్తచేతులేం కర్మం! అన్నయ్యకోసం ఖడ్గమృగ చర్మాలతో డాలులు తయారవుతున్నై. ఒకటి కాదు, ఆరు."

భామ— ఏమయ్యో మరదీ! మీ వదినకి నువ్వేనన్నమాట? నా వేలాది ముద్దులు వృధా అయినట్టేనా?"

''మరి, ఒదినా! యీసారి ఒక్క ముద్దయినా యిచ్చావూ నాకు ?"

భామ వెంటనే శూరసేనుని మెడకు పెనవేసుకొని ముద్దుమీద ముద్దెట్టి అన్నది— ''ఇదిగో, సరేనా మరదీ! యిక చెప్పు."

శూరసేనుడు చప్పున తన కంచుకములో దాచిపెట్టిన దంతపుఒరలోనుంచి కరవాలాన్ని లాగి భామచేతి కందిచ్చాడు. ఆమె ప్రోలమోకాళ్ళమీద వొంగి కైమోడ్చి అన్నాడు—దేవీ! ఈ దాసుని కానుక స్వీకరించు. నా బాహువులకు పుష్టిని ప్రసాదింతువు గాక!"

భామ ఖడ్గాన్ని చూచుకొని ప్రఫుల్లవదనంతో ''ఇష్టసిద్ధిరస్తు! శూరసేన! నీ ఆరాధ్యదేవి నిన్ను నిలబడమని ఆదేశించుతోంది. తనివితీర ముద్దాడవచ్చని వరమిస్తోంది."

శూరసేనుడు చివ్వునలేచి ముద్దులతో భామచెక్కిళ్ళ నెరుపెక్కించాడు. అప్పుడందరు ఒరపైన చెక్కబడివున్న చిత్రాలను శ్రద్ధతో చూడసాగారు. ఒరకొకప్రక్కన అడవియేనుగులగుంపు చిత్రింపబడింది. అందు పెద్దదంతాలున్న గజసర్దారును చిత్రించుటలో చిత్రకళానైపుణ్యము అత్యద్భుతంగా ప్రదర్శింపబడింది. రెండోవేపున చెట్లవెనకాల సింహాలజంట తమ రెండుకూనలతో వున్నట్టు చిత్రింపబడింది. ఆడసింహం పడుకొనివుంది. మగది నాలుకతో ప్రియురాలి చెవుల్ని నాకుతోంది. కూనలు తల్లితోకతో ఆడుకుంటున్నాయి. భామ తదేకంగా కొంతసేపుచూచి ''మరదీ, శూరసేనా! నిశితకృపాణము, చక్కని ఒరను బహూకరించినందుకు నీ కివే నా కృతజ్ఞతావందనాలు" అని శూరసేనుని కళ్ళలోకి చూస్తూ ''మిగతావారి కింతవరకు నోటిమాటలతోనే సరిపెట్టావు; కాని, —మరదీ! ఈ సుందరఖడ్గాన్ని కానుకగా యిచ్చి నీకు భామ ముద్దులం దెంతప్రీతో బుజువుచేసుకున్నావు" అంది మందహాసంచేస్తూ.

"ఇక్కడ వినీలకుంతలాలకు, సుందర నేత్రాలకు వున్న గౌరవమేగా వదినా! ఇందులో నేను చేసిన దేముంది ?"

"నువు తాత్సారం చేశావు మరదీ! లేకుంటే నా యీ కేశపాశంతో మనూనికాక నిన్నే కట్టివేసేదాన్ని."

"కాదు వదినా! నేను నీ సిగలో చిక్కుకొనే వున్నాను."

"అల్లాగా! నాకు తెలియకుండానే ?"

"పురుగులు దీపానికి చెప్పి వెళ్లిపడతయ్యా ?"

"అక్కడ పెద్దపురుగు పడి మాడి కముకుకంపు గుప్పుమంటూండగా కూడానా?"

"క్రిమి - కీటకాలకు కళ్లూ చెవులూ మండవ్ వదినా! వాటికుండేది మన సొక్కటే."

భామ శూరసేనుని మరొకసారి ముద్దు పెట్టుకుంది. శూరసేనుడు తనకు తగిన జోడని తలుస్తూన్నట్టు మెరిసిపోతున్న ఆమెకళ్లు, అరుణవర్ణందాల్చిన కపోలాలు ద్యోతకం చేస్తున్నాయి.

మేమా సాయంత్రం అజిత్ యింటికివెళ్లి జ్ఞాతివంశ యువతీ యువకుల సమ్మేళనంలో పాల్గొన్నాము. అక్కడకూడ పాన - గాన - నృత్యాలున్నవి. ఆ వేళ అక్కడ జరిగిన ఒక విషయంమాత్రం జ్ఞాపకంవుంది. సంభాషణ సందర్భంలో ఎవరో జైనమత ప్రవర్తనుగూర్చి ప్రస్తావించారు. నేనదివిని ఆ మత ప్రవర్తకునిగూర్చి వివరాలడిగాను.

అజిత్ చెప్పాడు— "మన వంశంలోనే పుట్టి సాధువైనాడని".

నేను— "మన వంశీయుడా? నాకు తెలియనే తెలియదే!"

అజిత్—"యిప్పుడాయనతపో - తేజాలను గురించి వజ్జిదేశమందేగాక అన్యత్రకూడ కీర్తి వ్యాపించింది."

నేను— "నీ వాయన్ను చూచావా అజిత్ ?"

అజిత్—చూడకేం ? చాలసార్లు దర్శించాను. నిరుడు యిక్కడ మహావనంలో నాలుగు నెలలు మకాంవేశారు."

నేను—"మంచి తేజోవంతుడాయేం ?"

అజిత్—"తేజస్సో గీజస్సో నేనెరుగను; గ్రీష్మ, శీత, వర్ష ఋతువులన్నిటిలోను ఆయన దిసమొలతోనే వుండటం మాత్రం నాకు తెలుసు."

రోహిణి—"దిసమొలతో! స్త్రీల ముందుకూడానా ?"

అజిత్—"అవును వదినా! వస్త్రహీనున్ని నిర్గ్రంథు లంటారు. నేను కోపం పట్టలేక ఆయనగొంతు నులిమెయ్యాలని రెండుదఫాలు వెళ్ళాను; కాని, ఆ అంగములమూచి సిగ్గుతో నా తల దించుకుపోయింది."

రోహిణి—నిజమేనా మరదీ! ఏ పురుషుడుమాత్రం సిగ్గు విడిచి అల్లా వుండగలడా ?"

అజిత్—"మరి వాన్నే మన మూర్ఖు లెందరో తపో—తేజ మని మెచ్చుకుంటున్నారు."

రోహిణి—"దిసమొలతత్వం మాత్రమేనా, వారిలో యింకేదైనా విశేషం వుందా ?"

అజిత్—"నాకు తెలియదు, తెలుసుకోవాలని ప్రయత్నించను కూడాను. వారి దిసమొల తత్వంతోనే నేను సంతృప్తి చెందాను. ఏం సోదరా సుభద్రా! నువ్వు నిగంఠుల ప్రియశిష్యుడవయ్యావుగా, వదిన కా వివరాలన్నీ చెప్పు."

సుభద్రుడు—"అజిత్ ! నీలో ధార్మిక విషయ వాసనే శూన్యం. సాధు సత్తములను దుయ్యబట్టడం మాత్రం నీ కిష్టం."

అజిత్—"సాధుల సంగతి వద్దులే సుభద్రా! మీ వర్ధమాన మహావీరుని గురించి వదినకు చెప్పుమా. ఆవిడ అమాయకురాలు కాదని నీకే తెలుస్తుందిలే."

సుభ—"అయితే నిగంఠ శిష్యులు శుద్ధ మూర్ఖులనేగా నీ అభిప్రాయం?"

అజిత్—"సిగ్గూ శరమూ లేనివాళ్ళని కూడాను."

సుభద్రుడు—చలిలో, ఎండలో నువ్వా రీతిని దిస మొలతో వుండగలవూ?"

అజిత్—"ఆ పనికి నే నెందుకు? నా ఆవులూ, పందులూ మొండి మొల తోనే వుంటున్నై!"

సుభద్రుని ముఖం కోపంతో జేవురించింది. అజిత్ నవ్వుతూ అతని భుజమ్మీద చెయ్యేసి అన్నాడు —"సోదరా సుభద్రా! నన్ను నాస్తికుడంటూనే వున్నావుగా. మహావీరుడు జ్ఞాతృ వంశం వాడయినా, నీ ఉపన్యాసం విన్నా నాకాయనయందు భక్తి కుదరటంకల్ల; అయితే నీ భక్తిని ఆక్షేపించటం ఉచితం కాదని ఒప్పుకుంటాను. ఇందుకు నన్ను క్షమించి వదిన జిజ్ఞాసను పోగొట్టు''.

అజితుని వాగ్ధోరణి భామకు ముదము గూర్చినట్టు గమనించాను. సుభద్రుడు రోహిణికి నిగంఠపురాణం చెపుతూంటే, భామ అజితుని చేయి నొక్కి, చెవిలో "శభాష్! బలే చక్కగా అంటించావు మాటలు. ఈ జైనుల పని బాగా పట్టావు!" అన్నది.

అంతవరకూ భామనుచూచి బెదురుతూన్న అజిత్ ఆమెపరివర్తనంగాంచి సంతృప్తిచెంది, కృతజ్ఞతను తెలిపాడు చూపుల్తో.

సుభద్రుడు—"గాంధారపడతీ! దిసమొలతత్వం జైనుల తపస్సుల్లో ఒక భాగమే. తపస్సు లన్నింటిలోకి శారీరకతపస్సే గొప్పది. పాపవిముక్తులు కావటాని కిది మహోపాయము. దేహాన్ని యెండబెట్టి, కష్టపెట్టుటద్వారా వెనుకటి పాపాలన్నీ హరించుతాయి. జన్మ, జన్మాలనుంచీ పేరుకున్న పాపాలను పోగొట్టుకోనిదే శాశ్వత సుఖాన్ని పొందలేము. అందువల్లనే మహావీరుడు 'శిష్యులారా! జన్మ - జన్మాంతరపాపాలను పారద్రోలేందుకు దేహాన్ని తపింపజేయండి. శీత, తాపాలను సహించండి. అనశనవ్రతమాచరించండి' అని సెలవిచ్చారు.

రోహిణి—"నిరాహారమా?"

సుభద్రుడు—"అవును, నిరాహారమే. భగవాన్ మహావీరుని శిష్యులు,శిష్యురాండ్రలో అనేకమంది నలభై యాభై రోజుల పర్యంతం ఉపవాసంచేస్తూంటారు. అంతేకాదు, ఆజన్మ అనశనవ్రతమూని జీవితాలనే చాలించినవారు కూడ వున్నారు. ఆరీతిని తమ పాత — కొత్త పాపాలనుండి విముక్తులయ్యారు. ఈ మార్గం దుర్గమమేకాక కష్టసాధ్యంకూడాను. మరి సుఖంతో సుఖప్రాప్తి కాదుగా. అమ్మాయ్! సుఖప్రాప్తికిముందు దుఃఖ పర్వతాలనేకం దాటాలి. మన సర్వ దుఃఖాలకు పాపాలేకారణం. వాటిని దూరంచేసుకోటానికే కాయాన్ని కష్ట

పెట్టాలి. దుఃఖాన్నుంచి తప్పించుకుంటానికి యెట్టి క్షుద్ర ప్రాణులనైనా హింసించడం మానుకోవాలి."

రోహిణి—"అతి క్షుద్రప్రాణులంటే ఏవని మీ వుద్దేశం ?"

సుభద్రుడు—"భగవాన్ మహావీరుడు సర్వజ్ఞులూ, సర్వదర్శులూను. గతంలో జరిగిందీ, యిప్పుడు జరుగుతున్నదీ, ముందు జరుగనున్నదీ—యింటాయనకు తెలియని దేదీ లేదు. ఆయనకు నడుస్తున్నా, కూచున్నా, నిద్రలోనూ, జాగ్రదావస్థలోకూడ సర్వం తెలుసు. మనకు యెరుక లేనివన్నీ సర్వజ్ఞులు, సర్వదర్శి అయిన మహావీర భగవాను డెరుగును. స్థూలంగాను సూక్ష్మంగాను కనపడే ఏనుగులు, చీమల్నే కాదు; నీరు, గాలి, అగ్ని, భూమియందుండే ఏ క్షుద్రప్రాణినీ హింసచేయరాదని ఆయన శిష్యుల కుపదేశించారు. అసలు నీరు కూడ ఏకేంద్రియజీవమని చెప్పారు. మనకి తెలియకుండానే అనుక్షణము యెంత జీవహింస జరుగుతున్నదో కోడలా ?"

రోహిణి—"ఎంతని చెప్పగలం? అస లాలోచించటానికే శక్యంకాదు."

సుభద్రుడు—"అందువల్లనే భగవాన్ మహావీరుడు మనం వూపిరి పీల్చటంలోకూడ అంతులేని పాపం చేస్తున్నా మన్నారు."

రోహిణి—"దీన్నిబట్టి జీవితంలో పాపా మినహా యింకేం లేదన్నమాట?"

సుభద్రుడు—"నిస్సందేహంగాను. భగవాన్ మహావీరుడు ఈ అపవిత్ర జీవితాన్ని పాపక్షయానికి వుపయోగించ మన్నారు."

రోహిణి—"అయితే, జైనమత ప్రవక్తం అన్ని విధాలా జీవహింసను వదలమని ఉపదేశించుతున్నారన్నమాట."

సుభద్రుడు—"అవును; మనోవాక్కాయ కర్మలందు దేనిద్వారానూ, ఏ జీవాన్నీ చంపకుండుటేగాక ఏమాత్రం బాధించరాదనేది వారి సూక్తి."

రోహిణి—"ఖూనీచేసిన హంతకుడిని కూడానా?"

సుభద్రుడు— "వానిపాపమే వాణ్ణి దండించుతుంది. జైనధర్మావలంబకులు ఒకరిని శిక్షించి పాపార్జన చేయవలసిన అవసరమే లేదు."

రోహిణి— "దుష్టుడో, దుర్మార్గుడో, ఒక ఆర్తురాలినో, అనాధనో లేక పసిబిడ్డనో చంపటానికి లేక చెరచడానికి వుద్యుక్తుడుగా వున్న స్థితిలో మహావీరుడు తన శిష్యుల నేమి చెయ్యమని ఆదేశించుతారు ?"

సుభద్రుడు— "మనోవాక్కాయములపై నిగ్రహం కల్గి వుండమని."

రోహిణి— "అంటే అకర్మణ్యత్వాన్ని ప్రదర్శించి, తన లజ్జ, మర్యాద, పౌరుషము, సర్వస్వము ఒక గూండాచేతిలో పెట్టటమనమాటే. ఇది మంచిదనే మీ యభిప్రాయామా ?"

సుభద్రుడు— "మంచిదే; కాని, జైన ధర్మాలన్నిటినీ పూర్తిగా ఆచరించడం అందరికీ శక్యంకాదులే."

భామ— "కనీసం తానొక మనిషి ననుకొనేవ్యక్తికి అసలేసాధ్యం కాదు."

భామ కలుగజేసుకోగానే సుభద్రుడు కొంచెం నాలిక సంబాళించుకున్నాడు.

ఈవిధంగా ప్రియమిత్రులను, బంధువులను కలసికోవటము, వినోద, విలాసక్రీడలలో పాల్గోవటంతో నా అభిషేకదినం వచ్చేసింది. వైశాలి పుష్కరిణిలో స్నానాభిషేకం అత్యంతగౌరవప్రదమైనది. జనసమితికి సభ్యుడుగా ఎన్నుకోబడిన వారికి మాత్రమే అందులో తానమాడే అర్హతవుంటుంది. ఈ అభిషేక మవడంతో రాజైపోతాడని బయటివాళ్ళు అపార్థం కల్పించారు. వైశాలిలో 999 రాజులు వున్నారని చెప్పుకుంటారు. అభిషేకపుష్కరిణి మా పూర్వులు మొట్టమొదట వైశాలిని నిర్మించినప్పుడు యేర్పరచిన పాతకొలను. వైశాలిక్రమంగా విస్తరింపబడి విశాలనగరమై 'వైశాలి' నామం ధరించింది. కాని, ఆ పుష్కరిణి యథాస్థితిలోనే వుంది. లిచ్ఛవీపరివారాలు పెచ్చుపెరుగకముందు ప్రతిలిచ్ఛవీయువకుడు గణసంస్థ సభ్యుడయ్యేవాడు. ఇది సూచించటానికి పూర్వుల ఏకైక స్మృతిచిహ్నం-వారి శరీరస్పర్శచే పునీతమై శుభదాయకమైన ఆ పుష్కరిణిలో స్నానంచేయించేవారు. లిచ్ఛవుల ఆది వంశాలు తొమ్మిదీ వృద్ధిచెంది, పరివారానికి ఒక్కొక్క ప్రతినిధినే తీసుకున్నప్పటికీ సంఖ్య మితిమీరిన కారణంగా మొత్తం సభ్యుల సంఖ్య 999 గా నిర్ణయింపబడింది. కాబట్టి అప్పటినుంచి పుష్కరిణిలో అభిషేకం చేయబడ్డ సభ్యుల సంఖ్య 999 కి ఎన్నడూ మించదు. అభిషేకపుష్కరిణిచుట్టూ అహర్నిశలూ విచ్చుకత్తులపారా వుంటుందనీ, పిట్టలు కూడ అందొకచుక్క నీరైనా తాగకుండా దానిపైన యిత్తడితీగలు అల్లబడి వుంటాయనేవదంతు లన్యరాజ్యాలలో వ్యాపించినై. కాని, నిజాని కివన్నీ పుక్కిటి పురాణాలే. చాటుమాటుగా అందులో తానమాడినంతమాత్రాన ఎవడూ గణసంస్థ సభ్యుడు కాజాలడు. అయితే ఒక సంగతి: అభిషేక పుష్కరిణి ప్రాముఖ్యతను, తద్వారా పూర్వుల గౌరవాన్ని యినుమడింప జేసేందుకు సర్వసాధారణు లందులో స్నానమాడుట నిషేధించినమాట నిజమే. జనసమితి సభ్యులైనా తమ జీవితంలో ఒక్కపర్యాయంమాత్రమే అందులో స్నానంచేస్తారు. ఆ పుష్కరిణి ఆకృతిలో చిన్నదేగాని, నిర్మల జలంతో అతి రమణీయంగా వుంటుంది. దానికి నలువేపులా మెట్లతో రేవులున్నై. నీటిలో రంగు రంగుల పద్మాలు వికసించివుంటై. వానాకాలంలో అందలి నీరు మార్చబడుతుంది. సాయం సమయాల్లో చేపలుపట్టడానికీ, కమల శోభను తిలకించడానికీ స్త్రీ - పురుషు లనేకమంది పుష్కరిణిచుట్టూ చేరుతారు. అభిషేక మున్నప్పుడు రేవులు శుభ్ర పర్చబడి అన్నివైపులా తోరణాలతో అలంకరింపబడుతుంది.

నా అభిషేకంనాడు వైశాలి అంతటా అలంకరింపబడింది. ఆ దినం మహోత్సవ దినంగా ప్రకటింపబడింది. జుబ్బాలేకుండా ధోవతి ధరించి, వుత్త

రీయం పైన వేసుకొని నేను ముందు నడుస్తూంటే, నాకుముందు మంగళతూర్యములు మ్రోగుతున్నై. వెనక గణసంస్థసభ్యులు, వారినంటి నగరవ నులగు స్త్రీ-పురుషులు మహోల్లాసంతో అనుసరించి వస్తున్నారు. పుష్కరిణిప్రధానఘట్టానికి కొంతదూరంలో ప్రజాసామాన్యం ఆపివేయబడింది. అక్కడినుంచి ముందుకెళ్లడానికి పంచాయతీ (జనసమితి) సభ్యులకు మాత్రమే అనుమతి వుంటుంది. పుష్కరిణికి నాలుగు ప్రక్కలా సాయుధ భటులు బారులుతీరి నిలబడ్డారు. నేను మెట్లుదిగి నీటిదరికి వెళ్లగానే గణపతివచ్చి నా ముందు నిలిచాడు. ఆయన నాచే చేయించిన ప్రతిజ్ఞా సారాంశమిది:

"నేను లిచ్ఛవీ ప్రజాతంత్రం కొరకే జీవించి, అందు నిమిత్తమే ప్రాణమర్పించుతాను.

"జన సమితిచేసే నిర్ణయం ఎట్టి సందర్భంలోనైనాసరే, నా కనుసరణీయంగా ఎంచుతాను.

"పురాణ యుగంనుంచీ అమల్లోవున్న లిచ్ఛవీ కట్టుబాట్లైడింటిని తు. చ. తప్పక పాలించుతాను."

ఈ ప్రతినచేసి మంగళమేళములు మ్రోగుతూండగా నేను నీటిలోకి దిగాను. అందలి జలము వజ్జి, గాంధారాది పంచాయతీ రాజ్యాల్లోని చెరువుల్లోని నీటివంటిదే. ఇంతకంటె చక్కని రేవులనేక రాజధానినగరాల్లోని కొలనులకు వున్నవి. మా పుష్కరిణిలో కంటె అత్యంత రమణీయంగా వుండే పద్మనిలయాలూవున్నై; కాని, మా పుష్కరిణితోయములందు నా దేహాన్ని ముంచినప్పుడు నా కేదో అవ్యక్తానందం కలిగింది. అది సామాన్యజలం కాదనీ, పుష్కరిణికూడ అసాధారణ మైనదనీ అనిపించింది. మా లిచ్ఛవీ వంశపు ఆదిపురుషుని లగాయతు పూర్వులు యావన్మందీ నా చుట్టూ నిలబడి నన్ను స్పృశించుతూన్నట్లు, వారి స్పర్శచే నా దేహమందేదో నూతనశక్తి, స్ఫూర్తి (పరిపూర్ణత్వం) వృద్ధిచెందుతూన్నట్లూ వుంది. శతాబ్దాలనాటి గాఢాంధకారాన్ని చీల్చుకుంటూవచ్చి "మేమున్నూ లిచ్ఛవీ ప్రతినపూనిన వాళ్ళమే. మేమా ప్రతిజ్ఞను అక్షరాలా పాలించామని గర్వించుతున్నాం. మేము లిచ్ఛవీకత్తి పదునును మొద్దుబారనివ్వలేదు; ధ్వజాన్ని క్రింది కొరుగనీకుండా కాపాడాము వీరా అబ్బాయ్! లిచ్ఛవీపుత్రుడవని ఋజువు చేసుకోటానికి నువ్వు సిద్ధంగా వున్నావా?" అని వా రంటూంటే నా వీనుల్లో ప్రతిధ్వనించుతూన్నట్టుంది. నేను "తప్పకుండాను. నా లిచ్ఛవీ రక్తమే అందుకు తగిన ప్రమాణం. పితరులారా! నేడు లిచ్ఛవీపతాకం ప్రమాదావస్థలో నున్నదనుకుంటున్నారు. ఈ పరిస్థితిలో నేను నా కర్తవ్యాన్ని నిర్వహించి తీరుతాను. అయితే నాకు కేవలం మీ ఆశీస్సులు, ప్రోత్సాహం కావాలి" అనుకున్నాను మనసులో.

జీవితంలో మళ్ళీ పుష్కరిణిలో స్నానంచేసే అవకాశముండదు; కాని, అప్పుడు త్వరగా పైకి వచ్చేయాలన్న నియమం లేదు. అటువంటప్పుడు — మాఘ మాసపు శీతల జలమైనా - నే నా అభిషేకానందాన్ని తనివితీర అనుభవించకుండా యెల్లాలేచి వస్తాను? పుష్కరిణి ఒడ్డున బాజాలు మ్రోగుతున్నై. కొన్నిచోట్ల నాట్యం చేస్తున్నారు. ఒక ప్రక్కన నిలబడి భామ, రోహిణులు తదేక దృష్టితో నావంకే చూస్తున్నారు. అప్పుడు వారిముఖాలు వికసిత పద్మాల్లాగున్నాయి.

పుష్కరిణిలో నుంచి బయటికి వచ్చి నూతన వస్త్రాలను ధరించాను. జుల పాలు ముందుకు వదలి తలపాగ చుట్టుకున్నాను. ధనుస్సు, తూణీరము, ఖడ్గాలను అమర్చుకున్నాను. అనేకు లనేక రకాల పుష్పమాలలతో నా కంఠసీమ నలంక రించారు. తరువాత వెలుపల సిద్ధంగావున్న నా వారువాన్నెక్కాను. తతిమ్మా సభ్యులుకూడ రథాలమైన, గుర్రములమీద యెక్కారు. అందరము సంస్థాగారం లోకి చేరాము. అది ఆనాడు చక్కగా అలంకృతమైవుంది. నాలుగువైపులా తోరణాలు కట్టబడివున్నై. లోపల చక్కని తివాసీలు పరచబడ్డాయి.

సభ్యులెల్లరు సుఖాసీనులయిన తర్వాత గణపతిలేచి నేను సభ్యుడనైనట్టు ప్రకటించాడు. నా యోగ్యతను ప్రశంసించి, నన్ను దక్షిణ సేనానాయకునిగా నియమించుటను గూర్చి ప్రస్తావించాడు. ఇదివరకా పదవిని నిర్వహించుతూన్న రోహిణుకు సైనికసన్నాహంకోసం వైశాలియందే వుండిపోతాడని తెలియజేశాడు. ఇదివరకు 28 సం॥ల ప్రాయంలో సేనానాయకత్వం వహించినవారే నలుగు రైదు గురో మాత్రమే వుంటారనీ, అందులోనూ ముఖ్యమైన దక్షిణసేన కధిపతిగా అల్ప వయస్కుడగు సమర్థుడు నియమింప బడటాని కిదే మొదలనీ ఆయన చెప్పాడు.

నేను గణపతి అనుమతితో లేచి "గౌరవ సభ్యులారా! మీ బిడ్డనగు నా పట్ల మీరుచూపిన గౌరవానికి నేనర్హుడను కానేమో యని తలుస్తున్నాను; అయితే దక్షిణాన మన పవిత్ర వజ్జిభూమి శత్రువుల పాదపంకిలంచే కళంకితం కాకుండా కాపాడుట నా పరమ కర్తవ్యంగా ఎంచి, నా గురుతర బాధ్యతను నిర్వహింప ప్రయత్నించుతాను" అని చెప్పాను.

జనసమితి సంస్థాగారంలోనే భోజనాలకు యేర్పాటుచేసింది. ఆ విందులో వేటాడి తేబడిన పందులు, కృష్ణమృగాల మాంసము, యవలనుంచి తీయబడ్డ కల్లూ మాత్రమే వుపయోగింప బడినవి. మా ఆదిపురుషులు యట్టి విందులే చేసి యుండుటచే గణసంస్థ చేయు విందుల్లో ఏమార్పులేకుండా ప్రాచీనాచారాన్ని యధాతథంగా ఆచరించేవారు.

అభిషేకానందం ఒకప్రక్క వుండనేవుంది. పైగా సేనానాయకపదవీ విభూషితుడనైనందుకు మా యింట్లో ఆనందం వెల్లివిరుస్తోంది. బాబాయి (రోహణ్) కూడ సాయంత్రం యింటికి వచ్చేశాడు. ఈ వివరాలన్నీ ముందే తెలిసివుంటంవల్ల ఆయన ఆశ్చర్యపడాల్సిన పనిలేకపోయింది. వజ్జీ—మగధరాజ్య

సరిహద్దుల్లో అప్పుడే అల్లర్లు ఆరంభమైనట్టు ఆయన చెప్పాడు. క్రితం రాత్రి గంగను దాటి మా గడ్డమీదికి వచ్చిన మగధ గూఢచారులు కొందరిని మా సైనికులు బందీలుగా పట్టుకున్నారు. మగధ రాజుకు మాతోడి శత్రుత్వమంటే నిర్లక్ష్యంగా వున్నట్టు తేలిపోయింది. ఇక యుద్ధం అనివార్యంగానే కనపడుతోంది. మూడో నాడు యుద్ధ సమితి సమావేశం కాబోతున్నందున తాను వైశాలికి వచ్చినట్టు బాబాయి చెప్పాడు.



# 15. కమతం

మారుటి తండ్రి మరణానంతరం సంసార బాధ్యత కొంత కొత్తగా నా పైన పడింది. న్యాయంగా ఆయన ఆస్తి అంతా సోమకే దక్కాలి; కాబట్టి అమ్మాయికే చెందాలని అమ్మతో చెప్పేశాను. నా స్వంతయిల్లు (పితృగృహం) మరమ్మతు పూర్తయింది. రోహిణిసలహానుసరించి కిటికీలు వగైరా కొన్ని మార్పులు కూడ చేయబడినై. నేను వారం రోజులలోపలే హాజీపురం (ఉల్కాచేలం) వెళ్ళి పదవీ స్వీకారం చేయాల్సివుంది; కాబట్టి ఈ లోపుగానే మా స్వగృహంలో కాపురం పెట్టి ఒక్కనాడైనా గడపి పొమ్మంది రోహిణి. మేము స్వయంగా మా కొండ్ర విషయంలో కూడ ఏర్పాట్లు చేసుకోవాలి. భూములు పచ్చని గోధుమ, యవ పైరులతో కళకళ లాడుతున్నాయనీ, సేద్యగాండ్రు మంచివాళ్ళేననీ, పశువులు బాగా బలిసివున్నట్టూ తెలిసింది. మా భూముల్లో పెద్దపులి ఒకటి హంగామా చేస్తున్నదట; కాని, వుల్కాచేలానికి ప్రయాణం కట్టబోతూన్న నాకా అవ్యవధిలో బెబ్బులి పని పట్టడానికి యెసులు బాటేది? అందుచే పశువుల కొట్టానికి రక్షణగావున్న కలప ప్రహరీని మరికొంత యెత్తు పెంచమనీ, పశువుల చావిళ్లను మరింత కట్టుదిట్టం గావించమనీ సలహా యిచ్చాను. మా మామిడితోటను - అది పండ్లకాలం కాకపోయినా - చూచి రోహిణి చాల సంతోషించింది. సీమరేగు, జామకాయలున్నవి; కాని, అవయినా పండేందుకింకా కొంతకాల ముండాలి.

తోటలో వుండగా రోహిణి "మన మిందులో ద్రాక్ష నాటకూడదూ?" అనడిగింది నన్ను.

"ఇక్కడివారు ద్రాక్షపంటకీ భూమిలాయక్కైంది కాదంటారు" అన్నాను.

"మనం వేసి పరీక్షించి చూస్తే పొయ్యేదేముంది?"

"అల్లాగే, యీ సంగతి మన తోటమాలి కిష్టాయితో ఆలోచించు."

ముసలి కిష్టాయి వచ్చాడు. "కిష్ట తాతా! బాగా ముసలాడి వయి పోయావే" అని పల్కరించాను.

"బాబూ! నా కళ్ళముండే మూడు తరాలెళ్ళి పోయాయి; మరి ముసలి తనంగాక యింకేమిటి? మీ తాత లచ్చుమయ్యగారు నన్నొక కటిక దురమార్గుడైన మగధ కోమటివద్ద కొనితెచ్చి కొత్తజన్మ యిచ్చారు."

"అవును తాతా! నీ దేహం యెండి శుష్కించిపోతోంది. మనకి పండులు దండిగా వున్నట్టున్నై, వారానికి రెండుతడవలు తింటూండు, కాస్త ఓపిగ్గా వుంటావు; మాక్కూడా పంపిస్తూండు."

"అట్లాగే బాబయ్యా! మీ రిప్పుడు యవ్వనంలో వున్నారు. చిన్నతనంలో నా గడ్డంతో ఆడుకునే టప్పుడు మీరీ బీదవానిమీద చూపిన దయ యిప్పటికీ అట్లాగేవుంది, నా కదేపదివేలు."

"తాతా! మీ యజమానురాలిని చూశావా?" అన్నాను.

"వినటమే గాని చూచే భాగ్యమింకా కలగలేదు బాబూ!"

"అదిగో! రేగుచెట్టు నీడలోంచి వస్తోంది."

కపిలుడూ, రోహిణీ మేమున్న చోటుకు వచ్చాక రోహిణికి చెప్పాను- "రోహిణీ! ఈ కిష్టాయితాత మూడు తరాల్నుంచి మమ్మల్నే కనిపెట్టుకొని వుంటున్నాడు—"

"అవునమ్మగోరూ! తాతయ్యగారు శెట్టికి కోరినంతా డబ్బిచ్చి నన్నుద్ధరించారు. అమ్మగారూ అల్లాంటివారే. పెద్దమ్మగారు మల్లికాదేవిగారూ దయగా చూచారు. ఈ ముసలికిష్టాయిమీద దయుంచమ్మా! మీకు మూడుతరాలనుంచీ దాసుణ్ణి."

"నీ పిల్లాజెల్లా యెందరు తాతా!" అనడిగింది రోహిణి.

"ముసల్ది చచ్చి పదేళ్ళయిపోయిందమ్మా. అది పోయినకాణ్ణుంచి నా మతిలో దిగులుగానే వుంటోంది. అది యజమాని ఋణం తీర్చుకుపోయిందిలే. దాన్ని పడుచుతనంలో తాతగారు యాభై కార్షాపణాలిచ్చికొన్నారు. 'ఒరే కిష్టా! ఇదిగో నీకు పెళ్ళాన్ని తెచ్చాగా' అని నాకు అప్పగించారు. అమ్మగారూ! అదెంత మంచిదనుకున్నారు! నాకుమల్లె నల్లదికాదు. చాలా అందంగా వుండేది. ఎంత శుభ్రంగా వుండేది! మణుసుకూడ మంచిదే మాయ-మర్మంలేకుండా పాతికేళ్ళు మల్లికమ్మగారిసేవ చేసింది-"

"మరి పిల్లలో?" రోహిణి అడిగింది.

"ఒక వూరికి సరిపడ వుండారుతల్లీ! మనమలు, మనుమరాళ్ళు కూడాను. అయ్యగారు వీళ్ళందరినీ అమ్ముకుంటే బోలెడు గుర్రాలొచ్చేవి."

"అల్లాచేస్తే నువ్వెంత కుమిలిపొయ్యేవాడివో!"

"మాబానిసోళ్ళ యేడుపెంతసేపుతల్లీ! ఆ రాచ్చసుడు--కోమటాయన నన్ను పెట్టినబాధలెన్నని చెప్పను! వీపుమీద చురకలనచ్చులిప్పటికీ అయిదు కనపడతాయి" అని వెన్నుమీద స్పష్టంగావున్న మచ్చల్ని చూపిస్తూ కిష్టాయి చెప్పాడు—"ఇనపకడ్డీ కాల్చి వాతలుపెట్టాడు."

రోహిణి జాలిగాచూస్తూ అంది—"తాతా! వాడు మహాకఠినాత్ముడయి వుంటాడు. ఎంత తప్పుచేస్తే మాత్రం అంత క్రూరంగా హింసించకూడదు."

"అమ్మా! బానిసలంటే అక్కడ జాలెవరికి? నేను వత్సదేశాన కౌశాంబిలో పుట్టాను. మా అమ్మతోపాటు నన్నూ కాశీలో అమ్మారు. వయసొచ్చిన తరవాత నన్ను మళ్లీ మగధకోమటి కొన్నాడు. ఎక్కడయినా దెబ్బలు తప్పవు; కాని, ఆ శెట్టి మరీ కిరాతుడమ్మా!"

"మరక లెందుకు వేశాడు తాతా?" రోహిణి అడిగింది.

"అర్నెల్లనుండి వాడుతూన్న పాత కడవతో నీళ్ళు తెమ్మన్నాడు. ఎంత మంచిదయినా అర్నెల్లు వాడితే గట్టి తగ్గిపోతుంది. ఆ కోమటి అసలే పీనాసి కావటంవల్ల చవగ్గావచ్చిన కడవలే కొనేవాడు. ఇంతకీ తినేవాళ్ళెవరయినా వున్నారా అంటే అదీలేదు. మగధరాజుకోసం కాబోలు తినకుండా కూడబెట్టే వాడు. ఒకనాడు పాతకడవతో నీళ్ళు తేబోయాను. చేదవేసి నూతిలో నీళ్ళు తోడుతూవుంటే కడవమూతి వూడివచ్చింది. ఇదీ నావల్ల జరిగిన తప్పు."

"ఈ మాత్రానికేనా నీ వీపుమీద అంతంత వాతలేసింది?"

"అవునమ్మా! నేను గిలగిల కొట్టుకుంటూంటే ఆ పిశాచి నన్నొక స్తంభానికి అంటవేసి కట్టేశాడు. వాతలువేసినా వాడికి తృప్తితీరక తిడుతూనేవున్నాడు. సరిగా అదేసమయంలో తాతగారేదో సరుకు కావాల్సి శెట్టివద్ద కొచ్చారు. నాస్థితికి జాలిపడి ఈ బానిసని అమ్ముతావా? అని అతడినడిగారు. వాడుసరే నన్నాక బేర మడిగారు. నన్ను తను నలభై నాణాలకేకొన్నా, అరవైకి కొన్నానని పచ్చి అబద్ధం చెప్పాడు. నేను నిజం చెప్పెయ్యాలనుకొనికూడా మళ్ళీ యినపకడ్డీవాతలు పడుతాయేమోనని భయపడి మెదల్లేదు. అమ్మగారూ! అక్కడ రాజులపాలనలో బానిసల్ని చంపేసినా అడిగేవాడులేడు ఈ లిచ్ఛవీ పంచాయతీరాజ్యం వేరు. మేమిక్కడ దాసులమన్న సంగతే మర్చిపోయాము. అసలిక్కడివారికి వాతలు పెట్టటమన్నమాటే తెలీదు. అదీగాక ఒకతడవ వజ్జిదేశంలోకి వచ్చిన బానిసని యిక్కడి బయటివాళ్ళకి అమ్మనే అమ్మరు. తల్లీ! ఇక్కడ దాసులే లేరమ్మా? బానిసలని మగధలోనో, కాశీలోనో చూడాలి. అక్కడ వయసు మళ్ళేదాకా బ్రతికిన బానిసే లేడు."

"ఏంచేస్తారు తాతా?"

"మీదేశంలో బానిసలెల్లా వుంటారు అమ్మగారూ?"

"మావేపున బానిసలనే వాళ్ళుండరు తాతా!"

"ఉండనే వుండరూ! బలేవిచిత్రంగా వుందే! ఉండినా వాళ్ళనిక్కడి కంటె యెక్కువ దయతో చూస్తారు కామోసు."

"లేరుతాతా! అక్కడ మనుష్యుల్ని అమ్మటానికీ, కొనటానికీ వీల్లేదు. తప్పజారి ఏ బానిసైనా మా గాంధారదేశంలో అడుగుపెట్టితే వెంటనే స్వతంత్రుడయి పోతాడు."

"నా కసలు అనుమానం పీకుతూనే వుందమ్మా! మీ యీ రూపం మనుషుల్లో వుండకేం? అయితే చినబాబుగారు అందాకా వెళ్ళారన్నమాట. ఇల్లొదిలి యెళ్ళి యెన్నాళ్ళకూ రాలేదేమా అనుకుంటూనే వుండాను."

"ఎక్కడి కెళ్ళారను కున్నావు తాతా?"

"అక్కడికే నమ్మా! బానిసలు స్వతంత్రులయ్యేలోకం - మీ దేశంలోకి. ఆ లోకానికి తగ్గరూపే మీది. చూచినప్పట్నుంచీ నాకు సందేహంగానే వుంది."

"ఏమిటా అనుమానం?"

"బానిసలు మనుషులయ్యే లోకాన్ని గురించే నమ్మా. పెదబాబుగారు లేక పొయ్యారు; వుంటే యిల్లాంటికోడలిని — అంటూంటే కిష్టాయి కళ్ళు చెమ్మగిలినయి." కాని, "తల్లీ! నువ్వు చిన్నబాబు నొదలేసి మీ లోకానికి వెళ్ళి పోవుగందా?"

"అల్లాగంటా వేమిటి తాతా! ఈయన నా భర్త కాదూ, మరి నాది వజ్జిదేశమేగా. ఈయన్ను విడిచి నే నెక్కడికి పోతాను?"

"మీ లోకాన్ని గురించి అల్లాంటి కథలు విన్నానే తల్లీ! అందువల్ల నాకు భయంగా వుంది; నువ్వు వదిలిపెట్టి పోనని చెప్తుతూంటే యిప్పుడు కాస్త నమ్మకం యేర్పడుతోంది మయ్యాటికీ విడిచెళ్లవుగదూ అమ్మా!"

"పతిని విడిచి ఎక్కడికి వెళ్తాను! తాతా"

"అల్లా అడగొద్దుతల్లీ! నువ్వెప్పుడూ చినబాబుదగ్గరే వుంటానని నీనోటితో చెప్పమ్మా, వినాలనుంది."

"ఎప్పుడూవుంటాను, సరేనా?" ఆనందపరవశుడై కిష్టాయి అన్నాడు- "నేను భయపడ్డానుతల్లీ!"

"భయ మెందుకు?"

"దాసులు స్వతంత్రులయ్యే లోకంవారి-అంటే నీలాంటివారిని గురించి భయమమ్మా!"

"ఏం చేస్తారనుకున్నా వేమిటి?"

"వారి ప్రేమ తిరంగా వుండదని."

"ఛ్ఛే! అల్లాగంటావేం తాతా? నామాట నమ్మవూ?"

"ఇక నాకు గట్టినమ్మకమే తల్లీ! ఈ ముసలికిష్టాయిమీద కోపగించుకోకు. ఇంకెన్నాళ్లు బతుకుతాను. నా చిన్నబాబుకోసం నీమాట పుచ్చుకున్నాను."

"లేకపోతే నేను భర్తని వదిలిపెట్టి వెళ్ళిపోతా ననేనా నీవుద్దేశం?"

"ఏమో ఏం తెలుస్తుంది; ఆలోకాన్ని గురించి అల్లావిన్నాను." రోహిణికి వృద్ధుని వుద్దేశం వ్యక్తంకాలేదు. అందుచే మళ్లీ అడిగింది—"తాతా! నే నెక్కడి నుంచి వచ్చాననుకున్నావ్?"

"నాకు బాగానే తెలుసమ్మా. బానిసలు స్వతంత్రులయ్యే లోకాన్నుంచే గదూ? అల్లాంటి లోకాలు ఒకటికంటే యెక్కువే నేమిటి?"

"అంటే అది యే లోకమని?"

"నాకు టోకరా యివ్వాలనుకుంటున్నావా తల్లీ! ముసలి కిష్టాయికి అవన్నీ బాగా తెలుసులే".

"అయితే మరి చెప్పు."

"నీ రూపురేఖల్ని చూట్టంతోనే గ్రహించాను. నువ్వు దాయాలను కొన్నావు; గాని లాభంలేక పోయింది. చిన్నబాబుగారి దగ్గర శాశ్వతంగా వుంటానని మాటిచ్చావుగా. ఇక భయంలేదు."

"సరే, నేనెవరి ననకొంటున్నావో చెప్పు."

"నాకు యజమానురాలివనీ, ఈ ముసలాడిని 'తాతా' అని పిలిచే చల్లని తల్లివనీ అనుకుంటున్నాను. ఆపాటికూడ తెలవని మూర్ఖుణ్ణి కానులేతల్లీ!"

"అదికాదు తాతా! నా పుట్టిల్లు యెక్కడుం దనుకుంటున్నావు?"

"చెపితే ప్రమాద మేముంది? నువ్వు యిడమర్చి చెప్పనే చెప్పావుగా. బానిసలు స్వతంత్రులయ్యేది దేవలోకమేగా."

"అయితే తాతా! నేను దేవలోకాన్నుంచి వచ్చా ననుకుంటున్నావా?"

"అనకోవటమేమిటమ్మా! నువ్వు చెప్పిందేగా?"

"అవునుగాని, నేను దేవలోకంలోని అప్సరసని తాతా!"

"అంతే, సరిగానే చెప్పావు తల్లీ!"

"ఇక నేను పారిపోతాననే భయం లేదుగద?"

"లేదమ్మా, దేవకన్నె అబద్ధమాడదు. ఇష్టంలేకపోతే ముందు మాటే యివ్వదు."

"సరేగాని, నీ పిల్లా - జెల్లల్ని గురించి చెప్పనేలేదే?"

"ఒక యిరవైమంది కొడుకులు మనుమలు, అంతకుమించి కూతుళ్ళు, మనుమరాళ్లు, కోడళ్ళూ నమ్మా! ఒక వూరు వూరంటే నమ్మ. అంతా బాబుగారి పొలాల్లోనే పనిచేస్తుండారు. పెదబాబుగారు తమ హయాములో వయసొచ్చిన వాళ్ళందరినీ స్వతంత్రుల్ని చేశారు. నన్నుకూడ వదిలెయ్యాలని చూచారుగాని, నేను ఒప్పుకుంటేగా. నాకు స్వతంత్రమొద్దని బతిమాలుకున్నాను. కాళ్లా వేళ్లా బడి ప్రాధేయపడితే యెల్లాగో ఒప్పుకున్నారు."

"ఇప్పుడు నీ పిల్లల్లో దాస - దాసీ లెంతమంది వున్నారు?"

"పదిమంది. అయిదుగురు మగాళ్ళు, అయిదుగురు ఆడాళ్లూను. ఒక మనుమరాలు పెద్దమ్మగారికి వూడిగం చేస్తోంది. దాన్ని మీరు చూచేవుంటారు. ఇంకో తె-రాధ-తోటలో కనపడి వుండొచ్చు. పద్దెనిమిదేళ్ళుంటయి. నల్లగా

వుండదు. దాని అమ్మమ్మ నల్లటిదై తేగా. రాధ తెలివిగలది కూడాను. మీరు వచ్చారని విన్నప్పుడే 'నువ్వు కొత్తమ్మగారిదాసీ'వని ఆ గుంటతో చెప్పేశాను."

"నాకు దాసియా ?"

"అవునమ్మగారూ! రాధ చాల చురుకైనపిల్ల. పెద్దమ్మగారిక్కడికి వచ్చినప్పుడల్లా ఆమెగారిసేవ చేస్తూంటుంది. ఆయమ్మగారు కూడ 'రాధా నువ్వు మాకోడలికి దాసిగా వుందువుగానిలే' అని చెప్పారు."

"దాసీ!"

"అది ఎలాగూ దాసీయేనమ్మగారూ! పెద్ద బాబుగారు ఎక్కువ మందికి స్వతంత్రమిచ్చినా, మేము మాత్రం బాబుగారి దాసులమనే అనుకొంటాము."

"మరి పెద్దబాబుగారు మిమ్మల్ని అమ్మబడేవారుగా వుంచలేదుగా తాతా!"

"అది నిజమే. ఆయన సొతంత్రం యిచ్చారు. అందరూ అల్లాగే అనుకుంటున్నారు కూడాను. అయినా నేను నా పిల్లలందరికీ 'మీరు బాబుగారి దాసులమనే' అనుకోమని చెబుతున్నాను. వాళ్ళూ అలాగే అనుకొంటున్నారు"

"అయితే, మా కవసరమైనప్పుడు నీపిల్లల్ని అమ్మేస్తామనుకొంటున్నావా?"

"మీరు అమ్మరుగదమ్మా! కాని, అవసరమైతే-అగల్లాంటి రోజును భగవంతుడ చల్లని దొరలకి యెందుకు కల్పిస్తాడు? - అయినా అవసరమైనప్పుడు నా బిడ్డల్లో ప్రతివారూ యజమానికోసం అమ్ముడుపోతారు."

"కాదు తాతా! ఇక అల్లా జరగటానికి వీల్లేదు. స్వతంత్రుల్ని చెయ్యకుండా, నేనెవర్నీ వుంచుకోను. ఏం ప్రియా ఏంపా?" అని రోహిణి నావైపు చూచింది.

నేనంతవరకు గప్‌చిప్‌గా వారి సంభాషణ వింటున్నాను. కిష్టాయి తన దొరసానిని దేవకన్యనిచేసి అగాధసముద్రంలో బుటకలు వేయించటంకూడ చూస్తూనేవున్నాను. "తప్పకుండా అల్లాగే ప్రేయసీ! మనవద్ద చాకిరీచేయదలచిన వాళ్ళు నౌకరులుగా జీత-బత్తాలు పుచ్చుకుని పనిచెయ్యాలి" అని రోహిణితో మాటకలిపాను.

"కొలువులో వుండనిస్తారుగదబాబూ!" అన్నాడు కిష్టాయి.

"పనిలో వుంచుకోకేం తాతా! మేమెవర్నీ అమ్మం. ఇకముందు అల్లా అమ్మే అధికారం మా వంశానికే లేకుండా చేస్తాం" అని నేను చెప్పాను.

వృద్ధుడు పెద్దగా నిట్టూర్చి అన్నాడు—"దేవకన్నెమ్మా! నువ్వు మీ లోకంలోలాగా యిక్కడకూడ చెయ్యాలనుకుంటున్నావుగదూ? మా బాబుగారి దాసులు దాసుల్లాగాకాక నమ్మకమైన నౌకర్లమాదిరే పనిచేస్తున్నారు."

"దాసుల పనికీ, నౌకర్ల పనికీ తేడావుందాతాతా?" అనడిగింది రోహిణి.

"తేడా చాలా వుందమ్మగారూ! నౌకర్లు పనిచేసినకొద్దీ జీతం ముట్టుతుంది. బాగా పనిచేయని బద్ధకస్తుల్ని ఎవరూ నౌకర్లుగా పెట్టుకోరు. ఇక దాసీసో-

యింటి గొడ్డుతో సమానమే. వాళ్ళని కొట్టొచ్చు, తిట్టొచ్చు, చంపొవచ్చు; కాని ఒళ్ళొంచి పనిచెయ్యాలనుకోని బానిసచేత దెబ్బలతో, తిట్లతో పనిచేయించటం సాధ్యంకాదు. పొడుగునా పనిచేయకపోతే బానిసని ఎన్నాళ్ళని కొట్టగలరు? మూలపడేటట్టు కొట్టినా, చంపినా తమ సొమ్ముకే ముప్పొయె. సున్నితమైన పనులేవీ బానిసలచేత చేయించకూడదు. అల్లాంటి పనులు చేసి వాళ్లు బాముకునే దేముంది? కాబట్టి బానిసలల్లాంటి వాటిని చెడగొట్టేస్తారు కూడాను; కాని, మీ బానిసలు అలాంటి వాళ్ళు కారు తల్లీ!”

“మావద్ద బానిసలుండరు తాతా! ఇవాళే మీ మందరినీ స్వతంత్రుల్ని చేసి మరీ వెడతాను; నిన్నుకూడాను ముసలి తాతా!”

“నన్ను మాత్రం విడిచిపెట్టు తల్లీ! పెదబాబుగారు కూడ వదిలేశారు. (కళ్ళనీరుపెట్టి రుద్ధ కంఠంతో) నన్ను అదానుని చెయ్యొద్దు. నన్నీయింటిబానిసగానే నావనీయండి అమ్మగోరూ!”

“తాతా! స్వతంత్రుణ్ని చేయటమంటే నిన్ను మా పనిలో వుంచమని కాదు. మీ దొరసానిలోకంలో దాసులుండరని నీకూ తెలుసుగా” అన్నాన్నేను.

“అవునుబాబూ! నే నెఱుగుదును. అమ్మగారు మీతోనే వుంటుందని కూడా నాకు తెలుసు.”

“తాతా! నువ్వు చెప్పినట్టు ఈమె ఎప్పుడూ నాతోనే వుంటానంది గద; మరి ఆమె మాట మనం వినొద్దూ? దాసులతో వుండటం ఆమె కలవాటులేదు. అందువల్ల ఆమె చెప్పినట్టుచెయ్యి. నువ్వు యెప్పటిలాగానే పనిచేస్తూ మా వద్దనే వుండువుగాని. మీ దొరసాని నీతో మన తోటని గురించి మాట్లాడాలనుకుంటోంది. ఆమె మనస్సును నొప్పించకూడదు. ఇవాళే మీ కుటుంబంలోని చిన్న-పెద్ద దాసులంతా తలార తానంచేసి మధ్యాన్నం యీ యింటికి రండి. ఇక పనిని గూర్చి మీరు మాట్లాడుకోండి.”

“అయితే బాబూ! మే మెప్పటిలాగా మీ వద్దనే వుంటామా?”

“అల్లాగే; మాకు నమ్మకమైన నౌకర్లుగా వుంటారు” అన్నాము నేనూ, రోహిణీకూడాను.

“సరే” అని కిస్టాయి తలూంచుకున్నాడు.

“ప్రియా! దాస-దాసీలందరినీ స్నానంచేసి మధ్యాహ్నం మన వద్దకివచ్చేటట్టు చెయ్యమని మన నిఘామానుతో చెప్పు” అంది రోహిణి నాతో.

నేను వెంటనే మా కమతం మేస్త్రీని పిలిపించి ఆ సంగతి చెప్పాను.

“తాతా! నీ చేతిక్రింద తోట చాలాబాగుంది” అని రోహిణి ముసలివాడిని మెచ్చుకుంది.

“అవును తల్లీ! మగధ శెట్టికి ముందు యజమాని నన్ను కాశీరాజు తోట పనికి పంపేవాడు. అక్కడే నాకు కాస్తపని అబ్బింది.”

"ఇంకోరి పనికా ?"

"అవునమ్మా ! దాసుని పనికితగ్గ మజూరీ యజమానికి ముట్టేది."

"మొదటినుంచీ నీకు తోటపని అలవాటే నన్నమాట ?"

"ఆయనవద్ద మరికొన్నేళ్ళుండివుంటే తోటల పెంపకంలో మెలకువ యింకా నేర్చుకొనేవాడిని. మన తోటలో మామిడి, జామ, రేగు, నేరేడు, పునాస మొక్కల్ని కాశీలోవలెనే నాటి పెంచాను. అమ్మా ! రేగుపళ్ళు చూశారుగా ! అవి కాశీరేగుజాతివి. రేగుపండంతా నోట్లో ఒక్కసారేపట్టదు. చాల కమ్మగాకూడవుంటై. దీనిముందు సీమరేగు దిగదుడుపే. జామకాయలు కూడ కాశీజామిలాగా పెద్దవే. తియ్యగావుంటై. గింజలు తక్కువ. మామిడి పళ్ళనిగూర్చి చెప్పనక్కరేవుండదు. పండిన తర్వాత చూస్తారుగా."

"తాతా! అయితే నీతోటలో మంచిజాతి జామచెట్లే పెంచావన్నమాట."

"అవునుతల్లీ ! పెదబాబుగారికి మంచిజాతులంటే మహామోజు. వారొక సారి నన్ను తమతో పడవమీద కాశీకి తీసికెళ్ళారు. అబద్ధమెందుగ్గాని తల్లీ ! నేను కాశీరాజు తోటమాలికి కానుక యిచ్చి, బతిమాలీ అక్కడ మంచి జాతిమొక్కల్ని యేరితెచ్చాను. రాజులు తమ తోటల్లోని పళ్ళలాంటివి యితరుల తోటల్లో వుండటానికి యిష్టపడరు. అందువల్ల వాటిని సంపాదించటానికి చాలా శ్రమపడాల్సి వచ్చింది; అయినా పెదబాబుగారు యెవరొచ్చి అడిగినా మంచి జాతిఅంట్లను యిచ్చెయ్యమని చెప్పేవారు."

"మరి నువ్వు యిచ్చావా ?"

"ఇచ్చాను; కాని, వాళ్ళకి వాటిని పోషించటం తెలియదు. చెట్లుకూడ అంతులేని సేవ కోరుతాయి. తోటమాలిపనికూడా తెలిసినవాళ్ళదగ్గర నేర్చుకోవాలి."

"మరి నువ్వు కొందరికి నేర్పక పోయావూ? ?"

"నేర్పాలనే అనుకున్నాను; కాని, అయిదారుగురికే అబ్బింది. అందుకు కూడ చురుకుతనముండాలి. తయారయినవాళ్ళయిదుగురిలో ముగ్గురు నా కొడుకులూ, మనుమలే. నేను చచ్చిపోయినా వాళ్లు మన తోట చూచుకోగలరు."

"తాతా ! ఇందులోలేని పండ్లను గూర్చి నిన్నడిగి తెలుసుకోవాలను కున్నానే."

"ఏ పళ్ళు తల్లీ !"

"ద్రాక్ష, నారింజ, అంజూర, అక్రోటు, సీమరేగు వగైరాలు."

"వీటిలో కొన్నిటి పేర్లయినా నే నిదివరకు విన్లేదు. అదీగాక ప్రతిచెట్టూ దానికి తగిన నేల, శీతోష్ణస్థితి వుంటేనే పెరుగుతుంది. అయితే ఏదైనా అంత బాగా కాకపోయినా అసలే పెరక్కపోదు. విత్తులుంటే మొలిపించి చూడొచ్చు.

మొక్కలు దొరికితే మరీ మంచిది. కొత్తరకాలు వేసి ప్రయత్నించటమంటే నాకు బలే సరదా."

"మొక్కలింతదూరం తేవటం చాలాకష్టం తాతా! విత్తనాలు నాదగ్గర వున్నై."

"వాటిని నా కియ్యి తల్లీ! వేసి చూస్తాను. నేను మొట్టమొదటగా యిక్కడ దానిమ్మ, బేరి మొక్కలు నాటినప్పుడు అందరూ అవి బ్రతకవనీ, కిష్టాయి పిచ్చోడనీ అన్నారు; కాని, తోటలో తూర్పువేపున చూడండి. ఇప్పుడవి యెల్లా కాస్తున్నయ్యో! అవి అంత తీపిగా లేవంటారు; కాని, నాకు మాత్రం తియ్యగానే వున్నై."

"కాస్త తీపి తక్కువైతే మాత్రం నష్టమేముందిలే. కొత్తరకాల పండ్లని మన దేశంలోకూడ పండించుకో వచ్చుగా."

"ఆఁ, అంతే తల్లీ! విత్తులియ్యండి. మట్టి, వుప్పు, సున్నం పాళ్లు మార్చి యెందులో యే మొక్క ఏపుగా పెరుగుతుందో చూస్తాను. పెదబాబుగారి మరణంతో కిష్టాయి అనాథుడయి పోయాడు."

"ఏఁ, ఎందువల్ల?"

"కొత్తకొత్త పళ్ల మొక్కలు, పూల మొక్కలు వేయించేవారు లేక పోయారు. కొత్తపని అంటే మనసు కుల్లాసంగా వుంటుంది. మరి విత్తులు ఎప్పుడు పంపుతావు తల్లీ?"

"ఎల్లుండి పంపుతాను గ్గాని, ఈ నడిశీతాకాలంలో పెరుగుతాయీ?"

"కొద్దిగానే వేసి చూస్తాను; అయినా వేసవి వెళ్ళింతర్వాత అయితేనే బాగా పెరుగుతయ్యి."

"ద్రాక్ష తీగవేసి పాకుతుంది తాతా!"

"అయితే అది పెరిగినతర్వాత పందిరేసి పాకిస్తాగా"

"వారిసంభాషణ యెంతకీ తెగేటట్టు కనపడనందున విసుగెత్తి నేనన్నాను- "రోహిణి! ఇక మనం మధ్యాన్నపు భోజనానికి లేద్దాం. పందిమాంసం వేడిగా వుంటేనే బాగుంటుంది. ఏఁ తాతా?"

"అవునుబాబూ! చల్లారిపోతే సగంరుచి చచ్చిపోతుంది. పందిపిల్ల మాంసం అంతే నమ్మగారూ!"

"మేమిక భోజనానికి వెళ్తాంతాతా! మీ వాళ్ళంతా స్నానంచేసి అప్పుడే వచ్చేస్తున్నారు. నువ్వుకూడాపోయి తానమాడిరాపో" అన్నాను.

"సన్నొదిలి పెట్టరాబాబూ?"

"నువ్వు మళ్ళీ మీ దేవకన్యమ్మకి కోపం తెప్పించుతున్నావా?"

"లేదు బాబుగారూ! నేను అమ్మగారు చెప్పినట్టే వినుకుంటాను ఇకపోయి తానంచేసొత్తా."

మేమిద్దరము కమతగృహంలోకి వెళ్ళాము. తలారా స్నానంచేసి జుట్టార బెట్టుకోటానికి నల్లని వెంట్రుకల్ని జారవదిలి చామనచాయ పడుచొకతె పీటలు వేస్తోంది. రోహిణి ఆమెను "నీ పేరేమిటి పిల్లా?" అనడిగింది.

"రాధ-అమ్మగోరూ!" అని చప్పున వెంట్రుకల్ని ముడేసుకుంది.

"రాధా, నీకు మాంసంవండటం చేతనవునా?"

"పెద్దమ్మగారు యిక్కడికి వచ్చినప్పుడల్లా నేనే వారికి వంటచేస్తా నమ్మగారూ! ఇవాళ పందిమాంసం వండటంలో నేనుకూడ చెయికలిపాను."

"సరే, తొరగా వడ్డించు, మా కిద్దరికి బాగా ఆకలవుతోంది."

"అంతా సిద్ధంగా వుంచానమ్మగారూ!"

భోజనానంతరం మేము వైశాలినుంచి తెచ్చిన బట్టలమూట విప్పాము. నిఘామానునుపిల్చి దాస-దాసీలు, వారి పిల్లలు మొత్తమెందరో కనుక్కున్నాము. తలకు రెండేసిబట్టల చొప్పున మడతలు పెట్టాము.

కొద్దిసేపట్లోనే పరివారసహితంగా కిట్టాయి వచ్చాడు. వాళ్లందరిని దగ్గరకు పిల్చి రోహిణి చెప్పింది– "మేమిప్పుడు మీకందరికి స్వాతంత్రం ఇస్తున్నాము. ఈ క్షణంనుంచి మీరు దాస - దాసీలుకారు. ఇకమీదట మీరు మావద్దగాని, లేక మీ కిష్టమైన యితరులవద్దగాని, మరొకచోటగాని పనిచేస్తే మీ శ్రమకు తగిన జీత - భత్యాలు ముట్టుతాయి. ఇప్పుడు మీ కందరికి తలకి రెండు వస్త్రాలు కట్టుకోటానికి, కప్పుకోనేందుకు యిస్తున్నాను. తరువాత యివాళ సాయంత్రం మన కమతంలోని నవుకర్లు, కమతగాళ్ళు, ఆడ - మగవాళ్లంతా పిల్లలతోసహా వచ్చి మా సహపంక్తిని భోంచెయ్యాలి. బలిసిన ఆబోతు, పందిమాంసాలతో కూర, చారు తయారు చెయ్యండి."

ముందుగా కిట్టాయికి రెండు బట్టలిచ్చింది. వాటి నందు కొనేటప్పుడు ఆ వృద్ధుని కళ్ళనుండి అశ్రుబిందువులు టపటప క్రిందరాలినై. తరువాత వరుసగా అందరికి బట్టలు పంచిపెట్టబడినవి. రాధ సిగ్గుపడుతూ అందరికి వెనకాల వచ్చింది. రోహిణి ఆమెకు మడతఅందిస్తూ "రాధా! నువ్వు మావద్ద పనిచేస్తావా?" అనడిగింది.

"మీరు ఒప్పుకుంటే తప్పకుండా చేస్తానమ్మగారూ!" అంది రాధ.

"అయితే నువ్వు నేటినుండి మా పనిలోనేవుండు. మాతో వైశాలికి వచ్చెయ్యి."

రాధ పట్టరాని ఆనందంతో "అంతకంటేనా, అల్లాగే నమ్మగారూ!" అంది.



# 16 యుద్ధపరిషత్తు

నేను యుద్ధపరిషత్సమావేశంలో పాల్గొనవలసి వుండటంవల్ల మేము కమత గృహంలో ఆ ఒక్క రోజుమాత్రమే వుండి వైశాలికి తిరిగివచ్చేశాము. కమతంలోని పనివాళ్ళందరూ తమ దొరసాని–దేవకన్యకనుచూచి చాల సంతోషించారు. కిష్టాయి మరీను. ఎవరైనా ‘అమ్మగారు మనిషేశే’ అంటే వూరుకునేవాడు కాదు. ‘దాసులు స్వతంత్రులయ్యే లోకాన్నుంచివచ్చానని ఆమె స్వయంగా నాతో చెపితేను’ అని వాదులాడేవాడు.

అక్కడినుంచి తిరిగివచ్చినా పితృగృహంలోనే దిగాము. బాబాయి మగధ సైనిక సన్నాహాలను గూర్చి మరికొన్ని వివరాలు తెలిపాడు. మగధరాజు బింబిసారునికి వస్తుతః అసలు యుద్ధం చెయ్యాలన్న కాంక్ష యిప్పుడు లేదట. అతని కొడుకు - అజాతశత్రుడు తండ్రిని రెచ్చగొడుతున్నాడు. అందుచే రాజు యుద్ధానికి ఆయత్తంకాక తప్పలేదట. బింబిసారుని ప్రధానామాత్యుడు వర్షకారుడు మహాతెలివైన బ్రాహ్మణుడు. మా రాజ్యంలోని ప్రతి విషయాన్ని తెలిసికోటానికి తన వేగులను నియమించాడు. మగధ భూపాలునికి మంచి సైనికులు, సమర్థులగు సేనాపతులు లేకపోయినా, అతని చేతిలో మహాజిత్తులమారి వర్షకారు డుండటాన్నే మే మెక్కువ ప్రమాదంగా యెంచేవాళ్ళం.

మా సర్వసేనాపతికార్యాలయంలో యుద్ధసమితి సమావేశమయింది. సేనాపతి సుమనుడు, నేను, మరి ముగ్గురు సేనానాయకులు హాజరయ్యాము వారిలో ఒకరు వేగు సంఘాధ్యక్షుడు. సేనాపతి సమితి సమావేశ కార్యక్రమా న్నారంభించుతూ యిల్లా చెప్పాడు- “లిచ్ఛవీ సేనానాయకులారా! వజ్జిదేశానికి వ్యతిరేకంగా మగధరాజు చేస్తున్న యుద్ధసన్నాహాలను గూర్చిన వివరాలు కొంతవరకు నెలక్రితం జరిగిన గతసమావేశంలో మీరు విన్నారు. తరువాత తన గూఢచారుల ద్వారా సంగ్రహించిన కొత్తసంగతులను మన కిప్పుడు సేనానాయకుడు- పుష్పదత్తు వివరించుతాడు.”

పుష్పదత్తు యాభైఅయిదేళ్ళవాడు. ఒడ్డూపొడుగూ కలిగిన దృఢకాయుడు. బట్టతల. గంభీర హృదయుడని అయన ముఖమే చాటుతోంది. ఆయన స్వగతం మాట్లాడుకుంటూన్నట్టు మెల్లగా చెప్పసాగాడు.

“బింబిసారుడు అయిదేండ్లనుంచి అంగ, మగధ రాజ్యాల ఆదాయంలో అధికమొత్తాన్ని యుద్ధనిధిలో నిల్వచేస్తూవచ్చాడు. అతడు గంగ, శోణ, వాగ్మత్

నదీతీరములందున్న పాతకోటలను కట్టుదిట్టం గావించుటేగాక, నూతనంగా పద హారు దుర్గాలను నిర్మింపజేశాడు. వాటికిచుట్టూ పెద్దపెద్ద టేకి మానులతో దిట్ట మైన ప్రహరీల నేర్పరకొన్నాడు. ప్రతి దుర్గంలోను మూడువేల లగాయితు యేడువేలవరకు సుశిక్షిత రథ, గజ, తురగ, కాల్బలాలను అట్టిపెట్టాడు. రాక పోకలు కట్టడినా ఇబ్బంది లేకుండడానికి ఒక యేడాదికి సరిపడు ఆహారద్రవ్యాలను ప్రతి కోటలోను నిల్వచేయించాడు. ఇవిగాక నౌకాసేనను తయారుచేసిన వైనం కూడ మనకు తెలిసిపోయింది. మూడు నదులపొడుగునా నిర్మించిన దుర్గములవద్ద బలమైన నావికాదళాలను కాపుపెట్టాడు. ప్రతినావయందు 8 నుంచి 16 మంది వరకూ నావికులు, 20 నుంచి 50 మందిదాకా శూల, ఖడ్గ, ధనుర్ధారులైన సైనికులు వుంటారు. ఈ పర్యాయం బింబిసారుడు తన విజయసాధన కా నావికా దళాలనే నమ్ముకొని వున్నాడు. సైనికుల జీత-బత్తాలకు కొదువలేకుండా బింబి సారుని ధనాగారం నిండివుంది. అతనివద్ద అన్నిరకాల ఆయుధసామగ్రి మన కంటె అధికంగా వుండటంలోకూడ సందేహంలేదు. మన ప్రయత్నాలు కూడ చూచాయగా అతనికి తెలియకపోలేదు. ఈవిషయంలో మగధబ్రాహ్మలు తమ రాజుకు పూర్తిగా సాయపడుతున్నారు. అంగదేశంలో రేగిన తిరుగుబాటును అణచివేశాడు. ఇప్పుడక్కడిప్రజలు కత్తిపట్టి మగధ నెదిరించేస్థితిలోలేరు. కుట దంతుని లాంటి గొప్పగొప్ప బ్రాహ్మణపండితులను జాగీరులు, పదవులు యిచ్చి లోబర్చుకున్నాడు. అంగదేశ వర్తకవాణిజ్యవేత్తలుకూడ మగధ రేనికీర్తి గానం చేస్తున్నారు. బింబిసారుడు, తన వాడి కరవాలంతో అంగ, మగధరాజ్యాల్లో దొంగలభీతి, దోపిడీభయం లేకుండా చేశాడు. వీటన్నిటి ప్రభావం ప్రజలమీద పనిచేయకమానదు. ఇంతేకాదు, బింబిసారుడు తాను పక్కా గౌతమబుద్ధుని శిష్యుడనిని ప్రచారంచేయించుకున్నాడు. ప్రస్తుతం బుద్ధునికీర్తి తూర్పునందేకాక, యితరప్రాంతాల్లోకూడ వ్యాపించినట్టు మీకు తెలిసియేవున్నది! చదువుకొన్నవారి పైన గౌతముని ప్రభావం పనిచేసినంతగా మరే మతప్రవక్తలమహిమ పనిచేయుట లేదు. శాక్య, కోల, మల్ల, లిచ్ఛవీ మొదలగు ప్రజాతంత్ర రాజ్యాలందలి క్షత్రియులందరు బుద్ధునిపట్ల విశేష భక్తి, శ్రద్ధలు కల్గియున్నారు. ప్రసేనజిత్తు, బింబిసారులేకాదు, వత్స, అవంతి, కురు, శూరసేన (మధుర) ఆదిగాగల రాజు లంతా గౌతముని గౌరవించుతున్నారు. బుద్ధుడు మన పంచాయతీ ప్రశంసకును పాత్రుడేకద. మన మాయనకు వుద్యానము, విహారము, ప్రాసాదములేవీ యివ్వక పోయినా బుద్ధుడు లిచ్ఛవులను దేవతాసమానులని వర్ణించుతున్నారు. కాని, బింబిసారుడు గౌతమశిష్యుడనీ, ధర్మరాజనీ ప్రఖ్యాతిగడించుకున్నాడు. అతడు తన రాజోద్యానవనం - వేణువనాన్ని గౌతమునికిచ్చి పేరు - ప్రతిష్ఠలు సంపా దించాడు. బుద్ధుడు గృధ్రకూట పర్వతంమీద వుండగా బింబిసారుడు పాదచారియై వారి దర్శనానికి వెడుతూంటాడు. భక్తి, ధార్మిక విషయాలమీందిది సామాన్యంగా

కనపడవచ్చును; కాని, అదే కారణంవల్ల బింబిసారుడు ప్రజల భక్తి, గౌరవాలకు పాత్రుడు కాగలిగాడు. ఈవిధంగా బింబిసారుని ప్రజల్లో శాంతి, సంతృప్తి వున్నట్టు మీకు స్పష్టమవుతోంది. ఇవన్నీ తెలిసినమీదట యిప్పుడు మగధరేడు యెప్పటికంటె అధికబలంతుడుగా వున్నాడనీ, యుద్ధంచేయుటకు తగ్గ సమర్థుడనీ మనం అంగీకరించక తప్పదు.

"అయితే అతని బలంలో అవుడు కూడ లేకపోలేదు; కాని, అది మగధలో జొరబడి చూచినంత మాత్రాన దృగ్గోచర మయ్యేదికాదు. అది అతనిరాజతంత్రాన్ని మనలిచ్ఛవీ పంచాయతీ పాలనతో పోల్చిచూస్తే విశదమవుతుంది. ఆ విషయాలు మన సర్వసేనాపతి, దక్షిణసేనానాయకుడు వివరించి చెపుతారు. నేనిప్పుడా విషయంలో చెప్పగల్గింది ఒక్కటే. వజ్జి భూమిమీద జన్మించిన ప్రతి లిచ్ఛవీబిడ్డ దేశరక్షణకు చేసే యుద్ధాన్ని తనదిగా భావించుతాడు. అంగ, మగధ సైనికులట్లు గాక, తాము చేసే యుద్ధాన్ని బింబిసారుని యుద్ధంగా యెంచుతారు.

సేనాపతి సుమన్ లేచి తెల్లని గడ్డాన్ని సవరించుకుంటూ చెప్పనారంభించాడు—

"చిరంజీవులారా! నేను మన పంచాయతీ చేసిన యేర్పాట్లను గూర్చి చెపుతాను. మన గత సమావేశంలో తెల్పిన కొన్ని ముఖ్య సంగతులు సింహునికి ఆకరమయ్యేందుకు మళ్ళీ చెపుతాను. బింబిసారుని నదీ దుర్గాలకు పోటీగా మనం రెండు ప్రానుకోటలను నిర్మించాము. గండకీనదీతీరాన దుర్గశ్రేణి నిర్మించాము. గండకి అవతలివేపు మల్లులదయినప్పటికీ తమకు మనవల్ల భయంలేదనివారికి తెలుసు. మనకక్కడ వారినుంచి ప్రమాదం లేదు; కాని, మగధను దృష్టిలో వుంచుకొనే మన మా దుర్గ శ్రేణిని తయారుచేశాము. గండకీ ప్రవాహ మతి వేగవంతమని మీ రెరుగుదురు. అందులో యెగువకు వెళ్ళేటప్పుడు నావల నడక చాల మందగించుతుంది. కాబట్టి మన ఆ దుర్గశ్రేణి సైనికులతోను, ఆయుధాలతోటి నిండి వుంది. అందుచే ఆ దుర్గశ్రేణిమీద దాడిచేసి జయించటం శత్రువుకు సాధ్యం కాదు. మల్లులను, వారిని అధీనం గావించుకున్న కోసలాధిపతిని దృష్టిలో వుంచుకొని మాగధులు మల్లభూమిని మనకు ప్రతికూలంగా వుపయోగించలేరు. ఇది మన కెంతయు అనుకూలమైన సంగతి. పైగా గండకీమార్గాన మన యుద్ధనావలు శరవేగంతో పోయి మగధ సేనావాహినులమీద విరుచుకొనిపడగలవు. మనకు యుద్ధనావలు మొత్తం రెండువేలున్నై. ప్రతి ఒకదానియందును యాభైమంది సైనికు లుండి పోరాడవచ్చును. గత రెండు సంవత్సరాలలో మన నావికా బలాన్ని అయిదురెట్లు వృద్ధిచేశాము. కిమాగధులు వజ్జిభూమిపైకి దండెత్తి రావటానికి పెద్ద పెద్ద నదులు దాటి రావాలి. కాబట్టి మనకు నావలెంత ముఖ్యావసరమో మీరు గ్రహింపగలరు. మగధకంటె మనకొక వీలుంది. ఇక్కడ పల్లెకారుల పరివారాలు చాలా వున్నై. సహింపశక్యంకాని బానిసత్వం, అవమానములకు భీతిల్లి యేటేటా

కుందలాది పల్లెకార్ల కుటుంబాలు మగధనుంచి మన వజ్జిదేశానికి తరలి వచ్చేస్తున్నాయి. ఇక్కడి పల్లెకార్లలో బానిసలుగా వున్నవారు చాల తక్కువ. మన పల్లెవార్లందరూ వజ్జిభూమిపట్ల భక్తి-గౌరవాలు కల్గివున్నారు. వారిలో ముఖ్యులంతా యిచ్ఛాపూర్వకంగా వచ్చి మన పంచాయతీ సభలో దీక్షాబద్ధులయ్యారు. కాబట్టి మనకు నావికుల కొఱతలేదు. ఈ సారి మన నావలను బాగా దృఢంగావించి, వాటి పాపటాల్లో వాడియైన గునపాలను అమర్చాము. లోపలి నావికులు, సైనికులు బయటికి కన్పించకుండేలాగున నిర్మాణంలోకూడ మార్పుచేయించాము. రథ, తురంగాలను దాటవేయటానికి అనువుగావుండే నావలను, రేవులను ప్రత్యేకంగా నిర్మింపజేశాము.

మన కాల్బలము - ముఖ్యంగా దక్షిణోత్తర సరిహద్దులలో మగధ సైనికుల కంటె తక్కువే; అయితే మన భటుల సుశిక్షణ, సామర్థ్యాలు ఆ లోటును భర్తీ చేస్తాయి. రథ, గజ, తురంగాలల్లోకూడ బింబిసారునిదే - అంగ, మగధ ప్రజ సర్వస్వం దోచుకొని కూడబెట్టిన ధన - సంపదలుండుటచే - పైచేయి. అయితే విశాలమైన అతని రాజ్యసరిహద్దు రక్షణకు అధికసేనల అవసరంకూడా వుంటుంది. పడమట అవంతిరాజు - ప్రద్యోతునికి మగధరాజ్య విస్తరణ ఏమాత్రం యిష్టం లేదు. వత్సరాజ్యంకూడ అంతే. ప్రసేనజిత్తులాంటి పప్పురామన్న కోసల సింహాసన మెక్కివుండకపోతే బింబిసారుని గాలిమేడలన్నీ కూలిపోయి వుండేవి. ఇప్పుడైనా బింబిసారుడా సరిహద్దుల రక్షణకు తగినన్ని సైనిక దళాలను ప్రత్యేకించక తప్పదు. బింబిసారుడంగరాజ్యంలోని సైన్యాన్ని నిశ్చింతగా తరలించుకొని రాకుండా అక్కడక్కడ విప్లవాగ్ని భగ్గుమంటూనేవుంది. ఇక మనకో, పశ్చిమోత్తర సరిహద్దుల్లో సైనిక రక్షణావశ్యకతేలేదు.

"మనవద్ద సిద్ధంగావున్న సేనలేకాక, లిచ్ఛవేతర ప్రజలుకూడ ఈ యుద్ధాన్ని తమదిగా భావించుతున్నారు. వారు మగధేశ్వరుని నిరంకుశపాలనకు, లిచ్ఛవుల ప్రజాస్వామ్య విధానానికి గల తారతమ్యం బాగా యెరుగుదురు. వారికి మన శాసనవిధానంలో పాల్గొనే హక్కు లేకపోయినా, రాజులపాలనలో వలె లిచ్ఛవులు వారిపట్ల నిరంకుశంగా ప్రవర్తించ వీలులేదు. అందగత్తెలైన వారి స్త్రీలను బలాత్కారంగా రాణివాసంలో చేర్చుకొనేవా రిక్కడ లేరు. వారి వుత్తమాశ్వాలను, చక్కని రథాలను నిర్బంధంగా వశపర్చుకునేవారున్నూ లేరు. చూచారుగా, ఆనాడు మణిభద్రశ్రేష్ఠి నిస్సంతుగా చనిపోతే వజ్జిన్యాయశాస్త్రానుసారం అతని సంపత్తిని పంచాయతీకోశంలో చేర్చటాన్ని గురించి చర్చించినప్పుడు జనసమితి సభ్యుల్లో పెక్కుమంది మణిభద్రుని దూరపువారసుకే ఆ సంపద చెల్లాలని సమర్థించారు. న్యాయంగా పంచాయతీకి చెందవలసినదాన్ని అన్యులెవరికో యిప్పించడం తప్పే; అయితే ఆనాటి చర్చనుబట్టి మన సమితిలో యేవ్యక్తీ ఎవరికీ అన్యాయం తలపెట్టరనేది స్పష్టమయింది. వజ్జి స్వాతంత్ర్య రక్షణార్థం పోరాడే

అవకాశం కల్పించమంటూ యిక్కడి బ్రాహ్మణ, వైశ్య ప్రముఖు లర్థించారు; మనతోపాటు యుద్ధంలో నిలుస్తామని వాగ్దానాలిచ్చారు. మనంకూడ వారిని సాయుధులనుగావించి, సుశిక్షితులను చేశాము, చేస్తున్నాము.

"మన నౌకరులు, పాలేర్లు మగధనుంచి పారిపోయివచ్చిన నౌకరుల ద్వారా అక్కడివా రనుభవించిన కష్టాలను గూర్చి విన్నారు. వారికంటె మన నౌకరులు వేయిరెట్లెక్కువ సుఖంగా జీవిస్తున్నారు. మన భూమి పరాధీన మయితే తమ కెట్టి గతి పట్టునదీ వారికి తెలుసు. కాబట్టి వారిలో ఆయుధాన్ని చేపట్టగలవా రందరినీ మన సైనికులుగానే భావించవచ్చును.

"ఇక బానిసల విషయం: మన న్యాయశాస్త్రం ప్రకారం యజమాని దాసుని మీద యిష్టమొచ్చినట్లు అత్యాచారం చేయటానికి వీల్లేదు. మగధరాజు మన మీద కత్తిపూనటాని కిదికూడ ఒక కారణమే. నిజానికి లిచ్ఛవులము దాసులను స్వతంత్రులనుగావించి నౌకరులతోనే పని జరుపుకోగలం; కాని, మన మిక్కడి లిచ్ఛవేతర ప్రజలను గూర్చి కూడ ఆలోచించాలి. వజ్జిభూమి యందలి బానిసలు తక్కువమందే అయినా, అవసరమైనప్పుడు వాళ్ళు మన నిమిత్తం కత్తి పట్టగలరు.

"ఈవిధంగా మనవద్ద సిద్ధంగావున్న సైన్యము, అవసరమైనప్పుడు నడుం కట్టగలవారి సంఖ్యలదృష్ట్యా మన సైనికబలం మగధసైనికశక్తికి తీసిపోదని మీకు తెలిసినదేగద. ఇక్కడ సందర్భాన్నిబట్టి చెప్పవలసినది మరొకటుంది. మన లిచ్ఛవీయువతులలో ఉద్రిక్తభావాలు వ్యాపించివున్నాయి. దేశరక్షణ నిమిత్తం ఆయుధధారిణులై యుద్ధకార్యకలాపంలో చెయిచేసుకోవాలనే వాంఛ వారిలో నానాటికి ప్రబలమవుతోంది. లిచ్ఛవియోషు లొకప్పుడు తమ భర్తలు, పుత్రులతోపాటు శస్త్రాస్త్రములుదాల్చి కదనరంగంలో వీరవిహారంచేసేవారన్న సంగతి నిటీవలి తరాలవారు విస్మరించారు. మన మిప్పుడు నగరరక్షణకోసం లిచ్ఛవీ కాంతలకు తర్ఫీదు నివ్వాలి.

సేనాపతి వుపన్యాసానంతరం యితర సేనానాయకులు తమతమ సరిహద్దులలోని సైనికస్థితిగతులను గూర్చి మాట్లాడారు. కట్టకడపట సేనాపతి ఆదేశంతో నా అభిప్రాయాన్ని యిలా చెప్పాను:

"సేనాపతీ! సేనానాయకులారా! నేను తమ వుపన్యాసాలను అత్యంత శ్రద్ధాళువునై ఆలకించాను. మన వజ్జిభూమి బాహ్యాంతర్గత పరిస్థితులన్నిటిని సమన్వయం చేసిచూస్తే మగధకంటె మన రాజ్యమే దృఢతరము, శక్తివంతమూనని నాకుతోస్తోంది. ఇంతకంటె నేనీ విషయంలో అధికంగా చెప్పనగత్యంలేదు. ఒకటిమాత్రం ముఖ్యంగా చెప్పదలిచాను. రణరంగాల్లోని క్షతగాత్రుల నివతలికి జేరవేయుట, వారి సేవా శుశ్రూష చేయుపనులను లిచ్ఛవీకాంతలకు అప్పగించ

మని నేను సిఫార్సు చేస్తున్నాను. ఈ కార్యానికికూడ మగవారినే యిరికించాల్సిన అవసరంలేదు.

"యుద్ధం ఎన్నిరంగాలలోనైనా పొసగవచ్చు; కాని, వాటిలో మనకు జయాపజయాలను తేల్చగలది దక్షిణరంగమేనని మనం భావించవచ్చును. అందులో ముఖ్యంగా గండకీదుర్గాల్లోని నావికా దళాలే మన విజయానికి చాలవరకు సహాయ పడతాయి. మగధ మన యేర్పాట్లన్నిటికి జవాబీయగల్గవచ్చు; కాని, ఆ అయిదు వందల నావలకు తగ్గ సమాధానం దానివద్ద లేదనే నా తలంపు. మహాసింధులోని యుద్ధనావలను నేను చూచివచ్చాను. వాటి నిర్మాణవిధానా నన్నుసరించి మన నౌకలలో కొంత మార్పు చేయించాలి. వాటిముందమర్చిన యినుప గునపాలను అవసరాన్నిబట్టి తగిలించటానికీ, తీయటానికీ అనువైన ఏర్పాటుండేట్లు చూడాలి. ఇక్కడ నేను మరొక సంగతికూడ చెప్పాలి. తక్షశిలనుండి వచ్చిన మన అతిథులతో నేను నిన్న మాట్లాడాను. మగధ మనపైకి దండెత్తి రానున్నదని వారూ విన్నారు. వజ్జిదేశ సంరక్షణార్థం తమకుకూడ యుద్ధంలో పాల్గొనే అవకాశం కల్గించమని కోరారు. నా మిత్రుడు కపిల్ గాంధారయువకుల్లో సమర్థుడగు సేనానాయకుడు. పారసీకులతోటి యుద్ధంలో అతను నాకు సహాయకుడుగా పనిచేసినవాడు. మహాసింధుదాటి పారసీకసేనలను పుష్కలావతివరకు తరిమి తరిమి కొట్టి విధ్వంసము గావించినదతడే. అతడు, అతని సహచరులు తొమ్మండుగురు నౌకాయుద్ధంలో ఆరితేరినవారు. గండకీ దుర్గశ్రేణిలోని నావికాదళాల నుపయోగించుటలో నేను వారి సహకారాన్ని పొందుటకు మీ అనుమతిని కోరుతున్నాను.

"గండకిలోని యుద్ధనావల ప్రాముఖ్యత ఆ నది గంగలో దిఘవారావద్ద కలియుట, శోణనది దానికి దిగువను పాటలీపుత్రంవద్ద కలియుటనుబట్టియే తెలియగలదు. అంటే అక్కడి మన నావలవల్ల మగధ కెంతైనా ప్రమాదం వుంది. వారుమాత్రం మనల నక్కడ యేమీ చేయలేరు.

"మరొక విషయం: మగధసేనలు మనపై దాడి చేసేవరకు మనం నిరీక్షించ కూడదు. అవకాశం లభించినంతనే ముందు మనమే దాడి నారంభించాలి. ఈ దృష్టితో మన మిప్పటినుండి అన్ని యేర్పాట్లు పూర్తి చేసుకోవాలి. ముందుగా మనం దాడి చేయటానికేమి, తరువాత శత్రువులతోడి సంఘర్షణకేమి, ముందు నావికాదళాలను, తరువాత గజ, కాల్బలాలను, ఆ వెనక అశ్వికదళాలను, రథాలను వుపయోగించాలి. గండకీతీర రక్షణసైన్యాన్ని అలసియున్న శత్రుసేనపై దెబ్బతీయడానికి మాత్రమే వినియోగించాలి.

మేమా రీతిని యుద్ధసన్నాహాన్ని గూర్చి ఎన్నో విషయాలు సంప్రదించుకొన్నాము. దక్షిణరంగం విషయంతో నా పథకాన్ని యుద్ధసమితి అంగీకరించింది. కపిల్‌ని నాకు సహాయ సేనానాయకుడుగా నియమించారు. తతిమ్మావారు

కూడ యుద్ధంలో పాల్గొనటానికి సమ్మతించబడింది. నా సిఫార్సుతో భామ, రోహిణుల ఆధ్వర్యాన స్త్రీలకు సైనిక శిక్షణ నిప్పించుటకుకూడ అంగీకరించారు.

ఆనాడు యుద్ధసమితి సమావేశం ముగిసిన తర్వాత నేను ప్రొద్దుపోయి యింటికి చేరాను. అంతరాత్రివేళ కూడ మా యింటివద్ద భామ, రోహిణి, క్షేమ మరెందరో లిచ్ఛవీ యువతులు ఏదో గంభీరంగా చర్చించుకుంటున్నారు. వారు తమ మంతనాల్లో లీనమైయుండుట చూచి - "వదినా! నేను రావచ్చునా?" అని భామ నడిగాను.

"రా మరదీ! నీ కడ్డేమిటి? నీ సుందర వదనారవిందాన్ని చూచేందుకు ప్రొద్దుటినుంచి కాచుకుని కళ్ళు కాయలు కాచినై. ఇంకా 'రానా' అని అడుగు తున్నావా?" అంటూ ఆహ్వానించింది భామ.

"ఏదో నీ దయ వదినా! ఇక్కడికి మన సర్వసుందరి క్షేమకూడ వచ్చిందే! క్షేమా! నీ కిదే నా స్వాగతం!"

"ధన్యవాదాలు సింహన్నయ్యా!" అంది క్షేమ.

"మరి నాకేదీ స్వాగతం మరదీ? దీన్నే ముఖంచూచి మాట్లాడట మంటారు" భామ నవ్వుతూ అన్నది.

"అదేమి టొదినా! నీముఖమలంమాత్రం నన్ను తక్కువ ఆకర్షించుతోందా?"

"నా మొహం ఒకప్పుడు - నువ్వు దానికోసం తపించి నప్పుడు - నీ వీపు మీద నన్నుప్పుగోనెగా యెక్కించుకున్న రోజుల్లో - ఆకర్షణీయంగా వున్నా, యిప్పుడు కాదుగా?"

"నిన్నిప్పుడు మాత్రం వుప్పుగోనెగా యెందు కెక్కించుకోను? కాని, వదినా! నువ్వు మళ్ళీ ఆ యేడేళ్ల భామవి అవ్వాలి సుమా!"

"ఏం, నే నిప్పుడు మోటయి పోయానా?"

"లెక్కకి వదినా?"

"ఆ లెక్కని నువ్వూ పెద్దవాడి వయ్యావుగా, నాటకమాడబోకు మరదీ! క్షేమ యవ్వనమూ, అంద చందాల ప్రభావం అల్లా వుందను, సరిపోతుంది."

"అయితే నీ ప్రభావం తగ్గిపోయిందంటావా వదినా?"

"కాకపోతే యిప్పు డీ ముచ్చటెన్నివ రడుగుతారు? కాని సింహా! నువ్వింత కఠినాత్ముడ వనుకోలేదు. నువ్వు న్యాయంచెప్పు రోహిణీ!"

"నీ ఫిర్యాదంతా నే నెరుగ నక్కా? అయినా స్త్రీ స్త్రీపక్షమే వహించాలి. మనమంతా ఐక్యంగా వుండకపోతే యీ మగవాళ్ళముందు మన మెందుకూ కొరగాము" అని రోహిణి భామని బలపర్చింది.

"నేను మాత్రం కాదన్నానా? మీ రంతా ఒక్క మాటమీద వున్నా రనేగా మీ కాక్కావలసింది మూటేసుకొచ్చాను." అన్నాను నర్మగర్భంగా.

"ఏమిటేమిటి మరదీ? సరిగాచెప్పు" అంటూ భామ ఆత్రపడింది.

"ఊరికేనే! బహుమతిముట్టితేనే చెపుతాను".

"అదొకటా? ఎవరియ్యాలి?"

"మీరందరూను."

"చెప్పినతర్వాతా, ముందా?"

"ముందు బేరం ఖాయపర్చుకోండి. తర్వాత సరుకు నచ్చితేనే ధర యిద్దురుగాని."

"అందరి తరఫునా నేను చెపితే సరిపోతుందా, లేక యెవరికివారె బహుమతి యివ్వడానికి ఒప్పుకోవాలా?" అనడిగిందిభామ.

"నువ్వుచెపితే చాలు వదినా!"

"అయితేసరే, నీ యిష్టప్రకారమే బహూకరించుతాము. ఇక ఆ సరుకేదో వెళ్ళబెట్టు."

"యుద్ధసమితి......"

"ఓహో! చెప్పటాని కొక యుగం పట్టించి నన్నూ నా చెలుల్నీ చంపెయ్యాలనుకుంటున్నావా మరదీ?"

"మధ్యలో అడ్డుపడి నన్ను చెప్పనీకుండా నువ్వే ఆలస్యం చేయిస్తున్నావు వదినా! సరే, వినండి, యు ద్ధ-సమి-తి-ఆయుధాలిచ్చి - సాము నేర్పించటానికి అంగీకరించింది. ఎవరికో నువ్వు చెప్పుకో."

"బలే! మాకు సమస్యయిస్తున్నావా మరదీ?"

"ఈ మాత్రమైనా చెప్పుకోలేనిదానవు నీవల్ల యేమవుతుంది వదినా?"

"నేను చెప్పనా అన్నయ్యా?" అంది క్షేమ.

"ఊఁ, చెప్పుచూద్దాం" అన్నాను.

"నేను రోహిణక్కయ్య చెవిలో చెపుతాను."

"నా చెవిలోనే యెందుకు చెప్పకూడదు? నా చెవులేం పాపంచేశాయి?"

"నువ్వయితే నే చెప్పింది కాదంటావేమో!"

"అయితే నీకు సింహుని యందు బలే నమ్మకముంది!"

"క్షేమా! నువ్వెవరి వల్లో పడుతున్నావో తెలుసా? ఈయన సింహమమ్మా, సింహం! వెనకోసారి యీ టక్కరి సింహు డేంచేశాడనుకున్నావు! కాలవ దాటిస్తానని నన్ను వీపుమీద యెక్కించుకున్నాడు. నీళ్లమధ్య కెళ్లింతర్వాత ధపేల్‌మని నన్ను పడేసి తానూ పడి "కుయ్యో, మొఱ్ఱో! తేలు కుట్టిందని యేడుపు సాగించాడు. నా బట్టలన్నీ తడిసి ముద్దయ్యాను క్షేమా!" అని భామ నన్నెత్తిపొడిచింది.

"నా గుడ్డలుమాత్రం తడవలా?" అన్నా న్నేను.

"నువ్వు బుద్ధిపూర్వకంగా తడుపుకున్నావయ్యే."

"అయితే నేను మునిగిపోయి వుక్కిరిబిక్కి రెందుకవుతాను?"

"నీదంతా టక్కరి, మోసమూను. కాకపోతే నీళ్లలో తేస్తుంటాయా క్షేమా ?"

"నీటిలో తేలు కుట్టటం మాత్రం పచ్చి అబద్ధమయి వుంటుంది భామక్కాయా !" అంది క్షేమ.

"ఆ దగాకోరే యితడు పిల్లా ! నీకింకా యితని బూటకం తెలియదు."

"గంటసేపటిదాకా గిలగిలా తన్నుకుంటూ వెక్కివెక్కి యేడ్చాను. కళ్ళు వాచిపోవటం కూడ అబద్ధమేనా ? భామ తన ఉత్తరీయాన్ని పిండి నా ముఖం తుడిచిందీ అబద్ధమే ! తానుకూడ యేడుస్తూ కన్నీళ్ళతో తడిసిన నా ముఖాన్ని ముద్దుపెట్టుకున్నదీ అబద్ధమే. తన చిన్ని చేతుల్తో నన్ను నీటిలోనుంచి బయటికి లాగటానికి ప్రయత్నించిందీ నటనేనా ?"

"నాటకమాడటంలో బలే నేర్పరివిలే" భామ అన్నది.

"కాదు భామా ! నా కాలిబొటన వ్రేలినుంచి నెత్తురు కారినదికూడ నటనకే నంటావా ?"

భామ కళ్లు చెమ్మగిల్లినయి. ఆమె తన బాహువులు, కపోలాలతో నా తల నదిమిపట్టి "ఇక జ్ఞాపకం చెయ్యమాకు సింహా ! ఆ రక్తాన్ని తలిస్తే నా కిప్పుడు కూడ యేడుపు వస్తోంది. మనిద్దరము కుట్టింది తేలే ననుకున్నాము; కాని, 'అది తేలుకాదు, జెల్లచేప'ని మల్లి కత్తయ్య చెప్పింది.

"మరి నా యేడుపు బూటకం కాదన్న మాటేగా ?"

"నటనకాదు, నిజమేలే సింహా !"

"ఇక నిజం చెపుతాను విను భామా ! నేనాబాధ నోర్చుకొని నిన్ను గట్టుకు చేర్చలేకపోలా. ని న్నేడిపించాలనే పడేలా."

"పోనిద్దూ, యిక మాటలు పెంచక అసలు సంగతి చెప్పు."

"సరే, క్షేమా ! నువ్వేమనుకున్నావో నా చెవిలో చెప్పు."

క్షేమ నా చెవివద్ద నోరుపెట్టి మెల్లగా "యుద్ధసమితి లిచ్ఛవీ కాంతలకు ఆయుధాలిచ్చి యుద్ధవిద్య నేర్పించటానికి అంగీకరించింది" అని చెప్పింది.

నేను నెమ్మదిగా నా చెవిని క్షేమ పెదవి కానించి "ఏదీ, మళ్ళీ చెప్పు నాకు సరిగా వినపళ్ళేదు" అన్నాను.

"చాల్లే సింహా ! నీ యెత్తు నాకు తెలుసు. క్షేమను ముద్దుపెట్టుకోటానికిలే నీ యెత్తు" అంది భామ.

భామమాట వినీ విననట్టుగా క్షేమ నా చెవిలో మళ్ళీవూదింది వెనకటి మాటల్ని. అప్పుడు నే నన్నాను—భామా ! క్షేమసరిగానే వూహించింది. (క్షేమ నుద్దేశించి) ఆ మాట నువ్వేచెప్పు పిల్లా వీరందరికీను."

క్షేమచెప్పివేసింది. భామ, రోహిణులు సంతోషంతో వుబ్బితబ్బిబ్బు లవుతున్నారు. నా బహుమతి సంగతి నొక్కరూ యెత్తలేదు. అప్పుడు నేను

"ఏం వదినా! సరుకు నచ్చింది కదా, మరి నాకు ఈనాము యిచ్చేయండి." అన్నాను.

"మరదీ! ఈ శుభవార్తను మోసుకొని రావడమేకాక, అసలీ నిర్ణయం చేయించటంలో కూడ నీ చెయ్యివుందికదూ!" అనడిగింది, భామ.

"కాబట్టి నా కీనాము తప్పకుండా ముట్టాల్సిందే."

"ఈనామేకాదు, యింకాను."

"ఇంకా యిప్పుడొద్దులే వదినా! ప్రస్తుతానికి బహుమతిని మాత్రం వసూలుచేసుకోనివ్వు. ఈనామంటే మరేంకాదు; రోహిణీ పెదవులమీద, మీ అందరి బుగ్గలపైన రెండేసి ముద్దులు మాత్రమే. ఏం అంగీకారమేనా?"

"ఓస్, అదేమంత దుర్లభాలేమిటి?"

"నే నల్లాగే తలుస్తున్నాను. సరే, ఎవరితో ప్రారంభించమంటావు?"

"నీ యిష్టం."

"అయితే నీతోనే" అంటూనే భామని ముద్దుపెట్టుకున్నాను.

అందరివంతులు అయిన తర్వాత భామ అడిగింది — "అయితే, మరదీ! నీ పీపని నింత సుళువుగా యెల్లా సాధించగలిగావు?"

"నేను తీర్మానం ప్రతిపాదించగా అది ఏకగ్రీవంగా ఆమోదించబడింది."

"నువ్వు దీర్ఘోపన్యాసం దంచావన్నమాట?"

"ప్రత్యేకంగా యీ విషయాన్నిగురించే కాదులే. మిగతా విషయాలతో దీన్ని కూడ కలిపాను. ఇంకోసంగతి: నువ్వూ, రోహిణీ లిచ్ఛవీ కాంతలకు తర్ఫీదు నివ్వాలి. వీరిచేతులు కోమలంగా తయారయినై...అంటూ నేను క్షేమ వైపు దృష్టిని మరల్చాను.

క్షేమ పెద్దగా వూపిరివిడిచి తక్షణం తన చేతులను నా ముందుకు చాచి అన్నది—"ఇవిగో చూడు! నా విప్పుడు వెనకటి మృదుహస్తాలు కావన్నయా!"

ఆమె చేతులకు బొబ్బలెక్కి తోటలూడివున్నై. వాటి అంచులవద్దచర్మం మొద్దుబారి యింకా యెర్రగా వుంది. కందియున్న ఆ చేతుల్ని చూచినంతనే నాకు కంపం కలిగింది. కాని, తరువాత ఆమె ఓర్పుకు ముదమంది రెండుచేతులను నా కళ్ళ కద్దుకొని, ముద్దుపెట్టుకున్నాను. నా కళ్లు చెమ్మగిల్లినై. ఆమె చేతులను నిమ్మళంగా విడిచిపెట్టి "క్షేమా! నీ యీ చేతులనుచూచి నేను గర్వపడు తున్నాను. లిచ్ఛవీ కుమారికి తగ్గ పనిచేశావు. నీలాంటి సుపుత్రిని బడసిన మన వైశాలి అజేయంగా విలసిల్లగలదు" అన్నాను.

భామ, రోహిణులంత వరకు క్షేమ చేతులను చూళ్ళేదు. ఇప్పుడు చూడ గానే భామ క్షేమను ఒడిలోకి లాక్కొని కౌగలించుకున్నది. ఒకటే ముద్దుల వర్షం. రోహిణి క్షేమ హస్తాలను తన చెంపలమీద పెట్టుకొని ముద్దాడింది. కొంచెంతాళి భామ అన్నది — "క్షేమా! నువ్వింతవరకు సామాన్య జానపద

సుందరివేగాని, యిప్పుడు లిచ్ఛవీ సమాజ కళ్యాణివి. ఏంచేశావేమిటి చేతులిల్లా అయినవి ?"

"ఆ వాళ నీ వుపదేశం విన్న తరువాత నా చేతులంటే నా కక్కడలేని రోతపుట్టింది భామక్కా! నిజంగా యీ చేతులు నావికాక, అంబాపాలివే నని పించింది. అమ్మ కాదు, కూడదన్నా వినక నేనానాడే దానితోపాటు వడ్లు దంచటం ఆరంభించాను. చేతులు కంది బొబ్బలెక్కే వరకు దంచాను. బొబ్బలు చూచి అమ్మ కోప్పడి మాన్పించింది అప్పుడైనా."

"పిల్లా! (ముద్దుపెట్టుకొని) మరి నీవు చేతులు మంటలెత్తలా ?"

"బొబ్బలబాధనే ఓర్చుకోలేకపోతే మరి కత్తెల్లా పట్టగలనని సహించు కున్నాను."

"అయితే క్షేమా! మా కెప్పుడూ నీ చేతుల్ని చూపించావు కాదే ?" అనడిగింది రోహిణి.

"ఇప్పుడైనా సింహన్నయ్య ఆ మాటతేకపోతే చూపించేదాన్నే కాదు."

"ఎంత జాణవే! ఎవరికీ తెలీకుండా దాచావు" అన్నది భామ.

"ఒకరికి తెలుసునక్కా!" అంది క్షేమ.

రోహిణి క్షేమనోటికి చెయ్యడ్డంపెట్టి "చెప్పమాకు పిచ్చిపిల్లా" అని భామ వేపుతిరిగి "అక్కా! ఆ ఒకరెవరో నువ్వుచెప్పుకో" అంది.

"ఓహో! నాకు తెలియదనుకున్నావా రోహిణీ?" భామ దర్పంతో అంది.

"తెలిస్తే చెప్పు ?"

"నా కదెంతపని రోహిణీ! నే నెగిరిపోయే పిట్టనుకూడా గుర్తించగల్ను."

"అయితే యింకేం, చెప్పు ?"

"ఇంకెవరు ? నువ్వే. యింకా స్పష్టంగా చెప్పాలంటే క్షేమ తన రహస్యాలను నీ కొక్కదానికి చెపుతా ననేగా ఒట్టుపెట్టుకుంది ? తన చేతుల్ని యిది వరకు నీకే చూపించి వుంటుంది."

"కాదక్కా! నువ్వు పైన ఎగిరే పిట్టను గుర్తించ గలిగినా క్రింద వున్న మనిషిని గుర్తించ లేక పోయ్యావు."

"అయితే మీరిద్దరూ కలసి నా పరువు తీయదలచారన్నమాట. సరే, ఆ మనిషెవరో చెప్పిక?"

"ఎవరో కాదు, మా అన్నయ్య క-పి-ల్"

క్షేమచెంపలు యెఱ్ఱబారినయి. ఆమె తల క్రిందికి దించుకోకముందే భామ ఆ మార్పును పసిపట్టింది. భామ రోహిణి నడిగింది — "నీ కెల్లా తెలిసింది రోహిణీ?"

"ఈమాత్రానికే సర్వాంతర్యామి అవ్వాలా అక్కా? ఆ తొలినాటి రాత్రి కపిల్‌తో నృత్యంచేసిన తర్వాత క్షేమ మరెవరితోను నాట్యం చెయ్యలే దని మనకి తెలుసుగా."

"నే నాలోచించనేలేదు రోహిణీ!"

"నేను కత్తి, డాలుచేతబట్టి సాముకూడ నేర్చుకుంటున్నానుభామక్కయ్యా!" అంది క్షేమ సగర్వంగా.

"ఆ గురువు దగ్గరేనా?" అనడిగింది భామ.

క్షేమ సిగ్గుపడింది. భామ ఆమె నాలింగనం చేసికొని "లేదు లేవే పిల్లా! కత్తి తిప్పటంలో కపిల్ సిద్ధహస్తుడని సింహుడు చెప్పాడులే. మరి కపిల్ తన 'దేవలోక' యాత్రను గురించి నీతో చెప్పాడా?"

"దేవలోకం!"

"అవును, దేవలోకమే. దేవలోకానికి వెళ్ళి, కపిలు దేవిధంగా వారి పక్షాన పోరాడేడో సింహు డొకనాడు వినిపించాడు. దేవలోకమంటే దేవతలూ, వారి రాజు ఇంద్రుడూ వుండే మేరుపర్వతంమీది దేవలోక మనుకొ నేవు" అన్నది భామ.

"అయితే మరే దేవలోకం అక్కా?"

"భూలోకంలో దేనే, ఉత్తర కురుదేశం క్షేమా!"

"ఓసి పిచ్చిపిల్లా! అయితే నువ్వు వెర్రిదానవై వృధాగానే కపిల్‌తో గంతులేస్తున్నావన్నమాట."

క్షేమ చిన్నపుచ్చుకోవటం గమనించి వెంటనే నేనన్నాను— "కపిల్ యే సంగతియినా అడగండే చెప్పడు క్షేమా! అతను ప్రపంచంలో చూచి నన్ని ప్రదేశాలు చాల కొద్దిమందే దర్శించి వుంటారు. (భామ నుద్దేశించి) వదినా! ఇంకో సంగతి చెప్పటం మరచిపోయాను. కపిలుడు, అతని సహచరులు కూడ మగధకు ప్రతికూలంగా కత్తి పట్టదలిచారు."

రోహిణి నన్నానుకొని కూచొని నా చేతుల్ని తన రెండు హస్తాల్లోకి తీసుకుని "సైన్యంలో చేరతామన్నారా ఆర్యపుత్రా?" అనడిగింది.

నే నామె కన్డోయిని ముద్దిడుకొని "వారి వాంఛను యుద్ధసమితి అంగీక రించిందికూడాను" అన్నాను.

"అంగీకారంకూడా అయిందీ?" అంది రోహిణి.

"అంతేనా, కపిల్ నాకు సహాయ సేనా నాయకుడుగా కూడ నియమింప బడ్డాడు."

రోహిణి తన చేతుల్ని నా కంఠానికి పెనవేసి, నా పెదవులకు మోవి నానించి "అయితే మహా గంగాతీరస్థలిని మహాసింధు తీర దృశ్యమే!" అంది.

నేను రోహిణిని కౌగలించుకొంటూ అన్నాను — "ఇప్పుడే కాదు. రోహిణీ! నేను కబురు పంపుతాన్లే. ముందు నువ్వు, భామ కలసి లిచ్ఛవీకాంతలను సాయుధులను గావించి కురుదేవాంగనలవలె తయారుచెయ్యండి. నేను బాగా యోచించి మీకు తగిన బాధ్యత నప్పగిస్తాను."

భామ నా చేతుల్ని రోహిణి హస్తాల్లోంచి గైకొని "యివాళ చాలా సంతోషకరమైన వార్తలు తెచ్చావు మరదీ!" అంది.

అప్పుడే వస్తూన్న మనోరథ్‌ని ముందుగా చూచి నే నన్నాను—"ఇంకో శుభవార్తకూడాను; అదుగో మనోరథ్ వస్తున్నాడు."

నే నీ మాటలు ముగించేప్పటికి మనోరథ్ వచ్చేశాడు. "లిచ్ఛవీ పుత్రునికి సుస్వాగతం" అన్నారు అందరూ ఏకకంఠంతో.

భామ యెగిరి గంతేసి మనోరథుని మెళ్ళో చేతులేసి "రా, నా ప్రియ మనూ! ఇంతసేపెక్కడి కెళ్ళావు?"

"కపిల్‌ని, అతని సహచరుల్ని బ్రాహ్మల యజ్ఞవాటికలు చూపించేందుకు తీసుకెళ్ళాను."

"గొప్పప్రదేశం చూపటానికెళ్ళావే!"

"వారి దేశంలో యిల్లాంటి బ్రాహ్మలూ వుండరు, యజ్ఞవాటికలూ వుండవు ప్రేయసీ!"

"సరేగాని, లిచ్ఛవీ పడుచులకు సైనిక శిక్షణ నిప్పించటానికి మన యుద్ధసమితి తీర్మానించింది విన్నావా?"

"తీర్మానమే! అయితే నాకు చాల సంతోషం."

"నీ వంటకత్తెకి స్త్రీలని సంఘటితపర్చే భారం అప్పగించారుకూడాను."

మనోరథు డామెను ముద్దాడి "నీకా?" అనడిగాడు.

"అవును. కాని, మరి నాకు అన్నం వండి పెట్టటంమాత్రమే తెలుసు. (దిగులు నటించుతూ) ఇంట్లోవాళ్ళు గౌరవించరుగా. మనోరథునికి నేను వంటకత్తెని, పాచిపని చేసే భామనే నయ్యో! ఇప్పుడు మరదివచ్చి వుండకపోతే, యిక నీ భామ పొయ్యిలోనే పడి చచ్చేది."

"బలే మరది!!లే."

"కాక, నే నేమైనా అబద్ధమాడుతున్నానా మనూ?

"లేదులే, నవ్వులాటకైనా భామ అబద్ధమాడగా ఎవరైనా విన్నారూ?"

"సరేలే (అలిగినట్టుగా) నా ప్రతిమాటనీ నవ్వులాటక్రింద కడతారు. గాయంమీద కారం చల్లటం మానవుగా మనూ!"

"భామా! నన్నసలు ఒక దరికి చేరనిస్తావా, లేక నీ అధరానికి వేలాడుతూండమంటావా?"

"అధరానికే అంటిపెట్టుకొని వుండదలిచేవారిని ఎవరుమాత్రం ఒద్దుకు యెల్లాచేర్చేది ?''

"కాదు భామా! నీ మనూ అధరానికే అంటిపెట్టుకొని వేలాడేవాడు కాదు! ఒక ఒద్దుకు చేరిపోయాడు !''

సంతోషంతో భామ అతనిచేతులు పట్టుకొని "నిజమేనా ప్రియా ? ఇవాళ శుభవార్తమీద శుభవార్త వినవస్తోంది!" అంది.

''ఇవాళ యిక్కడ యింతమంది వైశాలీ సుందరీమణులు పోగైవుంటే సంతోషవార్తలకి కొదువేమిటి ? చెపుతా విను, వైశాలి దక్షిణ ద్వారంవద్ద నగరోప రక్షకుడుగా నియమించారు నన్ను."

భామ తలవాల్చి ''అంటే రణరంగానికి నాలుగుయోజనాల దూరాన— దేహం రవంతయినా చెక్కుచెదరకుండా నన్నమాట ?'' అంది వెటకారంగా.

''అయితే నన్ను యుద్ధరంగంలోకి పంపేదాకా నీకు తృప్తిలేదన్నమాట. ఓరి బాబు! ఇల్లాంటి పెళ్ళాన్ని నే నెక్కడా చూళ్ళేదే!"

నే నందుకుని అన్నాను—''ఒదినా ! లిచ్ఛవులు రెండుచేతులా కత్తులు పట్టి రణరంగంలో వురకటం మినహా మరే పనీ ముట్టరాదనుకుంటున్నావా ? అల్లాఅయితే మనకి జయంమాట సున్నే వదినా! యుద్ధరంగంలో కథన మెంత అవసరమో, క్షతగాత్రులకు కట్లుకట్టి సేవచెయ్యటం, సైనికులకోరకు వంటిండ్లో పిండి విసరి, రొట్టెలు కాల్చడం, దుస్తులు కుట్టడం అంతే ప్రాముఖ్యమైనవి. వైశాలిలో శత్రువుల యీగయినా జొరబడకుండా కాపాడుటకూడ అంత అవసరమే.

''మంచిదే. కాని, తమ రిల్లాంటి వాచస్పతులు కూడానని నే నెరుగనే" అన్నది భామ.

''నేను వాచస్పతిని కావటమే యిష్టం లేనిదానవు మనూని ఆక్షేపించుతా వెందుకు ?" అన్నాను.

"భర్త నేమన్నప్పటికీ మన లిచ్ఛవులలో నేటివరకు తప్పుగా భావించడం లేదు; కాని, నువ్విప్పుడు సేనానాయకుడివి, నీ అన్న నగర రక్షకుడూ - ఇంకేం, ఇక యిద్దరూ ఏకమై లిచ్ఛవీ కాంతలనోటికి తాళంవెయ్యండి."

మనోరథుడు చేతులు జోడించి భామముందు ఒంటికాలుమీద నిలబడి "దేవీ! వాచస్పతి పదవిని నువ్వింకొకర్ని తీసుకోనివ్వ దలచలేదు. బ్రహ్మకైనా ఆ పదవి నివ్వని నీ ముందు సింహు డేపాటి ? సరే, నగర రక్షకుడిని కావటం యిష్టంలేకుంటే నీ కిష్టమైన వుద్యోగమే యిప్పించు, నిర్వహిస్తాను. నీకు సంతృప్తిని కల్గించగల పదవి లభ్యపడే అవకాశముంటే నాకూ అదేయిష్టం."

భామ కొంచెం మెత్తబడి "సేవకా ! మనోరథా ! నీ తపస్సుకు మెచ్చాను. నీ కక్కావలసిన వరం వేడుకో" అన్నది.

"సంతోషం దేవీ ! ఈ సేవకునిపై భవదీయ కృపాకటాక్ష వీక్షణా లనవరతము ప్రసరించాలన్నదే మదీయ అభీష్టం."

"అభీష్టసిద్ధిరస్తు ! ఇంకేమైనా ?

"మీ మహిళా మండలి శాస్త్ర కాంత స్వభావం వహింతురుగాక !"

"ఒక మినహాయింపుతో అట్లే యగుగాక ! లిచ్ఛవీకాంతల సైనిక శిక్షణకు ప్రోత్సాహమిచ్చి, సింహా, కపిలులవలె నీవుకూడ సహాయపడుతూండాలి.

"మీ యీ సేవకుడెల్లప్పుడు తమపాదసేవకు సంసిద్ధుడే; అయితే కపిలుడే సుకృతం కారణంగా భవత్కృపా పాత్రుడైనాడో తెలిసికో గోరవచ్చునా?"

"కపిల్ మా క్షేమకు సాము—గరిడీలు నేర్పుతున్నాడు. (క్షేమ ముఖంలోని మార్పును గ్రహించి వెంటనే విషయంమార్చి) నువ్వు క్షేమ చేతుల్ని చూచావూ ? పిల్లా ! నీ చేతు లిల్లా చూపు" అన్నది భామ.

మనోరథుడు బొబ్బలెత్తిన చేతులుచూచి "అయితే భామా ! నువ్వు అంబాపాలి తెప్పను నట్టేట్లో ముంచేసే టట్టున్నావే ?" అన్నాడు.

"మా ఉద్యమమంటే నీ కిష్టంలేదా మనూ ?"

"నీ యిష్టమే నా యిష్టం ప్రేయసీ !"



# 17. వైశాలి వణిజులు, శిల్పులు

ఇవాళ మధ్యాన్నం తీరుబాటుగా వున్నందున కపిల్ బసకు వెళ్లాలనుకున్నాను. నే నా సంగతిని రోహిణికో చెప్పాను. ఆమె భామకి, భామ క్షేమకి చెప్పుకొన్నారు. ఇక నా అప్సరసలు ముగ్గుర్నీ రథంమీద కూచోబెట్టుకొని సింహుడు వైశాలి వీథులకుండా వెళ్లక తప్పిందికాదు; నన్నప్పుడు చూచినవాళ్లంతా 'సింహుడదృష్టశాలి' అనుకొని వుంటారు. దారిలో కనపడిన ప్రతి యువకుడు పెదవివిప్పకుండానే నవ్వడం గమనించాను. అజిత్ కడుపుబ్బపట్టలేక 'అదృష్టదేవతను అప్పుడప్పుడూ మావంకకూడ చూడనివ్వన్నా!' అనేశాడు మొహంమీదనే.

భామ నోరు విప్పబోయింది; కాని, నేను గుర్రాన్ని అదలించటంతో రథం ముందుకు సాగిపోవడంవల్ల ఆగిపోయింది. నేనప్పుడు భామకు రెండు నీటికోళ్లు పట్టుకొన్న పుల్లను నోటితో కరచి పట్టుకొని గగనయానంచేసిన తాబేలుకథ వినిపించాను. కథ అంతా ఆలకించి భామ అన్నది—"అయితే మరదీ! నువ్వు మూడు నీటికోళ్ల మధ్యనున్న తాబేలువనా? లోకులనే మాటలకు మారు చెప్పకుండా వుడాయించుకొచ్చావు?"

కొరడాని యథాస్థానంలో పెడుతూ నేనన్నాను - "ఇదుగో ఒదినా మనం శ్రేష్టిసదనానికి వచ్చేశాం. నీ వాగ్జాలం కపిల్‌పైన విసురుదువుగాని అట్టే పెట్టు."

"ఏమిటిల్లా వచ్చారంటే, యేం చెపుతావు మరదీ?" అన్నది భామ.

"నామట్టుకు ఆ ప్రశ్నేరాదు; నేను తరచుగా వచ్చేవాడినేగా."

"అయితే నువ్వు బలే స్వార్థపరుడివి మరదీ! పూర్వం తేలు కుట్టినప్పటిలాగా మళ్ళీ భామని నట్టేట్లో ముంచాలనేనా?"

"భామ తననేగాక తన చెలుల్నికూడా కాపాడుకోగలదనే విశ్వాసం నాకుంది."

"అదెల్లాగూ జరిగేదేలే."

రథం దిగి నేను గుర్రాన్ని రథచోదకునికి అప్పగించాను. సుందరీత్రయాన్ని వెంటేసుకొని మేడపై కెక్కటానికి మెట్లుకోసం ఒక గదిలోనుంచి మరో గదిలోకి వెళుతూండగా భామ నా చెయ్యిపట్టుకొని ఆపి "నాకో వుపాయం తోచింది మరదీ! (ఎడంచేత్తో క్షేమని లంకించుకొని) సాము - గరిడీ నేర్ప

టంలో - ముఖ్యంగా వైశాలి సుందరాంగులకు నేర్పుటలో కపిల్ సిద్ధహస్తుడని విన్నామనీ, కాబట్టి నీ శిష్యులం కావడానికి వచ్చామనీ చెపుతాను.” అంది

క్షేమ కోపంతో అలిగింది. “అట్లయితే నేను తిరిగెళ్లిపోతానక్కా.” అంది.

భామ ఆమె చేతుల్ని మరింత గట్టిగా పట్టుకొని అన్నది— “ఏఁ పిల్లా! నేను నీ పేరైనా యెత్తలేనా?”

“హూఁ, పేరెత్తలేదంట! ఎవరికి తెలుసదు?”

“అయినా కపిల్ వద్ద నువ్వు సాము నేర్చుకున్నావే అనుకో. అయితే తప్పా? విద్య నేర్చేది ఎవరో ఒక గురువువద్దనేగా?” అందిభామ.

“నువ్విమాటే అంటానంటే నేను వెళ్లిపోతా.”

“అయితే నీటికోళ్లు మాడింటిలోను ఒకటి మాయమవుతుందన్నమాట! ఇక మిగిలేది ఒక తాబేలు, రెండు నీటికోళ్లే. మరదీ! నీ కథలోకూడ నీటికోళ్లు రెండేగదూ?”

రోహిణి క్షేమను తన దగ్గరికి లాక్కొని “చెల్లీ! భామ వేళాకోళమూ, ఎకసక్కేలూ మామూలేగా”అంది.

భామ తప్పుచేసిన దానివలె నాలికకొరుక్కొని - “సరేలే క్షేమా! నే నిక నీ వూసెత్తనులే” అంది.

“నే రెన్నిసార్లు తలిచినా సాము సంగతి మాత్రం యెత్తగూడదు వదినా!” నే నన్నాను.

“సరే, నేను చెవులు పట్టుకుంటున్నాలే” అంది భామ.

కపిల్ ప్రభృతులు మధ్యాహ్నభోజనం ముగించి ఖులాసాగా కబుర్లు చెప్పు కుంటూ కూచున్న మూడో అంతస్థులోని పెద్దహాల్లోకి ముద్దుగుమ్మలు ముగ్గురూ ముందు నడుస్తాంటే వెనకనే వెళ్ళాను. వారు మమ్మల్ని చూస్తూనే లేచినిల బడ్డారు. కపిల్ ముందుకొచ్చి “దేవిగార్లకు స్వాగతం!” అన్నాడు.

“అప్సరసలు అను మిత్రమా! ఇప్పుడు దేవిగార్లకు అంగడిలో గిరాకీలేదు” నవ్వుతూ నే నన్నాను.

కపిల్ కూడ నవ్వుతూ అన్నాడు—“అయితే అప్సరసల్ని మానవులవద్దకు చేర్చే దేవదూతలు — తమరుకూడ విచ్చేశారన్నమాట! దేవతలారా! కాదు, అప్సరసలారా! నేడు తమ పాదధూళిచే యీ పేదల విడిదిని పునీతంచేయడానికి గల హేతువు నరయవచ్చునా?”

“మా పాదధూళి అంతసులభంగా లభించేది కాదు కపిల్. మేము కాలి జోళ్ళు వదిలింది యిక్కడి తివాసీ మీదనే” అని అతిఠీవిగా జవాబిచ్చింది భామ.

“నేను నీకు సమాధానం చెప్పగలవాణ్ని కాను భామా!” అన్నాడు కపిల్.

“అయితే నేను నీకా విద్య నేర్పుతాన్లే.”

"అనేక ధన్యవాదాలు; అయితే భామా! ఒకేసారి యిద్దరు దేశైకసుందరీ మణు లెవనిగడపతొక్కుతారో ఆతడెంత భాగ్యశాలి!"

"కాదు, సేనానాయకా! ఒకదేశంలో ఏకకాలంలో యిద్దరు సర్వోత్తమ సుందరు లుండరు."

"నేనన్న యిద్దరిలో ఒకామె మాజీ అందాలరాణే ననుకో."

"మాజీ దేశైక సుందరులకు లెక్కేముంది. పళ్లూడి కర్రనూతగాగొని వూగిసలాడుతూ నడిచే దేశైక సుందరులకు కొఱతేముంది?"

"కాని, ఏడాదిక్రితంవరకు అందాలరాణిగావున్న యామె విషయం అట్లా కాదుగా?

"ఆమెగిరాకీ పడిపోయింది కపిల్! ఇప్పుడు సర్వసుందరి ఒక్కతే. ఒక ఒరలో రెండు కత్తులు, ఒక అడివిలో రెండు సింహాలూ వుండవు. కాబట్టి మన మధ్యవున్న దేశైక సుందరి ఒక్కతే—క్షేమే. సరే, యింతకూ మేమువచ్చి మీ పగటినిద్ర చెడగొట్టలేదుకద?"

"నిత్యము నువ్వు మా నిద్ర భంగపరచటమే మా అభిలాష సుందరీ!"

"ఆ బాధలో ఆనంద మేముంటుంది?—మరదీ! మూంగిలా కూచోక యిక నువ్వు నోరుతెరచి మాట్లాడుదూ, నా వాగుడు కేముంది" అని భామ నన్ను రేపింది.

"నీ నోటిమాటల్లో తేనె లూరుతుంటాయి వదినా!" అన్నాను.

"ఇదిగో మరదీ! వన్నదేపనిగా పొగడి తోడికోడళ్లలో జగడంతెచ్చి పెట్టేవు."

"మన్లో మనకి తగాదా పెట్టడాని కెవరికి శక్యం అక్కా!" అంది రోహిణి.

"మగవాళ్లకి నిలకడలేదు రోహిణీ! ముందు తామే కయ్యంపెట్టి తర్వాత తోటికోడళ్లకు పడటం లేదు, అత్తా కోడళ్ల పోరుతో వేగలేకుండా వున్నా మంటారు" అని భామ మగవాళ్లమీద విరుచుకొని పడింది.

"మగవారికనుసన్నలతో పోట్లాడుకునే తోడికోడళ్లు అదో తరహా అక్కా!" అన్నది రోహిణి.

"అవునే చెల్లీ! మనం బయటపడి యుద్ధరంగంలో పరాక్రమం ప్రదర్శించా లనుకుంటూంటే యింట్లో ద్వంద్వయుద్ధ మెందుకు చేస్తాం? సరే, సేనానాయకా, కపిల్! మేంకూడ యుద్ధ కార్యనిర్వహణకు ఆయత్తమవుతున్నాము."

కపిల్ భయకంపితుడైనట్లు "ఏమన్నావు దేవీ! అట్లాయితే త్రిలోకాలూ భస్మమైపోవూ! స్త్రీలకు శోభించేది శాంతే" అన్నాడు.

"అయితే మా హస్తాల్లో కృపాణం శోభించదనేనా మీ అభిప్రాయం?" అనడిగింది భామ.

"అల్లా అని ఎవరన్నారు? రోహిణిని ఆనాళ మహాసింధుఒడ్డున చూస్తే ఆ శోభ బోధపడేది భామా!"

"మహా సింధుఒడ్డున నేను చూళ్లేదుగాని, మహాగంగ గట్టున ఎల్లాగూ చూస్తాము" అంది భామ.

"భేష్! నువ్వు ప్రస్తావించింది యుద్ధసన్నాహాన్ని గురించా? నేనింత వరకు మీ సన్నాహంతో నా పాపము, సింహుని పాపము బద్దలవుతుందేమో ననుకున్నానే."

భామ వెంటనే - "మీ పాపంకాదు బద్దలయ్యేది, బింబిసారుని బుర్ర" అన్నది.

"అయితే మీ సన్నాహం సంతోషకరమైనదే. మే మీ యుద్ధంలో పాల్గొనేందుకు మీ పంచాయతీ అవకాశమిచ్చింది భామా!" అని చెప్పాడు కపిల్.

అప్పుడు నే నన్నాను - "మిత్రమా కపిల్! ఇంకో సంగతికూడ విను - పంచాయతీ లిచ్ఛవీ స్త్రీలకు కూడ యుద్ధకార్య నిర్వహణభారం అప్పగించటానికి తీర్మానించింది. లిచ్ఛవీ స్త్రీ సైన్యానికి భామ నాయకిగా నియమింపబడటం మరీ సంతోషించదగ్గదనుమా!"

కపిల్ —"అభివందనాలు భామా!"

నేను —"నీ సోదరి రోహిణి ఉపసేనానాయకి."

కపిల్ — "చెల్లి రోహిణీ ఇల్లారా" సిగ్గుచే జేవురించిన మోముతో ముందుకొచ్చిన రోహిణి లలాటాన్ని ముద్దుపెట్టుకొని "చాలాచాలా అభివందనాలు" అన్నాడు.

నేను— "వదినా! మీ స్త్రీ సైన్యంలోచేరే తొలిబంటు క్షేమేగదూ?"

భామ— "అయితే ఇద్దరు సేనానాయకురాండ్రకు ఒక సిపాయి అని మమ్మల్ని ఎగతాళి చేస్తున్నావా?"

నేను—"కాదు ఒదినా! నిర్ణయం జరిగింది నిన్న నేనని కపిల్‌కి తెలుసులే, సైన్యాన్ని సమకూర్చటం యెప్పుడైనా ఆదిలో ఒక్కరితోనేగా ప్రారంభమయ్యేది."

కపిల్ —"భామా! కాదు, సేనానాయకీ! నీ తొలి సిపాయే ఒకప్పుడు నీ మొత్తం సేనకు ఖ్యాతిని గడించిపెడుతుంది."

నేను—"ఆ విషయంలో నీకంటె భామకే బాగా తెలుసు కపిల్!"

కపిల్ —"బహుశా అంతేకావచ్చు"

నేను—"ఇంకా బహుశా ఎందుకు?"

కపిల్ —"భామ ఇదివరకు క్షేమ హస్త పరిశీలన చేసివుండలేదేమో?"

నేను—"అంటే వాటి సంగతి నీకు బాగా తెలుసునన్నమాట."

కపిల్—"ఆమె యీ మధ్యనే నావద్ద కత్తితిప్పడం నేర్చుకోసాగింది. మిత్రమా! ఆమె చేతులు సాముకు బలేవాటంగావున్నై సుమా."

నేను—"అయితే త్వరలోనే క్షేమ సేనానిపదవిని కొట్టేస్తుందన్నమాటే. ఇదంతా నీ చేతి చలవే."

కపిల్—"ఆమె యింకా పదిహేను రోజులపాటు కృషిచేస్తే ఖడ్గచాలనంలో తర్ఫీదవుతుంది. క్షేమకి గుర్రపు స్వారీలో ఇదివరకే నేర్పువుంది. బల్లెము, ధనుస్సు లుపయోగించటం యింకా నేర్చుకోవాల్సివుంది."

క్షేమ—"బాణాన్ని గురిపెట్టి బాగానే సంధించగలను.

కపిల్—"నువ్వు గురిచూసికొడ్తే చాలనుకుంటూన్నావా? బాణం నడుపూ, వేగం పెంచాలి. గురి కుదిరిన తర్వాత తతిమ్మా సులువులన్నీ తేలిగ్గానే గ్రహించవచ్చు. మొత్తంమీద క్షేమ ఒకటిన్నర నెల్లలో కొంతవరకు విద్య పూర్తిచేయవచ్చుననుకుంటాను సింహా!"

నేను-"కాని, నువ్వన్నాళ్లు క్షేమకి శిక్షణ నిచ్చేందుకు అవకాశముండ దనుకుంటాను."

కపిల్-"అదీ నిజమే. నిన్న నువ్వు చెప్పిన వివరాలనుబట్టి అల్లాగే కన్పిస్తోంది. మరి వుల్కాచేలానికి నీ ప్రయాణ మెప్పుడు?"

నేను- "ఈ వారంలోనే."

తాము శెట్టి భవనాన్ని చూచి వస్తామని భామ గాంధార యువకుడు శంతనుని వెంటబెట్టుకొని తన నెచ్చెలులతో అక్కడి నుంచి వెళ్లింది.

"నేనూ నీతో రావాల్సి వుంటుం దనుకొంటాను" అన్నాడు కపిల్.

"అవశ్యం రావాలి. మన మక్కడ ఒక వారంరోజులపాటు సైనికదృష్టితో గంగాతీరాన్ని పరిశీలించి, గండకీ దుర్గశ్రేణిని చూడాలి. మన యుద్ధనావలను యింకా దృఢతరం గావించేందుకు కొన్ని మార్పులు చేయించాలను కున్నాను. మనం పదకొండు మందిమీ పోయి వాటిని పరిశీలించుదాము; తర్వాత అవసర మయ్యే మార్పులను గూర్చి యోచించుకోవచ్చును. మనం సూచించే మార్పులను కార్యరూపంలో పెట్టడానికి కమ్మరుల సలహా, సహకారాలను తీసుకుందాం. వైశాలికి పడమరగా వున్న సరోవరాన్ని మన నౌకా విన్యాసాలకు కేంద్రంగా చేస్తే బాగుండదూ కపిల్?" అనడిగాను.

కపిల్ కొంచె మాలోచించి చెప్పాడు—"అది అవసర మనే నా వుద్దేశం కూడాను. గండకీ నదీతీరాల్లో ఒకటి మాత్రమే మన అధీనంలో వున్నందున రెండో తీరాన్నుంచి అన్యులు మన నౌకా సంబంధ ప్రయోగా లన్నిటినీ పరికించ గలరు. కాన నీ సూచన అవశ్యాచరణీయమే."

"ఇక్కడైతే పరులకంట బడకుండా మనం విన్యాసాలను గోప్యంగా జరుపుకోవచ్చును."

"అదే మంచిది సింహా! నావలనుచూచి మనం మార్పులను గురించి ఆలోచించుదాము. నావికులను, సైనికులనుకూడ మనం పరీక్షించాలి. నావలన్నిటిని సుదృఢం గావించిన పిదప మన సహచరుల్ని గండకీవద్ద నౌకాదళాల్లోనే వుంచవచ్చు. శిల్పుల సహకారంతో నావల నిక్కడే సంస్కరించి ప్రయోగించి చూద్దాం. ఉపయోగా లనుకున్న మార్పుల నెక్కువ నౌకల కుపయోగించటానికి తగినంతమంది లోహకారులను గండకి వద్దకే చేర్చి పనిని శీఘ్రగతిని పూర్తిచేయించటానికి ఏర్పాటుచెయ్యాలి."

"ఇదేకాదు, మన మన్నిపనులను త్వరత్వరగా ముగించుకోవాలి. నెలా పదిహేనురోజులకు శీతాకాలం వెళ్ళిపోతుంది. ఈ చలికాలంలోనే యుద్ధం సాగించటం శ్రేయస్కరం; కాని, బింబిసారుడు తాత్సారం చేస్తున్నాడు. వారి సన్నాహ మింకా పూర్తిఅయివుండదు. మన ఏర్పాట్లయినా యింకో నెలకిగాని సమాప్తంకావు."

"అంటే ఇంకో నెల అనంతరంగాని మనం యుద్ధానికి దిగలేమన్నమాట. క్షతగాత్రులకు వేసవికాలం మరీ బాధాకరంగా వుంటుంది" అన్నాడు కపిల్.

"అల్లా అని బింబిసారునికి, లేక యీ యుద్ధప్రేరేపకుడైన అజాతశత్రునికి క్షతగాత్రులపట్ల జాలి ఎందుకువుంటుంది? ఒకరికి బదులు పదిమంది హతులయితే మాత్రం వారికేం? ముందు దురాక్రమణచేసే అవకాశాన్ని మనమేమాత్రం బింబిసారుని కివ్వకూడదు. పరిస్థితులన్నీ సరిచూచుకొని ముందుగా మనమే యుద్ధ మెప్పుడు ప్రారంభించాలో ఆలోచించుకుందాము."

"ఈ యుద్ధానికి మూలకారకుడు అజాతశత్రుడనే నీ అభిప్రాయమా?"

"నిస్సందేహంగా అంతే. వృద్ధ బింబిసారు డీవరకే లిచ్ఛవులతోడి పోరాటంలోని మజా చవిచూచి వున్నాడు. తనమాట నెగ్గితే మళ్ళీ లిచ్ఛవులను కవిలించి కయ్యానికి కాలు దువ్వేవాడే కాదు."

"అసలీ కేపటానికి కారణం?" అని అడిగాడు కపిల్.

"జయము, రాజ్యవిస్తరణ."

"అంటే ఒక స్వతంత్ర జాతిని పరాధీనంచేయుటమన్నమాట?"

"మిత్రమా కపిల్! ఈ రాజులకు చక్రవర్తిత్వం వెలగబెట్టాలనే దురాకాంక్ష వుంటుంది. ప్రపంచంలోని భూభాగాన్నంతటా యేకచ్ఛత్రాధిపత్యం స్థాపించి యేలాలనే వారి వాంఛ."

"పర్షియా చక్రవర్తి దరయనులాగా నన్నమాట!"

"ఎన్ని ఎక్కువ జాతుల్ని-దేశాలను పరాధీనం చేస్తే అంత గొప్ప చక్రవర్తి అవుతాడు."

"అయితే మన పంచాయతీ ప్రజాతంత్ర రాజ్యాలకు పూర్తిగా విరుద్ధమన్న మాట. మనం పరాధీనుల మవడానికి అంగీకరించం. మరొక జాతిమీద పారతంత్ర్యాన్ని రుద్దాలని కోరం."

"మన మల్లా చెయ్యాలన్నా చెయ్యలేము. మన రాజ్యాల సరిహద్దులన్నీ మన రక్తంమీద ఆధారపడి వున్నాయి. లిచ్ఛవులు లేనిచోట లిచ్ఛవీ ప్రజాస్వామ్యాన్ని స్థాపించడం అసంభవమే."

"అంటే పంచాయతీ రాజ్యాధికారం విశాల భూభాగంమీద స్థాపించటం సాధ్యంకాదన్న మాట?"

"అల్లా స్థాపించటమే సంభవించితే మన ప్రజాస్వామ్యాన్నే కోలుపోతాము. అధికారం పంచాయతీ చేతిలోనుంచి జారిపోయి, స్వజాతి, విజాతీయ సేనలమీద సైన్యాధ్యక్షుడే సర్వాధికార సమన్వితుడవుతాడు, కాబట్టి—"

"విజాతీయ లేమిటి?"

"ఒకే రాజ్యాధికారంలోని విశాల భూభాగమందలి వివిధజాతులను ఆయుధబలంతో మాత్రమే పరాధీనులుగా వుంచడం సాధ్యపడుతుంది. ఆ పనికి పంచాయతీలోని ఒకేజాతి సమర్థం కాలేదు."

"అయితే ఆ సైన్యాధికారే రాజవుతాడు" అన్నాడు కపిల్.

"అవును, రాజు లావిధంగా గద్దె లెక్కినవారే."

"మరి పంచాయతీల గతేంకావాలి?"

"ప్రజాస్వామికాల్లోని ప్రజలహృదయాల్లో ప్రజ్వలించుతూండే స్వాతంత్ర్యాగ్ని వివిధజాతులమీద రాజులు సాగించే ఏకచ్ఛత్రాధిపత్యాన్ని భస్మీపటలం గావించి వేస్తుంది."

"అంగ - మగధలు, కాశీ - కోసల రాజ్యాలు అజాతశత్రుని హస్తగతమైతేనో?"

"ఆ మాట నాలకించితేనే నా గుండె గుభేల్ మంటోంది."

"రాజతంత్రం తన సరిహద్దులను విస్తరింపజేసుకోనిదే మనగల్గుట అసంభవమని స్పష్టమవుతోంది."

"పెద్ద పెద్ద చేపలు చిన్న చిన్న మీనులను మ్రింగి మరీ పెద్ద వవుతాయి."

"పంచాయతీరాజ్యం తన ఎల్లలనుమాత్రం సురక్షితంగా వుంచుకోగల్గుతుంది."

"సంతాన మభివృద్ధిచెంది; జనాభా పెరిగేకొద్దీ యితరుల భూమివరకు వ్యాపించుతుందికూడాను."

"అయితే ఆ పని తన సజాత్యభివృద్ధిద్వారానే."

"అవును, అప్పుడక్కడ సరిహద్దు రక్తప్రవాహంతోగాని నిర్ధారణకాదు."

"సరేగాని, మరి పంచాయతీల భావినిగూర్చి నీ అభిప్రాయమేమిటి?"

"అది ఎప్పుడో ముందుతరాల వారు చూడబోయేది మిత్రమా! పంచాయతీ జీవితం అతి సుందరము, స్వచ్ఛందము, మానవోచితమూ నని మన కిప్పు డనుభవైకవేద్యమే. రాజతంత్రంలోని జీవితం కేవలం బానిసత్వమే ననికూడ మనకి తెలుసు. మనం గాని, మన లాంటి ప్రజాస్వామ్యవాదులుగాని యీ జీవితాన్నుంచి ఆ బ్రతుకుకు అలవడలేము."

అని నేను చెప్తున్నంతలో శంతనునితో అప్సరసలు ముగ్గురూ వచ్చారు.
"రాజ సదన మెల్లావుంటుందో గాని, నే నింతకు ముందు శెట్టిగారి యీ భవనం లాంటిది చూచెరగను" అని రోహిణి ఆశ్చర్యాన్ని వెలిబుచ్చింది.

"ఈ భవన నిర్మాత లిచ్ఛవీ కాదు" అని నేను చెప్పాను.

"మీ లిచ్ఛవీ పరివారాల్లో యీ శెట్టి సంపదతో తులతూగే భాగ్యవంతులే లేరుగా" అన్నాడు కపిల్.

"అంతేకాదు, లిచ్ఛవీ పరివారాల్లోని బానిసలు యావన్మందిని కొనగల భాగ్యశాలి అనవచ్చు."

"ఇంతకూ అత నింత శ్రీమంతు డెల్లా కాగలిగాడో?" నన్నాడు కపిల్.

"వ్యాపారంవల్ల. అతడు తూర్పు దేశాల్లోని గొప్ప సార్థవాహుల్లో ఒకడు. అతని పూర్వుడొకడు కోసలరాజు కోపానికి గురికావడంవల్ల యిక్కడికి వచ్చి ఆశ్రయం పొందాడు."

"ఇప్పుడీ భవనం ఖాళీగా వుండటానికి కారణం?"

"అతడు నిస్సంతుగా మరణించాడు. సంతులేనివారి సంపదంతా లిచ్ఛవీ పంచాయతీ పరమవడమే యిక్కడి న్యాయం."

"సరేగాని, మిత్రమా! వజ్జిదేశ పాలనాధికారం అంతా లిచ్ఛవుల చేతుల్లోనే వుందన్నావుగదా, మరి యీ శెట్టిలాంటి లిచ్ఛవేతరు లెప్పుడైనా, ఏ పొరపాటు వల్లనో అన్యాయానికి గురి అయితే రక్షణోపాయం వుందా?" అనడిగాడు కపిల్.

"వర్తక శ్రేష్ఠులు ప్రత్యేకంగా తమ శ్రేయంకొరకు బలవత్తరమైన వాణిజ్య సంఘాలను నడుపుతుంటారు. తమ కేట్టి అన్యాయం జరిగినా వారు పంచాయతీ ముందు చెప్పుకోవచ్చు. పంచాయతీ తన వునికికి వ్యక్తులనే ప్రధానంగా యెంచుతుంది; కాబట్టి వర్తకసంఘ ఆరోపణను శ్రద్ధగా ఆలకించి విచారించకుండా వుండలేదు. ఇల్లాంటి సంస్థలు రాజతంత్రాల్లోకూడ వున్నై; కాని, అక్కడ రాజు చిత్తమొచ్చినట్టు చేసివేయటంలో కృతకృత్యుడవుతాడు; కాబట్టి సంఘాలు వారిమీద ఒత్తిడి తేలేవు; అయినా ఆ వర్తకసంఘాలు తమ సంఘీయులమీదమాత్రం మంచిమహిమ కలిగివుంటై. పంచాయతీ అనుబంధసంస్థలు గ్రామ పంచాయతీ లున్నట్టే యిక్కడ వర్తక సంఘంకూడ పంచాయతీకి అనుబంధించి వుంటుంది. అది కేవలం వ్యాపారులు, సార్థవాహుల ఆంతరంగిక, వ్యక్తిగత, వ్యాపార సంబంధ తగాయిదాలను పరిష్కరించడమేగాక, ఇతర జనపదాల్లో (పంచాయతీ

రాజ్యాలు) వజ్జి వర్తక ప్రముఖుల గౌరవానికి భంగం కలుగకుండ కృషిచేస్తుంది. వాటివల్ల పంచాయతీకి మరో ప్రయోజనంకూడా వుంది. సార్థవాహులు వ్యక్తిగతంగా అంతర్జాతీయులవుతున్నారు. వారిఅంగళ్లు వజ్జికి వెలుపల దూరదూర దేశాలలోకూడ వుంటాయి. అట్టివారితో ఎవడైనా వ్యక్తిగత స్వార్థబుద్ధితో ప్రవర్తించటంకూడ సంభవమే; కాని, వాణిజ్యసంఘంమాత్రం అంతర్జాతీయం కాజాలదు. అది పరిశుద్ధమైన స్వదేశానురాగం కలిగివుంటుంది. లిచ్ఛవీ జనసంస్థ వలెనే అదికూడ వజ్జిభూమిపట్ల విశ్వాసఘాతుకత్వాన్ని మాత్రం సహింపదు."

"స్వార్థపరులైన ఆ కొద్దిమందే వాణిజ్యసంఘంమీద పెత్తనం సంపాదించి గుప్పిట్లో పెట్టుకుంటేనో?" కపిల్ సందేహాన్ని వెలిబుచ్చాడు.

"అల్లా ఎన్నడూ సంభవించటానికి వీల్లేదు. సంఘంలో అధిక సంఖ్యాకుల వర్తకం వజ్జి భూభాగంలోనే. అదీగాక సంఘాలు ధనిక సార్థవాహుల చెప్పు చేతలకు లోబడకుండడానికి మరో హేతువు అని స్వయంగా గొప్పగొప్ప నిధులు కలిగివుంటాయి. తరతరాలనుంచి వాటివద్ద ధనం పోగుబడుతూ వస్తోంది."

కపిల్ మళ్లీ అబ్బురపడి అన్నాడు—"సంఘాలకు అశేషధనమా!"

"అవును; సంఘంకోసం వర్తకులు, వాణిజ్యవేత్తలు తమతమ నికరాదాయంలో ఒక వంతును ప్రత్యేకించి యిస్తారు. అల్లా వచ్చినదాన్లో కొంత ఖర్చవుతుంది. నిల్వధనాన్ని సంఘం వడ్డీకి అప్పిస్తుంది. సంఘ ధనం పంపిణీ చేయబడదు. అందువల్ల అది వ్యక్తుల భాగ్యంకంటె పెరుగుతూనే వుంటుంది."

"మా వేపున వాణిజ్యసంఘాలుండనందున మాకీ సంగతులు విచిత్రంగా వున్నై".

"విచిత్రంగానే కనబడుతాయి. ఈ భవనాన్ని శెట్టి తన మరణానికిముందే వాణిజ్య సంఘానికి యిచ్చివుంటే నేడిది పంచాయితీ సొత్తయివుండేదికాదు. ఈ యింటి అద్దెక్రింద వచ్చే ఆదాయంకూడ వాణిజ్యసంఘ నిధికే జమ పడుతూండేది. బహుపుత్ర చైత్యస్వామి ఆలయం మొదలగు దేవస్థానముల నిధులు, ఆదాయంకూడ వాణిజ్యసంఘంలోనే నిల్వ వుంటుంది. నిధులవల్ల వచ్చే వడ్డీని మాత్రం ఆయా దేవస్థానాల వుత్సవాలు వగైరాలకు నియమపూర్వకంగా వినియోగించుతూంటుంది."

"మీ వజ్జిదేశంలో యింకా పెక్కు సంఘాలున్నవనుకుంటాను."

"సార్థులు, వర్తకులకొక సంఘము, శిల్పులలో ఒక్కొక్క రకం శిల్పులకు అంటే – దంతకారులకు, లోహశిల్పులకు, శిలాశిల్పులకు – యిల్లాగే ప్రత్యేక సంఘాలు అనేకం వున్నై."

"వీటినే మీ పంచాయితీక్రింది చిన్న పంచాయితీలన్నావు కదూ?"

"మా రాజ్యంలో చిన్నరాజ్యాల్లాంటివి ఇల్లాంటి సంఘాలు మగధ, కోసల, మున్నగు రాజ్యాల్లోకూడ కనిపిస్తాయి. కాని, వాటికంటె పంచాయితీ రాజ్యంలోని సంఘాలు నిర్మాణయుక్తంగాను, శక్తి - సంపన్నంగాను వున్నై."

ఎంతసేపూ మేమిద్దరమే మాట్లాడుతూండడంవల్ల మా అప్సరసలు కొంచెం విసుగు చెందుతూన్నట్లు గ్రహించి నేను భామతో అన్నాను, - "వదినా! నువ్వు మౌనముద్ర వహించావేమిటి ?"

"నువ్వే మమ్మల్ని మౌనం వహించేలా చేస్తున్నావు మరదీ! ఇంతకూ మీ యీ సంఘాల గొడవకు అంతూపొంతూ లేదా ? మేము వచ్చినట్టే తిరిగి పోవలసిందేనా ?" అంది భామ.

"వచ్చినట్టే అంటే ?" నే నడిగాను.

"మరి నువ్వు మమ్మల్ని మ్యుగురిని యీ భవనం చూడటానికే వెంటేసు కొచ్చావనుకుంటున్నావు కాబోలు ! మేమొక వుద్దేశంతోనే బయలుదేరి వచ్చాము."

"అల్లాగా ! ఏమి టా వుద్దేశం ?"

"లిచ్ఛవీ కాంతలకు సైనికశిక్షణనిచ్చే విషయంలో కపిల్ సలహా నపే క్షించి వచ్చామయ్యా మరదీ !"

"ఓయబ్బో ! సైనిక శిక్షణే !!"

"మరే; సైన్యంతో సంబంధముండే స్త్రీలందరి శిక్షణను గురించి."

"అట్టయితే యింకేం, చెప్పు మిత్రమా ! లిచ్ఛవియాణులు నీపైనే ఆధార పడదలచారులే" అన్నాను.

"మరదీ ! ఇంతలోనే యీర్ష్యపడాల్సిన పనేముంది ?"

"ఇప్పుడే యీర్ష్య యెందుకులే నాకు ?"

"లిచ్ఛవియాణులం నీకూ్కాడ ఆ భారం కొంత అప్పగించుతాంలే. మా కోసం అంతగా వాదించి సమర్థించినప్పుడు ముందుకూడ నీ మీద ఆశపెట్టు కోవడం మా కుచితమేగా, (కపిల్ వంక చూచి) మరి మేమేమి నేర్చుకోవాలో, మా సేనలో యే వయస్సువారిని చేర్చుకోవాలో చెప్పన్నయ్యా!" అని అడిగింది భామ.

కపిల్ చెప్పాడు- "స్త్రీలు రెండు భాగాలుగా ఏర్పడి పనిచేయ్యాలి. ఒక భాగం సాము- గరిడీలు నేర్చి సాయుధదళాలుగా ఏర్పడాలి. రెండో భాగం లోనివారు ఆహార సరఫరాశాఖ, ఔషధసేవాదళంగానూ పని చెయ్యాలి. అంటే శత్రువులమీద దెబ్బతీసేది ఒకభాగం, మన సైనికులకు ఆహారాదులు అందజేస్తూ క్షతగాత్రులకు చికిత్స, సేవచేసేది రెండోభాగం. గాయపడ్డవారిని సురక్షిత స్థానాలకు చేర్చేపని ప్రస్తుతం పురుషులే నిర్వహించుతూండడంవల్ల రణరంగంలో పోరాడే మందిబలం తగ్గుతోంది. ఇక నల్లాగాక ఆ పనిని మీరే నిర్వహించితే మహాబాగని నా వుద్దేశం."

"అయితే మే మందునిమిత్తం శస్త్ర చికిత్సకులను తయారు చేసుకొని, చికిత్సాశిబిరాలను నిర్వహించటానికి తగు శిక్షణ పొందాలి. మందు- మాకులు కొల్లలుగా సమకూర్చుకోవాలన్న మాట."

"అంతేకాదు, ఆహారాదులను సరఫరాచేసే భారం కూడ మీరే వహించవచ్చు."

"సరేకాని, యిదికూడ సైనికసేవే అవుతుందా?"

"ఖడ్గ, శల్య, బాణాది శస్త్రాస్త్రములతో రణరంగంలో ప్రవేశించి పని చేయటానికి మీ కధికారం యీయబడినప్పు డదికూడ అందులో ఒకభాగమే" అన్నాడు కపిల్.

"అట్లయితే మేమా పనుల్ని సంతోషంగా నిర్వహించటానికి పూను కుంటాము."

"రెండో శాఖలో పనిచేసేవారికక్కూడ కొంతవరకు అస్త్రవిద్యనేర్పి, చికిత్సాసంబంధమైన శిక్షణ నివ్వాలి. ఇందుకు ప్రాయంతో నిమిత్తంలేకుండా వృద్ధాంగనలనుకూడ చేర్చుకోవచ్చును. మొదటిశాఖలో అంతా పక్కాసైనికు రాండ్రే వుండాలి. వారికి మామూలుగా పురుషసైనికులకిచ్చే శిక్షణే యివ్వవలసి వుంటుంది."

"అంటే ఆ విషయంలో స్త్రీ-పురుషభేదం వుండకూడ దన్నమాటేగా?"

"అవును; ఇప్పుడు మళ్ళీ తరతరాలనాటి లిచ్ఛవియాణులవలె మీ కత్తి వాడి పురుషుల కరవాలములకు తీసిపోదని నిరూపించాలి."

"అన్నా కపిల్! లిచ్ఛవీకాంతలు కులదేవా సింహా! మీ యిద్దరి అమూల్య సలహాలను మే మర్థించుతున్నాము. మేము మా సాయుధ భటశాఖలో లిచ్ఛవేతర యువతుల్ని చేర్చుకోవచ్చునా, లేదా? చేర్చుకోదలచితే వేలాది బ్రాహ్మణ, వైశ్య స్త్రీలందుకు సంసిద్ధ మవుతారనే నే నాశించుతున్నాను."

"ఈ సందర్భంలో అంగీకార, అసంగీకారములకు అధికారంగల గణపతి, సేనాపతులు అభ్యంతరం చెప్పరనే నాతలంపు" అని నేను చెప్పాను.

"నా వుద్దేశంకూడ అదే" నన్నాడు కపిల్.

భామ కపిల్ నుద్దేశించి "గురూత్తమా! వైశాలిలో వున్నంతకాలము తాము మా సైనికశిక్షణ విషయంలో సహాయంచేస్తుంటారని ఆశించుతున్నాను" అంది.

"తప్పకుండాను" అని కపిల్ సమ్మతిని తెలిపాడు.

"ఇక - మాదీ! సేనాపతి, గణపతుల అనుమతి మాకు త్వరగా అందేటట్లు చేయవలసినబాధ్యత నీదే. తర్వాత ఒక నెలకి లిచ్ఛవీ సుందరీమణులు భామనే అనుసరిస్తారో, అంబాపాలినే అనుసరించుతారో నీకే తేటతెల్లమవుతుంది. మరదీ! నిజంగా నా కా పాడుముండ - మీద బలే కోపంగావుంది అది ఎందరెందరో లిచ్ఛవీ యువకులను భ్రష్టుల్నిచేసి, ఎన్నెన్నో సంసారాలకు యెసరుపెట్టి అంత టితో సంతృప్తిచెందక, లిచ్ఛవీయువతులను లిచ్ఛవియాణులుగా వుండనీక విలాసినులుగా చేసివేస్తోంది." అని భామ తనలో అణగివున్న ఆక్కసును వెళ్ళబోసింది.

"అయితే సాయంత్రం నువ్వూ, రోహిణీ ఆ వృద్ధులదగ్గరకు రారాదూ? ఆవేళప్పుడు స్లాను చేత్తోపుచ్చుకుని మాట్లాడే శోకం వుంటుందిగా ముసలాళ్లకి" అన్నాను.

"అల్లాగే వస్తాం మరదీ! నేనా తర్వాతనే మా యువతీసమ్మేళనకు వెడతాన్లే."

"అదేమిటి? మీ సమ్మేళన మేమిటి వదినా?"

"అవును, మేమంతా సంఘాన్ని స్థాపించాము. సోమ తన పితృగృహాన్ని మా కార్యాలయానికి యిచ్చేసింది. అక్కడే యువతుల మందరం యివాళ సమావేశమవుతున్నాము."

"ఆఁ! వ్యవహారం అందాకా వచ్చిందీ? మా వదిన యింకా రెక్కల్లేకుండానే గాలిలో ఎగురుతోందనుకుంటున్నాన్నే" అన్నాను.

"మీ ఒదిన నేలమీదనే ఎల్లా ఎగురుతుందో చూద్దువుశే మరదీ! ఇంకో సంగతినిచెప్పు-మా సైనికులు స్త్రీవేషంలోనే వుండాలా?"

"సైనికవేషంతోనే"

"అది స్త్రీవేషం కాదుగా?"

"మీకూ మాకూ తేడా యేముంది? జుట్టు అందరికి పొడుగ్గానే వుంటుందాయె. తలగుడ్డమాత్రం కొంచెం మార్చితే సరిపోతుంది. మీరూ పురుషుల్లాగే కన్పిస్తారు; కాని, మరి బొమ్మలో?"

"సిగ్గుపడుతా వెందుకు మరదీ! తిమ్మిని బ్రహ్మిని చేసినట్టు వాటిని కుదించి కట్టుకుంటాంలే."

"స్తనాలను పైకి కన్పడకుండా చేయటానికి సాధ్యంకానివారిని చికిత్సా శాఖలో చేర్చండి భామా!" అని కపిల్ సలహా యిచ్చాడు.

"చక్కగా చెప్పావు. అది చాలా అవసరం కూడాను. శత్రువుకు తన ప్రతిద్వంద్వి పురుషుడో, స్త్రీయో తెలియకూడదు" అన్నది భామ.

కపిల్ "అవు నంతే" నన్నాడు.

నేనుకూడ వారితో ఏకీభవించాను. "ఇక మా వేషధారణ సమస్య తేలిపోయి నట్టే" నని భామ లేచింది. అంతటితో సంభాషణ ముగిసింది.

మేము మళ్ళీ తేగపైనెక్కి స్వగృహాలకి చేరుకున్నాము. సాయంత్రం భామ, రోహిణుల నిద్దరిని సేనాపతి, గణపతులవద్దకు తీసుకెళ్ళాను. సుందర తరుణీమణుల అరుణాధరములనుండి మాట వెలువడటమే తరువాయిగా వృద్ధులు వారి కోరికకు సమ్మతించారు.



# 18. వనభోజనం

నేను ఉల్కాచేలానికి బయలుదేరడానికి రెండురోజులముందు లిచ్ఛవీ వనభోజనోత్సవం వచ్చింది. ఈ వుత్సవం యేటేటా చలికాలంలో వస్తుంది. వనభోజనానికి కల్లు, వుప్పు, మినహా అడవికి ఏమీ తీసుకెళ్ళకూడదు. తతిమ్మా ఆహారాన్ని కత్తిబలంతో అరణ్యంలో సంపాదించుకొని తినడమే పూర్వంనుంచీ వస్తున్న ఆచారం. యుద్ధప్రమాదం నెత్తిమీద వున్నందువల్ల సైనికులలో ఎక్కువమందికీసారి వనభోజనంలో పాల్గొనేందుకు అనుమతి యివ్వడం సాధ్యపడలేదు. అనుమతి పొందిన లిచ్ఛవులు తమకు సమీపంలోని అరణ్యంలోకి వెళ్ళారు. అరణ్యానికేం కొదవ? హిమాచలంనుంచి బంగాళాఖాతం దాకా ఏక మహారణ్యమేనయ్యె. ఒకటొకటిగా బస్తీలు పెరుగుతున్నా ఆ మహారణ్యంలో అవియేపాటి?

సూర్యోదయమవుతూండగానే వైశాలియందలి లిచ్ఛవులము నగరానికి తూర్పుగా నడచి వెళ్ళాము. యోజనం దూరాన ఘోరాటవిలో ప్రవేశించాము. అక్కడకు వెళ్ళిన జనం ముఠాలుగా చీలిపోయారు. కపిల్, శంతనాది తక్షశిల మిత్రులు, మనోరథుడు, అజిత్ వగైరా కొందరు జ్ఞాతృవంశయువకులు, రోహిణి, భామ, క్షేమ మొదలగు యువతులు మా జట్టులో వున్నారు.

ఆ అరణ్యప్రాంతంలో గంగసైలావులు, ఖడ్గమృగాలు, జింకలు, పందులు, ముళ్ళపందులు, ఎనుబోతులు, వుడుములు మున్నగు అనేక వేటమృగాలకు కొరత లేదు; కాని, లిచ్ఛవీజనం ఒక్కసారిగా వాటివెంటపడటంవల్ల అందరికీ అందుట కూడ సంశయాస్పదమే. అరణ్యవాసులైన వేటగాండ్రకు మా వద్దనున్న కల్లు త్రాగించీ, బాణాలను బహూకరించీ వారిని మచ్చికచేసుకున్నాము. అజితుడు వారిలో యిద్దరు పడుచువాళ్లను చేరదీసి చనవుచేసుకున్నాడు. వాళ్ళిద్దరూ మాకు వేటమృగాలజాడ చెప్పి సహాయపడేందుకు ఒప్పుకున్నారు. అన్నిటికంటే ఖడ్గమృగాన్ని కనుక్కోవడం చాలా సులువని వాళ్ళద్వారా తెలిసింది. అయితే ఖడ్గమృగం చర్మంమీద బాణము, బల్లాలు పనిచేయవు. కత్తి కఠారులు కూడ వుపయోగించవు. ఖడ్గమృగం కంటబడిన మానవుడు దాని ముంగొమ్మునుంచి తప్పించుకోవటంకూడ అసాధ్యమే. ఏదో వుపాయంతో దాన్ని గోతిలో పడవేసిగాని, వేటకాడు మంచి నేర్పరయితే దాని రెండుకళ్లలోను ఒకేసారి బాణాలతో కొట్టి చంపడానికి సాధ్యమవుతుంది. బోయవాడొకడు ఖడ్గమృగం వుండే తావుకు మమ్మల్ని తీసుకెళ్ళటానికి అంగీకరించాడు. చాల ప్రమాదకరమయినప్ప

టికి మా జట్టులో అనేకమంది ఖడ్గమృగాన్ని వేటాడేందుకు సిద్ధమయ్యారు; కాని అసలు నలుగురికి మించి వెళ్లకూడదు. అందుచే తుదకు అజితుడు, మనోరథుడు, రోహిణీ, నేనూ వెళ్లడానికి నిశ్చయింపబడింది. కపిల్ దళంలో భామ, క్షేమ లున్నారు. వారు అడవిపందిని వేటాడేందుకు వెళ్ళారు. కొందరు ఎనుబోతు కోసము, మరికొందరు నెమళ్లు, కుందేళ్లను వెతుక్కుంటూను, జింకలనిమిత్తం మరొకదళము యిల్లాగే అందరము వేర్వేరు వేటల నన్వేషించుతూ వెళ్లాము.

ఎంతతొందరపడినా మేము బయలుదేరేసరికి పొద్దు నెత్తిమీద కొచ్చింది. కాళ్ళకి మెత్తని చెప్పులుండటంవల్ల నడుస్తుంటే ధ్వని కావడంలేదు. క్రోసు దూరానికిపైగా మేము జోరుగానే నడచివెళ్ళాం. అక్కడున్న ఒకగుంట ఒడ్డుకు తీసుకెళ్ళి బోయ మాకుకొన్ని అడుగులగుర్తులు చూపాడు. గట్టుమీద యేనుగు పాదాల్లాంటి ఖడ్గమృగ పదచిహ్నాలు, లోతట్టున బురదలో అదిపొర్లాడిన గుర్తులూ అదికొమ్ములతో కుల్లగించిన మన్నూ మాకు కన్పించినయి. బోయవాడొకసారి చెవులు రిక్కించి నాల్గువేపులా యేదైనాధ్వని విన్పిస్తుందేమోనని వినటానికి ప్రయత్నించాడు. ముక్కుతో గాలిలో వాసన పసిపట్టడానికి యత్నించాడు. అప్పుడొక క్షణమాలోచించి మాతో యిల్లాచెప్పాడు.

"ఖడ్గమృగ మిక్కడికెంతో దూరంలోలేదు, అంటే మీ రిప్పుడు చాల ప్రమాదకరమైన స్థలంలో వున్నారు. అదిగో! పిట్టకూత వినిపిస్తోందే, ఆ సమీపంలోనేవుంది. ఖడ్గమృగమున్నచోట ఆ పిట్ట తప్పకుండా వుండి తీరుతుంది. గాలి మనవేపుకే వస్తూండడం మేలిచ్చింది. ఖడ్గమృగం చాలదూరంవరకు చూడగల్గినట్టే ముక్కుతో వాసనకూడ పసిగడ్తుంది. ఇప్పుడుగనుక గాలి అటు ఫిరాయించెనా యిక మనలో ఏ వకళ్ళమూ ప్రాణంతో తప్పించుకెళ్లటం వుత్తదే; అయితే గాలివాటం ఇప్పట్లో మారేసూచన లేనందున మనం భయపడనక్కర లేదులెండి. మనమిప్పుడింకా ముందుకెళ్ళాలి. నేను సైగచేయగానే యిద్దరు చెట్లెక్కిపోండి. బాణాలెక్కుపెట్టుకొని సిద్ధంగా వుండాలి. తతిమ్మా యిద్దరూ నావెంట - ఖడ్గమృగం దాపులోకిరాండి. జాగ్రత్తసుమా! అడుగుల చప్పుడు వినపడకూడదు. దానిచెవులు మహాచురుకైనవి. నేను మెల్లమెల్లగా ఒకచెట్టు చాటునుండి మరోచెట్టుమరుగుకు వెడుతూంటాను. మీరూ అల్లాగే రండి. ఖడ్గమృగం మోరపైకెత్తి ముక్కుతో వాసనచూస్తూ కళ్ళుతెరచి చూస్తుండడం, మనం ముగ్గురము బాణాలతో దానికళ్ళకి గురిచూసి కొట్టడం ఒక్కొక్కసారిగా జరిగిపోవాలి. ఇక మాట్లాడకండి. చడీచప్పుడూ లేకుండా నా వెంటరండి."

మేము బోయవాని ననుసరించి నడిచాము. నిగనిగలాడుతూ నీడలుతేలుతూన్న వాడినల్లటిమేను, ధృడకాయము ఆచ్ఛాదనమయినా లేకుండా ఠీవిగా-నిర్భీతిగా ముందుకు సాగిపోతూంటే నా మనసులో అనేకవిధాలైన ఆలోచనలు రేగినై. కాని, అది నిలకడగా ఆలోచించే సమయంకాదు. ముందుకెళ్ళేకొద్దీ

పిట్టకూత మరీదగ్గరగా వినపడుతోంది. కొంచెందూరాన నీళ్ళెండినగుంట-చానిలో బురదలో అదేదంతుగలదేదో కదుల్తాన్నట్టు దృగ్గోచరమయింది. బోయవాని సౌంజ్ఞతో రోహిణి, మనోరథుడు చెట్లెక్కారు. మిగిలిన ముగ్గురము యింకా ముందుకువెళ్ళాము. తోకాడించుతూన్న ఆ భీకరాకారం మాకు దగ్గరవుతున్న కొద్దీ నా మనోవేగం మరింత తీవ్రమవుతోంది. అయితే అది భయంకాదు. ఉరుకుతనం. ఖడ్గమృగమిక 30 గజాలదూరంలో వుందనగా బోయ మాకు రెండేసి కొత్తబాణాలిచ్చి చెట్లను చూపించాడు. అతడొక చెట్టెక్కడంచూచి నేనూ, అజిత్‌కూడ చెట్లపైకెక్కాము. బోయ బాణంసంధించుతూంటే మేమూ వానిననుకరించాము.

ఖడ్గమృగము కొమ్ముతో మట్టిని కుళ్ళగించి దుంపలేరుకొని తింటోంది. మధ్య మధ్య చెవులు రిక్కించి, ముక్కుపుటాలుబ్బించి యేదో ఒకవేపు తిరిగి అలికిడి నాలకించటానికి, వాసన పసిపట్టడానికి ప్రయత్నించుతోంది. మళ్ళీ మట్టిని కుళ్ళగించటంలో నిమగ్నమయ్యేది. మేమిద్దరము బాణాలెక్కుపెట్టి సిద్ధంగా వున్నతరువాత బోయవాడొకపుల్ల విరచి క్రిందవున్న ఎండుటాకులమీద పడేశాడు. ఆకుల గలగలధ్వని వినపడగానే ఖడ్గమృగం మోరపైకెత్తి చిన్నికళ్ళను బాగా తెరచి నిశిత దృష్టితో మావేపు చూడసాగింది. బోయవాడు వింటినారిని చెవిదాకా లాగిపట్టడం నేను గమనించాను. వాని యీలధ్వనితోపాటు మేమిద్దరము ఖడ్గమృగం కళ్ళలోకి గురిచూసి బాణాలు వదిలాము. నేను కుడికన్నును, అజిత్ యెడమ కంటికి లక్ష్యముంచి కొట్టాము. దానిరెండు కళ్ళలోను రెండు అంబులు నాటుకున్నై. మూడోది బహుశః నాదేనేమో, దాని కొమ్ముకు తగిలి క్రింద పడిపోయింది. ఖడ్గమృగం బాణాల బాధను సహింపలేకపోయింది. వాటినూడ పెరకటానికి కాబోలు అది తలను నేలకేసి కొట్టుకుటూంటే బాణాలు మరీ దిగబడిపోయినై. అది గ్రుడ్డిదైపోయిందనీ, అందుచే దాని మిగతా యింద్రియాలు కూడ పనిచేయటంలేదనీ మేము వెంటనే గ్రహించాము. నిర్భయులమై చెట్లనుండి క్రిందికి దిగాము. క్రిందవున్న యీటెలను చేతబట్టి బిగ్గరగా యీలవేశాము. తర్వాత కొంచెం సమీపంలోకివెళ్ళి నేను ఖడ్గమృగంగుండెకు గురిచూచి యీటెతో బలంగా పొడిచాను; అది సూటిగానే తగిలింది; కాని, నేను దాన్ని తిరిగి లాక్కోలేకపోయాను. ఖడ్గమృగం ఒకసారి బిగ్గరగా దిక్కులు పిక్కటిల్లేటట్టు అరచి నేలకూలింది. నా సహచరు లిద్దరూ కూడ బల్లాలతో దాన్ని పొడిచారు. ఇదంతా దూరాన్నుంచి గమనించుతూన్న రోహిణి, మనోరథుడుకూడ మమ్మల్ని కలుసుకున్నారు. అప్పటికే ఆ భయంకర క్రూరమృగము తుదిక్షణాలు లెక్కపెట్టుకుంటోంది. నేను రోహిణితో "ప్రేయసీ! బల్లెంతో పొడిచి దీన్ని తుదముట్టించడం నీవంతే" నన్నాను.

రోహిణి శక్తికొద్దీ యీటెతో దాని డొక్కలో పొడిచింది. ఆమె యీటెను తిరిగి వెనక్కి గుంజినప్పుడు దానితో ప్రేగులుకూడ బయటికి వొచ్చినై. అయినా దానిగుండె యింకా కొట్టుకుంటూనేవుంది. రోహిణి దానిముందు కెళ్ళ బోతూంటే బోయవాడామె రెక్కపట్టుకొని ప్రక్కకులాగి "అక్కమ్మోయ్! ఇప్పుడుకూడ ఒక యెనుబోతు ప్రాణంతీయటానికి ఆ కొమ్ముతో ఒక కుమ్ము చాలు" అన్నాడు.

మరికొన్ని పోటులతో ఖడ్గమృగ మొక ప్రక్కకు వాలిపోయింది. దాని కాళ్ళు పట్టుతప్పినయి. బోయవాడొక గడ్డను దానిమీదికి విసిరాడు; కాని, ఇక నది కదల్లేదు, మెదల్లేదు.

అంత పెద్ద మహాకాయాన్ని త్రాళ్ళు, వాసాలు వున్నా మే మయిదు గురమే మోసుకెళ్ళడం అసంభవమే. మావద్ద ఒక ఖడ్గము, ఒక బాకుమాత్రమే వున్నై. బోయవద్ద కంపుకత్తి ఒకటి — పుల్లలు నరికేది వుంది. మేము ఖడ్గ మృగంపొట్టచీల్చి కార్జాన్ని బయటికి తీశాము. బోయవా డొకముక్క నప్పుడే తినేశాడు. మేమూ వాడి ననుకరించేవాళ్లమే; కాని, ముందెవరో ఒకళ్లం మా డేరావద్దకుపోయి త్రాళ్ళు, వాసాలతో, మరికొందరు మనుష్యుల్ని తీసుకురావాలి. నేనూ, బోయా అక్కడే వుండటానికీ, తతిమ్మా ముగ్గురూ కారిజం తీసుకొని వెళ్లడానికీ, కాదు దౌడు తీయడానికి నిర్ణయించుకున్నాం. వారు వెళ్లిపోయిన తర్వాత నేను ఖడ్గమృగం దేహాన్ని పరిశీలనగా చూచాను. దానికొమ్ము మూరెడుకు పైగా వుంది. పిరుదలమీద, దండలవద్ద మాంసం తెగబెరిగివుంది. ఊరకే కూచునే కంటే ఏదోఒకటి చేస్తుండడం మంచిదని నేను దాని ప్రేగుల్ని కోసి తీశాను. నీళ్లవద్దకు పట్టుకెళ్లి కడుగుతూంటే, అది అంతకుముందు తిన్నదుంప లాప్రేగుల్లో నుంచి బయటపడినై.

కొంతసేపటికి మనోరథుడు కొందరు లిచ్ఛవీ యువకులను, బోయవాండ్రను వెంటతీసుకొచ్చాడు. ఖడ్గమృగాన్ని ఆపళంగా మోసుకెళ్ళడం మా కలవిగాని పని. అక్కడ నది, నావ వుంటేనే అది సాధ్యమయ్యేది. చర్మాన్ని ఒలుస్తూండ గానే చీకటి కమ్ముతుందేమో ననుకున్నాను; కాని, బోయ యువకు లయిదుగురు మేము చూస్తుండగానే అతి సులువుగా ఒలిచేశారు. మాంసాన్ని పెద్దపెద్ద ఖండా లుగా తెగగొట్టుటలో మేంకూడ చేతులు కలిపాము. మే మా మాంసాన్ని, చర్మాన్ని, తలను తీసుకొని బయలుదేరేప్పటి కింక జాము పొద్దు మాత్రమే వుంది. కృతకృత్యులైన వేటగాండ్ర ఆనందం వర్ణింప శక్యంగాదు. అందులోను మహా ప్రమాదమైన క్రూరమృగాన్ని వేటాడిన మా వుల్లాసాని కిక అంతులేదు.

మా ముఠాలో రెండు దళాలు మాత్రం వేటాడుటలో సఫలమైనాయి. ఒక దళ మొకయెనుబోతును యీడ్చుకొచ్చారు. కపిల్, భామ, క్షేమాదులకు మూడు పందులు లభించినై. వాటిలో కోరలపంది ఒకటుంది. క్షేమ అదృష్టవశాత్తు దాని దెబ్బను తప్పించుకోగలిగినదని చెప్పారు.

సూర్యాస్తమయం కాబోతోంది. తెల్లవారగట్ల వైకాలిలో యే నాలుగు ముద్దలు తిన్నామో, అంతే, మళ్ళీ యింతవరకు దవడాడించలేదు. అల్లాంటప్పుడు కరకర ఆకలవడం ఆశ్చర్యమేముంది? కపిల్ దళం తగినంత ప్రొద్దుండగానే మకాముకు తిరిగివచ్చింది. వాళ్ళు మంట జేసి మాంసాన్ని పేల్చటంలో నిమగ్నులయి వున్నారు. కొవ్వుతోకూడిన మాంసం వేగుతున్నప్పుడు నల్దిక్కులా గుమాయించుతూన్న సువాసనతో మానవులకే కాదు దేవతలకూ్కడ నోరూరేటట్లుంది. మా తండాలో స్త్రీ పురుషులమంతా కలసి మూడొందలదాకా వున్నాం. అంత మందిమే మూడురోజులుతిన్నా అయిపోనంతమాంసంవుంది మా దగ్గర. అందుచే ఖడ్గమృగం, ఎనుబోతులమాంసంలో చాలమట్టుకు మాకు తోడ్పడిన కొండజాతి బోయవాండ్రకు యిచ్చేశాము.

మాంసంలో చిన్నముక్కల్ని చీకులకు గుచ్చి, పెద్దవాటిని చేత్తో పట్టుకునీ కాల్చుతున్నారు. భామ చువ్వలకు మాంసపు కండల్నిగుచ్చి కాలుస్తోంది. నేనామెదరికిచేరి "ఒదినా! తొందరగా లోపలికేమాన్నా పడవెయ్యకపోతే పొట్టలోని పేగులు బయటికొచ్చి పడేటట్టున్నై" అన్నాను.

"రావయ్యా మరదీ! యెందరెందరి పేగుల్లో బయటపడకుండా కాపాడినయ్యి నా యీ చేతులు. యిటొచ్చికూచో. ఈ చీకుల్లో పిరుదుల కండలున్నై, వుడికినట్టేలే."

అన్న భామ ఆహ్వానంతో నేనామె ప్రక్కకెళ్తుంటే అజిత్ చూచి "నన్నెక్కడికి పోమంటావు వదినా?" అన్నాడు.

"నువ్వూరా" అంది భామ.

"మరి నేనో?" అనడిగింది రోహిణి.

"అడిగి రావాలా ఏమే పిల్లా?"

"అడక్కుండా వచ్చేవాడిని నేనుండనే వున్నానుగా రానే వచ్చాను కూడాను" అని మనోరథుడువచ్చి భామప్రక్కనే కూచున్నాడు.

క్షేమ పచ్చని ఆకుల్తో కుట్టిన విస్తరితెచ్చి క్రింద పరచింది. భామ కాలిన మాంసపుముక్కనొకదాన్ని అందులో పడేసింది. మేము దాన్ని కత్తితో చిన్న తునకలుగాకోసి వుప్పద్దుకుని తినసాగాము. నముల్తానే అజిత్ అన్నాడు — "ఒదినా! క్షేమ ఆ ప్రమాదమెల్లా తప్పించుకున్నదో యిక చెప్పు."

భామ—"ఎల్లా అయితేం, క్షేమకులాసాగావుందిగా. నన్ను మాంసంకాల్చమంటారా, కథ చెప్పమంటారా?"

అజిత్ — "రెండూచేస్తే మరీ మంచిది."

కపిల్ — "భామ చెప్పినంత చక్కగా యింకెవరూ కథ చెప్పలేరని నా వుద్దేశం."

భామ— "కాని - అన్నా! ఈ చీకుల్ని సరిగా తిప్పుతూండకపోతే మాంసం ఒక ప్రక్కన మాడిపోవటం, మరోవేపున వుడక్కపోవటము జరుగుతుంది. ఏమంటారు?"

క్షేమ— "నేనుకూడ సాయంచేస్తూంటానులేవే అక్కా!"

భామ— అయితే రావే పిల్లా! బొగ్గుల్ని తగ్గించేస్తున్నాలే. నువ్వా ప్రక్కన పుల్లలు మంటలోవేసి బొగ్గులు చేస్తూండు. సరే, మరదీ, సింహా! మా వేటచరిత్ర వినాలనుందా?"

నేను— "అవును వదినా! నువ్వు మాట్లాడుతూంటే పూలు రాలుతున్నట్టుంటుంది."

భామ— "అయితే నువ్వు వాటి పేరుకో మరదీ! ఆ రాలేవి పారిజాత పూలా, పొగడ పువ్వులా?"

నేను— "దేవ కుసుమాలు".

భామ— "ఆఁ, పారిజాతమే! వినటమేగాని నే నెప్పుడూ చూళ్ళేదు. మరదీ! అయినా మమ్మల్ని అప్సరస లనేవాడివి మానోటిపూలు పారిజాతాలనక ఏమంటావులే. సరే, యిక కథ మొదలెడతాను. మనూ! నీదంతాలు గట్టిగావున్నై, యీ గట్టి కండల్ని నమలకుండా వదిలేవు! నువ్వు కథ నాలకించుతావో లేక నీ పెళ్ళాన్ని చులకన చేస్తావో చూస్తుండాలి, నువ్వు నావేపే చూస్తూవుండు"

మనూ— "ఈ మాంసం అయినా నీచేత్తో కాల్చిందేగా?"

భామ— "అట్లయితే వీటిలో ఒక చీకుపట్టుకెళ్ళి ఆ టేకుమ్రాను క్రింద కూచొని తినమనాల్నొస్తుంది."

మనో— "అంటే అరణ్యం నట్టనడుమకే?"

భామ— "ఇంకా"

మనో— "చిమ్మచీకటి కమ్ముకొస్తోంది కూడాను."

భామ— "ఊఁ, యింకా?"

మనో— "అరణ్యమంతా ఏనుగులు, పులులు, సింహాలతో నిండివుంది."

భామ— "ఇంకా?"

మనో— "నీ ప్రవర్తన ఏమీ బాగోలేదు భామా! ఈ నిర్భాగ్యుడంటే నీకు రవంతయినా దయలేదుగద! భామా! నీ దాసానుదాసుడు-మనూ యేమంత చెడ్డవాడు కాదే? అల్లాంటి అమాయకుణ్ని ఆ టేకుచెట్టుకాడికి తోలెయ్యటం దేనికి?"

భామ— "ఇవా లిక్కడికి ఏనుగులు, సింహాలు వగైరా రావు మనూ! అసలీ ఘోరాటవిమధ్య - యిక్కడ వన్యమృగాలు తిష్టవేయడంవల్లనే చెట్టూ - చేమా పెరుగక బయలేర్పడింది. కాబట్టి దీన్ని క్రూరమృగాల స్థావరమనడంలో సందేహానికి తావులేనిమాట నిజమే; అయితే యిప్పుడు వాటి జాగాని మన

మాక్రమించాము. అక్కడక్కడ కట్టెలు పోగుబెట్టి వుంచాం. కాస్సేపటికి వాటికి నిప్పంటించుతాము. ఆ వెలుగు చూచి క్రూరజంతువులేవీ యీ దాపుకేరావు."

మనో – "మరి టేకి చెట్లపైనున్న వాళ్ళు దిగి వస్తేనో ?"

భామ – "అవ్వా, కొండముచ్చులా ? అయ్యో మనూ ! నువ్వు కొండ ముచ్చుకు జడిసేపాటి పిరికివేనా ? ఇదివరకు నా కీ సంగతి తెలియదులే."

మనో – "కొండముచ్చులు కాదు భామా ! చీకటిపడుతుండగా చెట్లెక్కి కొమ్మలకి వ్రేలాడుతూ అవి తెల్లవారేదాకా క్రిందికి రావని ఎవరికీ తెలియదు ?"

భామ – "అయితే చెట్టుమీది వాళ్ళెవరు మరి ?"

మనో – "పొడుగ్గా బొచ్చుండదూ ?"

భామ – "ఓస్ ! ఎలుగొడ్డా ? మనిషి అలికిడి, మంట వాసన వున్నంత మేర యే అడివిజంతువూ రాలేదు మనూ !"

మనో – "ఎలుగొడ్డు కాదు భామా ! దానికి పెద్ద పెద్దచేతులు కూడా వుంటై."

భామ – "అయితే అడవి మనిషి కాబోలు. వాళ్ళయినా రారులే."

మనో – "అవీకాదు. వాటి కళ్ళు ఎర్రగా పచ్చగా వుంటయి."

భామ – "తోడేళ్ళురావు మనూ ! నీకు లేనిపోని భయంగాని."

మనో—"తోడేళ్ళని ఎవరన్నారు ? అవి టేకి చెట్లెక్కుతయ్యేమిటి ? నేను చెప్పేవి మనుష్యుల్లాగానే వుంటయి."

భామ—"అయితే కొండజాతివాళ్ళనా నీ వుద్దేశం? వాళ్ళు మనకి స్నేహితులయ్యారుగా. వాళ్ళవల్ల మనకేమీ భయంలేదులే. మనం వాళ్ళకి మాంసము, కల్లూ యివ్వటం నువ్వు చూడలా ? వాళ్ళిపాటికి తిని, తాగి గంతు లెయ్యటానికి సిద్ధంగా వుంటారు. నువ్వొట్టిపనికి మాలిన వాడివి, కాలం వృథా చేస్తున్నావు.

మనో—"భామా ! స్పష్టంగా చెపుతావిను. ఒక్కొక్క చెట్టుమీద యేడేసి భూతాలున్నై. ఈ సంగతి తెలిసికూడ నీకిష్టమై వెళ్ళమంటే నేనిప్పుడే ఆ టేకిచెట్టుక్రిందికి వెడతాను ఏమంటావు ?"

భామకి భూత-ప్రేతాలంటే వల్లమాలిన భయం. అందుచే భూతంపేరు వినగానే జంకి, మృదువుగా అన్నది— "అట్లాయితే నువ్వెళ్ళొద్దుమనూ ! నిజంగా యీ అడివిలో చాలా భూతాలున్నాయంటావా "

మనోరథుడు పెద్ద మాంసంముక్క నోట్లోకూరుకొని "సీతోడుభామా బోయయువకుడొకడు రెండుమూడు భూతాలపేర్లుకూడ చెప్పాడు. కాని-నా జ్ఞాపకశక్తి నీకుతెలుసుగా-"

భామ కొంచెం చిరాకుగాఅంది- "నువ్వన్నీ మరచిపోతూనే వుంటావు, కాని, యింత మహారణ్యంలో చెట్టుకేడేసి భూతాలే :"

మనో — "మానవుల కెన్నితరాలు గడిచిపోయాయో తెలుసా ?" ఒక్కొక్కతరంలో ఎంతమంది చచ్చిపోయారో ! అంతమందికంటె యీ చెల్లెళ్ళెక్కువ వుంటాయా ?

నేను — "అన్నా మనోరథ్ ! నువ్వు చెప్పేదంతా నిజమే. బోయవాడు చెప్పేటప్పుడు నేనూవిన్నాను.

భామ — "అయితే మనమిప్పుడు చాల ప్రమాదావస్థలో వున్నామన్న మాట ?"

మనో— "ప్రమాదం యింతా అంతానా ! నువ్వన్నట్టు మంటనుచూచి సింహాలూ, పులులూ వగైరారావు. కాని, ఈ అడవిలో భూతాల సర్దారు ఒకప్పుడు సింహంమీద, మరొకప్పుడు ఏనుగుమీద యిల్లాగే దేనిమీదో యెక్కి వస్తాడనీ, భూతం పైనున్నప్పుడు అవి మంటదగ్గరకు రావటమేకాక, మంటమీద నడుస్తాయనికూడ బోయకుర్రాడు చెప్పాడు.

భామ మనోరథుని అనుకుని కూచుని "మనం మూడొందల మందిమి వున్నాంగా మనూ !" అంది.

మనో— "యింతమందికీ నలభై యాభై చెట్లమీది భూతాలేచాలు, ఈ మహారణ్యంలో ఆ మాత్రం చెట్లున్నాయనేనా నీ వుద్దేశం?"

భామ— "ఇదంతా నవ్వులాటకంటున్నావేమొ ?"

మనో— నేను నవ్వులాటకనేందుకు యిక్కడ వున్నది నా భామ ఒక్కతే కాదుగా! అందులో ఇల్లాంటి హాస్యమా ? ముందుగానే ప్రమాదం సంగతి నీకు తెలుపాలనీ, నాకు ప్రాణభిక్ష పెట్టమనీ అడగటానికి యింతసేపు చెప్పాను. ఇదంతా వినికూడ నీమనూని ఆ టేకిచెట్టు క్రిందికి వెళ్ళమంటావా భామా ?"

భామ— "అమ్మో ! వద్దు నాప్రియమనూ! నిన్ను నాదగ్గర్నుంచి గజందూరమైనా పంపను. ఇవాళ — ప్రాణప్రియా; నువ్వు నాదగ్గరేపడుకో."

మనో— "రోజూమాత్రం నేను నీ దగ్గర పడుకోవటంలేదా ? ఏంమాట భామా ! లోకులేమనుకుంటారు ? పైకి మిత్రులుగా కనిపించే వీరిలో శత్రువు లెందరున్నారో !"

అజిత్— "అన్నా ! నిజానికి నే నల్లాంటి వాడినే. భామ నిన్నా సాలవృక్షంక్రిందికి పంపాలనీ, కాస్సేపటికే మహాభూతమో వచ్చి ఎముకలతో సహా నిన్ను మ్రింగివెయ్యాలనే నా హృదయపూర్వకమైన కోరిక. ఆ తర్వాత భామ - ఆమె మరది అజిత్ వుండనే వున్నారు."

భామ కళ్ళెఱ్ఱజేసి "నోటికొచ్చినట్లు మాట్లాడటమేనా అజిత్ ? నేను నా మనూని రెప్పపాటుకూడ అవతలికి పంపను. అయితే - సింహా ! నువ్వుకూడ భూతాలున్నాయనే అంటున్నావా?"

నేను — "అవును వదినా ! కాని, మనదగ్గర కత్తులు, కఠార్లు వున్నయిగా. అవి లోహం వున్నచోటుకు రావు?"

భామ — "నిజమేనా ?"

నేను — "సందేహమక్కరలేదు. ముసలిదాదులు చెపుతూండగా నువ్వెప్పుడూ వినలేదా యేం ?"

భామ — "విన్నాను; కాని, పరీక్షించి చూడటానికి మనసొప్పటంలా."

నేను — "సరే, నీకేమీ భయం లేదులే వదినా ! మనూనీ, నిన్నూ మధ్యన పెట్టుకుని మేమంతా పడుకుంటాంలే."

భామ— "అయితే సరే, యిక తిను మరదీ ! చూడు, యీ చీకు యెంత బాగా కాలిందో ! ఎక్కడా మాడలేదు. తినటానికి బాగా కరకర లాడుతుంది. పంది చాలా పెద్దది. దాని కోరల్ని నేను జాగ్రతగా వుంచాను. అవి ఏకాస్తో తక్కువగా జానెడుపొడుగున్నై."

నేను— "సరేగాని, నువ్వా కోరలపందిని వేటాడినవైనం చెప్పనేలేదే ?"

భామ— "నాకు భూతాలు జ్ఞాపకంవస్తున్నై మరదీ !"

నేను— "ఇక వాటిని మరచిపోదూ. క్షేమ ఎల్లా తప్పించుకోగల్గిందో చెప్పరూ".

భామ — "బోయవాడు మమ్మల్ని పందులన్నీ గుమిగూడేచోటుకు తీసికెళ్లాడు. చెట్లపై కెక్కించి దూరాన్నుంచే చూపెట్టాడు. నేను ఒకచెట్టెక్కాను."

నేను—"ఈ కట్టుబట్టలతోనేనా?"

భామ—"కాదు, మేంకూడ మగవాళ్లలాగా పంచికట్టు కట్టుకుని వెనకా ముందూ గోచిపెట్టుకున్నాం."

అజిత్—"భలే ! భేష్!!"

భామ—"భేష్ యేమిటి? లంగాతో ఎక్కితే ఏకొమ్మకోపట్టి నేను క్రిందకూ పైకీ కూడ కాకుండా పోవాలనా నీ తలంపు?"

నేను—"ఆ మాటలకేంగాని, వేట సంగతి చెప్పొదినా!"

భామ — "అక్కడ పందులెక్కువగానేవున్నై. ఆగుంపులో చిన్నవీపెద్దవీ మొత్తం యాభైకి తక్కువ వుండవు. గుంటలో నీరుంది. ఆ గుంట నానుకుని మూడు వేపులా దట్టమైన అడవివుంది. ఒక ప్రక్కన మాత్రం బయలుంది. మేము ఆడవాళ్లం, మొగవాళ్లంకలసి యాభైమంది వున్నాము. అందరివద్ద యీటెలున్నై. కొందరివద్ద ధనుస్సులు, కత్తులుకూడ వున్నాయి. గుంటను నాల్గువేపులనుంచీ చుట్టవెయ్యాలను కున్నాము. బయలు ప్రదేశం వేపునుంచి అవి పారిపోయే అవకాశ మెక్కువగా వుండటంవల్ల ఆ ప్రక్కన యెక్కువమందిమి కాచుకొనివుండ డానికి నిర్ణయించుకున్నాము."

అజిత్ — "ఒదినా ! నిన్నే వేపున వుంచారు?"

భామ— "నన్ను మూడువేపుల్లో ఒకప్రక్కన వుండమన్నారు; కాని నేనూ క్షేమ ఖాళీవేపునే కాచుకున్నాము.

నేను — "ప్రమాద మున్నవేపే వున్నారూ! పందులు నీటిలో యీదు తాయిగాని, చాల నెమ్మదిగానే. బాణాలతో కొట్టడానికదే మంచి అవకాశం."

భామ — "ఏమైనా కానిమ్మని నేనూ, క్షేమా ఆ ప్రక్కకే వెళ్ళాం. పందులగుంపు వున్నదీ అటే. మేముచుట్టూ పూర్తిగా కమ్ముకోక ముందే అవి ముట్టెలు పైకెత్తి వాసని చూడసాగాయి. వాటి సరదారైన కోరలపందిదే యిప్పుడు మీరు తింటూన్న మాంసం. అది అన్నిటికంటె అప్రమత్తమై అటునిటు చూడసాగింది. అవి పారిపో ప్రయత్నింపకపూర్వమే మేమన్నివేపులా చుట్టుకున్నాము. నాచేతిలో యీటెవుంది. కపిల్, క్షేమల వద్దకూడ యీటె లున్నాయి. మాటల్లో చెప్పడానికి ఆలస్యమవుతుంది మరదీ! అసలప్పుడన్నీ రెప్ప పాటులో జరిగిపోయినై. కోరలపంది నల్దిశలా ముట్టడించిన జనాన్ని చూచింది. ఒక్కక్షణం అట్టె నిలబడిచూచి, ఖాళీప్రదేశం వేపుకి - అంటే మా వేపుకి శరవేగంతో వస్తోంది. తక్కినవన్నీ దాన్ననుసరించినై. మేమందరం చప్పట్లుకొట్టి గల్లంతుచేశాం. కొన్నిమాత్రమే బెదిరి వెనక్కితిరిగినై. కోరలపంది తనకిసూటిగా బల్లెం పుచ్చుకొని నుంచున్న క్షేమవేపు వురికింది. దాని వాడియైన పాలతెలుపు ముళ్ళు తళతళ మెరుస్తునై. మీదికి వురికివస్తూంటే ఏంచెయ్యాలో నేనుగాని, క్షేమగాని ఆలోచించడానికి అవకాశమేలేదు. ఆ దృశ్యంచూచి, నాకు మూర్ఛ వస్తోన్నట్టుంది. ఇక మన దేశైకసుందరి క్షేమని రక్షించుకోవటం అసంభవమే ననుకున్నాను."

క్షేమ భామని కౌగిలించుకుని "వద్దు అక్కా! ఆ దృశ్యాన్ని వర్ణించ మాకు" అన్నది:

భామ— "పిచ్చిపిల్లా! యిప్పుడింకేంభయమే? నీ కాలమృత్యువనుకున్న ఆ ముళ్ళపందిమాంసం కాదూ మన మిప్పుడు ఆప్యాయంగా తింటూన్నది? ఇంకేమీ భయంలేదు గాని, యీ దొన్నెల్లో కల్లు పొయ్యి, సింహుడు, కపిల్ వగైరాల నాలుకలు పిడచకట్టడంలా? ఆఁ, సింహా! మూర్ఛకాదుగాని, నేను స్వప్నంలో చూస్తున్నానేమో ననుకున్నాను. అంతా యంత్రలా నడిచిపోయింది. ముళ్ళపంది సమీపించకముందే కపిల్ కంగారుపడి క్షేమను కౌగిలించుకున్నాడు. క్షణంలో ఈమె నొదిలి బలంకొద్దీ బల్లెంతో పంది డొక్కలో పొడిచాడు. ఎగిరి వురుకుతూ వస్తూన్న ఆ యిసురులో దెబ్బ సూటిగా తగలడం కష్టమే. అల్లాంటప్పుడు బల్లాన్ని లాక్కుని తీసుకొనే అవకాశ మెక్కడిది? అది బల్లెంతోసహా ముందుకు దూసుకెళ్ళి పోయింది. ఆ అదురుకు కపిల్ యేడు బారల దూరంపోయి పడ్డాడు. నేనప్పుడు కపిల్ అయిపోయాడనే అను కున్నాను; కాని, అంతలోనే కపిల్ మెలాయించుకొనిలేచి క్షేమ చేతిలోని

యీ కెనుగుంజి తీసుకున్నాడు. ముందుకుపోయి తూలిపడ్డ మళ్లీపందికిమళ్లీ లేచే అవకాశం ఇవ్వకుండానే తెగపొడిచి వదిలాడు. అప్పటికి అందరం అక్కడికి చేరాము. పందియింకా గుర్రుపెడుతూనేవుంది. ఇక దానికి లేచే త్రాణ లేక పోయింది. కపిల్‌కి ముచ్చెమటలుపోసి రోమ రోమము కదుల్తూంటే నా కా శరీరాన్నే యెంతసేపూ చూడాలనిపించింది. ఏమినిర్భీతి! ఎంతబలం!! ఎట్టి చురుకుతనం!!! అదే సమయంలో రెండు తెల్లని హస్తాలు కపిల్‌ని చుట్టు కున్నై. రొమ్ము రొమ్ము లానుకున్నై. అరుణాధరాలు కపిల్ పెదవుల నందుకున్నై. కొంతవడి యిద్దరూ నిశ్చేష్టులై నిలబడివున్నారు. ఆ తర్వాత ఆశ్చర్యపూరిత నయనాలు పరస్పరావలోకనం చేసుకోవడం చూశాము. కపిల్ వీరముద్ర క్రమంగా అదృశ్యం కాదొచ్చినది. అప్పు డతడు నోరుతెరచి 'క్షేమా! నీ యీ కృపాభిషేకానికి కోటి ధన్యవాదాలు' అన్నాడు. మరి మా వేట యెల్లా వుంది మరదీ?"

నేనులేచి కపిల్‌ని కౌగలించుకున్నాను. రోహిణి క్షేమను తన ఒడిలోనికి తీసుకుని ముద్దులాడుతోంది. మళ్ళీ మేము విస్తరిముందు కూచున్నాము. భామ మరొక మాంసపు తునక ఆకులో వేసింది. నేను కొంత చీల్చుకొని నోట్లో వేసి కొని "ఇది చాలా బాగుంది వదినా!" అన్నాను.

భామ — "అది సరే, మరి మావేట కథో?"

నేను — "మిత్రుడు కపిల్ చాకచక్యమా? చాలా బాగుంది. ఇల్లాంటి వేట నిత్యమూ దొరుకుతూ మా వదినచేతి పక్వాలు నోటపడుతూంటే పితృ, దేవ లోకాలు కూడ అక్కరలేదు వదినా!"

భామ — "నువ్వు నీ వాన్ని ఆకాశానికెత్తుతావని నాకు తెలుసు. సరే, రోహిణీ! యిక నీ వేటసంగతి చెప్పు."

రోహిణి — తలొంచుకుని "నన్నసలా వేటమృగం దగ్గరకైనా వెళ్ళనిస్తేనా అక్కా!"

భామ — "ఇంతకూ నిన్ను వేటాడినచోటుకే తీసికెళ్లలేదా రోహిణీ!"

రోహిణి — "నన్ను, మనూ బావని దూరాన చెట్టెక్కించి వెళ్లారు."

భామ — "ఓహో! అల్లాగా? నా మనూ తన ప్రాణాన్ని గుప్పిట్లో పెట్టుకొని బలేగా వేటాడి వచ్చాడు!"

రోహిణి — "మా యిద్దర్నీ అక్కా! దగ్గరకు పోనివ్వనేలేదు. నాకు కోపంవచ్చి నానామాటలూ అనేసేదాన్నే. కాని - ఆ చింతనిప్పుల్లాంటి కళ్ల వాడు — మావెంట వచ్చిన బోయవాడు లేడూ — వాడు వూపిరి పీల్చేధ్వని కూడ వినపడకూడదని కట్టడి చేశాడు."

నేను — "కాని, రోహిణీ! ఖడ్గమృగాన్ని బల్లెంతో పొడిచి ఆఖరుకు తుదముట్టించింది నువ్వేగా"

భామ — (సంతృప్తితో) "నిజంగానా పిల్లా? నా కల్లాంటి అవకాశమే లేకపోయింది. గుంట కవతలివేపునవున్న వారుకూడ రెండు పందిపిల్లల్ని చంపారు."

రోహిణి—ఈయన కళ్ళనీళ్ళుతుడవటాని కల్లా అంటున్నాడులే అక్కా! అది లేవలేనిస్థితిలో వుండగా యీ బెత్తో పొడవమన్నారు"

నేను —"కాని, ఒదినా! రోహిణికి భయమేలేకపోయింది. దెబ్బతిన్నక్రూర మృగం దరికెళ్లటం ఎంతప్రమాదం! అయినా ఖడ్గమృగం దగ్గరకు గబగబా వెళ్ళిపోయింది."

రోహిణి — "ఆ నల్లమొద్దు నా చెయ్యిపట్టుకుని వెనక్కిలాగేశాడుగా."

నేను — (ఆమె వెంట్రుకల్ని వ్రేళ్ళతో నిమురుతూ) ఖడ్గమృగానికీ ముళ్లపందికీ చాల తేడావుంది రోహిణీ! ఖడ్గమృగాన్ని చాటుమాటుగా మోసం చేసి చంపాలి. ఎదురుగా పోనివ్వలేదని నువ్వేమీ కించపడనక్కరలేదు."

భామ — "అవును మరదీ! నువ్వుచెప్పేది నిజమే. కపిల్ ఎప్పుడాలోచించాడో, క్షేమ యెప్పుడు ప్రక్కకినెట్టి బల్లెంతో పందినిపొడిచాడో నాకిప్పటికీ అబ్బురంగానే వుంది. అప్పుడాలోచించేందు కవకాశమే లేదే, అల్లాంటప్పుడు కాళ్ళూ చేతులూ యేల్లా ఆడినయ్యోనాకు బోధపడటం లేదు."

కపిల్ — "కాదు భామా? అలవాటు మీద ఆలోచించడం, ఆయుధ ప్రహారం ఒక్కసారే జరిగిపోతాయి."

భామ — "నాకుమాత్రం అది అసంభవంగానే తోస్తోంది."

కపిల్ — "అవును, అభ్యాసంలేనప్పుడల్లాగే తోస్తుంది. డాలు, కత్తి వుపయోగించటం నీకు తెలుసుగద. సాధనం చేసేటప్పుడు డాలును అదునుకు అడ్డుపెట్టలేక పోవటానికి కారణం? మనిషి ఆలోచించుటలో ఆలస్యమవుతుంది. లేదా తన్నుతాను మరచిపోతాడు; కాబట్టి సమయానికి చేతి నాజ్ఞాపించలేక పోతాడు. అభ్యాసమైన తర్వాత అల్లాకాదు. ఎడంచేయి ఆలోచనతో అవసరం లేకుండానే, ఆజ్ఞతో నిమిత్తంలేకుండానే డాలును ఉచితస్థానంలోఅడ్డుపెడ్తుంది. ప్రతిపనికి మనను అవయవాలను ఆజ్ఞాపించితీరాలి; అయితే అభ్యాసంవల్ల అందు కేమాత్రం జాగుకాదు."

భామ—"ఆఁ, నాకిప్పుడు బోధపడింది. నీవు వేటలో అతిచురుకుగా పని జేశావేగాని, ఇంద్రజాలం చేయలేదని యిప్పుడు గ్రహించాను."

కపిల్ – "మనం ఆటలాడినా, సాము, గరడీలు నేర్చినా ఆ చురుకుతనం కోసమే. వేట, యుద్ధం ఆ నేర్పుకు గీటురాయిలాంటివి.

భామ – "అయితే క్షేమ ఒక పరీక్షలో నెగ్గిందన్నమాట. అలసి, వణుకు తూన్న దేహాన్ని ఉపశమింపజేయుటానికి నే నాలోచించి నీ తాపోపశమానికి తగ్గ ఔషధాన్నిచ్చి సేవింపజేసింది కూడాను."

కపిల్ – "నేను క్షేమ కెంతైనా కృతజ్ఞుణ్ని."

క్షేమ – "నేను మాత్రం ?"

భామ—"నేనెరుగుదును పిల్లా! నువ్వు నీ ప్రాణరక్షకునిపట్ల కృతఘ్నవు కావని నాకుతెలుసు. కపిల్ కృతజ్ఞతకంటె నీ మూక కృతజ్ఞతా ప్రకటనే గొప్పది."

క్షేమ — " నువ్వన్యాయం చేస్తున్నావక్కా! ఆయన్ది వుత్తమాటల కృతజ్ఞత కాదే"

భామ — (చెమ్మగిలిన క్షేమకన్దోయిని ముద్దుపెట్టుకొని) "నీవన్నది నిజమే పిల్లా! కపిల్ నిన్ను రక్షించేందుకు మృత్యుగహ్వరంలో జొరబడ్డాడు."

క్షేమ — "మరి నే నల్లాంటి ఘనకార్యమేదీ చేయలేదుగా"

నేను — "కృతజ్ఞతను మౌనంగా ప్రకటించినట్లు మాటల్లో వెల్లడించడం కుదరదు క్షేమా! ఇక చీకటిపడబోతోంది మనవాళ్లు మాంసంతిని, మద్యపానం ముగించి రాగాలాపనకూడ ప్రారంభించుతున్నారు. మనంకూడ త్వరగా సిద్ధమవ్వాలి ఇక తొందరలో నాట్యంకూడ సాగుతుంది.

నెగళ్లు ఒక టొకటిగా అంటింపబడినై. ఆహార - పానీయాలు ముగింప టంలో మేము వెనకపడ్డాము. మాంసఖండాలను మంటలో కాల్చడంలో అజిత్ నాకు తోడ్పడుతున్నాడు. మాంసం కాల్చడంలో అతనికొక ప్రత్యేక సిద్ధాంతం వుంది. కాల్చినమాంసంలోపలియుడుపంతా తగ్గిపోగూడదు. కొన్ని ఖండాలను అల్లాగే కాల్చాము. మాలో చాలమందికి మాంసం కరకర లాడుతూంటేనేగాని కమ్మగా వుండేదికాదు.

తర్వాత వనభోజనానికి స్త్రీ - పురుషులము '300 మందిమీ బారులుతీరి కూచున్నాము. అందరిముందర మాంసానికి ఆకులు, మద్యానికి టేకిఆకుల దొన్నెలు వుంచబడినై. పంక్తులమధ్య మంటలవెలుగు బాగా కన్పిస్తోంది. వడ్డించే స్త్రీ - పురుషులు బంతులమధ్య అటూయిటూ తిరుగుతున్నారు. వడ్డించే వారు గుటకలేస్తూ చూస్తుండనక్కరలేదు. వడ్డన పూర్తిఅయినతర్వాత అందరి విస్తళ్లూ వారివే. అజిత్ వడ్డించుతూ భామవద్దకు వచ్చి "వదినా! ఖడ్గమృగం మాంస మెల్లావుంది?" అనడిగాడు. భామ కత్తితో ఒక ముక్కకోస్తూ "చాలా బాగుంది. ఏదీ, నోరుతెరువు" అని ఆ ముక్క అజితుని నోట్లోపెట్టి చెంపమీద అల్లాగా ఒక దెబ్బ కొట్టింది. తర్వాత అజిత్ మద్యంకోసం రోహిణివద్ద కొచ్చాడు. "గాంధార వదినా! నీ యెంగిలి దొన్నెను కాస్త నా కియ్యి" అని అందుకొని తాగి "మా గాంధార వదినఅధరం బలే మధురం!" అన్నాడు.

మద్యపానంచే నిషాయెక్కుతూన్నట్టు కేరింతలు, పాటలు, యికయికలు, పకపకలే తెలుపుతున్నై. మనూని బాగా గుర్రమెక్కించాలని నేనూ కపిల్ కలిసి పన్నిన కుట్రలో భామకూడ యేకమయింది. అతనికి దొన్నెతర్వాత దొన్నెతో కల్లు తాగించుతున్నాము. మనూకి నిషా తలకెక్కుతోంది. ఆ మైకం

లోనే కల్లుదొన్నెను భామ కీయబోతూ "వ్వ-ది-న్నా!-న్న-వు-వ్వ-క్-కూ-డ్-డా-త్తా-గూ" అన్నాడు.

"నేను నీకు వదిననేమిటి?" అంది భామ.

"మ-ద్రే-మిటి-క్కా-క-అ-ం-ద-ర్-కీ వ్వో-ది-న్వి-న్నా-కూ వ్వది-న్వే"

"అల్లాగేలే నా మనూ మరదీ! ఇదిగో, యెంత తియ్యగావుంది, యీ దొన్నెకూడా పుచ్చుకో."

"మ్మ - ర - దిని క్కా - దొది - నా! న్నీ - మ్మ - నూని."

"ఊఁ. నా మనూవే. మరి నీ ఒదినకి యేదీ ఒకపాట వినిపించవూ?"

మనోరథుని నేత్రగోళాలు ఎర్రబడినై. ఉండుండి రెప్పలువాలిపోతున్నై; కాని, భామ కంఠధ్వనివిని అతను నిద్రనుంచి మేల్కొన్నట్టు కుదురుకొనేవాడు. దొన్నె నందిచటం ఆలస్యమైతే "త్రీ - పి-క్క - ల్లో - దినా - త్-త్రీపి -" అనేవాడు.

ఈ విధంగా మనోరథుని చాల సేపటివరకు ఆడించాము.

భోజనానంతరం బాజాలు సరిచేశారు. కైపెక్కి లేవలేనివారిని మినహాయించి తతిమ్మా వాళ్ళందరం సమూహనృత్యం చేయసాగాము.



# 19. మా సరిహద్దులో

రోహిణి భామతో కలిసి లిచ్ఛవీస్త్రీ సైనిక సంఘటనను పూనుకొని పని చేస్తోంది. నేను ఉల్కాచేలానికి పయనమయ్యేసరికే దాదాపు వేయిమంది యువతులు వారి సైన్యంలో చేరారు. ఆ యువతులకు సైనికశిక్షణ నిచ్చుటలో అజిత్, మనోరథులు సహాయం చేస్తున్నారు. ఈ విధంగా తన స్వంత కార్యక్రమంలో నిమగ్నురాలయి యున్నందున రోహిణి నాతో ఉల్కాచేలానికి రాజాలక పోయింది.

ఆ నాడు తెల్లవారగట్టనే మేము అశ్వారూఢులమై వైశాలి నుంచి బయలుదేరాము. దారిలో సైనికశిబిరాలను చూచుకుంటూ మేము మధ్యాహ్నానికి ఉల్కాచేలం చేరుకున్నాము. బాబాయి-రోహణ్ నారాక కెదురుచూస్తున్నాడు. నన్ను చూస్తూనే కౌగలించుకొని "రా నాయనా! తనపదవి అర్హుడైన అన్నకుమారునికే దక్కుతూంటే పినతండ్రి కెంత ఆనందం! మన భూసైనిక విన్యాసాల వివరాలను యిక్కడి సేనాని, నీకు రెండో వుపనాయకుడు కాబోయే అమరుడు చెపుతారు: కాని; ముఖ్యస్థావరాలను స్వయంగా నేనే నీకు చూపించాలనుకుంటున్నాను" అన్నాడు.

బాబాయి చూపిన ప్రేమాదరాలకు నా కృతజ్ఞత తెలిపాను.

భోజనానంతరం బాబాయి మమ్మల్ని కూచోబెట్టి మా కోటలను, శత్రుదుర్గాలను నేలమీద గీసి, ప్రతిదానినిగురించీ విపులంగా వివరించి చెప్పాడు. మా సైన్యం ఎక్కడెక్కడ ఎంతవున్నదీ తెలియజేశాడు. దక్షిణ సరిహద్దులోని దళాధిపతులు, వారి సహాయులు ఒకరొకరుగా నన్ను కలుసుకొని వెళ్ళేసరికి ఇంకా జాముప్రొద్దుంది. బాబాయి ముందుగా వారందరితో నాకు, కపిల్‌కి పరిచయం కలుగజేశాడు. తర్వాత మే మిద్దరము ఒక్కొక్కచోటవుండే సేనాని, వుపసేనానులను పిల్చి వారి సైనికుల సంఖ్య వగైరా వివరాలను సాకల్యంగా తెలుసుకున్నాం. వారు తెల్పినవాటిలో ముఖ్యాంశాలను నేను తాళపత్రాలపైన రాసుకున్నాను. చీకటి పడేవరకు మా సంభాషణలు సాగుతూనేవున్నై.

రాత్రి పిండారబోసినట్టు వెన్నెల కాస్తోంది. గంగా తీరమందలి మా దుర్గశ్రేణిని పరిశీలించుటకదే చక్కని సమయమని బాబాయి చెప్పాడు. కపిల్‌ని వెంటబెట్టుకొని బాబాయితో పడవెక్కి బయలుదేరాను. మా కెదురుగా పాటలీపుత్రం వుంది. అక్కడ మగధ సైనికుల శిబిరమున్నది. మేము గంగలో

ప్రయాణంచేస్తూ ఎగువను దిఘవరావద్ద గంగా - గండకీ నదులు కలిసేవేపుకు వెళ్లాం. అవతలివేపున అక్కడక్కడ మంటలవెలుగు కన్పిస్తోంది. ఒక్కొక చోటకి రాణాసురుల నావల్లోని దీపాలవెలుగు తెరచాపగుండా కనపడుతోంది. ఇవతలితట్టున యేలాటి వెలుతురూ సద్దూలేని మా దుర్గాలవలెనే అవతల మగధ కోటలువున్నై. దిఘవరాకి దిగువను కొయ్య మ్రానులను నిలబెట్టిన ప్రాకారములతో మావి అయిదు దుర్గాలున్నై. మేము నావ నాపగనే కాపలా భటులు హెచ్చరికగా కేకలు పెట్టేవారు. బాబాయి సంకేతం చెప్పగా వారభివాదమాచరించేవారు. అప్పుడు మేము కోటలో ప్రవేశించేవాళ్లం. పండువెన్నెట్లో దారి సులువుగానే కన్పించేది. అపరిచితులకు మాత్రమా దుర్గమార్గా లగమ్యాలే. మార్గము వంకరటింకరగా మిట్ట - పల్లములతో వుంది. మా యుద్ధనావలను అవతలి నుంచేగాక, యివతలి వేపునుంచి గూడా చూచినా కన్పడకుండేలాగున మరుగులో వుంచారు. తీరప్రదేశంలో లోపలగా ఒక తటాకాన్ని త్రవ్వి అక్కడినుంచి వంపులతో కాలువ నొకదానిని గంగలో కలిపారు. అందుచే తటాకంలో వున్న నావలు అన్యులకు కన్పడకుండా అవసరమైనంతనే వంపులలో కాలువలోగుండా అనతి కాలంలోనే గంగానదిలోనికి చేరగలవు. అయితే ప్రతియేటా ఆ త్రవ్వు కాలువ వానాకాలంలో పూడిపోతూంటే వేసవిలో మళ్లీ లోతుగా త్రవ్వవలసి వచ్చేది. అయినా అవసరాన్నిబట్టి శ్రమపడక తప్పేదికాదు. మేము ముందుగా సూచన యివ్వకనే దుర్గ పరిశీలనకు రాత్రిపూట వెళ్ళాము; ప్రతిచోట కాపలా వారు మేల్కొని అప్రమత్తులైవున్నారు. ఎవరూ తూగి ఏమరివున్నట్టుకన్పించలేదు.

మేము దిఘవరా దుర్గాన్ని తనిఖీ జూడడం పూర్తి అయ్యేసరికి తెల్లవారుట కింక జాము ప్రొద్దుంది. తతిమ్మావాటికంటె పెద్దది. ప్రతి దుర్గంలోను మేల్కొనియున్న సైనికులకు నన్ను పరిచయం చేసి యిక 'సింహుడే మీ సేనాయకు'డని బాబాయి చెప్పివేశాడు. నేను ఒకని వీపుతట్టి, ఒకనితో చనువుగా మాట్లాడీ, ఒకరిపక్కమీద కూచునీ, ఇంకొకని కంచంలో కలబడి ఒక కబళం తీసుకుతిని యీ తీరున నేనువారికి కేవలం సేనానాయకుడనే కాక, ఆప్తమిత్రుడనుకూడానని వ్యక్తం చేయటానికి ప్రయత్నించాను.

మేము వుల్కాచేలానికి తిరిగివచ్చునప్పటి కింకంతో ప్రొద్దులేదు. కపిల్ మా బాబాయిని మెచ్చుకుంటూ "సేనానాయకా! కాలితో తన్నితే రాయి వ్రక్కలయ్యే పడుచుతనంలో వున్న మా కిప్పుడు శ్రమ లెక్కలోనిది కాదు; కాని, వయసుమళ్లిన మీరుకూడా యింత శ్రమపడుతూండడం నా కాశ్చర్యంగా వుంది" అన్నాడు.

"కాదు ఉపనాయకా! ఆరోగ్యం బాగుండి, అలవాటుంటే వృద్ధాప్యం వచ్చేవరకు యెంత శ్రమనైనా ఓర్చుకొనే సహనశక్తి వుంటుంది." అని బాబాయి చెప్పాడు.

మేము వరండాలోకి వెళ్లగానే పిన్ని గుమ్మంలోకి యెదురొచ్చి "రా నాయనా! సింహా! ముందు యేదయినా కాస్త తిని యింకో పని చూచుకోండి" అన్నది.

"అయితే పిన్నీ! తెల్లవార్లూ నువ్వు మాకోసం కాచుకొని కూచున్నావా?" అనడిగాను.

"లేదులేరా అబ్బాయ్! కాశీకొడుకును రేవులో పడుకుని మీరు వస్తూంటే ముందొచ్చి నాతో చెప్పమన్నాలే"

"మేము అక్కడక్కడ చాలా తిన్నామమ్మా! ఒకచోట తంపటవేసిన రొయ్యలుకూడా తిన్నాం,"

"యేటిఒడ్డున వుండేవాళ్లకి అవి మామూలే బిడ్డా! ఇక్కడ చేపా - జెల్లకి కొరతేముంది? సరేగాని, కొంచెం పాలైనా తాగండి. బొగ్గులమీద పెట్టివుంచాను వెచ్చగానే వుంటై."

అంత ప్రొద్దుకాడలేచి కూచుని పిన్ని యెంతో ఆప్యాయంగా యిస్తానంటూంటే ఒద్దనలేక పోయాం. తలొక గ్లాసుడుపాలు తాగటానికి సిద్ధపడ్డాము. వజ్జి దేశంలో పాలు నీళ్ళలాగా సమృద్ధిగా వుంటైగా.

మర్నాడు పగలంతా మేము బాబాయితోను, ఆయనక్రింది ఉపనాయకుని తోను మాట్లాడి శత్రువుల ప్రయత్నాలను గూర్చి ఆకళింపు చేసుకున్నాం మగధరాజు యుద్ధమప్పుడే ప్రారంభించటానికి నిర్ణయించుకో లేదట. ఆ రాత్రి గంగానది దిగువపు దుర్గ పరిశీలనార్థం వెళ్ళాము. గంగ, వాగ్మతీ సంగమస్థానం చాల దవ్వున ఉన్నందున అన్ని కోటలను ఒక్కరాత్రిలో పూర్తిగా చూడలేకపోయాం. రాత్రిపూట పడవప్రయాణంచేస్తూ పగటిపూట ఏదుర్గంలోనో మకాంచేసి, రాత్రి చూచిన దుర్గాలనుగూర్చిన విశేషాలను గుర్తుకు రాసుకునేవాళ్ళం. మూడవనాటికి యమునా సంగమంవద్దకు చేరుకున్నాం. అంతా చూచినమీదట లిచ్ఛవీసైనికుల, సేనానుల అప్రమత్తత, చురుకుతనములకు నేనూ, కపిల్ సంతృప్తిచెందాము. తక్షశిలలో యుద్ధకళలో నేర్చిన నూతన యెత్తుగడలు- ముఖ్యంగా నౌకాయుద్ధ సంబంధమైనవి మావారికి బోధించవలసివుంది. అందు నిమిత్తం సేనానులందరినీ ఉల్కాచేలానికి పిల్పించడమే మంచిదనుకున్నాం; కాని, అన్నిటికంటె ముందు మేము గండకీదుర్గశ్రేణిని పరీక్షించవలసివున్నది.

సేనానాయకుడు రోహిణీ వైశాలికి నిర్గమించనున్నాడు. భామ రోహిణు లను అప్పుడప్పుడు కలిసికొని ప్రోత్సహించుతూ వుషారెక్కించమని నే నాయనతో చెప్పగా "నాయనా! ఏ పనినైనా 'సగమత్త మేనరికం'గా చేయడంకంటె అసలు వేలు పెట్టకపోవడమే మంచిది. నేను మన లిచ్ఛవియోణుల సేన నుత్సాహపరచ టమే కాక నా శాయశక్తులా సాయం చేస్తాను. వైశాలిలోనే వుంటాను కాబట్టి భామ, రోహిణులకు చేయూతనిచ్చేందుకు నాకు మంచి అవకాశం వుంటుంది.

వైద్యుడు అగ్నివేశుని ప్రోత్సహించి చికిత్సాశాఖలో పనిచేసేటట్లు ప్రయత్ని స్తాను. వారి కృషి తప్పక ఫలించి తీరుతుంది. మునుముందు మనకు లభించేజయంలో లిచ్ఛవీకాంతల కృషి ప్రశంసాపాత్రం కాక తప్పదు" అని చెపుతూంటే నా కత్యంతానందం కలిగింది.

మమ్మల్ని వీడి వెళ్ళబోతూ పిన్ని అన్నది — "అబ్బాయ్ సింహా! ఇంట్లో ఆడదిక్కు లేకపోతే యిబ్బందికాదూ ? పోనీ భామని ఇక్కడికి పంపనా ?"

"పిన్నీ ! సిపాయికి యిబ్బందేమిటి ? ఎట్టి కష్టానికైనా సిద్ధపడాలి. ఇంత మంది సేనానులు, సైనికులు వుండగా యిబ్బందిమాత్రం ఏముంటుంది. కాళికొడుకు శుకుని యిక్కడ దిగబెట్టివెళ్ళండి. వాడు నా గుర్రాన్ని మేపుతూంటాడు; చలాకీ అయినవాడు కాబట్టి యితరపనులు చక్కబెట్టవచ్చు కూడాను."

పిన్ని నామాట ప్రకారం శుకుణ్ణి విడచిపెట్టి వెళ్ళింది.

ఇక నా పెద్దయింట్లో నేను, కపిల్, శుకుడు- ముగ్గురమే వున్నాము.

మరునాడే మేము పడవమీద గండకీవేపుకు బయలు దేరాము. దిఘువరా నుంచి ఎగువను ప్రవాహం చాలవడిగా వుంది. అందుచే పడవను త్రాటితో లాగ వలసివచ్చింది. గండకి తూర్పుతీరాన పచ్చిగడ్డి మొలయెత్తున పెరిగివుంది. పశు పాలకు లక్కడ వేలాదిపశువులను మేపుతూంటారు. ఒకరోజున చూద్దామని మే మొక గోష్ఠంలోకి వెళ్ళాం. గోపాలకులు వుండేందుకు చిన్నచిన్న పూరిపాకలు వున్నై. వాటిలో గోవులను పితికి తీసినపాలను కాగబెట్టి, వెన్నతీయటానికి కావలసిన సరంజామా కూడవుంది. పశుపాలకుల్లో లిచ్ఛవులు, లిచ్ఛవేతరులు కూడ వున్నారు. వారందరూ వజ్జిభూమిపై దురాక్రమణ చేయబోతున్న మగధరాజును తిట్టేవారు.

గండకీతీర దుర్గశ్రేణిని పరిశీలించటానికి నాలుగురోజులు పట్టింది. శంత నాది యెనిమిదిమంది తక్షశిల మిత్రులను మే మా దుర్గశ్రేణియందే వుండ నియ మించాము. నావికులకు నవ్యపద్ధతిని శిక్షణ నిచ్చేభారం వారే వహించారు. అక్కడిపని పూర్తిగావించుకొని నేను కపిల్ ఉల్కాచేలానికి తిరిగి వచ్చాం. మా యుద్ధనావలలో నూతనంగా చేయవలసిన మార్పుల యేర్పాటుకోసం కపిల్ వైశాలికి వెళ్లాడు. నేను నౌకా యుద్ధవిధానంలోని నూతన పద్ధతులను బోధించేందుకు సేనానులను పిలిపించాను. ఆ తరగతిలో ఒకవారం గడచి పోయింది.

బోధనాతరగతిని ముగించే రోజున మా సేనాపతి సుమన్ వచ్చాడు. నేను మా దుర్గాలను, సైనికదళాలను చూచివచ్చిన వైనంచెప్పి మే మనుసరింపదగు యుద్ధవిధానాన్నిగూర్చి ఆయనతో సంప్రదించాను. నేను సూచించిన నవీన పద్ధతులను వుత్తరసరిహద్దులోని సైనికదళాలకుకూడ బోధించాలని ఆయన అభి ప్రాయం తెల్పాడు. నే నా భారాన్ని శంతనునికి అప్పగించడానికి నిశ్చయించాను.

లిచ్ఛవియోధుల సైనికశిక్షణ మహా జోరుగా సాగుతోందనీ, ఆ విషయంలో బాబాయి అత్యంత శ్రద్ధచూపుతున్నాడనీ, అగ్నివేశుడు - ఆయన శిష్యులు యెనభైమందీ మా సైనిక చికిత్సాశాఖలో పనిచేస్తున్నట్లూ సేనాపతి చెప్పాడు. వైద్యుడు కట్లుకట్టుట వగైరా చికిత్సారీతులను స్త్రీలకు నేర్పుతున్నారట. సేనాపతి వాగ్ధోరణినిబట్టి ఆయన మా జాతీయసైన్యం విషయంలో పూర్తిగా సంతృప్తి చెందియున్నట్లే తోచింది.

నేను పుష్యోగ నిర్వాహణకు పూనుకున్నతర్వాత గూఢచారులను వృద్ధి చేశాను. గంగా-శోణనదీతీర ప్రాంతాల్లో శత్రువుశేయే క్రొత్తఏర్పాట్లు చేస్తున్నదీ తెలుసుకోదలచాను. పంచపర్వతాల మధ్యనున్న మగధరాజధాని-రాజగృహ రక్షణకు, మార్గసంరక్షణకు ఏమి ఏర్పాటులు గావించినదీ తెలుసుకోవటం కూడ మాకు ముఖ్యావసరమే. ఇందునిమిత్తం నేను దళవాయిల్లోను, సైనికుల్లోను, చతురులైనవారి నెంచి పరివ్రాజకులుగా, జైనసాధువులుగా' జ్యోతిష్కులు, వ్యాపారస్తులుగా-యిట్లు వివిధవేషాల్లో మగధకుపంపాను. వారిద్వారా బింబిసారుడు రాజధానీ నగరదుర్గాన్ని మరమ్మతు చేయించుతున్నట్లు, గంగా తీరాన్నుంచిరాజగృహందాక అనేక రక్షణశ్రేణులను నిర్మింపజేసినాడని, ముఖ్యంగా నలందా అంబలట్టికా (సిలార్)లమధ్యగల రెండుయోజనముల మేరలో మరి యెక్కువగా బందోబస్తు చేయించాడని తెలియవచ్చింది. దీన్నిబట్టి యీపర్యాయం లిచ్ఛవులు తమను రాజగృహంవరకు తరుముకొని రావచ్చుననికూడ బింబిసారుడు భయపడుతూన్నట్టు గ్రహించాను. మగధసేన అంతరంగిక విషయాలను గురించి కూడ మావాళ్ళుకొంతవరకు భోగట్టా తెలిపారు. శత్రుసైన్యాధిపతి, సేనానాయకులు యుద్ధ సంచాలనం విషయంలోసనాతన పద్ధతినే అనుసరించనున్నారట. వారు పరస్పరంఒకరినొకరు అయోగ్యులుగాభావించుతున్నారట. ఒండొరుల కీచులాటలను సర్దుబాటుచేయడానికి ప్రధానామాత్యుడు వర్షకారుడు చాల శ్రమ పడవలసివస్తోంది. బింబిసారుడు కేవలము తన కొడుకుచేతి కీల్బొమ్మగానే ఆడుతున్నాడనటానికీ వల్లకాదు; కాని, వజ్జిదేశంమీద దండయాత్రచేసే విషయంలో మాత్రం అతడు పూర్తిగా తన తనయునిసలహా ననుసరించే ప్రవర్తించుతున్నాడు. 'నే నింకెన్నాళ్లుంటాను. ఎప్పటికైనా నారాజ్యాన్ని సంబాళించుకోవలసింది అజాత శత్రుడే' ననేవాడట. ఉధాగ్ధానికి యుద్ధంలో జయంకల్గుతుందన్న ఆశ బింబిసారుని కంతగాలేదు. ఇక అతని కొడుకు అజాతశత్రుడు యువకుడే, అయినా చతురుడనుటలో సందేహంలేదు. అయితే అతడు మహా దురహంకారి. మంకుపట్టు గలవాడు. యుద్ధ విజ్ఞానంలో సర్వజ్ఞుడనీ, రాజ్యనీతి విశారదుడనీ - వాస్తవంలో కాకపోయినా - అనుకుంటాడు. రాజనీతిలో అతడు వర్షకారునికితగ్గ శిష్యుడు. బ్రాహ్మణ మంత్రి వర్షకారునికిని తన శిష్యుని సామర్థ్యంపట్ల విశ్వాసం మెండే. మగధరాజ్య విస్తరణకు ఆయుధబలమందుగాక కూటనీతిపై నాధారపడి వెంటనే

కర్తవ్యాని కుపక్రమించుమని శిష్యునికి బోధించేవాడు. ఆయుధ బలంతో మగధ దృఢతరశక్తి కాగలదినాలుకూడ మునుముందు రావచ్చుననేవాడు. లిచ్ఛవుల శక్తి - సామర్థ్యాలు వర్షకారుని కనుభవైకవేద్యమే. అందువల్లనే మగధ ముందు కోసలరాజ్యాన్ని కబళించడం అవసరమనే అభిప్రాయం కలిగియున్నాడు. కాశీరాజ్య ప్రజలింకను తమ స్వాతంత్ర్యాపహర్తలగు కోసలులపట్ల తీవ్ర ద్వేష భావం కల్గియున్నారు గాన, కోసలను స్వాయత్తంచేసుకోవడం సులువనికూడ వర్షకారుడు భావించాడు. ఆ వైషమ్యాన్ని తుడిచివేయడానికే ప్రసేనజిత్తు తన సహోదరుని కాశీరాజ్య సింహాసనాధిష్ఠుని గావించి వారణాసిలో వుంచాడు; కాని కాశీ ప్రజానీక మదియొక యెత్తుగడయనియే తలచారు. కోసల రాజ్యాధికారంలోని కాశీరాజ్యంమీద మగధ దండయాత్ర చేస్తే అది చులకనగా చేతికి చిక్కటేగాక ప్రసేనజిత్తు కక్కడి మందిబలం దక్కక పోగా, వారి ధన - జనబలం యావత్తు తమకే చిక్కగలదనీ, ఆ తర్వాత అంగ - మగధ - కాశీరాజ్యాల అపార ధన - జనబలంతో విశాల కోసలదేశం సునాయాసంగా స్వాధీనమయిపోతుందనీ వర్ష కారు డుద్దేశించాడు; కాని బింబిసారు డతనితో ఏకీభవించలేదు. అతడు తన భావ మరది ప్రసేనజిత్తునందు మిత్రభావం కల్గియుండుటే అందుకు హేతువు. అదీగాక, లిచ్ఛవులతోడి కయ్యానికి కాలుద్రువ్వటలోకూడ ప్రసేనజిత్తుతో తలపడటం తప్ప తుందేమోనన్న భావమిమిడివుంది.

మా నూతన వేగులు తమ కర్తవ్యాన్నతి మెలకువతో నిర్వహించుతు న్నారు. వారిలో నందుడొకడు. అతను నిజంగానే జైనమతాభిమాని. ఒకనా డతడు మాటల సందర్భంలో వర్ధమానుని ప్రశంసించాడు. నే నంతకుమునుపుకూడ ఒకటి రెండు దపాలు మహావీరునిగూర్చి విన్నాను; కాని, అప్పు డా విషయం నన్నాక ర్షించలేదు. నందుడు జైనప్రవక్త ప్రస్తుతము ఉల్కాచేలాన్ని ఆనుకొనియున్న ఒకతోటలో మకాంచేసి వున్నట్టుకూడ చెప్పాడు. ఆసంగతివిన్నలగాయతు ఆయ న్నొకసారి మాచిరావాలన్న అభిలాష కలిగిందినాకు.

నే నొకనాటి సాయంత్రం నందుని వెంటపెట్టుకొని మహావీరుడు శిష్య వర్గంతో విడిసియున్న తోటలోకి వెళ్ళాను. వారి శిష్యులలో యెక్కువమంది ముఖాల్లో శాంతమే కనపడలేదు. వారు మొండిమొలలతో వుండటం నా కేమీ బాగుండలేదు. నేను జైనమత ప్రవక్తదర్శనానికి వచ్చానని తెలిసి, శిష్యు డొకడు మహావీరుడు తలవాల్చుకొని ఆలోచనా నిమగ్నుడై కూచొనివున్న చోటుకు మమ్ములను తోడ్కొని వెళ్ళాడు. ఆయన గడ్డము, మీసము నెరసిపోయినవి. దేహంమీద ముది చిహ్నాలు కనపడుతున్నై. అయినా ఆయన గౌర వర్ణశరీరం ఆకర్షణీయంగానే వుంది. మా పదధ్వనికి తలెత్తిచూచి ""జ్ఞాత్రుపుత్రా సింహా! రా, వచ్చికూచో" అన్నాడాయన. నా కప్పుడాయన నిజంగా సర్వజ్ఞుడనీ, సర్వ దర్శియనీ తోచింది; కాకపోతే నా పేరు, వంశం చెప్పకుండానే ఆయన కెల్లా

తెలుస్తవి? నేను దండము పెట్టి ఒక ప్రక్కన కూచుని ఆయన్నడిగాను—"భగవాన్! తమ రు నన్నెరుగుదురా?"

"తెలియకేం నువ్వు మన క్షాత్రువంశ యోధుడవేగా సింహా! నీతండ్రితో - వయసులో నాకంటె చిన్నవాడయినా - నాకు బాగా పరిచయం వుంది" అన్నాడాయన.

ఆయన మాటలతీరు సరళమై మధురంగా వుంది. లోగడ ఆయన్ను గూర్చి విన్న గాలికబుర్లచే నాకు కలిగిన దురభిప్రాయం క్రమంగా తొలగిపోతోంది. ఆయన నాతో ముక్తసరిగానే మాట్లాడాడు. అదయినా మధ్యమధ్య చాలసేపు మౌనందాల్చి ఒక్కొక్క మాటగానే కాని, మౌనంగా వున్నప్పుడు వారివిశాల పింగళ నేత్రాలనుండి కరుణరసం అవిరళధారగా కురుస్తున్నదా అనిపించింది. అప్పుడు మహావీరుడు గొప్ప దయా - ధర్మ ప్రచారకుడని విన్నసంగతి నాకు జ్ఞప్తికొచ్చింది. నిజంగా ఆయన ప్రతి అవయవాన్నుంచి కరుణరసం తొలుకుతోంది. మరి ముఖం సంగతి చెప్పనక్కరయేలేదు. ఆయన తాను చెప్పేదంతా స్వయంగా జీర్ణించుకొని వున్నాడనే నేను భావించాను. అకాత్తుగా "సింహా! ఆ చెట్టుక్రిందికి రా" అని ఆయన లేచి సమీపమందే పడియున్న నెమలి యీకల కుంచె నొక చేత్తో పట్టుకొని, రెండో చేత్తో ఒక గుడ్డను ముందు యీడ్చుకుంటూ బయలుదేరాడు. ఆ వృక్షఛాయను చేరి ఆయన అతి మృదువైన నెమలి యీకల కుంచెతో నేలపైన తుడిచి, క్రిమిరహితము గావించి, నన్ను కూచోబెట్టి తాను కూర్చున్నాడు.

నేను స్వతహాగా జీవితపక్షపాతిని. నా భావనలో జీవితం బండరాతి కొండలమధ్యగా మహావేగంతో ప్రవహించే మహాసింధువాహినివలె కల్లోల కలరవములతో ముందుకు వురుకులు తీస్తుంది. అది నిత్యము సంతోష - విచారాలు, సుఖ దుఃఖాలతో నిండివుంటుంది. కాని, యిక్కడ ఈ జీవితముగతి శూన్యమై ప్రశాంతంగావుంది. ఈ రెండు జీవితాల్లో యేది వుత్తమమో నిర్ణయించడం అప్పట్లో నాశక్తికి మించినదిగా గోచరించింది. అయినా నాలో కొన్ని సందేహాలు రేగుతూనేవున్నై. కొంతవడి ఆ మౌనమూర్తిని చూస్తూవున్న తరువాత 'తమరు మనో శుద్ధిని బోధంచుకూ, శరీరశుభ్రతపట్ల విముఖులుగా వుంటారేమి స్వామీ!' అనడిగాను.

"నా శరీరమాలిన్యాన్ని చూచి అడుగుతున్నావా?"

"అవును. తమ యీ గౌరవవర్ణచర్మం మురికిపేరుకొని బీట్లిచ్చిందికూడాను"

"దేహం మలరూపం సింహా! దీన్నెంత శుభ్రపర్చినా మళ్ళీ లోపలా బయటాకూడ మరింత మల మేర్పడుతూనే వుంటుంది; అయినా నేను శరీరాన్ని కడుగకూడదని చెప్పను. నేను చెప్పేదల్లా స్నానమొకనికి వ్యసనమై సుఖహేతువై తే అదే ప్రాణమందు తీపిగల వేలాదిజీవుల మృతికి కారణంకావచ్చు. కాబట్టి సౌఖ్యం వ్యసనాలనిమిత్తం మనమితరజీవుల మరణకారకులం కారాదనిమాత్రమే."

26

"మరి హింస జరక్కుండా జీవించడం సంభవమేనా ?"

"పూర్తి ప్రయత్నంతో మన శక్తివంచన లేకుండా జీవరక్షణ చేయుటే పూర్తి అహింస" అని ఆయన చెప్పాడు.

అప్పుడు నా మనసులో నా సైనిక జీవితాన్ని గూర్చిన ఆలోచన కల్గింది. "శక్తివంచన లేకుండా హింసకు దూరంగా వుండమనేగా తమరు చెప్పేది ?" అని మళ్ళీ ప్రశ్నించాను.

"అవును, నువ్విప్పుడు నీ సైనిక కర్తవ్యాన్ని గూర్చిన సందేహంలో పడ్డావు కదూ ?"

"సరిగా నే నిప్పుడదే ఆలోచించుచున్నాను భగవాన్!" అన్నాను.

"ఏ ఒక్క విషయాన్నీ ప్రత్యేకంగా విశ్వసించమని జైనసాధులు చెప్పరు. ఏ విషయమూ ప్రత్యేకంగా వుండదు. సమస్తము మిశ్రమమే కాన, అహింసకూడ విడిగా శుద్ధరూపమని వుండదు. ప్రత్యేకంగా ఆచరించబడుటకూడ కట్టిదే. కాబట్టి జైనమతావలంబకులందరు ప్రత్యేకంగా అహింసను ఆచరించుచున్నారని నాతలంపుకాదు; కాని మానవుడు సమస్త జీవరాసులయందు అపార కరుణమాప ప్రయత్నించాలి. నీవైనా - సింహా!- నీకర్తవ్య నిర్వహణ చేస్తూనే అందుకు ప్రయత్నించవచ్చు. మాంసం తినితీరమని నీ సైనిక బాధ్యతబాధించదుగద నీవుకోరితే దాన్ని వదల్లేవూ? సైనిక కర్తవ్యం నిన్ను వేటాడమని బలవంతం. చెయ్యదే. దాన్నిమాత్రం విసర్జించలేవా? జైనసాధులజీవితపథాన్ని అటుంచు; వారిలాగానే గృహస్థులంతా ప్రవర్తించాలనికాదు; కాని వారుకూడ చాలమట్టుకు తమ పరిసరాల్లో కారుణ్యామేఘాలను సృష్టించవచ్చును. ఈ జ్ఞాత్రుపుత్రుడీ పాటికేళ్ళనుంచి చేస్తున్నట్లే చేయవచ్చును సింహా!"

అని చెప్పి మహావీరుడు మౌనం వహించాడు. నాదృష్టి వారి ప్రశాంత ముఖమండలం మీద నిలచివుంది. కానీ, నా అంతరంగంలో భావతరంగాలు చెల రేగుతూనే వున్నై. ఎవరో బాణంతో నా హృదయాన్ని కొట్టినట్టుంది. ప్రాణుల యందు జాలి చూపటానికి చేయగలిగిన ప్రయత్నమయినా నేను నా జీవితంలో యెన్నడూ చేసియుండలేదని వెంటనే తెలుసుకున్నాను. అసలు జీవకారుణ్యాన్ని గురించినేను యోచించనేలేదు. జైనప్రవక్త నన్ను సైనిక బాధ్యతనుంచివిముఖుడను కమ్మని కూడా చెప్పలేదు. వర్ధమాన మహావీరునికి మా భావము అవగతములే. కొద్ది మాటలతోనే జీవిత పథాన్నంతనూ తేజోవంత మొనర్చినాడు. నాచూపు అప్పు డప్పుడు ఆయన పింగళ నేత్రాలమీద నిలచేది. గోడ అందలు విరిగిపడినట్లు నా సందేహాలాక టొకటిగా కూలిపోతున్నాయి.

నేను చాలసేపటివరకు ఆలోచనా ధీరుడనై ఆయన ముందు కూర్చుండి పోతిని. నరజన్మ మెత్తినందుకు చేయవలసిన కర్తవ్యాన్నే మహా వీరుడు నెరవేర్చు తున్నట్లు భావించాను. నా సందేహాలన్నీ నిర్మూలమైనాయని చెప్పలేను గాని,

చాలమట్టుకు హృదయం తేలికపడినట్టుంది. భూతదయను గూర్చి దీర్ఘంగా ఆలోచించాను. తుదకొక నిర్ణయానికి వచ్చి ఆ ప్రకారమే భావిజీవితంలో ఆచరించాలనుకున్నాను. నా యీ నూతన కర్తవ్యపథంలో యెదురొక్కనబోయే కష్ట-నిష్ఠురాలను గూర్చి కూడా యోచించకపోలేదు. ఈ రీతి నాలోచించినమీదట కర్తవ్యపాలన నిర్విఘ్నంగా సాగుటకు అడుగడుగున నన్ను హెచ్చరించే దొకటి వుండాలనుకున్నాను. నన్నావిధంగా హెచ్చరించగలది జైన మహావీరుని శిష్యత్వమే. ఆయన శిష్యరికం మాంసాహారాన్ని కాకపోయినా వేటాడే వ్యసనాన్నయినా మానుకోటానికి నన్ను బాధ్యుణ్ణిచేస్తుంది. ఈ విధగా ఆలోచించి ఎట్టకేలకు నా మౌనముద్రను వీడి "భగవాన్, తమ ఉపదేశామృతాన్ని గ్రోలి నేను సంతుష్టి చెందాను. తమరు నాకు చక్కని మార్గం చూపారు. నేటినుండి నేను తమ శిష్యుడను కాగోరుతున్నాను" అని చెప్పాను.

మహావీరుడు నన్నభినందించాడు. నందుడుకూడ చాల సంతోషించాడు. తరువాత మే మిద్దరం తిరిగి వచ్చాము.

కపిల్ వైశాలికి వెళ్ళిన పిదప ఆయింట్లో నేను, శుకుడు మాత్రమేవున్నాం. దళవాయిలు, భటులు, గూఢచారులు, యింకా యితరులు వచ్చిపోతూండేవారు. కాని, వారంతా మాయింటిమనుషు లెల్లా అవుతారు? ఇకమాంసము, చేపలువగైరా లేకుండా నాభోజనపదార్థాలను శుకుడినేస్వయంగావండమని ఆవాళేచెప్పివేశాను. అదివరకు దారినినడిచేటప్పుడు మిట్టపల్లాలు చూడటంతప్ప వేరేధ్యాసతో నేలవంక చూచేవాడినికాను; కానియిప్పుడల్లాకాక నాదృష్టి ఎక్కువగా అడుగువేయబోయే చోటు పడుతున్నది. ఏ చీమో, పురుగో నా కాలిక్రిందపడి చావకుండా నడవడానికి ప్రయత్నించుతున్నాను. స్నానం, ఒళ్ళుతోముకోవడం మానకపోయినా నీళ్ళు చాల తక్కువగా వాడసాగాను. అప్పట్లో రోహిణి నావద్ద లేకపోవడమే మేలుగా భావించాను. ఆమె వుండివుంటే నేను జైనవ్రతాన్ని ఆరంభంలో ఆచరించగల్గటం కష్టమయ్యేది. నా యీ నూతన వ్రతాచరణను గూర్చి ఎవరికీ తెలియనీయవద్దని శుకుని గట్టిగా కట్టడిచేశాను. ఆరోజుల్లో నేను దూరప్రదేశానికెక్కడికీ వెళ్ళనవసరంలేకపోవడం కూడ మంచిదయింది. బంధు-మిత్రు లెల్లరు తమ తమ పనుల్లో నిమగ్నులయి వున్నందున వైశాలినుంచి ఎవరైనా వస్తారేమోనన్న యిది కూడాలేదు.

నేను మళ్ళీ మహావీరుని దర్శించే వాడినే కాని, ఆయన మరునాడే ఉల్కాచేలం విడిచిపెట్టి వెళ్ళిపోయాడు. జైను లనేకమంది నా వద్దకు వచ్చిపోతూండే వారు; అయితే వారు తమపట్ల నాకు శ్రద్ధా-భక్తులను కల్గించేపాటి సమర్థులుకాదు. నేను శుకునికి చెప్పివుంచడంవల్ల మా యింటికి జైనసాధు - సత్తములెవరు వచ్చినా గౌరవ మర్యాదలకు, భోజనాది సౌకర్యములకు లోపముండేదికాదు.



# 20. యుద్ధము, విజయము

చలికాలం గడచిపోయింది. వసంతంకూడ వచ్చివెళ్ళింది. ఎండాకాలం జరుగుతోంది. మా కీ మూణ్ణెల్లవ్యవధానమిచ్చి బింబిసారుడు తనకు చేటే తెచ్చుకున్నాడు. కపిల్ సగం నావలకు యినుపకవచాలను తొడిగించి, మరికొన్నింటికి శత్రు నౌకలమీదపడి దెబ్బకొట్టడాని కనువుగా వాడి గసికలను తగిలింప జేశాడు. ఇంకను యిల్లాంటి మార్పులెన్నో చేయించాడు. అతను, అతని సహచరులు మా నావికులకు, నావికాసైనికులకు తర్ఫీదునివ్వటంలో ప్రత్యేకశ్రద్ధ వహించి పని చేశారు.

మగధరాజు యుద్ధసన్నాహం మరి కొద్దిదినాలలో పూర్తికాగలదనీ, ఆ తర్వాత మాపైకి దండెత్తిరాగోరుతున్నట్లూ మా చారులవల్ల తెలియవచ్చింది. మా యేర్పాట్లన్నీ సమాప్తమైనవి. ముందుగా మేమే దాడి ప్రారంభించడానికి నిశ్చయించుకున్నాం. గాడ్పులు తీవ్రంగా వున్నై; అయినా వేసవియని యుద్ధాన్ని వాయిదా వెయ్యటం మా ఒక్కరిచేతిలోనిది కాదు.

మా గూఢచారుల ద్వారా మా కందిన వార్తలు ఎప్పటికి అప్పుడు సేనాపతికి, గణపతికి తెల్పుతున్నాను. ఒకనా డాకస్మికంగా నన్ను వైశాలికి రమ్మని సేనాపతి పిలుపు వచ్చింది. నా సహాయ సేనానాయకుడు - అమర్ మూడు నెలల నాటి అమర్ కాదు. అతనికి తక్షశిలయుద్ధవిజ్ఞానం బాగా రాణించింది. అప్పుడు క్షణ క్షణము శత్రువులపోకడలను కన్నెట్టివుండాల్సిన అవసరమెంతైనా వుంది. నేను తిరిగి వచ్చేవరకు ఆ విషయంలో అమర్ తనబాధ్యతను చక్కగా నిర్వహించ గలడన్న విశ్వాసం వుంది.

నేను వైశాలిలోవున్న దొక పగలు, రెండు రాత్రుళ్ళుమాత్రమే. అందులో అధిక సమయం యుద్ధసమితి, మంత్రివర్గములతో సమాలోచనలు జరుపుటతోనే గడచిపోయింది. యుద్ధసమితి నా అభిప్రాయాలతో పూర్తిగా ఏకీభవించింది. మంత్రివర్గంలో కొంద రమాత్యులు మేముగా ,యుద్ధ మారంభించకూడదనీ, వేసవికాలాన్నెలాగైనా గడచిపోనివ్వాలనీ అభిప్రాయములు వెలిబుచ్చారు. నేను సేనాపతితో పరిస్థితులన్నిటినీ వివరించి చెప్పాను. బింబిసారుడు తన గజబలం మీదనే యెక్కువగా ఆశ పెట్టుకున్నాడనీ, అది గంగా తరంగిణిని దాటిరావడమే తటస్థించితే మాకున్న కొద్దిపాటి యేనుగులతో వాటిని ఢీకొనటం కష్టమై, చిక్కులెక్కువకాగలవనీ నేను చెప్పాను. తుదకు మా జనసమితి వెంటనే యుద్ధం

ప్రారంభించటానికి నిర్ణయించి, తేదీని నిశ్చయించే అధికారం మా సేనాపతికి, నాకు యిచ్చింది.

రోహిణి మాయింటిని సైనిక నిలయంగా మార్చివేసింది. భామ, రోహిణి వజ్జిదేశం మొత్తంమీద 30 వేలు, ప్రత్యేకంగా వైశాలిలో మరో 20 వేలమంది స్త్రీ సైనికురాండ్రను సంఘటిత పర్చారు. వారిలో మూడోవంతు మందికింకా సైనిక శిక్షణ పూర్తికావలసి వుంది. మొత్తంమీద తామకూడ లిచ్ఛవీసేనలో ఒక భాగమే నను కొనే ఆత్మవిశ్వాసాన్ని ప్రతియువతికి కలిగించారు. వయసుమళ్ళిన అగ్నివేశుడు మళ్లీ ఇరవైయేండ్లు వెనక్కిపోయిన వాడిలా వున్నాడు. ఇతరులకు కాయకల్ప చికిత్సచేస్తున్న వృద్ధునివలె లేడు. నేను చికిత్సాశాఖను సందర్శించ డానికేగినపుడు ఔషధాలను, పరికరాలను చూపించుతూ అగ్నివేశుడిల్లా చెప్పాడు—

"సేనా నాయకా! సుకుమార స్త్రీ ఇంటిలో చేరి కఠిన పరిశ్రమచేస్తూంటే నేను లజ్జపడేవాడిని. నాలోకూడ వుత్సాహం పొంగి పొర్లసాగింది. ఓషధులను సేకరించేందుకు గుర్రమెక్కి ఎనిమిది పదియోజనాలవరకు ప్రయాణం చేయ సాగాను. వివిధ ఆయుధములచే ఏర్పడిన విషాక్తగాయాలను గుర్తించుట, చికిత్స చేయుట, రక్తస్రావమును కట్టించుట, యీయవలసిన ఔషధాలు, పథ్య-పానీ యాలను గూర్చి నా శిష్యులకు, స్త్రీలకు బోధించుటలో రాత్రింబగళ్ళను భేదం లేకుండా కృషిచేశాను. ఆ విధంగా ఒక నెల గతించేసరికి నా వుత్సాహం యినుమడించింది. దేహంలోని శిథిలత్వం మాయమయింది. ఇప్పుడు నా యీ నెరసిన వెంట్రుక లేమి చెప్పినా, నాకు మాత్రం నాలో ముది లక్షణాలు కనపడటంలేదు. ఈ విషయంలో మాయాబిడ అభిప్రాయంకూడ యిదే"

క్షతగాత్రులకు తక్షణమే చికిత్స చేయటం మంచిదని చెపుతూ, యుద్ధ మారంభించేనాటికే తాను తగినంతమంది సహాయినులతో ఉల్కాచేలానికివచ్చి చేరుకుంటానని చెప్పాడు. నేను వెంటనే సాధన-సామగ్రితో కొందరినిపంపమనీ, మిగతావారికొరకు ఒకరాత్రి ముందుగా కబురుపెడ్తాననీ చెప్పాను.

భామ, రోహిణుల కార్యసాఫల్యతకు నే నభినందనాలు తెలిపినప్పుడు "కాని, మరదీ! నేనుమాత్రం నీకు ధన్యవాదాలు చెప్పలేకుండా వున్నాను" అంది భామ.

"ఏం వదినా! సింహుడు చేసిన మహాపరాధ మేమిటి?" అనడిగాను.

"కాస్తా కూస్తాకాదు, గొప్ప నేరమే"

"గొప్ప నేరం!"

"అవును, మరి నువ్వు జైనుల శిష్యుడ వెందుకయ్యావు?"

"ఓహో! భగవాన్ మహావీరుని జైనధర్మంపట్ల నేను శ్రద్ధచూపుతున్నా ననా నీ కోపం?"

"మరే."

"నే నాయనదర్శనం చేసుకున్నాను. ఆయన వుపదేశం విన్నాను. నా కది నచ్చింది వదినా!"

"మరి నీ సైనిక కర్తవ్యాన్నెలా నిర్వహించుతావు ?"

"నా కర్తవ్యాన్నుంచి విముఖుడను కమ్మని ఆయన చెప్పలేదే."

"మంచిది, సంతోషం !"

"లేకపోతే నా కాయన పట్ల భక్తికుదిరేదే కాదు. మన పంచాయతీ రాజ్య రక్షణకు యుద్ధంలో పాల్గొనడం నా ప్రథమ కర్తవ్యంగానే భావించుతున్నాను."

"సరేకాని, ఆర్యపుత్రా ! మీరు మాంసము, చేపలు తినుటకూడ మానివేశారటనే ?" అనడిగింది రోహిణి.

"నిజమే రోహిణీ ! నా హృదయంలో కారుణ్యాన్ని విస్తరింపజెయ్యాలనుకున్నాను. పాలు, వెన్న, బెల్లం మొదలైన కమ్మని పదార్థాలుతిని దేహానికి శక్తిని చేకూర్చుకొంటూ జీవించవచ్చును."

భామ అందుకొని "అయితే నువ్వు రోహిణిని కూడ జైనుల శిష్యురాలుగా చెయ్యాలను కుంటున్నావా మరదీ ? నువ్వందుకోసం ప్రయత్నించేముందు నన్ను ఢీకొనాల్సి వస్తుందిసుమా" అంది.

"ఇప్పట్లోనే నొక్క బింబిసారుని మినహా మరెవరితో తలపడటానికీ సిద్ధంగాలేను వదినా !" అన్నాను.

"అల్లా అయితే మన మిప్పు డింతటితోనే రాజీ చేసుకుందాం. నువ్వు జైనులవలలో యెన్నాళ్ళుంటావో యుద్ధమయిపోయినాక చూస్తాలే" అన్నది భామ.

"ప్రియా ! నేను నిత్యమూ మాంసం తింటున్నానుగదా, మరి నా పెదవుల్ని ముద్దుపెట్టుకుంటానికి యెబ్బెరికంగా వుండదూ ?" అని అడిగింది రోహిణి.

"రోహిణీ ! ప్రస్తుతం అంతా యథాప్రకారం జరిగిపోతుందిలే" అని సరిపెట్టాను.

నేను పిన్ని, అమ్మ, సోమలను కలుసుకొని మాట్లాడాను. అమ్మ, పిన్ని కూడ అగ్నివేశుని చికిత్సా శాఖలో శిక్షణ పొందుతున్నారు. అగ్నివేశునితో పాటు తాము కూడ ఉల్కా చేలానికి రాదలచినట్టు చెప్పారు.

నేను ఉల్కాచేలానికి తిరిగి వచ్చేప్పటికి మగధ నుంచి వచ్చే వార్తలు మరీ ఆందోళన కల్గింపుతున్నై. రాజగృహాన్నుంచి గంగాతీరం వరకు గల మార్గం సేనా వాహినులతో నేల యీనినట్లున్న దని తెలియవచ్చింది. గజ దళాలు గంగాతీరమున సమీకరించబడుతున్నవి. ఇక తామసించేందుకు వీలులేక పోయింది.

మర్నాటి సాయంత్రమే మగధ సైనికు డొకడు మా వజ్జి పౌరునితో పాటలీపుత్రం రేవువద్ద కారణంలేని కయ్యం పెట్టుకున్నాడు. వాడు మా పౌరుని

అదిరిపాటుతో త్రోశాడు. అతను కాలుజారి అగాధ జలప్రవాహంలో పడి తక్షణం ప్రాణం కోల్పోయాడు. ఈవార్త చేరగానే తాత్కాలికంగా ఉల్కాచేలమందేయున్న సేనాపతితో సంప్రతించాను. వెంటనే ఒక అశ్వికునితో మేము తెల్లవారగట్టనే యుద్ధమారంభించుతూన్నట్టు వైశాలికి వర్తమానం పంపాను. ఆ రాత్రికి రాత్రి సైనికులను, వాహనాలను మా నావలు గంగ అవతలిగట్టున పలుచోట్ల గప్ చిప్‌గా దించివేశాయి. అవతలికి చేరుకోగానే భూమిపైనుంచీ, నదిలోనుంచీ కూడ మా సైనికదళా లాకస్మికంగా మగధ నౌకాదళంమీద దాడి చేసినై. నల్దిశలనుండి అకాత్తుగా ముట్టడింపబడినందున మగధ సైనికులు కంగారు పడ్డారు. వా రొకసారి తెప్పరిల్లి జోరు చూపారు; కాని, అజ్ఞాతంగా వచ్చి పైబడిన శత్రువు నెదిరించడం సామాన్యంకాదు. తెల తెలవారుతూనే మగధ నౌకాదళంలో చాలమట్టుకు నౌకలు, సైనికులుకూడ నాశనమయిపోవడం జరిగింది. కొన్ని నావలు మాచేతికి చిక్కి సైనికులు బందీలైనారు.

నేను ఒక నౌకమీద వుండి స్వయంగా యుద్ధాన్ని నడుపుతున్నాను. మేము పాటలీపుత్రం రేవును శత్రునిశ్శేషం గావించుతూండగానే శోణనదీదుర్గశ్రేణిలో నిల్వవున్న యుద్ధనావలు మమ్మెదిరించటానికి వచ్చినై; అయితే కపిల్ నాయకత్వంలోని మా నౌకాదళంకూడ ఒకటి శత్రునావలను వెంబడించి వచ్చింది. ఈరీతిని శత్రు నౌకాసేన తమకుమించిన బలగంతో చుట్టివేయబడింది. అదే అదనులో కపిలుని మరొక నౌకాదళము శోణనదీ దుర్గశ్రేణిని ముట్టడించింది. అప్పుడక్కడ శత్రుసైనికులు తక్కువగా వున్నందున కపిల్ వారిని సులభంగా బందీలను గావించి వారిస్థానాల్లో మా లిచ్ఛవీ భటులను తైనాతుగా వుంచాము.

సూర్యోదయమవుతూండగా గంగలో దిగువనున్నవీ, శోణనదిలోనుంచి వచ్చిన నౌకాదళాలు, పాటలీపుత్రం వద్దనున్న గజ - తురగ - పదాతి దళాలూ ఒక్కుమ్మడిగా విజృంభించి మమ్మెదిరించినై; అయితే అప్పటికే గంగఅవతలి వేపున మా సేనలు కాలునిలద్రొక్కుకున్నై. ఒకప్రక్క సంకులసమరం సాగుతున్నా, మాకు అదనపు దళాలు అవిరామంగా వచ్చి చేరుతూనే వున్నై. పైగా గనికలమర్చబడిన నూతన నౌకాదళం కపిల్ ఆధ్వర్యాన అద్భుత ఫలితాన్నిచ్చింది. ముందుప్రక్కన కొమ్ముల్లాంటి వాడిమొనల గనికలుగల ఆ నావలు అతివేగంగా పోయి శత్రునావలను తాకుతూంటే అవి ఫట్‌మని పగిలి గంగలో కలిసిపోతున్నవి. మాగధులు ఏనుగులమీద గంగానదినిదాటి ఉల్కాచేలంమీద దాడిచెయ్యాలనుకున్నారు; కాని మా నావలవాడి కొమ్ముల వింతచర్యలనుగాంచి వారి ఏనుగులు దిగ్భ్రమ చెందినై. వారి సైనికుల గుండెలు గుభేల్ మన్నవి.

మా కెప్పటి కప్పుడు అదనపుసేనలువచ్చి కలుస్తున్నా పైనుంచి శత్రువుల తాకిడి మిక్కుటమవుతున్నట్టు గోచరించింది. శోణనదీతీరాన, గంగానది దిగువ తట్టునకూడ ఇవతలివేపున మా సేనలు వచ్చిచేరుకుంటున్నప్పటికీ యెదుటి రేవులను

శత్రునౌకా నిర్ముక్తం గావించనంతవరకు మేము మహా ప్రమాదంలో వున్నట్లే తోచింది. ఎల్లాఅయితేనేం అవతలిరేవును శత్రునిశ్శేషం గావించేసరికి రెండు ఘడియల ప్రొద్దెక్కింది. అప్పటికిగాని పైనుంచి పెద్దబరువును దించినట్టు నా హృదయం తేలికపడలేదు.

గంగానది దిగువకట్టున వున్న మా సేనను అమర్ నడుపుతున్నాడు. ఎగువను-అంటే శోణనదికి పైన కపిలుడు, మధ్యభాగంలో నేను సైన్యాలను నడుపుతున్నాం. కపిల్, అమరులు మొదట్లో భూభాగంమీద శత్రువులను కుడియెడమ పార్శ్వాలనుండి ప్రక్క దెబ్బలు కొట్టసాగారు. రేవులను శత్రునిర్ముక్తం చేయగానే నేను అదనపు దళాలతో పాటలీపుత్రంవద్ద పోరాడుతూన్న మా సైనికులకు మద్దతుగా వెళ్లాను. ఈలోగా శంతనుడు చేజిక్కిన శత్రునావలను వరుసగా నిల్పి, వాటిపై వెదురుగడలు, గడ్డి-గాదం వేసి దోనె వంతెనను తయారుచేయ బూనుకున్నాడు.

పాటలీపుత్రంవద్ద సమతల భూమియందు శత్రువులు నిలబడి యెదిరించేవారే గాని, కపిల్, అమరుల సైన్యాలు వారి అగ్రదళాల వెనక్కి చొచ్చుకొని పోగలుగుటవల్ల ముందున్నవారు తిరోగమించవలసి వచ్చింది. మూడు జాములవేళకు పాటలీపుత్రం అవతల ఒక యోజనంమేర భూభాగం మా హస్తగతమయింది. నేను వెంటనే పాటలీపుత్రంలో మా సైనికశిబిరాన్ని స్థాపింపజేశాను. కపిల్ నాయకత్వంలోని సేన శోణనది దక్షిణతీరాన్ని చాలవరకు శత్రుశూన్యం చేసివేసింది. సాయంకాలమయ్యేసరికి నాకు, అమర్‌కి దోనెవంతెన మీదుగా సహాయం రాసాగింది. ఘడియ ఘడియకీ యుద్ధపరిస్థితిని సేనాపతి సుమన్‌కి తెలుపుతూనే వున్నాను. అదే విధంగా నా సహచరులగు ఉపసేనానాయకులును తమ పురోగమనాన్ని గూర్చి యెప్పటికప్పుడు నాకు తెలియజేస్తున్నారు. మా సేనయావత్తు చక్కని బందోబస్తుతో నియమితస్థానాల్లో కర్తవ్యాన్ని నిర్వహించుతోంది. యుద్ధారంభంలోనే పరాజితులైన శత్రువులు భంగుపడి కింకర్తవ్యతా మూఢులైయున్న తరుణంలో మా సైనికదళాలు చిన్నచిన్న ముట్టడులతో వారిలో మరీ గడబిడ కల్గించారు.

పాటలీపుత్రాన్ని జయించినందుకు గణపతి, సేనాపతి ఆ రాత్రే నా కభినందనాలు తెల్పుతూ జాబు పంపారు. నా యీ విజయానికి మా జనసమితి అభినందించటమేగాక మరునాడు నన్ను సహాయసేనాధిపతిగా నియమించింది.

మా సైనికులు పాటలీ పుత్రంలో ప్రవేశించేసరికి అందనేక గృహాలు జనశూన్యంగా వున్నై. ఉల్కాచేలంలో మేమిచ్చిన శిక్షణవల్ల మా సైనికు లెవరూ గ్రామస్థుల సొత్తు నపహరించలేదు. ఎవరినీ యే విధంగాను బాధించలేదు. ఆచార్య అగ్నివేశుని చికిత్సా శిబిరము ఉల్కాచేలంలో స్థాపితమయింది. రణరంగంలోని క్షతగాత్రులను నావలమీద, డోలీలలో శిబిరానికి చేర్చుటలో భామసైన్యం నిమగ్నమయివుంది. గాయపడినవారిని చూడటానికి నేను రణభూమిలో సంచ

రించేటప్పుడు అందెందరో శత్రువీరులు కదలమెదలలేని స్థితిలో దిక్కు-మొక్కు-లేక పడియుండుట గమనించాను. పాటలిగ్రామంలోని కొన్ని యిండ్లను మంచి మాటలతోను, బహుమతు లాశపెట్టీ ఖాళీచేయించి క్షతగాత్రులగు శత్రుసైనికులను వాటిలోకి చేర్పించాను. వారి చికిత్సకుకూడ వెంటనే యేర్పాటు చేయవలసినదిగా అగ్నిదేశునికి కబురుపంపాను. నేనీ పనిని జైన ధర్మాన్ననుసరించి కరుణభావ విస్తరణకే చేశాను; కాని దాని ప్రభావం పాటలిగ్రామవాసులపైన అద్భుతంగా పనిచేసింది. భయోత్పాతంతో పారిపోయి సమీపారణ్యంలో దాగిన గ్రామీణులు లిచ్ఛవీ యువసేనానాయకుని హృదయం కరుణా సాగరమనీ, క్షతగాత్రులగు శత్రుసైనికులకుకూడ స్వయంగా పట్టీలువేసి కట్లు కడుతున్నాడనీ విని, ఆరాత్రే తిరిగివచ్చారు. నేను గ్రామపెద్దలను పిలిపించి ఓదార్చాను. మేము కేవలం గాయపడినవారికి చికిత్సచేయుటకు మాత్రమే కొన్ని యిండ్లను వశపర్చుకున్నామనీ, ఆ క్షతగాత్రుల్లో యెక్కువమంది మగధ సైనికులేననీ చెప్పాను. ఏమూలగాని, యేసైనికుడైనా అనుచితంగా ప్రవర్తించితే వెంటనే నాకుగాని, మా సేనానులకుగాని, తెలుపవలసినదిగాకూడ చెప్పాను.

తొలిదెబ్బకే శత్రువులు జంకి పోయారు; అయితే అంతమాత్రానికే మేము దాన్ని విజయంగా పరిగణించేందుకు వీల్లేదు.

రాత్రి తెల్లవార్లూ మా చతురంగబలాలు - గజ - తురగ - రథ - కాల్బలాలు గంగానదిని దాటి యీవల దిగుతూనే వున్నై. అటు పాటలికి మూడు యోజనాల దూరాన శత్రువులు కూడ చెల్లా చెదరైన సైనికుల్ని, నూతన దళాలను సమీకరించుకొని ప్రతిఘటించటానికి ఆయత్త మవుతున్నారు. ఆ రాత్రి నేను మరునాడు నా సిఫారసుతో సేనా నాయకులు కానున్న నా ఉపదళవాయిలతో ఉల్కాచేలంలో వున్న సేనాపతి సుమన్ వద్దకు వెళ్లాను. యుద్ధపరిస్థితులను పర్యాలోచించుకొని మళ్లీ మర్నాడు తెల్లవారగట్లనే శత్రుసేనలను ముట్టడించుటకు నిర్ణయించుకున్నాము. బింబిసారుని సైనిక బలం యావత్తు సమీకరింపబడటానికి కల్లా లేదన్నా రెండురోజులు పట్టవచ్చని మాకు తెలుసు. కాబట్టి యీలోగానే మేము శత్రువుల మీద గట్టి దెబ్బ తీయాలను కున్నాము. సమాలోచనలు ముగించుకొని మేమా రాత్రే తిరిగి మా స్కంధావారానికి వచ్చాము.

సూర్యోదయా త్పూర్వమే మా సేనలు ముట్టడి సాగించాయి. మగధసేన యింకను పూర్తిగా యుద్ధరంగంలోకి దిగలేదు; అయినా వారి గజ-రథబలాలు బలవత్తరంగానేవున్నై. వాటిముందు మా ఏనుగులు, రథాలు చాల స్వల్పం. మగధ మాగానిభూముల్లో రథాలంతగా వుపయోగపడవని మేము బుద్ధిపూర్వకంగానే వాటిని తగ్గించుకున్నాము. ఇక ఆశ్వికి, కాల్బలాలలో మాదే పైచేయి. ముందు కపిల్, అమరుల సేనలు శత్రువులమీద రెండు చెంపలనుండి దాడి ప్రారంభించాయి. అందుచే శత్రువులు అగ్రభాగంలో నిల్పిన యేనుగులను ప్రక్కలకు

నడుపుకోవాల్సి వచ్చింది. అదే సమయంలో నా సైన్యంయెదుటినుంచి తలపడింది. మా సేనలొక పథకం ప్రకారం తమ తమ నిర్దిష్టస్థానాల్లోనిలబడి అప్రతిహతంగా పోరుతూంటే వైరిమూకలకొక పద్ధతి అనేది లేకపోవడం నేను గమనించాను. అందుకు ఆక్రమణకారులము మేము కావడము, వారు కేవలం దెబ్బతట్టుకొనేందుకు మాత్రమే ప్రయత్నించవల్సిరావడం కూడ ఒక కారణం.

కపిల్, అమర్‌లు కవచధారులై శస్త్రాస్త్రములదాల్చి తక్షశిల సైంధవాశ్వములనెక్కి, ఎటుచూచినా తామై సైన్యములను నడుపుతున్నారు. బిబిసారుని రథాలు ఆ పంటమళ్ళలో నిజంగానే పనికిమాలినవయినవి. అవి మమ్ము ప్రతిఘటింపలేక పోవుటేగాక, వారి తతిమ్మా సైనికబలాలకు ఆటంక కారకములని మధ్యాహ్నానికే మా ఆశ్వికులు నిరూపించారు. వారి గజబలం ధాటికి తట్టుకోవటం ఆదిలో మాకు కొంతవరకు కష్టంగానే కనబడింది. నల్లటి పర్వతాల్లాగా అవి మా మీది మీదికి రాసాగినయి. మేము యెదుటినుంచి వాటిని ఢీకొన్నాంకూడాను; కాని, ఆ విధంగా వాటిని చెదరగొట్టలేమని గ్రహించి, తరువాత యిరుపార్శ్వములనుండి దెబ్బకొట్టసాగాము. మా యీ యెత్తుగడతో ప్రక్కనున్న ఏనుగులలో కలవరము జనించింది. వాటి ఘీంకారములతో మిగతా గజముల్లోకూడా గడబిడ రేగింది. మొత్తంమీద ఆరీతిని యుద్ధం సాగించడం సులభంకాదు; అయినా సాయంత్రాని కల్లాగెతేయేం మా స్థితిని చక్కబర్చుకున్నాం. మా శత్రువులు మధ్యాహ్నం లోపల సాధించుకున్న ఫలితాన్ని ప్రొద్దు కూకువేళకు కోల్పోయారు.

ఆయుద్ధంలో మాగధులాశించిన ధనుష ప్రయోగం నిష్ప్రయోజన మవడమే వారిని బలహీనపరిచింది. వారు రథికుల ధనుర్విద్యాపాటవం మీద యెక్కువ నమ్మకం పెట్టుకున్నారు; కాని, రథాలు నిరుపయోగము లవుటతో వారి యాశ నిరాశఅయింది. ఇక మా ఆశ్విక - కాల్బల సైనికులకో ధనుర్విద్యకొట్టిన పిండి. కనపడినచెట్టు - పుట్టలెక్కి మావాళ్ళు శత్రువులపై శరవర్షం కురిపించసాగారు. మగధ సైనికులకు సరియైన కవచాలులేకపోవుట కూడ ఒక లోటే. ఆ కారణంగా వారు మాబాణ, ఖడ్గ, బల్లెముల ప్రహారములనుండి తప్పించుకోవడం అసాధ్యమయింది.

మధ్యాహ్నం ప్రొద్దుతిరిగిన లగాయతు శత్రువులు ఒక్కొక్క అడుగు వెనక్కి జారిపోసాగారు. పీనుగలతోను, క్షతగాత్రులతోను నిండియున్న యుద్ధరంగంలో భామ స్త్రీ సేన అవిరామంగా తన కర్తవ్యాన్ని నెరవేరుస్తోంది. తీవ్రంగా గాయపడినవారిని ముందుగా మోసుకొని పోతున్నారు. ముఖాలమీద చన్నీళ్ళు చిలకరించి సేదతీర్చి, దప్పిగొన్నవారినోట నీళ్లుపోసి క్రమంగా అందరిని రణరంగాన్నుంచి తొలగించుతున్నారు. క్షతగాత్రులైన వైరివీరుల చికిత్సకుకూడ నేనప్పుడే పురమాయించాను.

నాటి పగలు యుద్ధంలో యిరుపక్షాలకు కలిగిన లాభ-నష్టాలను ఉజ్జాయింపువేశాను. శత్రువులకు రథాల ప్రయోజనమే లేకపోయింది. వారి కరి మేరువులను ఢీకొనుట మా కింకను కష్టప్రదంగానే వుంది; అయితే వాటితో తలపడటానికి మా గుర్రాలు అలవాటుపడుతున్నై. మా ఆశ్వికులుకూడ యీలెంతో వాటిపైనబడి దెబ్బతీయుటలో అనుభవం గడించుతున్నారు. ఏనుగుల్ని ప్రక్కవాటుగా దెబ్బకొట్టడం మాకు సులువనిపించింది. మగధ ఆశ్వికదళాలుకూడ ధైర్య-సాహసాలతో పోరాడుతున్నారు; కాని, వారికి కవచరక్షణ లోపించుటచే తీవ్రంగా నష్టపడుతున్నారు. కాల్బలాల విషయంలో వుదయాన్నుంచీ మా పక్షానిదే పైచేయిగా వుంది. క్రితంరాత్రివలెనె ఆనాడుకూడ వేయిమంది శత్రుసైనికులను బందీలుగా పట్టుకున్నాం. పగలంతా శత్రువుల నొక్క కోసుదూరం మాత్రమే గదుమగల్గటంవల్ల వారి బలమంతా యీ రంగంలోనే సమీకరింపబడినట్టు స్పష్టమయింది. వారు సర్వశక్తులు వినియోగించినా లిచ్ఛవులశక్తి మజాను చవిచూడకతప్పలేదు.

రణరంగంలో పోరుసల్పుతూన్న యోధులకు, గుర్రాలకు ఆహారపానీయాలను సరఫరా చేసుకోవడం మాకొక ప్రధానసమస్య అయింది. తిత్తులతో నీరు, సంచులతో వేపుడుమాంసము చంకలను వ్రేలాడుతున్నా యుద్ధం చేస్తున్నవారికి వాటిని తిని, తాగే వ్యవధానం లేకపోయింది.

వజ్జి తూర్పుసరిహద్దు రంగంలో దించబడ్డ వుత్తర అంగరాజ్య సేనలు చాల బలహీనంగా వున్నవని తొలిదూకుడులోనే తేలిపోయినట్టు రెండోనాటి రాత్రి మాకు కబురు వచ్చింది. కాబట్టి మేము గట్టిగాపోరాడవలసిన దీ ఒక్కరంగంలోనే. వివిధరంగాల్లోని పరిస్థితు లాకళింపు చేసుకొని గంగకు ఒకటికంటె ఎక్కువ దోనెవంతెనలను నిర్మించి పెద్దయెత్తున లిచ్ఛవీ సైనికదళాలు నదిని సంతతధారగా దాటివచ్చి మమ్ము చేరుకుంటున్నై. అప్పటినుంచి నిరంతర మొకే దళములచే పోరాడించేబదులు ఒకదానివెనుక మరొకటిగా లేచివచ్చే సముద్రతరంగాలవలె ఎప్పటికప్పుడె మా అదనపు దళాలను అగ్రభాగానికి నడిపి అలసిపోయిన దళాలకు విశ్రాంతి నివ్వాలని ఆరాత్రి నిశ్చయించుకున్నాం. అందువల్ల మా యోధులు ఆహారపానీయాలను తీసుకొనే వ్యవధానంకూడ చిక్కుతుంది. ఆ రీతిని సేదతీరిన దళా లెప్పటికప్పుడు శక్తిసంచయం చేసికొని ఉధృతంగా దాడిచేయ గల్గుతాయి. దాడిచేసేవాళ్ళం మేము కావడంవల్లనే మా కిదంతా సాధ్యపడింది. దాడిని తట్టుకొనే పక్షాని కిల్లాంటి అవకాశం లభించదు. మాకు వస్తున్నట్లే శత్రువులకుకూడ సహాయం వచ్చి చేరుతోంది. మూడోనాటి యుద్ధంలో ప్రతిపక్షులసంఖ్య మాకు మించివుంది. అయితే వారి యుద్ధవిధాన మప్పటికి మాకు చక్కగా అవగాహన అయింది. శత్రువులను కలవరపెట్టేందుకు మాదళాలు రాత్రివేళకూడ చిన్న చిన్న దాడులు జరిపినై. ఉదయాన్నే కొత్తగా వచ్చి

చేరిన దళాలను అగ్రముఖానికి పంపాము. శత్రుసేనల కాళ్ళు తేలిపో వారంభించే సరికి క్రితంనాడు పోరుసల్పిన సైనికులు సేదతేరి, తాపీగా భోంచేసి విశ్రమించిన వారు కదనరంగంలోకి వురికారు. వంతులువారీగా యుద్ధంచేయడంవల్ల మా సైనికులకు తగినంత విశ్రాంతి లభించటమేకాక, పగలంతా అవిరామంగా పోరు సాగించి శత్రువులకు వూపిరి సలుపకుండ వుక్కిరిబిక్కిరి చేయగలగాము. మూడు దినాలయుద్ధంతో పాటలిగ్రామం అవతల నాలుగు యోజనాల మేర ఆక్రమించుకున్నాం. అంటే చివర రెండు రోజుల్లోను ఒక్క యోజనంమేర మాత్రమే గెల్చుకున్నాము అయితే ఎక్కువ భూప్రదేశా న్నాక్రమించలేక పోయినా శత్రుసేనలను పూర్తిగా ఓడించగల్గడం గమనించతగ్గది.

లిచ్ఛవీ యువతీదళాలు సైనికుల కాహార - పానీయాలందించుట, క్షతగాత్రులనో శిబిరాలకు చేర్చుట, పీనుగలను యెత్తివేయుటతోపాటు రణభూమి యందు లభించిన ఆయుధాలను ప్రోగుచేయుటలో అత్యంతశ్రద్ధతో పనిచేస్తున్నవి అగ్రభాగాన నిలబడి పోరగల్గుట కవకాశం లభించాలని భామ ఒక పర్యాయం అన్నది; కాని, వారింతవరకు చేస్తున్న సేవాప్రాముఖ్యత, ప్రభావాలను గూర్చి నేను నచ్చజెప్పటచే ఆమె ఆ కోరికను విరమించుకున్నది. "మనమిప్పు డేకధాటిని పురోగమించగల్గుతూండబట్టిగాని, తిరోగమించవలసివస్తే మీరు కత్తులు ఝుళిపించి పరాక్రమాన్ని ప్రదర్శించవలసిన అవసరం వుండేది వదినా!" అని చెప్పిన నా మాట లామెను సంతృప్తిపరచినై.

మూడవ నాటి యుద్ధంలో విపరీతంగా నష్టపడినా శత్రువులు వెనుకంజ వేయలేదు. ఆ నాడు వారు ప్రధాన యోధులందరిని రంగంలోకి దించారని తెలిసింది. యువరాజు అజాతశత్రుడు స్వయంగా గజారూఢుడై సైన్యాలను నడిపాడు. నేను స్వయంగా ఖడ్గధారినై యుద్ధంలో పాల్గొనే అవకాశం చిక్కనందుకు విచారంగానే వుంది. యోజనాల పర్యంతం వ్యాపించి యున్న సైన్యాలను నడిపేవానికి బాహుబల ప్రదర్శనావకాశం లభించడం కష్టమే; కానీ, ఆ నాడు హోరాహోరిగా పోరాడుతూన్న సైనికులను హెచ్చరించుతూ తిరుగుతూన్న సమయంలో సామాన్య గజారూఢుడై పోరాడుతున్న వైరి వీరు డొకడు నాదృష్టి నాకర్షించాడు. అతడజాతశత్రువైయుండ నోపునని వూహించాను. తక్షణం బల్లాన్ని కుడి యెడమల త్రిప్పుతూ నా గుర్రాన్ని ఆహస్తివేపు కురికించాను. నాగుఱ్ఱం ముందుకు లంఘించుట గాంచి మా అశ్వికులును యినుమడించిన వుత్సాహంతో మాగధులపైన విరుచుకొని పడ్డారు. గొడ్డళ్లు, బల్లాలు, ఖడ్గ- గదాదులతో వీరవిహారం చేస్తున్నారు. నేను ఏనుగును సమీపించుటతో గాలిలోని జలదములవలె శత్రుసైనికులు చెల్లా చెదరై పోయారు. గజంమీది యోధుడు రెండు దఫాలు నా ప్రహారములను తప్పించుకున్నాడు. అంతలో మావటీడు హస్తిని నాపై కుసికొల్పాడు. నాతేజీ కూడదానికంటె చురుకైనదే.

నేనొక వుదుటున ప్రక్కకు తప్పుకొని బల్లెంతో పొడిచాను. అది గజారోహుని కవచాన్ని దూసుకొనిపోయి కంఠంలో దూరింది. నేను బల్లాన్ని లాగుట తోనే తలవ్రేలాడి అంబారీలో క్రిందకొరిగాడు. సరిగా అదే సమయంలో లిచ్ఛవీ యువకుడొకడు తన అశ్వంమీద నిలబడి యేనుగు వీపుపై కెగబ్రాకుతూండడం నా కంటబడింది. చూస్తూండగానే అతడు మావటి వాని వెనక్కు చేరుకొని యెడమచేత్తో వాని అంకుశాన్ని గుంజి లాక్కున్నాడు. ఆ గుంజులాటలో యువకుని చేతికి గాయమై నెత్తురు కారుతోంది. అయినా దాని నతడు లెక్కచేయక కుడిచేతి విచ్చుకత్తినిచూపి 'ఏనుగును ముందుకు నడుపు' మని మావటివాని నాజ్ఞాపించాడు. నే నాతని ధైర్యసాహసాలకు విస్తుపోయాను. మరుక్షణంలో నిజంగానే ఏనుగు మా శిబిరంవేపుకు సాగిపోతూండడం చూచి నా ఆశ్చర్యానికి మేరలేకపోయింది. మా చుట్టు చాల మేర శత్రు శూన్యంగా వుంది. మా అశ్వికులలో అయిదుగుర్ని వెంటరమ్మని నేను ఏనుగు ననుసరించి నడుస్తు న్నాను. నన్ను దిగ్భ్రాంతుని చేయగల్గిన ఆ సాహసుని గుర్రం ఖాళీగా మా వెనుకనే వస్తూండడం నే నప్పుడు గమనించలేదు. మా శిబిరాన్ని సమీపించి నంతనే ఆ యువకుడు మావటివాని చెవిలో యేమోచెప్పాడు. వాడు వెంటనే ఏనుగు కాలికి కట్టబడిన గొలుసును క్రిందపడవేశాడు. యువకుని చేసన్నతో మా యాశ్వికు డొకడు గొలుసునుతీసి దాపులోనున్న చెట్టుకు కట్టాడు. అప్పుడు యువకుడు ఏనుగుపైనుంచి వీపుమీదుగా క్రిందికి దూకాడు. అప్పటికప్పుడే అతని అశ్వం తలపాగచుట్టియున్న యజమాని శిరమును మూర్కొంటోంది. యువకుడు తన ముఖాన్ని అవతలివేపుకు తిప్పుకొని యున్నాడు. నిహతుడై అంబారీలో పడివున్న యోధుని కళేబరాన్ని కిందికి తతిమ్మా అశ్వికులచే దింపించాడు. మావటీడు క్రిందికి దిగివచ్చి యువకుడు చెప్పి నట్టు చేస్తున్నాడు. ఏనుగు వెనుకకాళ్ళకుకూడ ముండ్లగొలుసు తగిలించిన పిదప యువకుడు మావటివాని నుద్దేశించి "ఓయీ! నీ కిక ప్రాణదానము లభించింది. యిటువచ్చి మా సేనాపతి ప్రశ్నలకు ఉత్తరము లి"మ్మని చెప్పాడు.

అప్పుడుకూడ నే నా తరుణయోధుని ముఖాన్ని స్పష్టంగాచూడ వీలుకా లేదు. అతన్నేదో అడగాలనుకుంటుండగానే మావటీడు నా ముందుకొచ్చి "యిది మా మహారాజు పట్టపేనుగు 'నాలగిరి' స్వామీ!" అన్నాడు.

"ఏమిటీ? యిది నాలగిరా! మరి పై నెక్కియున్న దెవరు?" అనడిగాను.

"మగధ సేనాపతి భద్రికులవారు స్వామీ! చండికులనికూడ అంటారు."

చండభద్రుని పేరు విన్నంతనే నా కనలేని ఆనందం కలిగింది. భద్రికుడు యుద్ధ కళాకోవిదుడు. మాగురువు బహుళాశ్వులు చెప్పగా యీతనిని గూర్చి విన్నాను. వారి సహాధ్యాయుడేనట. రణ విద్యాపారంగతులు కావడానికి ఏటేటా కుచ్చీలు కుచ్చీలు యువకులు తక్షశిలకు పంపబడుతున్నదీ భద్రికుని ప్రేరణవల్లనే.

రాజును ముఖస్తుతిచేసే యితర సేనా నాయకులకుట్ర, వంచనలకు గురికాకపోతే యితడు మగధ సేన నజేయం గావించి వుండేవాడు.

నేను గుర్రాన్నిదిగి వెంటనే ఒకమంచం తెమ్మని భటుల నాజ్ఞాపించాను. మంచం తేబడగానే యింకొకని సాయంతో భద్రికుని శవాన్ని దానిమీద పరుండ బెట్టాను. అంతలో మరికొందరు భటులుకూడ వచ్చిచేరారు. వారితో "ఇతడు యోధాన యోధుడు – మగధ సర్వసేనాపతి భద్రికు" డని చెప్పాను.

ఈవార్త నందించి రమ్మని అప్పుడే ఒక అశ్వికుని మా సేనాపతి వద్దకు పంపాను.

మావటీవానిని మాభటుల కప్పగించి, యేనుగుకు ఆహారం పెట్టమని చెప్పాను. నేను భద్రికుని శవాన్ని పట్టించుకొని నాగుడారానికి వెళ్ళాను. అప్పుడే మా సైనికులు కొందరు వచ్చి శత్రుసేనలు కదనభూమిని వదిలి పలాయనం చేస్తున్నాయని చెప్పారు. శిబిరాల్లో విశ్రమించుతూన్న సైనికులను తక్షణం పోయి శత్రువులను వెంటాడవలసినదిగా ఆనతిచ్చాను.

కొంచెంసేపు మానసిక విశ్రాంతి లభించినంతనే రణరంగంలో నన్ననుస రించి యుండి అద్భుత సాహసాన్ని ప్రదర్శించిన యువవీరుడు జ్ఞాపకానికి వచ్చాడు. అతడు నాతోపాటు భద్రికునిపైకివచ్చి వచ్చివుంటాడు. అతని ఖడ్గ కౌశలాన్ని నేను చూళ్ళేదు; కాని, పట్టపుటేనుగును తోలించుకొనిరావటంలో అతడు చూపెట్టిన సాహసం అసమానమైనది. అతనికొర కటు నిటు చూచి, కాన రాని నా అంగరక్షకుని తీసుకొనిరమ్మని పంపాను; కాని, యెంత వెదకినా అతని జాడ తెలియలేదట. కనీస మొక మాటతోనైనా అతన్ని ప్రశంసించక పోయినందుకు విచారపడ్డాను. అతడు మళ్ళీ వెళ్ళి శత్రువులను వెంబడించివుంటాడు. తిరిగి వస్తా డనుకొనే దెలా ? నామైన నాకే బలేకోపం వస్తోంది. ధైర్య – సాహ సాలు ప్రదర్శించిన ఒక వీరునికి తగిన గౌరవం చూపక, అపరాధం చేసినట్టే భావించుతున్నాను. పశ్చాత్తాప తప్త హృదయంతో యేనుగు వద్ద కెళ్లాను. అది నిజంగా కరిరాజు ఐరావతం లాగే వుంది. మూడుమూరల పొడుగాటి దంతాలు, పర్వతంలాంటి దేహములతో అసాధారణంగా వుంది. మళ్ళీ యుద్ధరంగంలోని సైనికులకు సూచన లివ్వడంలో నిమగ్నుడనైనాను. ఇంకొంచెం ప్రొద్దుండగా నాకొక యోచన కలిగింది. 'బింబిసారుని పట్టపుటేనుగు నేం సేనాపతి ఎక్కి వచ్చా' డని మావటివాని నడిగాను.

"సేనాపతి గుణ-గణాలు మహారాజుకు మాత్రమే తెలుసు. సేనాపతి యువరాజేది చెప్పినా కుర్రవానికింద జమకట్టి మాట్లాడేవాడు. అందుచే యువ రాజుకు ఆయనంటే ఒళ్ళుమండేది; కాని, మహారాజు సేనాపతియందు మిక్కిలి గౌరవాదరములు కలిగివుండేవాడు. వారీయనకు తమ పట్ట పేనుగునేకాదు,

ప్రాణమైనా యిచ్చేవారు. ఇద్దరు ఒకేయీడువారు; బాల్యమిత్రులుకూడాను" అని మావటీడు చెప్పాడు.

"నిన్నీ యేనుగుతోసహా వదలిపెట్టితే నువ్వు రాజగృహానికి వెళ్ళిపోతావా?" అనడిగాను.

"వదిలిపెడ్తారా?" అని వాడాశ్చర్యంగా అడిగాడు.

మీ మహారాజుకు ఒక్కసారిగా తన బాల్యస్నేహితుడు, పట్టపుటేనుగుల నష్టంవల్ల అమిత దుఃఖం కలుగుతుంది. ఈ ఏనుగైనా కళ్ళబడితే ఆయనకు కొంత ఊరట కలుగవచ్చు" అని మావటీడు మాట్లాడకుండుట చూచి "తిరిగి వెళ్ళడానికి మా సైనికు లడ్డువస్తారని భయపడుతున్నావా?" అన్నాను.

"అవును స్వామీ!"

"నీ కా భయమక్కరలేదులే. నిన్ను భద్రంగా మా సైనిక శ్రేణిని దాటించి పంపేటట్లు చేస్తాను. నీ ఒంటిమీద దెబ్బలు పడకుండటం మేలే. నీకు, ఏనుగుకు మా భటులు ఆహారం యిస్తారు. ఇక వెళ్ళు. ఈలోగా నేను మీ రాజుకు ఆయన ప్రాణమిత్రుని మృతిని తెలుపుతూ జాబురాస్తాను. నువ్వు త్వరగా బయల్దేరి రాజగృహానికి పో; తిండి తినిరా."

నా యీ మాటలు వాణ్ని చకితుని గావించినట్లు వాని చేష్టలే తెల్పుతున్నాయి. నేను తాళపత్రంమీద మూడుబంతులు రాసి, ముద్రవేయబోతూండగా సేనాపతి సుమన్ వచ్చాడు. వచ్చీ రావటంతోనే ఆయన నన్ను కౌగలించుకొని నా ఫాలతలమును చుంబించాడు.

"కుమారా సింహా - కాదు, లిచ్ఛవీ విజయసేనాపతీ! —" అని ఆయన అంటూంటే మధ్యలో నే నందుకొని "కాదు, మీరు నన్ను 'కుమారా' అని పిలిస్తేనే బాగుంటుంది" అన్నాను.

"అలాగే నాయనా! వైశాలి - వజ్జి దేశం యావత్తూ నిన్నుగూర్చి గర్వపడుతుంది. ఇంతవరకు మనం భయపడుతున్నది మగధలోని కూటనీతి విశారదుడు వర్షకారునికి, రణవిద్యా పారంగతుడు భద్రికునికి మాత్రమే. భద్రికుని కడతేర్చి నువ్వు మగధపై పూర్తిగా జయం సాధించావు."

"సేనాపతీ! మగధ సైనికులు యుద్ధభూమిని వదలి పారిపోతూంటే మన యోధులు వెంటబడి తరుముతున్నా"రని చెప్పాను.

"పిక్కబలం చూపారూ! సేనాపతి మడియుటతో అది సంభవమే."

"నేనొక అపరాధం చేశాను, మన్నింప కోరుతున్నాను."

"మగధ విజేతకు ఒక తప్పుకాదు, నూరు తప్పులకు మాఫీ."

"శత్రు సేనాపతి భద్రికుడెక్కి వచ్చిన బింబిసారుని పట్టపు టేనుగును త్రిప్పిపంపుతున్నాను."

"అయితే పట్టపేనుగును కూడా పట్టుకున్నావూ?"

"అవును, కాని అసలు దాన్నిక్కడికి తన అద్భుత సాహసంతో అతి నేర్పుగా తోలించుకొని వచ్చిన వీరయువకుణ్ని మాటమాత్రంగానైనా ప్రశంసించలేకపోయినందుకు విచారపడుతున్నాను. బహుశః మన యీ యువయోధుడిప్పుడు శత్రువులను వెన్నాడుతూ వుండివుండవచ్చు."

"యుద్ధసమయంలో అనేక బాధ్యతల నేకకాలమందే నిర్వహించాల్సి వస్తుంది. అల్లాంటప్పుడు పొరపాటు జరగడం సంభవమే. ఆ యువకుడు నెమ్మదిమీద కన్పించుతాడులే. నీ వా ఏనుగును త్రిప్పిపంపదలిస్తే పంపించెయ్యి."

"మరో సంగతి. నేను మగధరాజు కొక లేఖ రాశాను. అందులో "మగధ రాజు బింబిసారునికి లిచ్ఛవీ ఉపసేనాపతి సింహుడు తెల్పునది: మీ పట్టపు టేనుగువలెనె మీ సేనాపతి భద్రుడుని సజీవంగా పట్టుకొనలేకపోయినందుకు విచారపడుతున్నాను వీరసన్మానము లిచ్ఛవుల కవగతమే. మే మత్యంత గౌరవ పురస్సరంగా మగధసేనాపతి దహనసంస్కారానికి ఏర్పాట్లుచేస్తున్నాము. లిచ్ఛవీ సేనాపతి స్వయంగా చితికి నిప్పంటించుతాడు. బాల్య మిత్రుని వియోగ దుఃఖంలో మీకుకొంత పూరటకలుగవచ్చునని పట్టపుటేనుగును త్రిప్పిపంపుతున్నాము!" అని రాశాను.

"నేను నీతో పూర్తిగా యేకీభవించుతున్నాను" అన్నాడు సేనాపతి.

మావటివానికి జాబిచ్చి మా సైనిక శ్రేణిని దాటించి రమ్మని యిద్దరాశ్వికులను తోడు పంపాను. మా శిబిరమున్న తోటలో ఒక ప్రక్కన చితిని పేర్చమని కొందరిని నియమించాను.

మా శిబిరము పాటలి గ్రామానికి మూడు యోజనాల దూరాన మామిడి తోటలోవుంది. ఆ యేడాది మామిళ్ళు విరగ్గాచినై; కాని కాయలింకా పండలా. నేను, సేనాపతి ఒకమామిడిచెట్టు నీడను కూచుని మాట్లాడుతూండగా కపిల్ కొందరాశ్వికులతో వచ్చాడు. రెక్కలిరగ్గట్టి పట్టుకొచ్చిన ఒకవ్యక్తిని గుర్రం మీదినుంచి దింపించి మా ముందుకు తీసుకొచ్చాడు. నాతోవున్న సేనాపతిని గాంచి అభివాదముచేసి నా వైపుతిరిగి కపిల్ చెప్పాడు - "ఇతడు మగధ ఉప సేనాపతి ఉదయుడు. ఇనాళే మే మిదివరక్కంటె ఎక్కువమందిని బందీలుగా పట్టుకున్నాం. ఇంకా లెక్కపెట్టలేదు; కాని, లక్షకువైగానే వుండవచ్చు."

మా సైన్యాధ్యక్షుడు కపిల్ ని అభినందించాడు. నేను కపిల్ ని కౌగలించుకొని "నువ్వు నాకంటె అదృష్టశాలివి కపిల్! నేను మగధ సేనాపతిని సజీవునిగా బంధించలేక పోయాను" అన్నాను.

"ఏమిటీ! మీరు మగధ సేనాపతిని కడతేర్చారన్నమాట?" అన్నాడు కపిల్.

"నే నాయన్ను ప్రాణంతో పట్టుకొని వుంటే యెంతైనా సంతోషించే వాడిని; సరేగాని, యుద్ధగతి యెల్లావుంది?" అనడిగాను.

"వైరిమూకలు సఫా అయినట్లే. పట్టుబడుతూన్న బందీలదే గొప్ప సమస్యగా వుంది" అన్నాడు కపిల్.

సేనాపతి సుమన్ బంధితునిచేరి "ఉపసేనాపతి ఉదయ్! మీ సర్వసేనాపతి దహనసంస్కారము, అంతిమ సన్మాన ప్రదర్శనంలో నువ్వుకూడా మాతోపాటు పాల్గొనెదరని ఆశిస్తాను" అన్నాడు.

"అవశ్యం పాల్గొంటాను; యిది నా అదృష్టమే" అన్నాడు ఉదయుడు.

ఉదయుని రెండుచేతులు నా చేతుల్లోకి తీసుకొని "సేనాపతీ! నీపట్ల మర్యాదచూపుట కాలసించిన నన్ను మన్నించు" అన్నాను.

"బందీనైన నాకు గౌరవమెందుకు?" అన్నాడు ఉదయ్.

"అయినా నువ్వు వీరుడవు. జయ మిరుపక్షాలలో ఒకరికే లభిస్తుంది; కాని శౌర్య - ప్రతాపాల ప్రదర్శనంలో యిద్దరము సమభాగులమే. మీరు మా సైనికులెట్టి అపచారము చేయలేదుగద?"

"మీ సేనా నాయకుని ఉదారతను అభినందనాలు."

"నేను మీ చేతులు కట్టి అపచారం చేశానుగా" అన్నాడు కపిల్.

"మీ రా పని చేసియుండకపోతే నేనింత సుఖువుగా పట్టుబడతానా?" అని ఉదయు డన్నాడు.

"మీరు భోంచేస్తారా?" అని నేను ఉదయు నడిగాను.

"మంచినీళ్ళు చాలు."

ఉదయుడు చల్లనినీళ్ళు తాగినతర్వాత మేము శవాన్ని యెత్తుకున్నాము. మధ్య మధ్య మనుష్యులము మారి అందరం భుజంవేశాము. చితిమీద శవాన్నుంచిన పిదప సుమన్ నిప్పంటించాడు. కొద్దిసేపట్లో అగ్నిజ్వాలలు చండభద్రుడునిశవాన్నలముకున్నవి. ఆ అగ్నికీలలు వీరశరీరాణువులను జ్యోతిర్లోకానికి జేరవేస్తున్నట్టుగా మిన్నంటుతున్నై.

దహన సంస్కారం ముగించి బసకు తిరిగి వచ్చిన పిమ్మట నేను ఉదయుని భోజనాదుల కేర్పాటు చేయించాను. భోజనానంతరం ఆయన్ను కొందరు భటులతో ఉల్కాచేలానికి పంపించు నట్లాజ్ఞాపించాను. అంతట తీరుబాటుగా కూచుని నేను, కపిల్ సేనాపతికి యుద్ధ పరిస్థితిని సాకల్యంగా వివరించి చెప్పాము. జరిగిన వైనమంతా రాసి వైశాలికి పంపుతానని చెప్పగా ఆయన తానే యీ శుభవార్తను స్వయంగా తీసుకెళ్తానని చెప్పాడు. అంతకుముందే ఆయన గుర్రంమీద మూడు రోజనాల దూరం ప్రయాణంచేసి వున్నందున నే నాయనను విశ్రాంతి తీసుకొమ్మని విన్నవించాను; కాని, ఆయన సమ్మతించడయ్యెను. విజయవార్తతో వెంటనే వైశాలికి వెళ్లిపోతానని పట్టుబట్టుటచే నే నొక ఉత్తమాశ్వమును తెప్పించి యిచ్చాను. సేనాపతి దాన్నెక్కి మేము చూస్తూండగానే కనుచూపుమేర దాటి పోయాడు.

నేను కపిల్ వంక చూచి "మిత్రమా కపిల్! కార్యసాఫల్యతే శ్రమకు తగిన పారితోషకము సుమా" అన్నాను.

"చక్కగా చెప్పావు. నీచాకచక్యంతో యీ ఘనవిజయాన్ని సాధించావు. లిచ్ఛవీ సర్వసేనాపతి నిన్ను మెచ్చుకున్నాడు. జనసమితి కూడ నిన్న సక్రీతిని సన్మానించుతుంది. కాని, సన్మానంలో కలిగే సంతోషం యీ విజయాన్ని సాధించినప్పుడు నీ మనసులో పొందిన ఆనందానికి సాటి అవుతుందా?" అన్నాడు కపిల్.

"నా గురించి యిప్పుడు నేనేమి చెప్పానో అట్లే నీగురించి కూడా భావించు తున్నాను. సరే, ఇక నాసంగతిని వదిలేసి భోజనం విషయం చూసు కుందాం. నేను - భామ అన్నట్టు - జైన ధర్మావలంబి నయినాను. అందుచే నాకిపుడు మద్య - మాంసాదుల అవసరంలేదు కపిల్."

"నాకవి కావాల్సిందే" అన్నాడు కపిల్.

"నీ భటులున్నారుగా, వారితో చెప్పు" అన్నాను నేను.

శుకుడా రాత్రి పాయసము, బూరెలు వండాడు. అవి కమ్మగా నేవున్నై; కాని, నా కేలనో ఆ పూట అవి రుచించలేదు. నా సహచరులు మద్య-మాంసముల నాప్యాయంగా మెక్కుతున్నారు. నాకు జతగా కూచునే శాకాహారి ఒక్కడూ లేకపోయాడు. అందుకని నే నెవరినీ నిందించలేను. నేను కోరి, బుద్ధిపూర్వకంగానే యీ నూతన పథాన్ననుసరించానాయె.

యుద్ధ రంగాన్నుంచి వచ్చే సమాచారముల నందుకోటానికి నా ఉపనాయకులు, సేనానులు వుండనే వున్నారు. వారాల తరబడి నిద్రలేమి నా రెప్పలు బరువెక్కి వాలుతున్నై. అందుచే నేను పెందలాడేపోయి పడుకున్నాను. అర్ధ రాత్రివేళ నాకు నిద్రలోనే ఎవరిదో పిలుపు వినపడింది. మొదట్లో నేను కలకంటు న్నానేమో ననుకున్నాను; కాని, మరి రెండు మూడుసార్లు అదే పిలుపు చెవిని పడుటతో కపిల్ పిలుస్తున్నట్టు తెలుసుకున్నాను. వెంటనే లేచి "ఏమిటి కపిల్?" అనడిగాను.

"కార్యభారంచే బడలి గాఢనిద్రలోనున్న నిన్ను గత్యంతరం లేక లేపవలసి వచ్చింది. మన సర్వ సేనాపతి సుమన్ మనల్ని వీడి పరలోకగతుడయినాడు" అని పిడుగువంటి వార్త చెప్పాడు.

"సేనాపతి మరణించాడా! ఇప్పుడేగా ఆయన యిక్కణ్ణుంచి వెళ్ళింది?" అనడిగాను.

కపిల్ చెప్పాడు - "ఉల్కాచేలం చేరగానే సేనాపతి వైశాలికొక దూత ద్వారా జాబు పంపాడట. అయినా ఆయన మనస్సుకు సంతృప్తి లేకపోయింది. జనసమితి సమావేశంలో స్వయంగా తానే విజయవార్తను ప్రకటించాలని ఉబలాట పడ్డాడు. ఆ ఉత్సాహంతో మళ్ళీ వెంటనే వైశాలికి బయలుదేరాడు. ఉల్కా

చేలం పొలిమేర దాటకముందే అకాత్తుగా గుర్రం మీదనుంచి క్రింద పడి పోయాడు. వెంటనున్న అశ్వికులు వెళ్ళి గుండెమీద చేయ్యేసి చూచేసరికే ప్రాణం పోయిందట. ఈ దుర్వార్త నందజేయుట కొకని నిక్కడికిపంపి, మిగతా వారు శవాన్ని వైశాలికి తీసుకెళ్ళారట."

ఇదంతా కపిల్ చెపుతూంటే చెవులప్పగించి వింటున్నానేగాని, నామతి మతిలోలేదు. నిర్విణ్ణుడ నయినాను. కొంతవడి నోటమాట లేకుండ చూస్తున్న నన్నుగాంచి కపిల్ అన్నాడు - "ఉల్కాచేలంలో మన సైన్యాలను ఆజ్ఞాపించే వారెవరూలేరు. తూర్పురంగంలో యుద్ధం సమసిపోయినట్లే; కాని, అక్కడి వార్తల నందుకొని, సూచనలివ్వాలిగద."

సర్వ సేనాపతి తర్వాత బాధ్యుడను ఉపసేనాపతినగు నేనేనని తలచుకొని కపిల్‌తో చెప్పాను— "జనసమితి మరల నూతన సేనాపతిని నియమించే వరకు యుద్ధ నిర్వహణకు నేనే జవాబుదారీ వహించాలి. మిత్రమా కపిల్! దక్షిణ రంగం బాధ్యత యిక నీదే. యుద్ధ విరమణకోరి, శత్రు దూతలు వచ్చేవరకు వారిని వెన్నాడుట మానవద్దు. యుద్ధఖైదీలను మామూలుగా ఉల్కాచేలానికే పంపుతూండు. అమరునికి కూడ లేఖరాస్తున్నాను ఈ లోగా నా గుర్రాన్ని తెప్పించు."

అని నేను దీపంవెలుగులో కమ్మవ్రాశాను. కపిల్ నా గుర్రంవచ్చినట్టు చెప్పగా జాబతనికిచ్చి నేనతణ్ణి గాఢాలింగనంచేస్తూ "మిత్రమా! ప్రస్తుత పరిస్థితుల్లో ఏది ఎవరి తుది కౌగిలో చెప్పలేం. నేనిక వెడుతున్నాను. నీ విక్కడ పరిస్థితులనుబట్టి నీకు మంచిదనితోచిన విధంగా చెయ్యి. అవసరమైతే మూడు యోజనాల దూరాన నేనుండనే వుంటాను" అన్నాను.

రాత్రిపూట వాతావరణం నిస్తబ్ధంగావుంది. ఆ నిశ్శబ్ధవాతావరణాన్ని భంగపరుస్తున్నదల్లా మా అయిదు గుర్రాల డెక్కల చప్పుడే. క్రితంనాడు రక్త స్రవంతులతో డాగులు పడిన భూమిపై ప్రయాణం చేస్తున్నాము. మా ప్రయాణ వేగంలో పరస్పర సంభాషణకే వీలులేదు. మార్గమందక్కడక్కడ రక్షకభటులు ఆగుమని కేకలువేసేవారు. 'మిత్రుల'మని చెప్పటతో జివిటీలెత్తిచూచి అభివాద నముచేసి వదలిపెట్టేవారు. పాటలిగ్రామంలో దళవాయిని పిలిపించి నేను ఉల్కాచేలానికి వెళ్ళిపోతున్నాననీ, ఇక కపిల్ ఆదేశాల ననుసరించి నడచుకోవలసిందనీ చెప్పాను. మూడుయోజనాల ప్రయాణంతో మా అశ్వాలు అలసిపోయినై. అందుచే మేము పాటలిలో కొంచెంసేపు విశ్రాంతితీసుకున్నాం. తర్వాత దోనెల వంతెనమీద మెల్లగాదాటి ఉల్కాచేలం చేరుకున్నాము. నాతో కూడా వచ్చిన భటుల తిరిగి పోవుట కనుమతించి సేనాని ప్రభృతులతో తాజా వివరాలను గూర్చి యోచించి నిద్రపోయాను.



# 21 శాంతి ఒడంబడిక

నేను ఉదయాన లేచేసరికి జనసమితి అధ్యక్షుని లేఖనుతెచ్చిన దూత నా కోసం వేచియున్నాడని చెప్పారు. నే నా జాబును గైకొని చదువుతున్నాను. యుద్ధంలో జయాన్ని సాధించినందుకు గణపతి నన్నభినందించాడు. మరల సర్వ సేనాపతి నియమింపబడువరకు ఆ బాధ్యతలను నిర్వహించు భారాన్ని వహించ వలసినదిగా నాకాదేశించాడు. వారి ఆజ్ఞానుసారం వెంటనే కార్యభారాన్ని వహించుతున్నానని జాబురాసి దూతకిచ్చి పంపివేశాను.

యుద్ధఖైదీలు తండోప తండాలుగా ఉల్కాచేలానికి పంపబడుతున్నారు. నేను వారి నెప్పటికప్పుడే దేశాంతర్భాగాలకు పంపించి వేస్తున్నాను. క్షతగాత్రుల చికిత్సా శుశ్రూషల యేర్పాట్లనుచూచి నా కత్యంతానందం కలిగింది. నా సంతోషాన్ని వెలిబుచ్చినప్పు డగ్నివేశు డిల్లా చెప్పాడు :

"మా ఏర్పాట్లు రోజు రోజుకు చక్కబడుతున్నై. నిరంతర కృషి యే పనిలో అయినా రాటు దేలుతుంది. ఒక్కసారిగా యింతమందికి చికిత్స చేసే అవకాశం యిదివరకెప్పుడూ నాకు లభ్యంకాలేదు. ఇంత పని వత్తిడిలో చిక్కు లెదుర్కొంటూ వచ్చినట్టే వాటి నివారణోపాయాలూ తోచుతూనే వున్నై. వివిధరకాల గాయముల వారిని వేర్వేరు స్థానాల్లో వుంచాం. ప్రమాదావస్థలో నున్న వారిని ప్రత్యేక మొకచోట వుంచాము. —"

నేను మధ్యలో అడ్డుపడి "సరే గాని, మరి మన యువతీదళాలు ఎలా పని చేస్తున్నై ?" అనడిగాను.

"లిచ్ఛవీయాణులేమి, లిచ్ఛవేతర కాంత లందేమి ఒక విచిత్రోత్సాహము రేకెత్తింది. వారు పురుషుల కేమాత్రం తీసిపోకుండా పనిచేస్తున్నారు; మరి నాయకి భామ విషయం చెప్పనక్కరయే లేదు. లిచ్ఛవులకు వారి సేనాపతి యాజ్ఞ యెట్లో అట్లే ఆమె యానతిని స్త్రీ లెల్లరు తుచ తప్పక పాలించుతున్నారు."

"ఆమె యాజ్ఞకు తిరుగులేదన్నమాట ?"

"నిస్సందేహంగా అంతే"

"భామ యెక్కడుంది ?"

"మొదట్లో కొన్నాళ్ళిక్కడే వుంది. ప్రస్తుతం నది కవతలివేపున మకాం పెట్టింది. అయితే అడపా దడపా యిక్కడికి వచ్చి చూచి వెడుతూనే వుంది. ఇవాళ తెల్లవారగట్టే వచ్చి రోగుల్ని చూచి వెళ్ళింది."

"ఈసారి వచ్చినప్పుడు నే నిక్కడే వుంటున్నానని చెప్పండి"

"అల్లాగే, సేనాపతీ! ఈ యుద్ధం మన వజ్జి ప్రజానీకంలో నూతన చైతన్యాన్ని కల్గించి జీవిత దృక్పథాన్నే మార్చివేసింది. వృద్ధులు కూడ స్త్రీ - పురుష వివక్షత లేకుండ దేశరక్షణ కేదో ఒకవిధంగా సహకరించడానికి వుద్యుక్తులవుతున్నారు. నేను మా ముసలావిడ మాణవికకూడ యిల్లా మారిపోతుందని ఎన్నడూ ఆశించలేదు సుమా. జీవితం పొడుగునా తన అరుపాణ్ణులతో నన్ను వేధించుకొని తిన్నదంటే నమ్ము."

"వేధించడమా?"

"మరి? అదీ అంతులేకుండా. ఆవిడ తొలిసారి చూలాలయి వుండగా నా ప్రాణం తీసినంత పనిచేసింది. తన పిల్లా డాడుకుంటానికి తిమ్మడిని తెమ్మంది."

"బ్రతికినదాన్నేనా?"

"కాదులే, కొయ్యబొమ్మని. కోతిబొమ్మ తెచ్చిచ్చానుగండా, మళ్లీదాన్ని పట్కెళ్లి లక్కరంగు వేయించుకు రమ్మన్నది. ఆ తర్వాత తన బుల్లాడికి బూర కావాలంది."

"మరి మీరా బొమ్మలన్నిటినీ తెచ్చివ్వలేదా?"

"తప్పుతుందా సేనాపతీ! మాణవిక పడుచుది. ఆమె కెక్కడ కోపం వస్తుందోనని గజగజలాడే వాణ్ణి. ఒక గది గదంతా బొమ్మలతో నిండిపోయింది పుట్టబోయే గుంటడికని."

"గదికి గదే!"

"ఆఁ, మరే మయిందనుకున్నారు? ఆడపిల్ల పుట్టేసింది."

"మరి మగపిల్లాడికోసం తెచ్చిన బొమ్మ లేమైనై?"

"మలి చూలుకు పుడతాడనే ఆశకొద్దీ దాచిపెట్టింది; కాని, ఆమె కైదుగురూ ఆడసంతానమే. మా యావిడసంగతి తెలియడాని కిదొక మచ్చుగా చెప్పాను. ఒళ్ళువంచి పనిచేయటమంటే ఆమెకి గిట్టదు. నేను కూడ దాస-దాసీ జనాన్ని, నౌకర్లని లోటు లేకుండానే వుంచాను; కాబట్టి కొంపలో ఎల్లాంటి వుపద్రవము లేకపోయింది. లేకపోతే మాణవిక నన్ను బ్రతకనిచ్చేదీ? అల్లాంటి మనిషి, మీయమ్మ మల్లికాదేవి గోచి బిగించి క్షతగాత్రులకు కట్లు కట్టుతూంటే, పక్కలు వేస్తూవుంటే, పాలు తాగించుతూంటే చూచి పూర్తిగా మారిపోయింది.

"మా అమ్మకూడ నడుంగట్టి పనిచేస్తోందా?"

"ఊఁ, మాణవిక కూడాను. వజ్జి స్త్రీలలో ఒక వింత పరివర్తనం వచ్చిందని చెప్పానుకదూ. క్షతగాత్రులిక్కడికి సంతతధారగావచ్చి పడుతూంటే అనుగులో అడుగేనుకుంటూ తిరిగి పనిచేస్తే చాలదు. మరి చర చర నడుస్తూ చకచక పనిచేయటానికి స్త్రీల కాళ్ళకు లంగా లడ్డుపడతాయని కాసికోకలు కడుతున్నారు."

"అమ్మ ఎక్కడుంది ఆచార్యా !"

"వచ్చేవేళ అయింది. మాణవిక, మల్లిక చిన్ననాటి చెలికత్తెలు సేనాపతీ! ఆమె బస మాణవికకు బాగా తెలిసుంటుంది."

"అయితే ఆచార్యా! అమ్మతోను, భామతోను నేను మళ్ళా మధ్యాహ్నం వస్తానని చెప్పండి."

"మరి మా కోడలికో ?"

"అల్లాగే చెప్పండి."

"మా యాబిడకి ఆమె అంటే బలే మక్కువ. స్నేహితురాలి కోడలు తనకూ కోడలే నంటుంది. భామ, గాంధారపడుచు యిక్కడికి రావడం అరుదే."

"కార్యభారంవల్ల కాబోలు.!"

"వారి శ్రమసంగతి ఏం చెప్పను? క్షతగాత్రులు అంతులేకుండా వుంటున్నారు. కొందరిని నది అవతలి శిబిరానికి పంపానేగాని, నేను పోయి చూచి రావటానికే తీరికలేకుండా వుంది. యుద్ధరంగం ఎంతమేర వుందోకూడా నాకు తెలియదు."

"రెండో నాటికే యుద్ధరంగం మూడు యోజనాల అవతలి కెళ్ళింది."

"అయితే అంతంత దూరాన్నుంచి దెబ్బతిన్న వారిని పరుగులు తీస్తూ జేర వేస్తూ వుండి వుండాలి."

"యుద్ధరంగంలో మాత్రమే యువతులు రోగులను మోయవలసి వస్తున్నది. ఇతరత్రా రథాలు, పడవలు ఏర్పాటుచేశాం. కాకపోయినా మనస్త్రీలు రాత్రిం బగళ్ళనే భేదంలేకుండా పని చేస్తున్నారు. మిట్టమధ్యాహ్నం నిప్పులు చెరిగే యెండనైనా లెక్కచేయటంలేదు. వారు బాణవర్షంలోకి దూకటానికిక్కూడ జంకటు లేదు. రణరంగంలో సంగ్రామమెంత తీవ్రంగా జరుగుతున్నా, దెబ్బతినిపడిపోయిన వారి నక్కడ ఏమాత్రం జాగుసేయకుండా తరలించుతున్నారు.

అదిగడే నేను చెప్పేది సేనాపతీ! గాయపడ్డ వారి నప్పటికప్పుడే నా వద్దకు తీసుకొస్తున్నారు. వెంటనే చికిత్స చేయటంవల్ల గాయాలు త్వరగామాని నయమవుతాయి కూడాను."

"సరే, నేను మధ్యాహ్నం వస్తానని అమ్మతో చెపుతారుకదూ ?"

"మాణవికతో కూడాను. ఆవిడ నిన్ను చూడాలని వుబలాటపడుతోంది."

ఆయనవద్ద సెలవుపుచ్చుకొని వెళ్ళిపోయాను. బింబిసారుని పట్టపుటేనుగు పైకి అటకమీద కెక్కినట్టు చులాకనగా యెక్కి తోలించిన యువయోధుడు మళ్ళీ జ్ఞాపకమొచ్చాడు. అతన్ని సమయోచిత ప్రవర్తనకు అభినందించలేక పోయినందుకు విచారం కలిగింది.

మధ్యాహ్నం భోజనాత్పూర్వమే నేను మరల అధినివేశుని చికిత్సా శిబిరానికి వెళ్ళాను. ఆచార్యుడు నన్ను వెంటనే రోగులను కనిపెట్టుకొనియున్న అమ్మ

దగ్గరకు తీసుకెళ్ళాడు. అమ్మ గుమ్మంవేపు వీపుపెట్టికూచుని వుండుటచే ముఖం కన్పించక నేనామెను గుర్తించలేకపోయాను. ఆమె లిచ్ఛవులపాగా, చొక్కాయి, ధోవతి ధరించివుంది. ఆచార్యుని పిలుపుతో వెనుదిరిగిన ఆమె దృష్టి నాపైన పడింది. చిప్పున లేచివచ్చి తాను నన్ను పసితనంలో లాలించినట్లే చేతుల్లోకి తీసుకొని నా లలాటాన్ని, కేశాలను, కన్బొమ్మలమీద ఒకే యిదిగా ముద్దు పెట్టుకున్నది.

"అమ్మా! నువ్వూ భామసేనలో చేరావా?" అనడిగాను.

అమ్మ-"భామ రోహిణుల సైన్యంలో నాయనా! ఆడపిల్లలు మొదట్లో లిచ్ఛవీయాణుల సైన్యాన్ని గురించి మాట్లాడుతుంటే నాకేమీ బోధపడలా; కాని, వాళ్లు కష్టపడి, పట్టుదలతో నేర్చుకుంటూండగా చూచి అది వుత్తుత్తి ఆట కాదని తెలుసుకున్నాను. మన యింటిల్లిపాది విచ్చుకత్తుల మధ్య తిరుగుతుంటే మరి నామాత్రం వెనకాలోచనేముంది?" అని చెపుతుండగా ఆమె యీడుదే మరొకామె - నేనెరిగినావిడలాగే వుంది - రావటంచూచి అమ్మ ఆవిడ చేయి పట్టుకొని అన్నది - "ఈమె నా స్నేహితురాలు సూర్య - మన ఆచార్యుని యిల్లాలురా అబ్బాయి!"

అగ్ని — "ఈవిడే మా యావిడ మాణవిక సేనాపతీ!"

ఆమె నా ఫాలంమీద ముద్దుపెట్టి "మరి ఏమండీ! మీరా తిమ్మడి కథ యీయన్తో ఏకరువు పెట్టారా?" అంది అగ్నివేశునితో.

అగ్నివేశుడు తడబడుతూ "భవతీ! కోపం సేయవద్దు. ఈయన మన సేనాపతి" అన్నాడు.

మాణవిక — "సేనాపతా! అయినా పరాయివాడు కాదుగా. నా బాల్య సఖి మల్లిక కొడుకు నాకూ బిడ్డే. ఏం కుమారా — సేనాపతీ?"

నేను — "నన్నలా పిలవొద్దమ్మా! మీ బిడ్డను పిలిచినట్లే పిలవండి. బాల్యంలో నేను మీ ఒళ్ళో ఆడుకున్నవాడినేగా."

మాణ — "మరే నబ్బాయ్! నీకు పాలుకూడ యిచ్చాను. ఏం మల్లికా?"

అమ్మ — "అవునంతే. మన మప్పుడు ఉమాసింహుల్లో భేదం చూసే వాళ్లం కాదు."

మాణ — "కాని, సింహు డెంత మారిపోయాడు! వైశాలిలో దూరాన్నుంచి చూచాను. పేరు చెప్పినా మొహం చూచి నమ్మలేక పోయాను."

అమ్మ — "సఖీ! అబ్బాయికి పన్నెండేళ్లు వచ్చిం తర్వాత మళ్ళీ నువ్వు చూచిందెక్కడలే. నువ్వు ఆచార్యునితో కాశీవెళ్ళిపోయావయ్యె."

మాణ — "నిజమే, మా బ్రాహ్మ డప్పుడు వైశాలి వదిలి యే రాజధానికైనా వెళ్ళిపోతే పశుచ నౌకరుకుమల్లే తన్ను ఆదరించుతారని ఆశపడ్డాడు. కాశీలో మర్యాదగానే జరిగింది. కాని, నా కది పరాయిదేశం లాగానే వుంది."

అగ్ని—"సేనాపతీ! మాణవిక నా మెడకు వురిలా తగులుకుంది."

నేను—"ఇంతకూ ఆమె తప్పేమీచెయ్యలేదుగా ఆచార్యా ?"

అగ్ని—"తప్పుచేయలేదులే. జన్మస్థానమంటే ప్రేమ యెవరికుండదు ?"

నేను — "ఆచార్యా! మా పిన్ని శుక్లమ్మ కూడ మీ చికిత్సాశాఖలో చేరిందని విన్నానే."

అగ్ని — "అవును సేనాపతీ! తొలినాడే ఆమె భామతో గంగ అవతలికి వెళ్లింది."

నేను — "మరి భామ కబురేమీ రాలేదా ?"

అగ్ని — "లేదు! ఈ పూట క్షతగాత్రులు రావటంకూడ తక్కువే."

నేను — "ఇక రారు ఆచార్యా!"

అమ్మ — "ఎందుకని నాయనా!"

నేను — "శత్రువులు పూర్తిగా ఓడిపోయారమ్మా! నిన్నటినుంచి చెల్లాచెదరయిన శత్రువుల్ని మన సేనలు వెంటబడి తరిమి పట్టుకుంటున్నై."

అగ్ని — "పాపం! సేనాపతి సుమన్ మన విజయాన్ని కళ్ళార చూళ్ళేక పోయాడు."

నేను - "ఆయన చూచాడు ఆచార్యా! ఆ శుభవార్త వైశాలిలో చెప్పటానికే ఆయన ఆత్రపడ్డాడు. అదే ఆయన మరణ హేతువయింది. విజయోత్సవానికి సర్వసేనాపతి లేకపోవడంకంటె విచారం అతని సైనికుల కింకేముంటుంది?"

చికిత్సా శిబిరాన్ని చూచిన తర్వాత నేను ఆయుధాగారాన్ని సందర్శించటానికి వెళ్ళాను. అందులో మగధ సైన్యాలవద్ద లాక్కొన్న శస్త్రాస్త్రాలన్నీ కూడ పెట్టబడుతున్నై. ఉపనాయకుడు దోనెల వంతెనలను నిర్మించిన నాటినుంచీ దిఘవరా నుంచి దిఘవగంగ వరకుగల నావికాదళ నాయకుడైన శంతనుడు అప్పుడాయుధాగారమందే యున్నాడు. అతని నౌకాదళం శత్రువులనుండి గుంజుకున్న సామగ్రిని జేరవేయుటలో నిమగ్నమై వుంది. మేము పరస్పరం చూచుకోగానే కౌగలించుకున్నాం. జయాన్ని సాధించినందుకతడు నన్నభినందించాడు. విజయ సాధనలో తక్షశిల మిత్రులదే ప్రధాన పాత్రయని నేను కృతజ్ఞతా సూచకంగా అన్నాను.

"తక్షశిల తన సోదరి వైశాలి రక్షణ కే మాత్రం సేవచేసే అవకాశం లభించినందుకు నాకు సంతోషంగా వుంది" అన్నాడు శంతన్.

"మీ సేవసామాన్యమా. మీసహాయం మాకు చిరస్మరణీయంగా వుంటుంది. మీరుగావించిన పరివర్తనంవల్లనే నౌకాదళం తొలిదెబ్బతోనే శత్రువుల స్థైర్యాన్ని దిగజార్చింది. మళ్ళీ వాళ్ళు కాళ్లు నిలద్రొక్కుకోలేక పోయారు. ప్రస్తుతం నది కవతలి రంగంలో కపిల్ ఒక్కడే బాధ్యత వహించి యుద్ధాన్ని నిర్వహించుతున్నాడు. ఇప్పుడిక మగధరాజు నోట ఓటమి నంగీకరింపజేయు టొక్కటే మిగిలివుంది" నే నన్నాను.

నా బసకు చేరి మళ్ళీ యుద్ధవార్తల నందుకొని, సైనిక దళాలకు ఆదేశాలిచ్చుటలో నిమగ్నుడనైనాను. శత్రువులు యుద్ధవిరమం కోరుతున్నట్టు కొంచెం ప్రొద్దుండగా కపిల్ వద్దనుంచి జాబు వచ్చింది. శత్రువులను తరుముట వెంటనే చాలించండనీ, కర్తవ్యాన్నిగూర్చి మర్నాడు కబురు పంపుతాననీ జవాబు పంపాను. అప్పటికప్పుడే నేను గుర్రంమీద వైశాలికి బయల్దేరాను. దారిలో అలసిన గుర్రాన్ని మార్చి సూర్యాస్తమయం అయిన కాస్సేపటికి వైశాలికి చేరుకున్నాను. కొన్ని మాసముల అనంతరం మళ్లీ నేను గణపతిని కలుసుకున్నాను. ఆయన అత్యంతానందంతో దర్శనమిచ్చి అతిపుత్సాహంగా మాట్లాడి, నన్ను పదేపదే అభినందించాడు. నే నాయనకు కపిల్ పంపిన వర్తమానం తెలియజేశాను. తక్షణమే మంత్రివర్గ సమావేశం పిలువబడింది.

యుద్ధం విరమించాలా వద్దా ? విరమించితే ఏ షరతులమీద అన్నదే మా ముందున్న సమస్య.

మహానామమంత్రి తన అభిప్రాయాన్నిల్లా చెప్పాడు —

"మగధరాజు మనమీద అనేకసార్లు దురాక్రమణ చేశాడు. వారితో మన మిదివరకు చేసుకున్న సంధుల్లో ఏవీ స్థిరంగా పాటింపబడలేదు. ప్రతి పర్యాయము ఒడంబడిక కంగీకరించి మగధ మళ్ళీ మనపైకి దండెత్తి వచ్చేందుకే మన మవకాశ మిచ్చాము; కాబట్టి ఈసారి అల్లాకాకుండా మన మీ తగాయిదాను పూర్తిగా రూపుమాపాలి."

"అంటే మగధరాజ్యాన్ని తుడిచిపెట్టాలనేగా ?" గణపతి ప్రశ్నించాడు.

"ఆఁ అంతే."

"మగధ, పాతా, దక్షిణోత్తర అంగరాజ్యాలన్నిటినీ వజ్జిలో కలిపేసుకోవాలనే !"

"అందులో తప్పేముంది ?"

"అట్లయితే మన యీ ప్రభుత్వ మప్పుడు పంచాయితీ ప్రభుత్వమవుతుందా, లేక రాజాధిపత్య మవుతుందా ?" అనడిగాడు గణపతి.

"పంచాయతీ పాలనే సాగుతుంది. ఇప్పుడున్నట్లే." మహానామాత్యుడు చెప్పాడు.

"గణపతి యీ పంచాయతీ ప్రభుత్వ రూపమిచ్చింది వజ్జిలోనున్న అధిక సంఖ్యాకులగు లిచ్ఛవులు. మరి మగధ, అంగరాజ్యాలలో లిచ్ఛవులు లేరే ?"

"అయితే ఏఁ?, మనమిప్పుడు వజ్జిలోని లిచ్ఛవేతరులను పాలించినట్లే అక్కడివారినికూడ శాసించుదాము."

"ఈ విషయంలో వుత్తరా పథమందలి తక్షశిలాది పంచాయతీల పంచ యానుభవమున్న మన తాత్కాలిక సేనాపతి తన అభిప్రాయం చెప్పాలి" అని పంచాయతీ అధ్యక్షుడు నా వంకచూచాడు.

నేను లేచి నా అభిప్రాయాన్నిలా విశదీకరించాను—"పూజ్య అధ్యక్షా! నేను కేవల మొక సైనికుడను. రాజనీతి- ముఖ్యంగా ప్రజాతంత్ర రాజనీతినిగూర్చి నేను వెలిబుచ్చే అభిప్రాయాలను ఏ రాజకీయ నేత సలహాగా నో కాక, ఒకసామాన్య సైనికుని యోచనగా మాత్రమే స్వీకరింతురు గాక! ఉత్తరా పథంలో గాంధారం వంటి పంచాయతీ పాలనలో బానిస విధానమే లేదు. అక్కడ రంగుభేదం కూడా లేదు. అందరూ ఆర్యులు. ఏకొద్ది పరివారాలనో మినహాయించితే అంతా గాంధారులే. అందుచేతనే ఆ పంచాయతీ పరిశుద్ధంగా వుంటుంది. గాంధారులలోని భాతృభావం ఇక్కడ కానరాదు. గాంధార (తక్షశిల) పంచాయతీ నిర్మాణ విధానం మన కాదర్శనీయమని నా వుద్దేశ్యం. మన దేశంలో బానిస విధానం వుంది. అనార్య ప్రజావున్నారు. అన్యప్రాంతాలనుండి లిచ్ఛవేతరు లనేకమంది యిక్కడికి వస్తూంటారు. మన పాలన లిచ్ఛవేతరులపట్ల నిష్ఠురంగా లేకపోయినా పైకారణాలవల్ల పంచాయతీ పాలనలాగా లేదు. మన శాసన చక్రాన్ని గుప్పిట్లో పెట్టుకోగల సాధనమేదీ లిచ్ఛవేతరుల చేతిలో లేదు. వజ్జిదేశంలోని లిచ్ఛవేతరు లీ విధంగావున్నా, మనం ఆదర్శప్రాయమగు పంపాలన సాగించడానికి శక్యం కాకుండావుంది. అసలు లిచ్ఛవీ పరివారాల్లోనే కొన్ని మహా భాగ్యవంతములు, మరికొన్ని నిరుపేద కుటుంబాలుగా వున్నై. ప్రజ లెప్పుడూ, తమ సంపద్భాగ్యాల కనుగుణ్యమైన శాసన నిర్మాణానికై ప్రయత్నించుతారు. దాని పర్యవసానంగానే దరిద్రులగు లిచ్ఛవులు శ్రీమంతులగు స్వజాతీయులపట్ల నిష్కపటంగా ప్రవర్తించుతున్నారు.

"ఒక్క వజ్జి దేశంలోనే యిల్లాంటి పరిస్థితులుండగా, మనమిక అంగ, మగధాది లిచ్ఛవేతర రాజ్యాలనుకూడ కలుపుకుంటే, దాని ఫలితం మన ప్రస్తుత పంచాయతీ విధానంమీద మరోలాగా ప్రతిబింబించకమానదు. మన మా నూతనంగా కలిసిన ప్రాంతాలకు యెవరో ఒకరిని రాజుగా కాకపోయినా, అధికారిగా పంపక తప్పదు; అయితే ఆ పంపబడిన వ్యక్తి తన యిష్టంవచ్చినట్టు చలాయించకుండా అరికట్టడాని కక్కడ లిచ్ఛవీ పంచాయతీ వుండదు. అదీగాక మనం ఒకే లిచ్ఛవీ అధికారి నక్కడ ఎక్కువకాలం అధికారంలో వుంచామా మరో మగధ రాజును సృష్టించుతున్నట్టే భావించాలి. అతడు ధనాన్ని కూడబెట్టుకోవడంతో పాటు స్వాధికారాన్ని స్థాపించుకుంటాడు. తరువాత ఒకప్పు డతనిని తొలగించాలంటే అది వాని కయిష్టమవుతుంది. ఆ విధంగా ముందే బూతుగాటకు పునాది పడుతుంది."

"మన మే ఒకణ్ణి ఎక్కువ కాలముంచకుండా ముందే మూడు సంవత్సరాల పరిమితి నేర్పరచి పంపితేసరి" అని మహానాము డన్నాడు.

"మూడేళ్లయినా అధికమే, తెలివిగలవాడా మూడేండ్లలోనే పునాది వేసుకోగలడు. అంగ, మగధ రాజకుటుంబాలవారినీ, వారి పుత్రులనూ ఆధారం

చేసికొని, ప్రవాస లిచ్ఛవులలో చీలికలు పెట్టి విద్రోహానికి పూనుకోవచ్చును" అని చెప్పాను.

"ఏమేటూ మన ప్రతినిధిని మార్చుతూంటేనో ?"

"అట్లయితే పై ప్రమాదం వుండదు; గాని, అతడా కొద్దికాలంలో అక్కడి రీతి — రివాజులు, రాజకీయాది పరిస్థితులు అవగాహనచేసుకొనలేడుగాన పరిపాలన సవ్యంగా సాగించలేడు."

"సేనాపతీ! దీన్నిబట్టి అంగ, మగధ రాజ్యాలను కలుపుకున్నందువల్ల అసలు మన పంచాయితీ పాలనా విధానానికే ముప్పువాటిల్ల గలదనియా మీ వుద్దేశ్యం ?"

"అవునంతే. పడమటి పంచాయతీలను వుదాహరణగా తీసుకుంటే మన మావిషయాన్ని స్పష్టంగా గ్రహించగలం."

"మరి కొన్నేండ్లకొకసారి మాటిమాటికి మగధతో మనం యుద్ధంచేయ వలసివస్తోందిగదా. మనమా వుపద్రవాన్నుంచి తప్పించుకొనే వుపాయమేమిటి?"

"అదేకాదు, దానికి మించిన ప్రమాదంకూడావుంది. ఇంతవరకు మనం జయించుతూవచ్చిన మాట నిజమే; కాని, మగధ నిరంకుశప్రభుత్వమునికే ప్రమాదం సంభవించలేదు. వాళ్ళేగనుక ఒక్కసారి జయించడం తటస్థించితే యిక వాళ్ళు మన ప్రజాతంత్రరాజ్యాన్ని శాశ్వతంగా తలెత్తకుండా రూపుమాపుతారు. పంచాయతీ పాలనలో అధికారంలేని లిచ్ఛవేతరులనేకమంది మన రాజ్యంలో వున్నారు. అందరినీ సమభావంతో చూస్తామన్నసాకుతో లిచ్ఛవుల, లిచ్ఛవేతరుల హక్కుల్ని సమానంచేస్తారు. అంతే ఉభయులను సమానంగా పరాధీనులను గావించుతారు."

"మీరు నుడివినది సత్యమే సేనాపతీ! ప్రతిసారీ మన విజయంతో వారిశక్తి కొద్ది కొద్దిగా క్షీణించుతున్నదే గాని, ఒక్క పర్యాయం వారు జయిస్తే మన పంచాయతీ విధానమే సమూలంగా అంతరించి పోతుంది. అటువంటి వినాశ కార కులకు శత్రువులవునికి నష్టే వదలివేయుట వివేకం గల పనేనా ?"

"నే నా విషయంలో మీతో ఏకీభవించుతాను; కాని, యిక్కడొక విషయం గమనించాలి. బింబిసారుని తొలగించి మరో బింబిసారుడు తయారవడం మరీ ప్రమాదం. బింబిసారుడు బింబిసారుడే, కాని, లిచ్ఛవీ బింబిసారుడు అంగ, మగధరాజ్యాలకు ప్రభువై, స్వజాతీయుడగుటచే మనలో చీలికలు పెట్టేసమర్థుడు కూడ కాగలడు. పరాయిజాతికి చెందిన బింబిసారునితో పోరాడటానికి ఒకే కట్టగా నిలబడిన లిచ్ఛవులందరూ లిచ్ఛవీబింబిసారునితో యుద్ధం చేయడానికి ఏకంగా వుండలేరు. అల్లాంటప్పుడు లిచ్ఛవీ పంచాయతీ రాజ్యానికే వాటిల్లేముప్పు సామాన్యంగా వుండదు. శత్రువును నాశనం చేయాల్సిందే; అయితే శత్రువును

శాశ్వతంగా నాశనం చేసేందుకు మన - అంటే లిచ్ఛవీల - ఐక్యతనే కోల్పో యేందుకు సిద్ధంగా వున్నామా అనేదే మనల నిప్పుడెదుర్కొన్న సమస్య."

"పాలుతాగే పసిబిడ్డకూడా అందు కంగీకరించదు. లిచ్ఛవీరక్త మున్నవా డెవడూ మన విచ్ఛిత్తి కొప్పుకోడనే నా వుద్దేశ్యం."

"అటువంటప్పుడు మన ఐక్యతకు భంగంలేనిరీతిని శత్రువునికిని రూపుమాపే దెట్లా అనే ప్రశ్న వస్తుంది."

"అవును, దీని కేదో తరుణోపాయాన్ని మన మాలోచించాలి సేనాపతీ! ఇందుకు మీ కేదే నుపాయం తోచుతోందా?" మహానాము డడిగాడు.

"ఈ విషయం నా కయోమయంగా వుంది. పూజ్యమహానామామాత్యా! శత్రువును శాశ్వతంగా నాశనం చేయాలన్నదే మీ వుద్దేశ్యమైతే అందుకొకమార్గం ఉంది. కొంతవర కది వుపకరించవచ్చు. అయితే దాన్ననుసరించడానికి కూడ కొన్ని సందేహాలు కలుగకపోవు."

"ఏమి టా మార్గం సేనాపతీ?" అని గణపతి ప్రశ్నించాడు.

నేను "అంగ, మగధప్రజలకు సర్వస్వాతంత్ర్యా న్నిచ్చివేయడమే" నని చెప్పాను.

"బింబిసారుని సైన్యాన్ని ఓడించి ఆ పనిని సులువుగానే చేయగలం" అని మహానాము డనేశాడు.

" అంగ, మగధ ప్రజలు స్వాతంత్ర్యాన్ని పొందడానికి ఒప్పుకుంటారా?" నే నడిగాను.

" స్వాతంత్ర్యం యిస్తూంటే వద్దనేవారెవరు?"

" మీ పరివారంలో చిరకాలంనుంచీ తలదాచుకుంటున్న మీ ప్రియ దానిస నొకడిని విముక్తునిచేసి చూస్తే తెలుస్తుంది. "

" వాడు స్వతంత్రుడవడానికి యిష్టపడడనేనా మీ అభిప్రాయం?"

" అవును, స్వాతంత్ర్యం అనేక సాధక-బాధకాలతో కూడి వుంటుంది. దానికింతో జవాబుదారీ వహించాలి. అది స్వార్థత్యాగాన్ని - ఇచ్ఛాపూర్వక ప్రాణత్యాగాన్ని కూడా కోరుతుంది. మరి చిరకాలంనుంచీ దాస్యంలోవున్న దానిసలు ఆ లక్షణాలను యేనాడో పోగొట్టుకున్నారాయె."

"అంటే ఒకసారి పరాధీనులైనవారు శాశ్వతంగా దానిసలుగానే వుండ గోరుతారంటారా?"

"దానిసభావం వారిలో దీర్ఘించి వుంటుందనే నాభావం. ప్రజలకు స్వాతంత్ర్య ప్రదానం చేయడమంటే వారి ప్రజాస్వామ్యాన్ని స్థాపించడమే; మగధ, అంగ పంచాయతీలను స్థాపనచేయాలన్నమాట."

"పాంచాలంలోవలె మనంకూడ తూర్పున పంచాయతీరాజ్యాల సంఖ్యను వృద్ధిచేయడం మంచిదికాదూ?"

"అప్పుడైనా యుద్ధాలురావని చెప్పలేము. కాని, మన ప్రజాస్వామ్య విధానానికి ముప్పుండదు. ప్రజాతంత్రానికి ప్రబల శత్రువు రాజతంత్రం మాత్రమే."

"బాగా చెప్పావు!"

"బాగాచెప్పాను. ఇంకా బాగా చెప్పగలం కూడాను. దాని నాచరణలో పెట్టడంలోనే వుంది. చేయడంకంటె చెప్పడం మహాసులువు."

"అంగ, మగధలకు వాటి స్వాతంత్ర్యాన్ని అప్పజెప్పలేమా ?"

"అక్కడి రాజులకు ఆ స్వాతంత్ర్య ప్రదానం చేయడం అతిసులభమే."

"కాదు, ప్రజానీకానికి స్వాతంత్ర్య మీయడమే మన ఆశయం"

"అంటే అంగ, మగధ పంచాయతీ రాజ్యాలను స్థాపించాలన్నమాట."

"ఆఁ, అంతే."

"అది మన లిచ్ఛవులవంటి ఏకరక్త సంజనితమై, పరిశుద్ధ ఆర్యజాతికి చెంది, శుక్లవర్ణం కలిగిన అంగ, మగధ జాతులుంటేనే సాధ్యమవుతుంది."

"అక్కడ అలాంటి శుద్ధమైన జాతులే లేవా ?"

"మగధలో క్షత్రియ, బ్రాహ్మణ, వైశ్య, శూద్రజాతులన్నీ వున్నై. అవి మన లిచ్ఛవీ జాతిలాగా ఏకజాతికాదు"

"వారిలో శుక్లవర్ణంగల ఆర్యులెల్లరిని యేకంజేసి మగధ పంచాయతీ నేల స్థాపించకూడదు?" అనడిగాడు మహానామమంత్రి.

"కాని, మనం బ్రాహ్మణుల్ని అందు కొప్పించలేము. వారు యజ్ఞ—యాగాదులు, పూజా—పునస్కారాలు మాత్రమే తమ పనులనీ, రాజ్యపాలనా విధి క్షత్రియులదనీ నమ్ముతున్నారు."

"పంచాయతీ స్వాతంత్ర్యము, పాలనాధికారము లభ్యమవుతూంటే వారు తమ పౌరోహిత్యాన్ని వదిలేయడానికి సిద్ధంకాకపోరు."

"మూడు వేదాల్లోని మంత్రాలూ మాసిపోయి, మరి యామంత్రాలను వల్లించే బాలుడొక్కడుకూడ లేకుండడం జరిగితేనే వారు మీ రన్నట్టు తయారవుతారు."

"కారణం ?"

"కారణమా ? మూడువేదాల రచయితలు అష్టక, వామక, వామదేవ, జమదగ్ని, భృగు, వశిష్ఠ, అంగిర, విశ్వామిత్ర, భరద్వాజాదులే బ్రాహ్మణ, క్షత్రియ భేదభావాన్ని సృష్టించడంలో ప్రముఖపాత్ర వహించారు. పడమటి దేశాల్లోని ఆర్యులు వేదాలను సృష్టించలేదు కాబట్టే అక్కడ ప్రత్యేకంగా బ్రాహ్మణులనేవారెవరూ వుండరు. చేతివచ్చిన బ్రాహ్మలెక్కడైనా కనిపించితే కనపడవచ్చు. కురు - పాంచాలంలో అష్టక, వామదేవాదులులేరు. వేదాలున్నదీ తూర్పునందే. కాబట్టి బ్రాహ్మణ క్షత్రియ భేదభావం తీవ్రరూపం దాల్చిందికూడ యిక్కడే."

"మనం వున్నదికూడా తూర్పువనం దేకదా, మరి మనలో ఆ భేదం కానరాదే?" అన్నాడు మహానామమంత్రి.

"ఉత్తరాపథంలోని గణజాతుల్ని చూచినమీదట ఆర్యులు — శుక్లవర్ణం కల మూలపురుషు లేవిధమైన బ్రాహ్మణ, క్షత్రియ భేదాన్ని పాటించియుండలేదనే నిశ్చయానికి వచ్చాను. గాంధార, కాంభోజ, వుత్తరమద్రదేశాల్లో నేటికీ అల్లాగే వుంది. బయటినుంచి వచ్చిన విజాయితీయుల్ని మినహాయించితే మన లిచ్ఛవీజాతి కూడ అంతే. సైనిక శిక్షణపొందుటలోను, పంచాయితీ పాలనాధికారంలోను అందరము సమానాధికారం కల్గియున్నకారణంగా బయటి రాజ్యాలవారు మనల్ని లిచ్ఛవీ క్షత్రియులని వాడుతున్నారు. మనల్ని క్షత్రియులనేవారి దృష్టిలో బ్రాహ్మణవర్ణంకూడ వుండివుంటుంది. అంటే బ్రాహ్మణులు పురోహితజాతియనీ, అగ్రజాతివారనీ, క్షత్రియులు వారికంటె హీనజాతికి చెందిన పాలకజాతివారనీ, రోాధజాతీయులనీ వారి వుద్దేశ్యం. వారి యీ భావంతో మీరేకీభవింపుతారా?" అని సేనడిగాను.

"ఎంతమాత్రం అంగీకరించం. బ్రాహ్మల్ని మనతో సమానంగా ఎంచము. రక్తశుద్ధి, స్వచ్ఛవర్ణముల విషయంలో మనకంటె బ్రాహ్మల్ని హీనంగానే తలుస్తాము. అందువల్లనే బ్రాహ్మణ స్త్రీ సంపర్కంతో లిచ్ఛవీ పురుషుడు కనిన సంతానానికిగాని, బ్రాహ్మణుని పొందుచే లిచ్ఛవీ స్త్రీ కన్న బిడ్డలకుగాని మనతో సమాన హోదా యివ్వం. అలాంటి వారికి లిచ్ఛవీ అభిషేకార్హతలేదు. మరి బ్రాహ్మలు లిచ్ఛవీ కన్యవల్ల కనిన సంతానాన్ని తమలో కలిపేసుకుంటున్నారు. వారికి యజ్ఞ - భోజనాదులపట్ల సమాన హక్కులిస్తున్నారు. తమ కన్యకు లిచ్ఛవీ పురుష సంయోగంచే కలిగిన పుత్రునికి పితామహుని గోత్రమిచ్చి తమ వంశంలో కలుపుకుంటున్నారు."

"దీని అర్థమేమిటి? బయటి బ్రాహ్మణులు వగైరాలు మనలనే దృక్పథంతో క్షత్రియులన్ని వాడుతున్నారో అట్టి క్షత్రియులం కామనే తేలుతోంది. కురు - పాంచాల మండలి ఆర్యులలో బ్రాహ్మణ, క్షత్రియ భేదం యేర్పడింది; కాని, పంచాయతీలలోని మనజాతులా విభేదాలకు తావీయలేదు. ఆ కారణాన అవి స్వచ్ఛమైన పురాత నార్యజాతులుగానే వుండిపోయాయి. వారు కురు-పాంచాలంలోవలె రాజతంత్రాలను స్థాపించక, ప్రాచీనార్య సాంప్రదాయానుసారం పంచాయితీ పాలననే అమల్లోవుంచారు. భావిలో లిచ్ఛవులు బ్రాహ్మణులా, క్షత్రియులా అన్న వివాదం లేవవచ్చు. ఇతరులు పిలిచినట్లు మనమూ క్షత్రియులమే ననుకుంటున్నాం; అయితే పాలనాధికారులుగానే కాని, బ్రాహ్మణులకంటె హీన వర్ణమనే భావంతో మాత్రం కాదు. నిజానికి మన మింతవరకు బ్రాహ్మణులు సృష్టించిన చాతుర్వర్ణాలలో మనం కలవలేదు. నే నిదంతా చెప్పుకొచ్చింది పంచాయతీ నిర్మాణానికి అవసరమైన ఏకజాతి - ఒకే ఆచారం అంగ, మగధ

దేశాల్లో లేవని వివరించడానికే. అక్కడి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు లిచ్ఛవులవలె ఏకవర్గానికి చెందినవారు కారు."

"అయితే వారిలో క్షత్రియులనే నాయకజాతిగా ఎందుకు పరిగణించ రాదు?" అనడిగాడు మహానాముడు.

నేనందుకిల్లా చెప్పాను—"క్షత్రియులకు-మగధక్షత్రియులకు పంచాయతీ సాంప్రదాయమంటే ఏమిటో తెలియదు. వారే సామంతునో తమనాయకుడుగా ఎంచుకుంటారు. అట్టివారు ప్రజాతంత్ర విధానాన్ని ఎలా చేపట్టగలరు?"

అంతట గణపతి యిల్లా చెప్పాడు — "అవును సేనాపతీ! బింబిసారుని రాజవంశాన్ని నిర్మూలించి మగధ శాసన చక్రాన్ని ఏ క్షత్రియజాతికో కట్టబెట్టినంత మాత్రాన ప్రజాతంత్ర ప్రభుత్వ మేర్పడదని నేనుకూడ అభిప్రాయపడుతున్నాను. మగధలో వారు క్షత్రియులని వ్యవహరించ బడుతున్నంత మాత్రాన నేడు లిచ్ఛవు లనుభవించుతూన్న పంచాయతీ స్వాతంత్ర్యాన్ని వారొకప్పుడనుభవించివుంటారనుకోటానికి వీల్లేదు. వారు రాజాజ్ఞను తు. చ. తప్పక నిర్వర్తించడానికి నియమింపబడిన యోధులుమాత్రమే. మరో సంగతి: మగధలోని వివిధజాతీయులు దాస్యాన్ని, పారతంత్ర్యాన్ని సమానంగా అనుభవించగలరేగాని, పంచాయతీ స్వాతంత్ర్యాన్ని సమభాగులై అనుభవించేందుకు సమ్మతించరు. కాబట్టి భిన్న భిన్న వర్ణములవారి నేకంచేసి అంగ, మగధ పంచాయతీలను నిర్మాణం చేయడం సంభవంకాదు. ఇక నక్కడి వర్ణ సాంకర్యాన్ని దృష్టిలో పెట్టుకుంటే పంచాయతీ స్థాపననే తలపెట్టరాదు."

"అక్కడ లిచ్ఛవీ పంచాయతీ ప్రభుత్వస్థాపన మన ఐక్యతకు మహాప్రమాదకరమనీ, కాబట్టి అది మన ప్రజాస్వామ్య విధానానికూడ అరిష్టదాయకమనీ నేను ముందేచెప్పా"నన్నాను.

మిగతా మంత్రులుకూడ తమ తమ అభిప్రాయాలను ప్రకటించారు. వారందరూ మొత్తంమీద నాతో ఏకీభవించారు. మహానామామాత్యుడుమాత్రం మరొకసారి కనీసం బింబసారుని వంశాన్ని తుదముట్టించాలని చెప్పాడు.

మళ్లీ నేనన్నాను—"పూజ్య మహానామా! మీరిప్పుడు లేవదీసిన సమస్య నాకు-అంటే సైనిక సంబంధమైనది. నే నా విషయంతో సాధికారంగా మాట్లాడగలను. కాని, నే నా విషయమెత్తే ముందు యింకొకటి చెప్పదలిచాను. మానవదేహానికి వలెనే రాజవంశానికి కూడ యౌవన, వృద్ధాప్యాలుంటాయి. యౌవనము ప్రమాద భూయిష్టం. వృద్ధాప్యం అంతచేటైనది కాదు. బింబిసారుని రాజవంశానికిప్పుడు యౌవనదశ అంతరించింది. రాజవంశమేదీ మూడు నాలుగు తరాలకు మించి యౌవనదశలో వుండదు. తర్వాత దానికి ముదిమి ముంచుకొస్తుంది. ఆ స్థితిలోనే దాన్నణగద్రొక్కి స్థాన మాక్రమించిన మరో రాజవంశానికి యౌవనదశ

ప్రాప్తించుతుంది. మన మిప్పుడు మగధను మన చేతుల్లోనే నవయౌవనంలోవున్న ఏ రాజవంశానికో కట్టబెట్టుదామా ?"

"ఇది గట్టిగా ఆలోచించాల్సిన సంగతే. మనం తోడేలు బారినుండి తప్పుకొని సింహంగుహలో చొరబడటానికి ప్రయత్నించకూడదు" అన్నాడు గణపతి.

"ఆలోచించిచూడగా నా కింకొకవిషయం కూడ తోస్తోంది. మగధ రాజవంశాన్ని ఓడించటము, నిర్మూలించటము ఒకే పనికాదు. ఓడించేపనిని మన మిప్పటికే ముగించాము. ఇక నాశనంచేయుడ మనేది చాలాదూరం పోతుంది. మన సేనలు గంగకి, రాజగృహానికి మధ్యనున్న మేరలో సగానికి మించి ముందు కెళ్ళాయి. నలందా అవతల దృఢమైన రక్షణశ్రేణులు నిర్మించినట్లు తెలియ వచ్చింది. మన మా రక్షణశ్రేణులను ఛేదించగలమనే నా విశ్వాసం; కాని, అందునిమిత్తం వేలాది లిచ్ఛవీ యువకుల్ని బలి యీయవలసివస్తుంది. మాసాల తరబడి మన మితరపనులను కట్టిపెట్టి యావచ్ఛక్తినీ యుద్ధకార్యాలకే వినియోగించాలి. ఇందుకు లిచ్ఛవీ పురుషులే కాక ఏ లిచ్ఛవీ కాంతకూడ వెనుకంజ వేయదనే నా వుద్దేశ్యం."

"అందుకు లిచ్ఛవీ యోధుల ప్రస్తుతకృషియే తార్కాణం" అన్నాడు సుప్రియుడు.

"మరి అంత త్యాగంచేసి రాజగృహాన్ని పట్టుకోవలసిందేనా ?" అని మంత్రివర్గాన్ని ప్రశ్నించాను.

పెక్కుమందిమంత్రు లొక్కసారిగా, "రాజగృహంలోని కోటను గురించేనా మీ రనేది ?" అనడిగారు.

."అవును, రాజగృహంలోని కోటను వశపర్చుకోనంతవరకు బింబిసారుని వంశాన్ని తుదముట్టించలేము."

గణపతి అడిగాడు- "సేనాపతీ ! జంబూద్వీప మంతటా ప్రసిద్ధి చెందిన రాజగృహంలోని దుర్భేద్యమగు కోటను నవ్వు చూచావా ?"

"నేను జూళ్ళేదుగాని, సైనికదృష్ట్యా దానికిగల ప్రత్యేకతనుగూర్చి చాలా విన్నాను." అని చెప్పాను.

"నలందా తరువాతి రక్షణశ్రేణిని ఛేదించడానికే నెలల పర్యంతం తంటాలు పడవలసివస్తే మరి రాజ్యగృహ దుర్గ విజయానికి సంవత్సరాలు పట్టుతాయా సేనాపతీ ?" గణపతి మళ్లీ ప్రశ్న వేశాడు.

"నా వుద్దేశ్యం అంతే పూజ్యగణపతీ ! దక్షిణం వైపున ఒక చిన్నవీధిని మినహాయించితే రాజగృహం నలుగడల వైభార, విపుల, పాండవాది పంచ పర్వతాలతో ఆవరింపబడివుంది. ఆ పర్వతాలమీద చాలా పెద్దవైన శిలాప్రాకారాలు, యిరుకు సందులు కొక వేపునుంచి రెండో కొసవరకు నిర్మింపబడి వున్నై. ఆ ప్రాకారాలలో అక్కడక్కడ రక్షకభటులు వుంటారు. అక్కడ ఒక్కొక్క

మగధ సైనికుని పడమార్చటానికి ఎందరెందరో లిచ్ఛవులు ఆహుతి కావాలి. ఇక నా పర్వతాల చుట్టూ కమ్ముకోడానికి ఎంత సేనా చాలదు; చాలినా బింబిసారుడు ఏండ్లతరబడి రాజగృహంలోనే వుండగలడు. ఆ గిరిదుర్గంలో సుమాగధి యను విశాల సరోవరం వున్నది. అందలి నీటితో వేలకొలది ఎకరాలభూమి సాగయి, పంటలు పండుతున్నై. ఆ కారణంచే మనం రాజగృహాన్ని దిగ్బంధనం చేయగలిగినా, బింబిసారుని మంది మార్బలాలను క్షుత్పిపాసలతో అటమటింపచేసి హతమార్చలేము."

"సైనికదృష్ట్యా నేను అవగాహన చేసుకోలేక అడుగుతున్నాను; మనం దండెత్తితే ఏమవుతుంది సేనాపతీ?" అని మహానాముడడిగాడు.

"విపరీత జనక్షయం జరుగుతుంది. పంచగిరులపైన నిర్మితమైవున్న మహాదుర్గాలను కూలద్రోయగల సాధనమేదీ మనవద్దలేదు. అట్టిదేదైనా సంపాదించగలిగినా మన సైన్యాలన్నీ పర్వతాలమీద కెక్కుతూంటే పైన ఏ రాతిబండ చాటునో దాగియుండి, ఒక్కొక్క విలుకాడు మన కెంతెంత నష్టం కల్గింపగలడో మీరూహించవచ్చు. మరి ప్రాకారముల కెగబ్రాకి దాటుతూన్నప్పుడు దుర్గరక్షకుల ప్రహారములచే ఎందరు యోధులు మడియుదురోకూడ వూహించండి."

"అంతమంది లిచ్ఛవులను వైశాలి బలియీయగలదా అని నా సందేహం" అన్నాడు సుప్రియుడు.

"అసలంతమందిమి లేనే లేము. మూడు తరాలనుంచీ ప్రతిలిచ్ఛవీ స్త్రీకూడ ఇరవయ్యేసిమంది పుత్రులను కనివుంటే మనకు మందిబలం సరిపోయేది."

"ఇంకా అంతమంది పుత్రికలను కూడాను" అన్నాడు మహానాముడు.

"అవునదీ నిజమే. లేకపోతే వచ్చేతరంలోనే పరజాతిపడుచుల్ని పెళ్ళాడాల్సివచ్చేది. మరి వారికికలిగిన సంతానం సంకరమయిపోయేది. గౌరవనీయు అమాత్యులారా! రాజగృహాన్ని పట్టుకోవటమే మన సంకల్పమయితే అది సాధ్యపడడం సందిగ్ధమే; అంతేకాదు, ఆపైన మన లిచ్ఛవీపరివారాల్లో 55-60 ఏండ్లకు పైబడిన వృద్ధులూ, 15 సంవత్సరాలలోపు కుర్రవాళ్లు మాత్రమే మిగిలివుంటారనడంలోకూడ సందేహంలేదు" అన్నాను నేను.

"లిచ్ఛవీ స్త్రీలవిషయంలోను అదే దుర్గతి సంభవిస్తుంది" అన్నాడు సుప్రియుడు.

"అల్లాకాదు; లిచ్ఛవీయోధుల సేనలో 40-45 సం॥ల లోపు వయస్సు కలవారు పాతికవేలకు మించిలేరు. అంటే మన జనాభానుబట్టి యుద్ధానంతరం లిచ్ఛవీ యువతులు చాలమంది వుంటారన్నమాట. అయితే వారికి లిచ్ఛవీపతులు లభ్యమయ్యే ఆశమాత్రం వుండదు."

"ఆ పరిస్థితిలో మనజాతి మరీ అధ్వాన్నమవుతుంది సేనాపతీ!" అన్నాడు మహానాముడు.

"అవును ఆ స్థితిలో లిచ్ఛవీ యువతులాజన్మాంతం పురుషసంపర్కం లేకుండా బ్రహ్మచారిణులై, మడికట్టుకొని యిళ్ళలోనే కూచుంటారని ఆశించ లేము. వారు లిచ్ఛవేతరార్యులతో, దాసులతో, నాకర్లతో ప్రేమానుబంధ మేర్పరచుకోనక మానరు. ఆ విధంగా లిచ్ఛవీరక్తం సంకరమైపోవటమేగాక, మన పంచాయతీ వునికికే ముప్పు వాటిల్లుతుంది. మనలో అధికసంఖ్యాకులైన లిచ్ఛవీ స్త్రీలు తమ దుర్గతిని, తమ సంతానానికి కలిగే హీనస్థితిని మెదలకుండ సహించడం కూడ అసంభవమే."

"మన లిచ్ఛవీ ధర్మాన్ననుసరించి వివాహనియమాలను కొంత సడలించుకో వచ్చును; అందువల్ల ఒకే పురుషుడు పదిహేను, యిరవయ్యేసిమంది స్త్రీలను పెండ్లాడి వారికి గర్భాదానం చేయవచ్చు; కాని, కేవలం సంతానోత్పత్తినే చేయ గల్గుతాడు" అని గణపతి సందేహంగా చూచాడు.

"అవును గణపతీ! ఇరవైమంది స్త్రీలొకే పురుషుని భర్తగా బడసి సంతృప్తి పొందలేరు" అని నేనన్నాను.

"ఇంతకూ బింబిసారుని రాజవంశాన్ని నిర్మూలించగల్గినంతమంది లిచ్ఛవులు లేరనేగా మీరనేది సేనాపతీ?" అనడిగాడు మహానామమంత్రి.

"కేవలం శత్రునిర్మూలనంచేస్తే ప్రయోజనం? దానితోపాటు మన ప్రజా సత్తాకాన్ని కూడ శక్తిసంపన్నంగా వుంచుకోగలగాలి."

"సేనాపతీ! అసలు మన మేమిచేయాలో నీ వుద్దేశ్యం చెప్పు?" అన్నాడు గణపతి.

"మనశక్తి క్షీణించకుండా చూచుకుంటూ శత్రుబలాన్ని బలహీనపరుస్తూ ఎప్పుడైనా అది మళ్ళీ తలెత్తితే అప్పటికి లిచ్ఛవులదే పైచేయి కాగలిగేటట్టు చెయ్యాలి" అని నా అభిప్రాయం చెప్పాను.

"అంటే లిచ్ఛవీ జాతికి తరతరాల శత్రుభీతి లేకుండా చేయగల వుపాయ మేది మనకు తోచలేదని అంగీకరించుతున్నామన్నమాట" అని సుప్రియు డన్నాడు.

"నిస్సందేహంగాను. మనమేకాదు. తమ భావితరాలవారిని శత్రుభయ విముక్తులను చేయగల్గటం యేజాతికి సాధ్యంకాదు. దేవతలకైనా అది అశక్యమే."

"మరి గత్యంతరం ?" సుప్రియుడు అడిగాడు.

"తాత్కాలికసంధికి ముందు యుద్ధవిరమణకు మన మొక షరతు పెట్టాలి. ఆ షరతుప్రకారం మన సరిహద్దుగావున్న నదుల కావల నాలుగుయోజనాల మేరలో శత్రుసైన్యాలుండరాదు; శాశ్వతసంధి కుదిరేవరకు అక్కడ మన సైన్యాలు వుండాలి."

షరతులను గురించి మళ్లీ కొంతసేపు చర్చ జరిగింది; కడకు నా అభిప్రాయం అంగీకరించబడింది.

ఆ రాత్రే సంస్థాగారంలో జనసమితి సమావేశం జరిగింది. అందులోకూడా తాత్కాలిక ఒడంబడికను గూర్చిన నా షరతులు సమ్మతించబడినై. జనసమితి మా విజయానికి నన్నభినందించుతూ తీర్మానించుటే కాక, నన్ను సర్వసేనాపతిగా నియమించింది. శాశ్వత సంధి షరతులను సిద్ధం చేయడానికి యుద్ధసమితికే అధికారమిచ్చింది.

మరునా డుదయాన్నే నేను ఉల్కాచేలంలో వున్న సేనానాయకుడు కపిల్‌కు తాత్కాలిక సంధిషరతులను తెలుపుతూ, మగధరాజు అందు కొడంబడినట్లయితే యుద్ధాన్ని విరమించవలసిందనీ, సంధి దూతలను నావద్దకు తీసుకొని రమ్మనీ జాబురాసి పంపాను.

తరువాత నా కీ క్రిందివివరాలు తెలిశాయి. బింబిసారుడు తన సర్వసేనాపతి మరణానికి, వుపసేనాపతి యుద్ధఖైదీగా పట్టుకోబడినందుకు మిక్కిలి దురపిల్లినాడట. అతడు కావాలని యుద్ధంలో దిగలేదు. యుద్ధ పర్యవసానంగా పట్టిన దుర్గతికి అజాతశత్రునిపైన, వాని ఉపగ్రహాలమీద మండిపడ్డాడు. బ్రాహ్మణ వర్షకారుడుమాత్రం తన చాకచక్యంవల్ల యథారీతిని రాజానుగ్రహపాత్రుడుగానే వున్నాడు. మావటీడు నాలగిరి – పట్టపుటేనుగును నా జాబుతో బింబిసారునివద్దకు తీసుకెళ్ళినప్పుడు అతను లిచ్ఛవీ సేనాపతిని — అప్పుడు నే నుపసేనాపతినే — మెచ్చుకొని "అలాంటివారితో జగడం పెట్టుకోవడమే తప్పు"న్నాడట. యువరాజు తనమాట సాగితే మాతో తాత్కాలిక సంధికి ఒప్పుకొనేవాడు కాదు. మహారాజా బింబిసారుడు మా షరతులకు సమ్మతించి శాశ్వతసంధి షరతులను గూర్చి సంప్రతింపులు జరిపేందుకు ప్రధానమంత్రి బ్రాహ్మణవర్షకారుని, మరోమంత్రి సునీథుని నియమించాడు. తన సేనలకు తక్షణం యుద్ధాన్ని విరమించి, సరిహద్దుల కవతల నాలుగుయోజనాల లోపలికి వచ్చేయమని ఆజ్ఞాపించాడు. పాటలి (పాట్నా) యుద్ధరంగంలో తాత్కాలికసంధి ననుసరించి మేముకూడ వెనక్కి రావలసివచ్చింది; కాని దక్షిణసరిహద్దున ఎక్కువగాను, తూర్పున పూర్తిగాను నాలుగుయోజనాల ముందుకుపోయి, మా సేనలు ఆక్రమించాలి.

విజయవార్తను వినగానే వజ్జిలో ప్రతిచోటా ఉత్సవాలు జరుపసాగారు. ఉల్కాచేలంలో నా కార్యాలయంలో పనిచేసుకుంటూన్న నేను సమీప గ్రామాలనుంచి పెద్దలు అభినందనలు తెలపడానికి వస్తూంటే మధ్యమధ్య బయటి వరండాలోకి వచ్చి వారితో ఒకటిరెండు మాటలాడి పోవలసివచ్చేది. తాత్కాలిక సంధి జరిగిన యేడోరోజున విజయోత్సవ దినంగా జనసమితి ప్రకటించింది ఆనాడు వైశాలి యందంతటా తోరణాలు, పతాకాలతో అలంకరింపబడింది వీథుల్లో వూడ్చి కళ్ళాపిచల్లి, ప్రతి యింటిముందు మంటపాలు నిర్మించారు

ద్వారాలమీద జలకలశాలుంచారు. ఆనాడు వైశాలి తన వీరసంతానానికి హృదయ పూర్వక స్వాగత మీయబోతున్నది. సేనావుత్సవంలో పాల్గొనేందుకు యుద్ధ రంగాలనుండి పెక్కు సైనికదళాలను, దళనాయకులను పిలిపించాను. ఊరే గింపులో గజ, రథ, తురగ, కాల్బలాలేగాక, ఎడంభుజాన చుక్కాని, కుడిచేత బల్లెము కలిగిన నౌకా సైనికులు, భామ నాయకత్వాన లిచ్ఛవీ వీరాంగనలు, చికిత్సాదళాలు బారులుతీరి యున్నారు.

ఊరేగింపులో ముందు గణపతి, తరువాత నేను, వెనుక ఏనుగులు, ఆశ్వి కులు, పదాతిదళాలు, వాటి వెనుక రథాలు, నౌకాసైనికులు, స్త్రీ సైన్యము — కొందరు గుఱ్ఱాలమీద, మరికొందరు కాలినడకను — వారివెనుక అంగహీనుల మేనాలు, చిట్టచివర అగ్నివేశుని చికిత్సాదళము వున్నారు. ఆ వుత్సవంలో పాల్గొ నేందుకు కపిల్, శంతనుడు, అగ్నివేశుడు, భామ మున్నగువారికి నేను ప్రత్యేక ఆహ్వానాలుపంపి రప్పించానని వేరేచెప్పనక్కరలేదు. క్షతగాత్రుల చికిత్సావస రాన్ని దృష్టిలోపెట్టుకొని చికిత్సా శాఖలో కొద్దిమందినే రప్పించాము. అందు వల్లనే రోహిణి రాజాలక పోయినదనుకున్నాను. ఊరేగింపు ప్రొద్దుపొడుస్తూం డగా వైశాలీ దక్షిణద్వారాన్ని దాటింది. నగరమందలి ముఖ్యవీధులన్నీ తిరిగాము. ఇండ్లలో వుండిపోయిన వృద్ధులు, పిల్లలు సైనికులపైన పువ్వులు, పేలాలు చల్లారు. యుద్ధంలో మా వీరయువకు లెందరో వీర స్వర్గమలంకరించారు. విజయానందం ఆ దుఃఖాన్ని మరపింపజేసింది.

రాత్రి మళ్ళీ దీపాలవుత్సవం వున్నది; అయినా నేను, కపిల్, అమర్ వగైరాల మామధ్యాన్నమే ఉల్కాచేలానికి, పాటలి గ్రామానికి బయలుదేరి వెళ్ళాం.

శాశ్వతసంధి చేసుకోవాలనే ఆదుర్దా మాకంటె మాగధులకే ఎక్కువగా వుంది. మేము నిశ్చింతగానే వున్నాం. అన్నివేపులనుంచీ శత్రుసేనలు సంధి షరతులను అక్షరాలా ఆచరణలోపెట్టిన వార్తలు వచ్చినై. వాస్తవానికి పాతి కేండ్లనాటి యుద్ధంలోనైనా శత్రువుల కింతనష్టం వాటిల్లలేదు. వారి కీసారి చావుదప్పి కన్ను లొట్టపడినట్టయింది.

నేను మూడు మాసాలనుంచి ఏకదీక్షగా యుద్ధకార్యనిర్వహణలో లీనమై యుండుటచే నిద్రాహారముల సుఖ మెరుగను. ఆ రోజుల్లో రోహిణి నాలుగైదు దినాలు నా బసలోవున్నా, మేమిద్దరం దూరంగావున్నదానితో సమానమే. అయినా అప్పు డావిడవియోగాన్ని తలచుకోటానికే నాకు తీరుబాటులేదు. యుద్ధం ముగియుటతో నా కార్యభారం తగ్గిపోయింది; పనితొందర లేకపోయే సరికి మనసు రోహిణిపైకి పోసాగింది. ఆ విధంగా ఒక్కరాత్రిమాత్రమే వియో గాగ్ని నన్ను దహించింది. మర్నాడు తెల్లవారి నేను పడకనుండి లేచి బయటి ద్వారంవద్దకు వచ్చేసరికి రోహిణి వస్తోంది. చప్పున నేను ఎదురెళ్ళి ఆమెను గుచ్చి

యెత్తి కౌగలించుకున్నాను. ఆనందాతిరేకంలో నా నోటినుంచి యీ మాటలు వెలువడినాయి.

"నా ప్రియ ఉషాదేవీ! ఉషః కాంతులను వెదజల్లుకుంటూ అరుణమూర్తివై అరుణోదయ వేళకే రావడం నాకెంత ఆనందంగావుంది!— నిన్నటినుంచీ నీకోసం తపించిపోతున్నాను. నే నిదివరకెన్నడూ యింత యిదవలేదు రోహిణీ!"

"అది స్వభావ సిద్ధమే ప్రియా! మనం ముఖ్య కార్యభారం వహించి యున్నప్పు డితర విషయాలు జ్ఞప్తికిరావు. నిన్నటల్లా అమ్మవద్ద వుండడంవల్ల నే నిక్కడికి రాలేకపోయాను. మీరు ఖులాసాగా వున్నందుకు నాకెంతో ముదమయ్యింది. మీ కిప్పు డొక సంతోష వార్త చెప్పనా?" అన్నది రోహిణి.

"చెప్పు ప్రేయసీ!"అన్నాను.

ఆమె యెందుకోగాని సిగ్గుపడింది. చెక్కిళ్లెరుపెక్కాయి.

నే నన్నాను— "చెపుతానని మళ్లీ ఆ సంతోషవార్తను దాచుకుంటావేం రోహిణీ?"

"కనపడటంలా? నా ఒళ్లు భారమవుతోంది" అని నాకళ్లలోకి ఒకసారి చూచి సిగ్గుతో తలవంచుకున్నది.

నే నామెముఖాన్ని ముద్దుపెట్టుకొని ఆనందాశ్రువులను తుడుచుకుంటూ, "దేవీ! లిచ్ఛవుల అవసరమెంతైనావుంది. మనం చాలమంది వీరులను — బింబిసారుడు నష్టపడినంతగా కాకపోయినా — కోల్పోయాము. మన మా నష్టాన్ని భర్తీ చేస్తున్నందుకు సంతోషమే! సరేగాని, ఎన్నాళ్లయింది ప్రేయసీ?" అనడిగాను.

"క్రితంసారి మనం కలుసుకుని ఎన్నాళ్ళయింది ప్రియా!"

"అప్పుడే!"

ఆమె యెడంచేతిని నా చేతిలోకి తీసుకున్నాను. ఆమె "ఈఁ" అని బాధను సూచించింది. నేను తక్షణం చేయి విడచిపెట్టి, "ఏమిటి రోహిణీ!" అన్నాను.

"ఆ చేతికి గాయముంది."

నే నామె అరచేతినిచూచాను. నాలుగంగుళాల పొడుగున చీకమీద పట్టీ అతికించివుంది.

"గాయ మింకా మానుపట్టలేదా?"

"మానుపట్టింది; కాని ఒత్తితేమాత్రం నెప్పిగావుంటుంది."

"దెబ్బ ఎల్లా తగిలింది రోహిణీ?"

"యుద్ధభూమిలో పడియున్న శత్రు సైనికులను లేవదీస్తున్నాను. ఒకతను నేను శత్రువు ననుకున్నాడో యేమో నా మీదికి బల్లెం విసిరాడు."

"గాయపడినవారిని లేవదీసి సేవా శుశ్రూషలు చేయడంలోకూడా ప్రమాద మున్నదన్నమాట ?"

"ముఖ్యంగా శత్రువులవిషయంలో."

తదాది రోహిణి నావద్దనే వుంటోంది. ఇక నాకు ఒంటరితనపు దిగులు లేకపోయింది.

నే నెన్నో రోజు లెదురుచూడనక్కర లేకుండానే బింబిసారుని సంధి దూతలు - వర్షకారుడు, సునీధుడు - వచ్చారు. పట్టపుటేనుగును త్రిప్పిపంపినందుకు వారు తమ ఏలిక తరఫున కృతజ్ఞత తెలిపారు. బింబిసారుడు లిచ్ఛవీ పంచాయతీ రాజ్యంతో శాశ్వతమైత్రిని కుదుర్చుకొన నభిలషించుతూన్నట్టుకూడ చెప్పారు.

నే నా మగధమంత్రు లిద్దరిని వైశాలికి తీసుకెళ్లాను. వారితో సంధి సంభాషణలు జరపడానికి జనసమితి నన్ను, గణపతిని నియమించింది. మేము సంధిసంభాషణలు జరుపుతూ ఎప్పటి కప్పుడు పంచాయతీ సభలో వివరాలు నివేదించి, చర్చలు జరుపుతూ సలహాలు పొందేవాళ్ళం. సంధి సంభాషణలలో ప్రతిష్టంభన ఏర్పడిన కారణంగా రాయబారులు రెండు పర్యాయాలు తమ సహాయులను మగధకు పంపవలసి వచ్చింది. తుదకు మేము రూపొందించి సూచించిన షరతులివి:

1. మగధకు చెందిన గంగ, కమల, వాగ్మతీ నదీతీరాలు, వాటి అవతల ఒక క్రోసుమేర పది సంవత్సరాలపాటు లిచ్ఛవుల ఆధీనంలో వుండాలి.

2. యుద్ధకాలంలో లిచ్ఛవుల హస్తగతమైన సామగ్రి వారిదే. మగధ సేనలకు చిక్కిన లిచ్ఛవుల ఆయుధాదులను తక్షణం వాపసుచేయాలి.

3. ఇరుతెగల యుద్ధఖైదీలను వదలివేయాలి. ముందుగా మగధరాజు తన బందీలను విముక్తులను గావించాలి.

4. మగధలోని లిచ్ఛవులపైన జరుపబడిన అత్యాచార, అన్యాయాలకు నష్టపరిహారమివ్వాలి.

5. పై షరతులన్నీ అమలు పరచబడిన పిమ్మట లిచ్ఛవీ సేనలు వెనక్కి పిలిపించబడుతాయి.

మా యీ షరతులతో బింబిసారుని దూతలు రాజగృహానికి తిరిగి వెళ్లారు.

వృద్ధబింబిసారుడు సంప్రదించడానికి అజాతశత్రునిచేరబిల్చి మా షరతులను గూర్చి ఆలోచించ మన్నాడు. యువరాజు ఆదిలో - "మహారాజులు తమరు; అంగీకరించినా, తిరస్కరించినా తమ యిష్ట" మన్నాడట. అందు మీదట బింబిసారుడు "కుమారా! లిచ్ఛవులు మన పొరుగువారు. వారితో సఖ్యతకల్గి వుండడం మంచిది. నేను మాస్తే ముసలివాడినయిపోయాను. ఇక ముందు రాజ్యాన్ని చక్కబెట్టుకోవలసిన వాడివి నువ్వే. పొరుగునవున్న లిచ్ఛవులవల్ల మంచో, చెడో అనుభవించే వాడివినువ్వే. కాబట్టి దీర్ఘంగా ఆలోచించు నాయనా!" అని బోధించాడు.

"మహారాజా! నా హయాములో ఆ మంచి చెడ్డల్ని నే ననుభవించు కుంటానులెండి" అని యువరాజు పెడసరంగానే జవాబిచ్చాడు.

"అంతే; మళ్ళీ యిల్లాగే లిచ్ఛవులతో యుద్ధానికిదిగి, మన రాజవంశాధికారాన్ని మంటలో కలిపేస్తావన్నమాట?" అనడిగాడు తండ్రి.

"మహారాజా! నేను లిచ్ఛవులను సర్వనాశనం చేయనిదే నిద్రపోను; అయినా అది నాహయాంలో జరిగే సంగతి. ఇప్పుడు మీరు తోచినట్లే చేయండి." అన్నాడు.

"ఇంతకూ నీకు లిచ్ఛవులతోడి సఖ్యత ఇష్టంలేదన్నమాట? నాయనా! ఇది మనకి మేలుకాదురా. లిచ్ఛవులు ప్రజాతంత్రవాదులు. వారికి పరరాజ్యాక్రమణ కాంక్ష వుండదు. కావాలనుకుంటేవా రిప్పుడు అంగ, మగధ రాజ్యాలను సునాయాసంగా స్వాధీనంచేసుకోగలస్థితిలో వున్నారు"

"నే నందుకంగీకరించను. గిరివ్రజాన్ని (రాజగృహం) జయించడం అంత తేలికా్కాదు; అయినా నే నిప్పుడేమీ చెప్పదలచలేదులెండి" అని అజాతశత్రుడు లేచి చక్కాపోయాడు.

బింబిసారుడు సంధిపరతులకు అంగీకరించక తప్పదయ్యేను.

తొలకరివాన లారంభమవుటతో మా సైనికజీవితం సమాప్తమైంది. సరిహద్దుల్లోమాత్రం కొద్దిపాటిరక్షణసైన్యాలుంచబడినై. మేము వైశాలికి తిరిగివచ్చి వేశాము.



# 22. సిద్ధార్థుని శిష్యరికం

సర్వసేనాపతి నయినప్పటినుంచి నా బాధ్యత లెక్కువైనై. సైనికసంబంధమైన ఏర్పాటులకు యెక్కువ సమయం వినియోగించాల్సి వచ్చినా, యుద్ధకాలంలో లాగా ఆదుర్దాగాని, హడావుడిగాని లేదు. వానాకాలం అవడంవల్ల మరీ తీరికగావుంది. కపిల్, శంతన్, అమరు డాదిగాగల నా సహచరులతోను, భామ, క్షేమ మున్నగు సుందరీమణులతోను కులాసాగా కాలక్షేపం చేసేందుకు తగినంత విసులుబాటుండేది. నా జైనవ్రతాన్నిగూర్చి భామ తరుచుగా చురకలంటించుతోంది. దేహాన్ని శుష్కింపజేసి పాపాన్ని హరింపజేయడం, అహింసాచరణనుగూర్చి నాకు తోచినమట్టుకు ఒకటిరెండురోజులు చెప్పాను. అటుపైన ఆమె అవహేళనచేస్తూంటే విని మౌనం దాల్చవలసివచ్చింది. ఆమె వేళాకోళంకంటె యింటిల్లిపాది నా కళ్లముందే రకరకాల మద్య - మాంసాదుల నారగించి, నాట్యంలో లీనమవుతూండడం మరీ సహించలేకపోయాను. సంఘంలో వెలిపెట్టబడినట్టుగా నే నొకమూల కూచుని చూస్తూ వుండవలసివచ్చేది.

ఒకనాడేదో పనిమీద మేమందరము సంస్థాగారంలో సమావేశమైనాము. అసలుపని ముగిసిన పిమ్మట పంచాయతీ సభ్యులం ఎప్పటిలాగే పిచ్చా-పాటీ మాట్లాడుకోసాగాము. ఒకాయన మతాచార్యుల ప్రసంగం తెచ్చి "వైశాలి అదృష్టం ఏమని చెప్పను! ఒకరిద్దరు గణాచార్లు - మతప్రవక్తలు శిష్యులతో సహా యిక్కడే వర్షఋతువును గడుపుతున్నారు. గౌతమ బుద్ధుడు తమ అయిదొందల శిష్యులతోను మన మహావనమందలి కూటాగారంలో మకాంచేశారు. ధర్మాచార్యుడు మహావీరుడు బహుపుత్రక చైత్యంవద్ద మకాంపెట్టారు."

"వైశాలి ప్రజలకిది బలేచక్కని అవకాశం. మహాపురుషుల వుపదేశాలను వినడానికి యింతకంటె సదవకాశం ఏముంటుంది" అన్నాడు మరొక సభ్యుడు.

"అన్నా! గౌతమబుద్ధుని ప్రతిభ యిక్కడే నన్నమాటేమిటి? ఇప్పుడాయన కీర్తిచంద్రికలు జంబూ ద్వీపమందంతటా వ్యాపించినాయి. ఆయన శిష్యులులేని ప్రాంతమేలేదు" అన్నాడు మూడోమనిషి.

గణపతి అన్నాడు గదా—"మత ప్రవక్తలన్నా, వారి ధర్మబోధలన్నా నాకంతగా శ్రద్ధలేదు; కాని, గౌతముని మేనత్త (ప్రజాపతి గౌతమి), ఆయన సతి యశోధర కాలినడకను వైశాలికి వచ్చిన రోజు నాకిప్పటికీ జ్ఞాపకంవుంది. గౌత

ముని యిల్లాలు అప్పుడు మాంచి పడుచుతనంలోవుంది. ఆమె సౌందర్యాన్ని వర్ణించడం నాశక్యంకాదు. ఆమె ఏ ఒక జనపదానికో కాదు, ఎన్నో జనపదాలకు సర్వసుందరి కాదగ్గది. కపిలవస్తునుంచి సరాసరి యిక్కడికి నడచిరావటంవల్ల ఆమెముఖం వాడిపోయింది. ఎఱ్ఱని పెదిమలు పగిలి బీటలిచ్చినై. పాదాలకు బొబ్బలెక్కి పుండ్లుపడినై. అదివరకు గౌతముడు శాక్యపంచాయతీలో తనతండ్రి శుద్ధోధనుని అపార సంపద్భాగ్యాలను త్యజించి భిక్షాటన స్వీకరించాడని మాత్రమే విన్నవారానాడు యశోధర రూపలావణ్యాన్ని, సౌందర్య ప్రభను కళ్ళారచూచి గౌతముని అద్భుత త్యాగమహిమను గ్రహింపగలిగారు. నేను శాక్యగణపతి— శుద్ధోధనునిపదవి, పేరు - ప్రఖ్యాతులను వినివున్నాను. ఆ కారణంగా గౌతముని ధర్మోపదేశాలను వినాలన్న ఆసక్తి నాకేమీ కలుగలేదుగాని, అతని వ్యక్తిత్వంపట్ల గౌరవ మేర్పడింది. ఆయన మన లిచ్ఛవీజాతికి పరమమిత్రుడు కూడాను. ఇక్కడ మహామ్మారి వ్యాపించినప్పుడు మనందరికీ ధైర్యంచెప్పిన దాయనే. మనపైకి యుద్ధానికి కాలుదువ్వుతూన్న బింబిసారునికి మన అజేయతను వివరించి ఎప్పటికప్పుడు యుద్ధం పొసగకుండా ప్రయత్నించాడు. వాస్తవానికీ యుద్ధం బింబిసారునిచేకాక అజాతశత్రుని వల్లనే సంభవించింది. వృద్ధబింబిసారుడు యుద్ధానికి సమ్మతించక పోతే అతడు తప్పకుండ స్వపుత్రునిచే చెరసాలలో బంధింపబడేవాడు. ఆ సంగతి బింబిసారునికి బాగానే తెలుసు"

అప్పుడు మరొకత డన్నాడు — గౌతమబుద్ధునిలో ఏదో అద్భుత ఆకర్షణశక్తి వుంది. విరోధులు ఆయనవద్ద సమ్మోహనశక్తి కలదనీ, దానిద్వారా అన్యమతాలవారిని స్వధర్మానుకూలురుగా చేసుకుంటాడనీ అంటారు; కాని, ఆ సమ్మోహనశక్తి ఇంద్రజాల మహేంద్రజాలంవంటిదికాదు. వారి వచోవిధానమే వేరు; వినసొంపుగా వుంటుంది. పిల్లలు, వృద్ధులు, పేదలు, రాజాధిరాజులు — అందరి యెడల ఆయన సమాన ప్రేమవాత్సల్యాలు కలిగివుంటాడు. ఇక వారి ప్రతిభ వర్ణింపనలవికానిది. మన నగరంలోనే ఒకజైనసాధువు వుండేవాడు. తర్కవిద్యలో నిధియని ఆయన పేరుపొందాడు. జంబూద్వీపం యావత్తూ సంచారంచేసి వచ్చినట్లు, ఆయనకు సమజోడా యెక్కడాలేడనీ చెప్పుకునేవారు. వైశాలిలో వింత ప్రచారం వ్యాపింపజేశాడు. తానున్నచోటు వదలి యెక్కడికీ పోనని ప్రతిన బట్టాడు. భోజనంగా మాంసము, పానీయంగా మద్యాన్నిమాత్రమే తీసుకుంటానని దీక్షపూనాడు. ప్రజాసామాన్య మతణ్ణి గొప్పసిద్ధునిగా ఎంచసాగారు. అతడు 'గౌతముడు నా ముందేపాటి' అని గప్పాలుకొడుతూండేవాడు. ఒకనాడతడు సిద్ధార్థునికి తారసిల్లుట తటస్థించింది. అంతవరకు ఎన్నెన్నో కోతలు కోసిన ఆ బూటకపు సాధువునోట మాటవస్తే ఒట్టు!"

ఈరీతిగనే చాలసేపు కబుర్లు చెప్పుకొని ఎవరిండ్లకు వారు వెళ్ళిపోయాం. నేనా రోజుల్లో నిత్యము సాయంత్రం జైన ప్రవక్త సన్నిధికి వెళ్తూండే వాడిని.

ఆవాళ నే నాయన్ను దర్శించి "భగవాన్! గౌతమబుద్ధుడు యిక్కడికి వచ్చారట. ప్రజలాయన్ను కీర్తించు తున్నారు; కాని, ఆయన తమకు సాటికాగలడా? నేనొకసారి పోయి ఆతన్ను చూచిరానా?" అనడిగాను.

"వద్దు సింహా! వాని వద్దకు పోవడమెందుకు? వాడు నాస్తికుడు. ఆత్మవాదాన్నంగీకరించడు; పరలోక మసలు లేనేలేదంటాడు. అలాంటి పాషండుని వద్దకు పోకు" మన్నాడు మహావీరుడు.

నా వుత్సాహం దిగజారి పోయింది. అంతటితో గౌతముని దర్శించాలన్న నా అభిలాషను త్యజించాను.

మరి కొన్నాళ్లకు సంస్థాగారంలో సమావేశానంతరం ఏదో ఉబుసుపోకకు మాట్లాడు తున్నాము. రాజులు-మహారాజులను గూర్చిన సంభాషణ మతాచార్యులపైకి మళ్లి, బుద్ధునిచర్చ వచ్చింది. ఒకాయన "గౌతమ భిక్షువును బుద్ధుడంటారు. ఆయన నిజంగా బుద్ధుడే. వారి జ్ఞాన మపారం. అన్యులకు కూడ జ్ఞానోపదేశం చేస్తుంటారు. మూఢభక్తి, అంధ విశ్వాసాలు కూడదని వారు బోధించుతారు." అని ప్రారంభించాడు.

ఇంకొకడు చెప్పాడు — "కేసపుత్రవాసులగు కాలాముల కాయన యెట్టి చక్కని వుపదేశమిచ్చారో మీరు వినే వుంటారు. కేసపుత్రము కోసలదేశంలో ఒక పెద్దవూరు. అది అరణ్యముఖానవుంది. శ్రావస్తికివెళ్ళే బిడారువాళ్ళక్కడ ఆగి మరీ వెళ్ళాలి. నేనొకపర్యాయం మా బిడారుతోపాటు అక్కడ రెండు రేయింబగళ్ళు వుండిపోయాను. ఆ వూరువారంతా బుద్ధుని శిష్యులే. ఒకప్పుడు కాలాములదికూడ పంచాయితీ రాజ్యమేనట; కాని, యిప్పుడది కోసలరాజ్యంలో కలుపుకోబడింది. గౌతమభిక్షువు కేసపుత్రానికి వేంచేసినప్పుడొకసారి "మతప్రవక్తలు, తీర్థంకరులు పరస్పర విరుద్ధంగా ధర్మోపదేశాలు చేస్తున్నారు. మే మెవరిమాటలను విశ్వసించాలి స్వామీ!" అని కాలాములు ప్రశ్నించారు. అందు కాయన జవాబేమిచ్చారో విన్నారూ? ఆ సమాధానం ఎంతో చక్కగా వుంది. బంగారంలోని కల్తీని సువర్ణమున్న చోటుకొచ్చి యెగబడి పోల్చిచూచినంతమాత్రాన కనిపెట్టలేరు. మీ చేతిలోని గీటురాయే దాని నాణ్యాన్ని తెలుపుతుంది. అలాగే రూపు-రేఖలనుబట్టి, వచోనైపుణ్యాన్నిబట్టి, లోకప్రసిద్ధినిబట్టిగాని ఏ ధర్మాచార్యుని వుపదేశాలను గ్రహింపరాదు. ఏ ధర్మాన్నైనాసరే అవలంబించేముందు మీ అనుభవాన్ని, బుద్ధిని గీటురాయిగా వుపయోగించండి" అని చెప్పా డాయన. రూప సౌందర్యంలో, వాగ్ధాటిలో, జగద్విఖ్యాతి పొందుటలో గౌతమునికి సాటియగువారు లేనేలేరు; అయినా ఆయన ఆ లక్షణాలకే లోబడరాదని చెప్పటం ఎంత సమంజసంగా వుందో చూడండి!"

మొదటి వ్యక్తి మళ్ళీ అందుకున్నాడు — "నా కిప్పుడు గౌతముని మరో సూక్తికూడ జ్ఞప్తికొస్తోంది. సాధారణంగా ప్రవక్తలందరూ తమ సిద్ధాంతాలను

మర్కట ముష్టిలాగా లంకించుకోమని బోధించుతారు; కాని, గౌతము డందుకు ప్రతికూలంగా చెప్పాడు. గౌతముడా విషయంలో ఎలాంటి ఉపమానం చెప్పాడో చూడండి- 'ఒకమనిషి జోరునవురిసేవానా కాలంలో అచిరవతి (రావీ)నది ఒడ్డుకు వెళ్ళాడనుకోండి. నది రెండు గట్లపై పొంగి వున్నదనుకోండి. అక్కడ పడవ గాని, బల్లకట్టుగానివుండదు. ఆ వెళ్ళిన వ్యక్తినది అవతలి వేపుకు వెళ్ళాలి. అతను కాస్సేపు ఆలోచించి సమీపంలో కనపడ్డ పుల్లా-పుడక లేరితెచ్చితెప్పగా తయారు చేస్తాడు. దానిపై నెక్కి మెల్లగా నడుపుకుంటూ నదిని దాటుతాడు. అప్పుడా పుల్లల తెప్ప అతని కెట్లుపయోగపడినదీ వేరే చెప్పనక్కర లేదు; కాని, ఆ వుపయోగాన్ని తలచుకొని అతడా తెప్పను నెత్తిమీద పెట్టుకొని మోసుకెళ్తుంటే దారిలో చూచిన వారతనిని శుద్ధమూర్ఖునిగా ఎంచుతారు. తెప్ప ఏరుదాటడానికే గాని, నెత్తిపైన మోయడానికి కాదోయ్ మొద్దూ! అంటాడు ప్రతివాడూను" అని గౌతముడు తన శిష్యులతో తెప్పమాదిరిగా నా వుపదేశంకూడ తరింపజేయడానికేగాని, పట్టుకొని వ్రేలాడటానికిగ్గాదుఅని చెప్పారు.

ఈ మాటలు విన్నలగాయతు నాకు గౌతముని చూడాలన్న అభిలాష మళ్ళీ రేకెత్తింది. జైన గురువుకు నా వుద్దేశాన్ని తెలుపగా ఆయన "సింహా! ఆ జడుని (మంచిచెడ్డల నంగీకరించనివాడు) వద్దకు వెళ్తావా ?" అనడిగారు.

ఇంకా ఎన్నెన్నో మాటలుచెప్పి ఎల్లా అయితేయేం నా తలంపును మళ్ళించారు. జైన మతాచార్యుడు - మహావీరుని యందుగల భక్తి - శ్రద్ధలచే నేను వారి యాదేశాన్ననుసరించి ఆనాడు మళ్ళీ నా సంకల్పాన్ని విరమించు కున్నాను.

మతప్రవక్త లిద్దరూ వర్షాకాలం మూణ్ణెల్లూ వైశాలియందే మకాము పెట్టారు. మేమప్పుడప్పుడు మా సంస్థాగారంలో సమావేశమవుతూ వుండేవాళ్ళం. అక్కడికి వచ్చేవారు ఆషామాషీరకం మనుషులు కాదు. అందరూ పేరుపొందిన లిచ్ఛవీ జాతీయనాయకులే. ఇంకో సారికూడా గౌతముని చర్చ వచ్చింది. బుద్ధుని గూర్చి సుప్రియు డిల్లా చెప్పాడు —

"మనకు — అంటే గణ క్షత్రియులకు గౌతమ భిక్షువు పూజనీయుడు. ఇంతవరకు బ్రాహ్మలు మనల్ని గొర్రెలుగా కాకపోయినా తోడేళ్ల సమానంగా ఎంచుతున్నారు. వారు మనల్ని అజ్ఞానులుగానూ, విద్యా విహీనులుగానూ అతి హేయంగా చూస్తూవచ్చారు. కాని, యిప్పుడో అంగ, మగధ దేశాల్లోని కూటదంత, స్వర్ణదండులవంటి మహాప్రసిద్ధి చెందిన పండిత ప్రకాండులు, వేద — వేదాంగవేత్తలు అయిన బ్రాహ్మలే మన గౌతముని శిష్యులయ్యారు. వజ్జి, విదేహాలలో అద్వితీయ విద్వాంసుడగు వృద్ధ బ్రాహ్మణుడు దీర్ఘాయువు గౌతముని శిష్యుడే. అయిదేసి వందలమంది శిష్యులకు వేదం చెప్పే కోసలరాజు

గురువు పౌష్కరసాయనివంటి బ్రాహ్మణులు సిద్ధార్థుని తమ గురువుగా భావించి, ఆయన్ను మహా ఋషిగా గౌరవించుతున్నారు. బ్రాహ్మణులు తమ అష్టక, వామదేవ ప్రభృతులను విడనాడి ఒక పంచాయితీలోని గణపతి పుత్రుని మహా ఋషిగా పూజించుతారని కలలోనైనా వూహించడానికి వీలుండేదా? ఇంతేగాదు. యిప్పుడు గౌతమ భిక్షువుశిష్యులుగావున్న సారిపుత్రుడు, మౌద్గల్యాయన్, మహాకశ్యపుడు, మహాకాత్యాయనాది ప్రతిభావంతులెల్లరు బ్రాహ్మణకులోద్భవులే. వారెవరికివారే స్వయంగా మతాలను స్థాపించగలమహిమోపేతులు. జైనగురువు, సంజయ వేలాద్రిపుత్రుడు, మక్ఖలిగోసాలాది తీర్థంకరులకంటెఖ్యాతి గాంచగలవారు; అయినా వారు గౌతమునే తమ వుపదేశకుడుగా ఎంచుతున్నారు. కురు, పాంచాలముల బ్రాహ్మలు తమ వేదాలకు, వేద విజ్ఞానానికి నిలయాలుగా భావించే...లోకూడ ప్రజలు బుద్ధుని వుపదేశామృతాన్నే తనవితీర గ్రోలుతున్నారు. తక్షశిల మాజీగణపతి కప్పినుడు గౌతముని వుపదేశ సారాన్ని ఆనోట ఆనోట విని అరవైయోజనాలదూరం యెన్నో ప్రయాసలకులోనై నడిచివచ్చి శాక్యపుత్రుని శిష్యవర్గంలో చేరాడన్న సంగతి మీలో చాలామందికి తెలుసు."

సుప్రియుడెప్పుడు ముగించుతాడా అని కాచుకున్న మహానామామాత్యుడు డిల్లా చెప్పాడు—"చేతిలోని మిఠాయిని మాటల్తో మెచ్చుకోవాల్సిన అవసరం ఏముంది? దాన్ని నాలికపైనవేసుకుంటే తెలిసిపోతుంది. ఇప్పుడు ప్రతినిత్యం వేలాది స్త్రీ-పురుషులు మహావనంలోని కూటాగారానికిపోయి గౌతమునివుపదేశాలను వింటున్నారు. వైశాలిలో ఎవర్నిచూచినా ఆయన్నే గొప్పగా చెప్పుకుంటున్నారు."

ఆవాళ మళ్ళీ నా మనసులో గౌతమసందర్శనాభిలాష కలిగింది. యథారీతి నానాడు మహావీరుని దర్శించినప్పుడు ఆయన్తో యిల్లా చెప్పాను!

"మహనీయా! గౌతమబుద్ధునిపేరు వినడమేగాని ఆయనెట్టివాడో నేను చూచి ఎరుగను. లిచ్ఛవులాయన్ను తెగ పొగడుతున్నారు. ఆయన తమవలె తపోతేజశ్శాలి కాదనే నా వుద్దేశం; అయినా ఒకసారివెళ్ళి గౌతమునితో మాట్లాడాలని వుంది."

"సింహా! నీవా తపోతేజ విహీనునివద్దకు వెడతావా! అతడు మెత్తని పరుపులమీదగాని శయనించడు. పట్టు పీతాంబరాలు ధరించుతాడు. రుచిగా వుండే రకరకాల మాంసాన్ని తింటాడు. వానిలో తపశ్శక్తి వాసనకైనాలేదే. ఎందు కల్లాంటివానితో మాట్లాడటం?" అన్నారు జైనమతాచార్యుడు.

"పూజనీయా! అందువల్లనే నే నాయన్ను కళ్ళతో చూడదలచాను. నేను స్వయంగా చూచి ఆయన మాయలో తగుల్కొన్న లిచ్ఛవులకు వారిపొరపాటును తెలియజేయాలని వాంఛిస్తున్నాను."

"మరేంలేదు సింహా! అతగాడికి సమ్మోహనవిద్య వచ్చు. దానిద్వారా ఎదుటికి వచ్చినవారిమనస్సును మార్చివేయగల్గుతున్నాడు. నీ వా మాయావి దాపు కైనా పోబోకు సింహా!''

జైనమతాచార్యుడు నన్ను బుద్ధునికడకు పోకుండా విముఖుని గావించుటకింకెన్నో బోధించారు; కాని, వారి ప్రయత్నం యెక్కువైనకొద్దీ నాయభిలాష మిక్కుటము కాసాగినది. ఆయనవద్ద సెలవుగైకొని వస్తూ నాలో అనుకున్నాను - "నేను నా విద్యా - బుద్ధులను, యింగితజ్ఞానాన్ని మహావీరునికి అమ్ముకోలేదే. ఎవరినైనా పరీక్షించడానికి వెళ్ళకుండా నన్ను నిరోధించడానికి ఆయన కేమి అధికారముంది? ఏమైనాగానీ, నేను స్వయంగావెళ్లి లిచ్ఛవీ నాయకు లెల్లరిచే ముక్తకంఠంతో ప్రశంసించబడుతూన్న ఆ గౌతమభిక్షు వెలాంటివాడో, ఆయన గుణ - గణా లెట్టివో చూచితీరుతాను.''

సాయంత్రం అనేకమంది స్త్రీ - పురుషులు - వారిలో నా జనని, పిన్ని, భామ, రోహిణికూడ కలరు - కూటాగారం వేపుకు వెడుతూంటే నేనూ వారి ననుసరించాను. నేను భామ కళ్ళబడకుండా తప్పించుకోలేకపోయాను. ఆమె ముందున్నదల్లా ఆగి యాగి నన్ను కలుసుకున్నది. నాచేయి పట్టుకొని "ఇవాళ యీ విడ్డూరం యేమిటి మరదీ? మీ దిసమొల జైనగురువును వదలి యిటు వస్తున్నావే? - ఈ అకాల పుష్పవికాసానికి హేతువేమిటి?'' అనడిగింది.

''భామా! నువ్వెంతో శ్రద్ధతో గౌతమబుద్ధుని వుపదేశాన్ని వినేందు కెడుతున్నావుగదా! యిల్లా పరిహాస మాడవచ్చా?'' అన్నాను.

''గౌతమబుద్ధుడు శరీరంతోపాటు మానసికారోగ్యం కూడ అవసరమని చెపుతారు. ఆయన వాటిని ఎండబెట్టి శుష్కింపజేయడానికి ఒప్పరు.''

''సరే, యింతకూ మీ రందరూ ఆయనకు పక్కా- శిష్యురాండ్రయినట్టేనా?''

''గౌతమునివద్ద పక్కాశిష్యులనీ, సగం శిష్యులనీ తేడాలేదు. ప్రతివ్యక్తీ తన ప్రస్తుత స్థితినుంచి ముందుకు పోవాలనే వారి వుద్దేశ్యం. ఆయన ముందుకెళ్లే వారిని చూచి సంతోషించా లంటారు.''

''ఒదినా! మీ స్త్రీ సేన మొత్తాన్నే గౌతముని సేనగా పరివర్తనం చేయాలనుకోవడంలేదు గద?''

''సేనను మార్చివేయడమనే సమస్యే రాదిక్కడ మరదీ! ఇక్కడ ప్రతి ఒకరూ తమ విషయంలో స్వయంగా నిర్ణయించుకోవాలి.''

"అమ్మ, పిన్నికూడ బుద్ధబోధలు వినడానికి వస్తున్నారే! ఇదెన్నాళ్లనుంచి వదినా!"

"అబ్బో! ఇప్పటిదా, బహుళా నువ్వు తక్షశిలకు వెళ్లినప్పటినుంచీ అనుకుంటాను. వారే మొదట నన్నిక్కడికి పిల్చుకొచ్చారు."

"మరి రోహిణి కథేమి ప్రోద్బలమో ?"

"నువ్వు రోజూ ఆ దిగంబరస్వామి వుపదేశాలు వినడానికి వెళ్లిపోతున్నావయ్యే. పాపం! ఇంట్లో రోహిణి ఒక్కతె వుండిపోతూంటే నేనే ఆమెను బుద్ధ భగవానుని దర్శనానికి రమ్మని పిల్చాను."

"అంటే నాకు తెలియకుండానే నాయింట్లో బౌద్ధమతం పాదుకున్నదిగా?"

"అంతే జరిగినట్టుంది మరవీ! ఒక రోజున గౌతమబుద్ధుని వుపదేశ మాల కించి రోహిణి ఆయనతో 'భగవాన్! నేను నా యీ గర్భంలోవున్న బిడ్డతరఫున కూడ బుద్ధ - ధర్మ సంఘముల శరణుజొచ్చుతున్నా' నేను వరకు వచ్చింది వ్యవహారం."

"బుద్ధ — ధర్మ — సంఘముల శరణ్యమా ? అంటే ?"

"గౌతమభిక్షువు ధర్మాన్నవలంబించేవారు బుద్ధ—ధర్మ—సంఘములన బడే త్రిరత్నాల శరణాగతి పొందుతారు; అంటే తమకు మార్గదర్శకములుగా వాటినంగీకరించుతారు."

"శరణాగతిని పొందుట అంటే బోధపడింది; కాని, మరి ఆ త్రిరత్నాల గొడవ ఏమిటి ?"

"బుద్ధుడు, ధర్మము, సంఘములను త్రిరత్నాలంటారు. ప్రపంచంలోకెల్లా సర్వశ్రేష్ఠములు కావడంవల్ల వాటినల్లా పిలుస్తారు" అని చెప్పింది భామ.

"బుద్ధుడేమిటి ?"

"నేను గౌతమ భగవానుని ధర్మము బాగా తెలిసిన పండితురాలను కాను. నీకీ విషయంలో చెప్పగలశక్తి నాకులేదు. తెలిసినంతవరకు చెప్పడానికైనా యిది సమయంకాదు. అయినా అడిగావు కాబట్టి క్లుప్తంగా చెప్తాను. బోధ, సత్య, జ్ఞానముల సాక్షాత్కారంపొంది జీవితాన్ని ముందుకు సాగించుతూ తనజ్ఞానాన్ని దయ, క్షమా గుణాలను చరమస్థాయికి చేర్చుకొనువానినే బుద్ధుడంటారు. ప్రాణి తన ప్రయత్నంతో - ఏ యింద్రుని దయవల్లనో, బ్రహ్మకృప చేతనో కాక - తన ప్రయత్న మాత్రంచే తన జీవితాన్ని అభివృద్ధి చేసుకుంటూ బుద్ధుడయిపోతాడు. ఈ శాక్యపుత్రు డట్టి బుద్ధుడే. ఇలాంటి బుద్ధులు పూర్వమూ వున్నారు, ముందు కూడ వుంటారు. అట్టి పథప్రదర్శనం తతిమ్మావారికి జీవితంలో సహాయపడుతుంది. తాము కేవలం మార్గదర్శకుడను మాత్రమేననీ, చెయ్యిపట్టుకొని దారిని తీసుకెళ్ళే వాడనుకాననీ గౌతమ బుద్ధుడు చెపుతారు."

"మరి ధర్మమంటేనో?" అనడిగాను.

"బుద్ధుడు తమ తలపోత, ప్రయత్నము, జిజ్ఞాసలవల్ల పొందిన మార్గాన్నే ధర్మమంటార"ని భామ చెప్పింది.

"బుద్ధధర్మం తెప్పలాగా దాటిపోటానికేగాని దగ్గరపెట్టుకొని వుంటానికి కాదనేగా నీ వుద్దేశం ?"

"బుద్ధ ధర్మాన్ని గురించి నువ్విదివరకే విన్నావులాగుందే మరదీ ?"

"సంస్థాగారంలో ఒకనాడు చర్చవచ్చింది, ఆవాళ ఎవరో చెపుతూండగా విన్నాను వదినా! గౌతముడు తమ ధర్మసిద్ధాంతాల నంగీకరించడానికి, తిరస్కరించడానికి ప్రతివారిని తమ తమ బుద్ధి అనుభవాలను ఉపయోగించమంటారనికూడ విన్నాను."

"అయితే బుద్ధ ధర్మాన్నిగూర్చి నీకు కొంత వరకు తెలుసు నన్నమాట ?"

"నేను విన్నదింత వరకే ననుకో. సరేగాని, మరి సంఘమన్నావు, అదేమిటి ?"

"బుద్ధుణ్ని మార్గదర్శకుడని, బుద్ధ ధర్మాన్ని మార్గంగాను భావించి, యథాశక్తిని ఆ మార్గాన్ననుసరించ ప్రయత్నించే భిక్షువులు, భిక్షుణీలు, వుపాసకులు, వుపాసినులునైన స్త్రీ - పురుషులే సంఘం. ఏ వ్యక్తిగాని తన నిర్ణయాన్ని సత్యమనే గీటురాయితో పరీక్షించడానికి అనేకమంది బుద్ధి, అనుభవాల తోడ్పాటుంటే ఆ వ్యక్తిపని మరీ సులువవుతుంది. అట్టి తోడ్పాటు వల్ల ఏ వ్యక్తిగాని సరియైన నిర్ణయాన్ని చేసుకోటానికి యెక్కువ వీలుంటుంది."

"భామా! నే ననుకొనేది —"

"నన్ను పూర్తిగా చెప్పనీయకుండానే భామ "ఏమిటంటే — నేను మనోరథుని పెళ్ళాన్ననీ, మాటల మారినవనీ, కొంచెం ఆవేశపరురాలినికూడాననీ అనబోతున్నావు. ఏఁ అంతేనా?" అంది.

"నేను చెప్పదలచుకున్నదానిని నా మాటల్లో చెప్పనివ్వు వదినా?"

"నువ్వు పొగిడేందుకు నేనేమంత పాండిత్యం చూపాను మరదీ! ఈ సంగతులు బుద్ధుని శిష్యులైనవా రెవరైనా నాలుగు మూడు రోజుల్లోనే గ్రహించగలరు. నేను నెలా పదిహేనురోజుల్నుంచీ వారి వుపదేశాలను వింటున్నానాయె."

"నా కీసంగతి నువ్వెన్నడూ చెప్పనేలేదేఁ వదినా? నన్నొక్కనాడైనా యిక్కడికి రమ్మనక పోతివే!"

"మేధావినిజైన ధర్మ మెంతో కాలం ఆకట్టి వుంచలేదని నాకు తెలుసు. నేనిది యెప్పుడు జరుగుతుందా అని ఎదురుచూస్తూనే వున్నాను."

"ఆఁ అల్లాగా? నే నిప్పటికీ జైన ధర్మబద్ధుణ్ణే."

"నీ యీవాక నాకు వింతగానేవుంది మరదీ! జైనులు తమ శిష్యులు అన్యమత సిద్ధాంతాలను వినకుండా ఆంక్ష పెడుతారని విన్నానే. సరే మనం కూటాగారంవద్ద కొచ్చేశాం. మన మిక మాట్లాడకూడదు."

ఆవరణలో ప్రవేశించుతూ అక్కడ నీరవంగా వుండడాన్ని గమనించి భామ చెవిలో అడిగాను— "వదినా! ఇక్కడి గౌతమభిక్షువు ఏకాంతగా వుంటారా ?"

"కాదు, ఆయనతో వారి!అయిదు వందలమంది భిక్షువులు కూడవుంటారు. ఈ పాటికి వందలాది గృహస్థ శిష్యులు, శిష్యురాండ్రు కూడవచ్చి వుంటారు." అని భామ మెల్లగా చెప్పింది.

"మరి అంతమంది వుంటే ఏమాత్రం సడీ చప్పుడూ వినపడటం లేదే" అన్నాను.

"బుద్ధభగవానునికి నీరవమంటే యిష్టం. వారి శిష్యులైనా తమ శబ్దోచ్చారణతో యితరుల ప్రశాంతికి భంగం కల్గించడానికి యిచ్ఛగించరు."

మేము ఆ దివ్యసౌమ్యమూర్తి బుద్ధుని యెదుటికి వెళ్ళాం. కూటాగారం లోని కుటీరమొకటి గౌతమునికి ఆవాసంగా వుంది. దాని కెదురుగావున్న విశాలావరణలో - ఆనాడు వర్షంలేదు. లేకపోతే గడ్డితో కప్పబడిన విశాల ధర్మమంటపములో వుండేవారు - ఒక ఆసనంమీద బుద్ధుడాసీనులైవున్నారు. వారి వెనుక కుడిప్రక్కన కాషాయాంబరధారులగు భిక్షువులు చాలమంది వినమ్రవదనులై కూచొనివున్నారు. ఎడమవేపున కాషాయవస్త్రధారిణులగు భిక్షుణీలున్నారు. ముందువేపున గృహస్థులగు స్త్రీ, పురుషులు వేర్వేరుగా కూచున్నారు. అక్కడికి చేరిన ప్రతివ్యక్తీ దగ్గరనుంచో, దూరాన్నుంచో గౌతమభిక్షువుకు అభివాదనముచేసి గప్‌చిప్‌గా తన కనుకూలమైన తావున కూచుంటున్నాడు. నేను గౌతముని కొన్ని ప్రశ్నలు అడుగవలసి వుండడంవల్ల ఆయన దాపులోకెళ్ళాను. నమస్కరించి ఒకప్రక్కగా కూచుని యిల్లా అన్నాను:

"గౌతమ మహనీయా! మేము ఎడతెరుగని కార్యభారము, బాధ్యతలు గలవాళ్ళం. లిచ్ఛవీ సేనాపతి పదవే అల్లాంటిది. ఎన్నాళ్ళనుంచో తమను దర్శించి నా సందేహాలను నివృత్తి చేసుకోవాలనుకుంటున్నాను. కాని, ఏవేవో అడ్డంకులు, అంతరాయాలవల్ల రాజాలకపోతిని.

"అయితే నీవు లిచ్ఛవీ సేనాపతి సింహుడువా? క్షతగాత్రులైన శత్రువీరులపట్ల నీవుచూపిన ఉదార, దయాస్వభావమెంతైనా ప్రశంసనీయము. ప్రతి వ్యక్తి కరుణాక్షేత్రాన్ని విస్తరింప చేసుకోవడం అవసరం. ఆ క్షేత్రంలో శత్రువులనుకూడ చేర్చినా, యిక నా మనిషిలో దేవభావోదయమైనదనే నా తలంపు'' అన్నారు గౌతమబుద్ధుడు.

"కాని, అది సామాన్యకార్యమే మహనీయా!" అన్నాను.

"అది స్వల్పకార్యంకాదు. అదీగాక మనచర్యలమహిమ వాటిచిన్న పెద్దరూపాలమీద ఆధారపడివుండదు. అది హృదయం సంకుచితమో, విశాలమో అయి వుండడంమీద ఆధారపడి వుంటుంది. మంచిది, యుద్ధసందర్భంలో మీ యితర సుగుణాలను గూర్చికూడ నేను విన్నాను. మీ కనేక పనులు, బాధ్యతలు వుంటాయని నాకు తెలుసు. సరే, మీరడుగదలచిన ప్రశ్నలడగండి."

"మహానుభావా! తమ ప్రతికక్షులు మీరు నాస్తికులనీ, ఆత్మ, పరలోక ముల నంగీకరింపరనీ ప్రచారంచేస్తున్నారు. వా రావిధంగా ప్రచారంచేయుటలో నిజమే చెపుతున్నారో లేక తమపైన అసత్యారోపణ చేస్తున్నారో తెలియగోరు తున్నాను."

"వారు చెపుతున్నది నిజమే సేనాపతీ! వారు నామీద లేని ఆరోపణ చేయడంలేదు. ఆత్మ రెండు క్షణాలైనా పరివర్తనం లేకుండావుంటుందని నే నంగీకరించను. ఇక జన్మాంతంవరకూ ఒకే ఆత్మవుంటుందనే వాదన విషయంలోను, ఒక శరీరంలోనుంచి మరోదేహంలోకి పోతుందనే ధృవాత్మవాదమును గూర్చి అడుగనక్కరయేలేదు. ఏం సేనాపతీ! నీవిప్పుడుకూడ చిన్నప్పు డినుకలో ఆడుకున్నప్పటి వాడవే ననుకుంటున్నావా?"

"సరిగా చెప్పారు స్వామీ! నా కిప్పుడు స్ఫురిస్తోంది — నా కన వరతము నా జ్ఞానంలో, రుచిలో, ప్రవృత్తిలో పరివర్తనం గోచరించుతూండేది. నేను తక్షశిలకు వెళ్ళేటప్పు డున్నట్టుగా తిరిగివచ్చేటప్పుడు లేనని సందేహంకలిగింది. నే నా రెండు అవస్థలలోను స్పష్టమైన మార్పును గమనించాను. కేవలం శరీరాన్ని జూచీ, జనం ఆత్మ ఆత్మఅని అరుస్తూండడంవల్లా నే నింతవరకు ఆత్మ వుంటుం దని విశ్వసించుతూ వచ్చాను. పూజనీయా! ఈవిధమైన పరివర్తన కారణంగా నిత్య ధృవాత్మను తా మంగీకరింపకుండడం వుచితమే ననిపించుతోంది.

"ఆవిధంగా స్థిరాత్మను అంగీకరింపనందుననే వ్యతిరేకులు నన్ను నాస్తికుడ నంటున్నారు. నే నేవస్తువునుగాని — అది జడమైనా, చేతనమేకానీ నిత్యధృవ మని అంగీకరించను. అట్లే బ్రాహ్మణులకు కూడాను. ఏది వున్నదో అది వుత్పత్తి అయినదంటాను. ఉత్పత్తి అయినది అంతరించితీరుతుంది, నశిస్తుంది. నిత్యధృవాత్మ భావం కేవలము భ్రమ, లోభములవల్లమాత్రమే యేర్పడుతూంది. సేనాపతీ! జీవితమంటే నాకు రోతలేదు; అయితే అది నదీ ప్రవాహంలాంటిది. అది క్షణక్షణము నూతనమవుతూంటుంది. ఆ నవ్యత్వం కల్గడమే లేకుంటే మన సత్కా ర్మలు, సద్విచారాలు, సద్భాషణలు నిష్ప్రయోజన మవుతాయి. ఎందుచేతనంటే- వాటి ప్రభావం నిత్యధృవ జీవితంపైన పనిచేయదుగా. జీవితము నిత్యనూతన మవు తూంటుందని నే నంగీకరిస్తాను. జీవితాన్ని బ్రాహ్మణులు, పరివ్రాజకులు, లేక తీర్థంకరులు తలచినట్టుగా నేను భావించను. ఈ కారణంగా వారు నన్ను నాస్తికు డని చెపుతున్నారు. కాని, సేనాపతీ! మళ్ళీచెపుతున్నాను - నాకు జీవితంమీద తిరస్కారభావం లేదు. జీవితము వృద్ధిచెందుతూంటుందనే నిశ్చయాన్ని త్యజిం చను; కాబట్టి యదార్థవాదులు నన్ను ఆస్తికుడననే చెప్పాలి."

"నిజమేస్వామీ! యథార్థంగా తమరే ఆస్తికులని నేను వక్కాణించు తాను. జీవితం నిత్యధృవమనిచెప్పి ఏ విధమైన సంస్కరణావకాశము లేకుండా చేసేవారు జీవితాన్ని అంగీకరించినా లేకున్నా ఒకటే."

"ఆత్మ పేరిట వ్యాప్తిచెందే అసత్యభావ, అకర్మణ్యత్వాలను గాంచి ఆత్మ దృష్టి, ఆత్మవిచారణలను మిథ్యాదృష్టి, విచారణలంటాను. నిత్య ధృవాత్మవాదులు జీవితాభ్యుదయాని కేల ప్రయత్నించుతారు? వారు కేవలం అదృష్టంపైన ఆధార పడే అకర్మణ్యవాదులు కాగల్గుతారు."

"నేను గ్రహించాను మహనీయా! తమరే యథార్థవాదులు, మిథ్యా వాదులు కాదు. భౌతికవాదులు, కల్పనావాదులు కాదు. పూజనీయా! తమ వ్యతిరేకులగు బ్రాహ్మణులు తమర్ని అక్రియావాదు లనడంకూడ విన్నాను. వారు ఆ విషయంలోనైనా తమర్నిగూర్చి చెప్పేది నిజమా లేక అదీ మిథ్యారోపణ యేనా?" అని మళ్ళీ ప్రశ్నించాను.

"ఒక దృష్టిలో — సేనాపతీ! — వారు చెప్పేది నిజమే. బ్రాహ్మణ సన్యాసులు పెక్కుమంది నిరాహారులై దేహాన్ని ఎండగట్టుకోవడాన్ని, ప్రాణ విసర్జనను కూడ క్రియ అని అంటున్నారు. అట్టి సుక్రియద్వారా పాతపాపాలన్నీ హరించిపోయి మానవుడు పాపరహితు డవుతాడని వారి వాదము. సేనాపతీ! నేను వారి యీ యోచనను మూఢత్వ మంటున్నాను. వారు ఆత్మ వేరు దేహం వేరు అంటున్నారుగదా, మరి శరీరాన్ని ఎండగట్టి శుష్కింపజేసినంత మాత్రాన ఆత్మ యెల్లా శుద్ధి అవుతుంది సేనాపతీ? అది నిజమైతే శరీరంమీది వుడుపుల్ని వుతుకుటవల్ల దేహంకూడా శుభ్రం కావాలిగదా! క్షుత్పిపాసలతో మృత్యువాత బడడం, దిగంబరులుగా వుండడం, దేహాన్ని బాధించడంవల్ల జీవితము పవిత్రమవు తుందనుకోవడం అజ్ఞానము, బాలబుద్ధీను. సేనాపతీ! నేనుకూడ ఏండ్లతరబడి కఠినాతి కఠిన తపస్సుచేశాను; కాని అది ఎలాంటి ప్రభావాన్ని, జీవితంమీద చూపెట్టలేదు. మన మనోభావాలు, నిగ్రహశక్తి, రాగ-ద్వేష-మోహాల మూల కారణములను కన్పెట్టి వాటిని దూరం చేసుకోటానికి ప్రయత్నించేకృషి - యివే జీవితంమీద ప్రభావంకల్గివుంటై. సేనాపతీ! ఈవిధంగా బ్రాహ్మణసన్యాసులు క్రియ అనేదాన్ని నేను అక్రియ అంటాను. కాబట్టి నే నక్రియావాదిని. దీనితోపాటు నేను క్రియావాదినని కూడ చెప్పగలను. ఎంచేతనంటే - నేను సత్కర్మ, సద్భాషణము, సద్విచారాలను అంగీకరించుతాను. వాటి మూలంగానే జీవితము వుచ్ఛ దశకు పోతుందని కూడ ఒప్పుకుంటాను."

"తమరు సెలవిచ్చినది చాల బాగున్నది భగవాన్! తమ అక్రియావాదము జీవితాన్ని అభ్యుదయ పథానికి చేర్చుతుంది. ఆ బ్రాహ్మణ యతీశ్వరుల క్రియావాదం మూఢత్వమనీ, బాలధర్మమనే నేనిప్పుడు విశ్వసించు తున్నాను."

"నేను చెప్పేది కూడ అదే సేనాపతీ!"

"పూజనీయా! తమరు తపో - తేజ విహీనులని శత్రువులు ప్రచారం చేయడంలో సత్యమెంతవరకు కలదో తెలిసికొన గోరుతున్నాను."

# సింహ సేనాపతి

"సేనాపతీ! వారు తపోతేజమని దేన్ని అంటున్నారో నాకు తెలియదు. వారి వుద్దేశ్యంలో దేహాన్ని ఎండగట్టడము. లేక శరీరమే సర్వమూనని దాని సేవలోనే నిమగ్నమవడమే తపస్సయితే- సేనాపతీ! ఆ రెండు మార్గాలూ తప్పే నంటాను. మానవుడు అచ్చంగా శరీర పోషణలోనే లీనం కాకూడదు, లేక శరీరాన్ని ఎండబెట్టి దాన్ని అకర్మణ్యంగా తయారు చేయుటలోను నిమగ్నుడు కారాదు. నేనీ రెండు చరమమార్గాలను వదలి మధ్యదారి ననుసరించమని చెపుతున్నాను. ఈ కారణంవల్లనే నేను తపోతేజహీనుడునని చెపుతున్నారు.

"పూజ్యా! తమ మధ్యమార్గము ధన్యం! భవదీయ మధ్యేమార్గమే శుభదాయకము. నేను జైనమత ప్రవక్తను—"

నన్నాపైన మాట్లాడనీకుండ ఆపి గౌతముడు "ఆ ప్రసక్తి వదిలెయ్యి సేనాపతీ! మహావీరుడు నన్ను గూర్చి ఏమిచెప్పినా నాముందు చెప్పవద్దు. మనమిప్పుడా సంగతులను చెప్పుకోవడంవల్ల, వినడంవల్ల, నీకుగాని, నాకుగాని ప్రయోజనమేమీ లేదు. ఇంకేమైనా సందేహముంటే అడుగు" మన్నారు.

హృదయం లోపలిదాకా చొచ్చుకొనిపోయే బుద్ధుని వుపదేశంతో నేను పూర్తిగా ప్రభావితుడనయ్యాను. ఆయన శత్రువులకేమీ అనకపోగా, శత్రునిందను వినడానికూడ విముఖత్వం చూపుటగాంచి నిజంగా బుద్ధుడు అనుపమ మహాపురుషుడనీ, మానవోత్తముడనీ తెలుసుకున్నాను.

నా సందేహాలన్నీ తీరుటచే సంతుష్టాంతరంగుడనై వారితో యిల్లాచెప్పాను- "పూజనీయా! నేను లోగడ విన్నదానికి విరుద్ధంగా తమ సద్ధర్మాన్ని తెలుసుకున్నాను. నేనీ క్షణంనుండి బుద్ధ - ధర్మ - సంఘముల శరణుజొచ్చుచున్నాను. భగవాన్! నన్ను తమ శిష్యునిగా గ్రహింపగోరుతున్నాను. మరో విన్నపము - రేపు మధ్యాన్నం తమరు సంఘ సమేతంగా నా ఆతిధ్యాన్ని స్వీకరించడానికి అంగీకరించ కోరుచున్నాను."

బుద్ధభగవానుడు నా ఆహ్వానానికి సమ్మతించారు. అప్పుడు వారి వయసు అరవై సంవత్సరాలకు పైబడివుంటుంది. అయినా వారి ముఖం దీప్తివంతమైవుంది. వారి నీలినేత్రాలు అన్నిదిశలకు దయా - స్నేహములను ప్రసారించుచున్నట్టున్నై. నేనా మహనీయునికి నమస్కరించి ఇంటికి బయలుదేరాను. నేనావరణదాటి వచ్చేసరికి అమ్మ, పిన్ని, భామ, రోహిణికూడ అక్కడికి వచ్చిచేరారు. అమ్మ ఎంతో సంతోషపడుతూన్నట్టు అన్నది — "చూచావా నాయనా? మా బుద్ధబోధసుధ యెంత మాధుర్యంగావుందో!"

"విన్నానమ్మా! మన సంస్థాగారంలో అనేకసార్లు చాలమంది బుద్ధభగవానుని ప్రశంసించుచుండగా విన్నాను. నేను వీరి దర్శనానికి రావాలనుకొన్నప్పుడెల్లా జైన ధర్మాచార్యుడు నన్నాటంకపరిచేవారు. ఇవాళ వారి యాజ్ఞని

తిరస్కరించివేసి వచ్చాను. నే నిదివరకు ఎంతమట్టుకు జాత్యభిమానంతో క్షాత్ర పుత్రుని ధర్మాన్నవలంబించి కట్టుబడివున్నాను."

"సేనాపతీ! ఇన్నాళ్లకు మన మందరం బౌద్ధధర్మపథంలో ఏకమైనాము కదూ?" అంది భామ మందహాసంచేస్తూ.

"అవును వదినా! ఇప్పుడందరం ఏకధర్మబద్ధుల మయ్యాము. రేపు బుద్ధ భగవానుడు భిక్షుసంఘ సమేతంగా మన యింటికివచ్చి ఆతిథ్యం స్వీకరించుతారు; ఇప్పట్నుంచీ అందుకు ఏర్పాట్లు చెయ్యాలి."

"అందుకు నువ్వేమీ శ్రమపడనక్కరలేదులే నాయనా!" అన్నది అమ్మ వెంటనే.

మర్నాడు కసాయిదుకాణాలనుంచి గోమాంసాన్ని, పందివారులు తెప్పించాము. వంట పూర్తికాగానే నేను బుద్ధభగవానుని పిల్చివచ్చాను. ఆయన భిక్షువులతో సహావచ్చి భోంచేస్తున్నారు. సరిగా అదే సమయంలో వైశాలిలో నాలుగు వీధులు కలియుచోట్ల జైనసాధులు చేతులుపైకెత్తి, "సింహసేనాపతి పాపాత్ముడు. అతడు బౌద్ధభిక్షువు నిమిత్తం ఆవుల్ని, పందులను చంపి ఘోర హింస చేశాడు. గౌతముని భిక్షుత్వం యెలాంటిదో చూడండి! గౌతముడు తనకోసం హత్యచేయబడిన గోమాంసాన్ని మెక్కుతూంటే యింకా వాని ధర్మమెక్కడుంది?" అని గావుకేకలు వేస్తున్నారు. జైనుల కథనం సర్వాబద్ధం. నేను పశువులను చంపనూలేదు, చంపించనూలేదు. వారు చెప్పుతూన్నట్లు నేను ప్రత్యేకంగా చంపించిన పశువుల మాంసాన్ని బుద్ధభగవానునికి ఆహారంగా పెట్టనూలేదు. నేను తమ జైన ధర్మాన్ని విడిచిపెట్టుటచే వారి కంతులేని విచారం కలిగింది. అందువల్ల వారు మతిపోయి మూఢబాలకులవలె అరుస్తున్నారు.

బుద్ధభగవానుని ధర్మమార్గం నన్నాత్మతంత్రాన్నుంచి వేరుచేసి పరతంత్రుణ్ణి గావించలేదు సరికదా, నాలో అంతర్హితమైయున్న శక్తులను పూర్తిగా వికసింప జేసుకోటానికే చక్కగా తోడ్పడింది.



# 23. కపిల్ ప్రభృతుల ప్రస్థానం

వానాకాలం వెళ్లిపోవస్తోంది. ఇక కపిల్, శంతనాది గాంధార మిత్రులు స్వదేశానికి వెళ్ళిపోతారే అని నాకు దిగులుపట్టుకుంది. ఆ విషయం తలపుకొచ్చినప్పుడల్లా హృదయంలో పుండు రేగినట్లుండేది. నేను సేనాపతి నిమిత్తమే నిర్మితమైవున్న సౌధంలో కాపురం పెట్టాను. గాంధార మిత్రులు ఎక్కువగా కాలాన్ని నాతోనే గడుపుతున్నారు. జైనుల మాయావాగురిలోనుంచి బయటపడ్డప్పటినుంచి నేను మిత్రగోష్ఠిలో తరుచుగా పాల్గొనగలుగుతున్నాను. పాన-నృత్యాల్లోకూడ మళ్ళీ పాల్గొంటున్నాను. శాకాహారవ్రతానికి స్వస్తిచెప్పానని వేరే చెప్పనక్కరలేదు. మృదుమధురములైన భామ సూటిపోటీ మాటలు మాకత్యంత మనోవినోదంగా వుండేవి. ఒకరోజున మగధ సేనాపతి ప్రసక్తి వచ్చింది. నేనాయన్ను ప్రశంసించుతూ అన్నాను— "అతడు జంకుగొంకుల్లేని యోధుడు. తన సైన్యంలో చాలమట్టుకు దెబ్బతిన్నా తాను గజారోహియై రణరంగంలో నిల్చి పోరాడుతూనే వున్నాడు."

"మిత్రమా సింహా! నువ్వు మళ్ళీ మహా సింధురంగంలో లాగానే సాహసాన్ని ప్రదర్శించావునుమా!" అన్నాడు కపిల్.

"అచ్చంగా అక్కడిలాగా అనడానికి వీల్లేదు కపిల్! కేవలం నా బాహుబలాన్ని ప్రదర్శించాలనే కుతూహలంతోనే నేను ముందుకు లంఘించలేదు. ఆ మత్తేభం ప్రత్యేకతనుబట్టి బహుశా దానిమీద అజాతశత్రుడువుంటాడని ఆశించాను. అతన్ని పట్టుకోవా లనుకున్నాను."

"అయితేమాత్రం శత్రువూక మధ్యకా?"

"మన సైనికులుకూడ వున్నారుగా?

"అయినా మాళ్వపసేనాపతియే తమ మధ్యవుండకూడదని వారికేం తెలుసునులే?"

ఒక్కొక్కప్పుడు ఆ విధంగా సాహసించక తప్పదు. సరేగాని, మిత్రమా మగధసేనాపతి రెండుసార్లు నా ప్రహారాలను తప్పించుకుని నాపైకి ఆయుధాన్ని విసిరాడుకూడాను; కాని, నామూడో దెబ్బను తప్పించుకోలేకపోయాడు. అప్పుడతిలాఘవంగా గజముపైకెక్కి మావటివానిని, ఏనుగును స్వాధీనం చేసుకున్న లిచ్ఛవీ యువవీరుని చాకచక్యమే నాకు వింతగావుంది. అతడా కరిని మన శిబిరంవరకు తోలించుకొని వచ్చాడుకూడాను. ఈయుద్ధంలో సాహస-శౌర్య-ప్రతాపాలను ప్రదర్శించిన మన వీరుల యందతనినొక్కడికే మాటమాత్రంగానైనా ప్రశంస

తెలుపజాలనందుకు విచారపడుతున్నాను. నా కతడు మళ్ళీ కనపడకుండామాయమై పోయాడు."

"మరదీ! నువ్వాతడిని గుర్తుపెట్టుకోలేదా?" అనడిగింది భామ.

"నాకతని ముఖం జ్ఞాపకంలేదు వదినా? మూతిమీద నూనూగుమీసాలు వున్నయ్యనుకుంటాను; అసలు నేనతనిముఖాన్ని సరిగాచూచేందుకు వీలుచిక్కనే లేదు. శిరస్త్రాణం, కవచము, ఆయుధాలతో సుసజ్జితులైన వారంతా ఒకమాదిరి గానే కనబడతారాయె. ఒక సంగతిమాత్రం జ్ఞాపకంవుంది. మావటివాని అంకు శాన్ని గుంజుకోవడంలో అతనిచేతికిగాయమై రక్తం చిందింది" అని చెప్పాను.

"చేతికి గాయమయిందా? అట్లయితే ఆ యువకుని గుర్తుపట్టొచ్చు మరదీ!" అంటూంటే భామ కళ్ళు మెరిశాయి.

నే నన్నాను- "కాదువదినా! అతడు వెంటనే మగధ సైనికులను వెన్నాడుటకు కాబోలు వెళ్ళాడు. అతను సజీవంగా తిరిగివస్తే నా కంటపడేవాడే; అప్పట్లో అతనితో మాట్లాడేందుకు అవకాశం లేకపోయింది; అతని చర్య నే నెప్పటికి మరువలేను."

"సరేగాని, మరదీ! నిన్ను మరదీ అని పిలవనా, సేనాపతిగారూ అననా?" అని అడిగింది భామ.

"మరది అనే పిలువువదినా! నా కల్లా పిలిస్తేనే బాగుంటుంది."

"ఆలాగేలే మరదీ! అసలు బహుమతులు, మెప్పు నాశించక అజ్ఞాతంగా వుండగోరే వీరులుకూడ వుంటారుకదూ?"

"అవును, అలాంటివారు వుండకపోరు; కాని, వదినా! ఆ యువవీరుని మళ్ళీ కలుసుకోలేనందుకు దుఃఖంగానేవుంది."

"అయితే వెతికించరాదూ? అరచేతిలో గాయమున్నవాళ్లెందరో వుండరు. అతను దొరికితే దొరకవచ్చుకూడాను."

"మళ్ళీ సైనికులనందర్నీ పరీక్షించడమా? అందువల్ల ఎందరికి యిబ్బంది కలుగుతుందో తెలుసా వదినా?"

"అవును యిబ్బందే. అయితేమాత్ర మేం నీకు నూనూగుమీసాలు జ్ఞాపకమే కదూ?"

"ఖచ్చితంగా చెప్పలేను వదినా! అది నాభ్రమేకావచ్చు. అసలు నే నా యువకుని ముఖాన్ని సరిగా చూచిందెక్కడ? అందుచేతనే అతని రూపమయినా నా మనసులో అంకితమవలేదు."

"ఆ యువకుణ్ని నేను వెతికి పట్టుకొని రాగలిగితేనో?" అనడుగుతూ భామ నా కళ్ళల్లోకి చూసింది.

"నీ కెంతైనా కృతజ్ఞుణ్ణి వదినా!"

భామ చెయ్యాడించుతూ నువ్వు నాకెంత కృతజ్ఞుడివై వుంటావో లోగడే తెలిసిపోయింది. మేమెంత శ్రమపడి నేర్చుకున్నాం. సాము, విలువిద్యలు! ప్రయోజన మేముంది? చేతులు జోడించి నీకు ప్రార్థించపడ్డామేగాని, మా మొరాలకించిన పాపాన పోలేదుగా. మీ పురుషసైనికుల వరుసలో నిలబడి పోరాడటానికి మా స్త్రీ సేన అయోగ్యమనే తలిచావుగా?"

"కాని, మీరు చేపట్టిన కార్యంమాత్రం సులువైంది కాదే. అందులో మీరూ ప్రమాదానెదుర్కొన్నారుగా. రోహిణి చేతిలో బల్లెపు గాయంకూడ చూచానే?"

"బల్లెం పోటా?"

"అవునుమరి, మీరు మాత్రం ఆయుధాలుపయోగించే అవకాశం లభించలేదని ఎలా చెప్పగలవు?"

"బల్లెంపోటు, ఖడ్గప్రహారముల గురికావడానికీ, స్వయంగా వాటినుపయోగించడానికీ చాల తేడావుంది మరదీ!"

"అది నిజమేగాని, వదినా! సంఖ్యనుబట్టి మీరు వప్పగించిన పనులే తలకు మించివున్నై, అందువల్లనే యుద్ధంలోకికూడ మిమ్మల్ని దించడం వుచితం కాదనుకున్నాను."

"కాని; నువ్వు సమ్మతించకపోయినా మేము స్వతంత్రించి సమరంలో పాల్గొన్నాము." అంది నవ్వుతూ భామ.

నే నాశ్చర్యంతో అడిగాను — "ఏమిటీ, మీరు రణరంగంలో వీరవిహారం కూడ చేశారా? సేనాపతి ఆజ్ఞలేకుండానే?"

"ఆజ్ఞలేకుండానే; ఒకవిధంగా ఆజ్ఞానుసారం కూడాను."

"అదెలాగా?"

"యుద్ధం జరుగుతుండగా, గాయపడి పడిపోయినవారిని బాణవర్షంలోనుంచి తీసుకెళ్ళడం మీ ఆనతికి వ్యతిరేకంకాదుగా?"

"కాదు."

"మరి ఆ ప్రమాదపరిస్థితిలో పనిచేసేవారి రక్షణకు మాసాయుధదళం తైనాతుగావుండడంకూడ ఆజ్ఞోల్లంఘన కాదనుకుంటాను."

"కాదు."

"మరి అలాంటప్పుడు యుద్ధభూమిలో ఎవరైనా ప్రమాదంలో చిక్కుబడితే చూచిన మేము వారి రక్షణకు ఆయుధా లుపయోగించడంకూడ సేనాపతి ఆజ్ఞ నతిక్రమించటం కాదుకదూ?"

"కాదు, అయితే భామా! నువ్వు ఆయుధముపయోగించి శత్రుసంహారం కూడ చేశావాయేం?" అనడిగాను.

"ఆ సంగతెందుకులే మరదీ! ఇంతకూ మే మేమిచేస్తే ఆజ్ఞోల్లంఘన మవుతుందో తెలుసుకోవా లనుకుంటున్నాను. ఆ విపత్కరపరిస్థితిలో క్షతగాత్రులను తరలించే స్త్రీసేనాక లిచ్ఛవీయోధునే కాపాడాల్సివస్తే మేమక్కడికిమాకి ఆయుధ ముపయోగించితే మీ ఆజ్ఞ నతిక్రమించినట్టా?"

"ఈ డొంకతిరుగుడంతా దేనిగ్గాని, యింతకూ నీ వా మగధరాజు పట్టపు టేనుగును స్వాధీనం గావించుకున్న యువకుణ్నెరుగుదువా ఏం?" అనడిగాను.

"ముందు నాప్రశ్నకు జవాబుచెప్పు మరదీ! ఒకవేళ మే మప్పు డేలిచ్ఛవీ వీరుని ప్రాణరక్షణకో ఖడ్గ ముపయోగించాల్సివస్తే అది ఆజ్ఞకు విరుద్ధమా?" అనడిగింది భామ.

"అసలు మీ రందాక వెళ్ళాలని మా వుద్దేశంకాదు."

"మీ వుద్దేశం అలావుంచి మీ యాజ్ఞ విషయం చెప్పు సేనాపతీ!"

"అది వుద్దేశానికి భిన్నంగా అజ్ఞ తీసుకోవడ మవుతుంది."

"ఆజ్ఞాతిక్రమణ కాదుగద?"

"ఒక విధంగా వ్యతిరేకం కాదుగాని, మరోవిధంగా వ్యతిరేకమవుతుంది కూడాను."

"మీ జవాబులోని తొలిభాగాన్ని గూర్చే నా ప్రసక్తి సేనాపతీ!"

"డొంకతిరుగుడు మాని నువ్వు కత్తినుపయోగించావేమొ చెప్పరాదూ వదినా?"

"ఇంకా అనుమానం దేనికి? అయినా మేము నీ యంత అపరాధులంకాము మరదీ!"

"ఇదొకటా! మీతోపాటు నన్ను కూడ అపరాధిని చేస్తావేమిటి?"

"నువ్వు వుపసేనాపతివే కదూ?"

"ఊఁ, అయితే?"

"యుద్ధరంగంలో సైన్యాలను నడుపవలసిన బాధ్యత నీపైనేవుంది కదూ?"

"అవును, వున్నది" అని ప్రశ్నార్థకంగా ఆమెవంక జూచాను.

"నువ్వు మగధ సేనాపతిపై వెనుక ముందాలోచించకుండా అకాత్తుగా లంఘించుతూంటే నాకు భయం వేసింది. నీ కేదైనా ప్రమాదం వాటిల్లితే యుద్ధసంచాలనంలో ఎంత తికమకవచ్చేది? విజయం పరాజయంగా మారినా మారవచ్చనికూడా నాకు భీతి కలిగింది."

"నిజమే, నా యీ అనాలోచితవేగిరపాటు నంగీకరిస్తున్నాను."

"మరి ఆ రీతిని తొందరపాటులో శత్రుసేన మధ్యకు జొరబడిన సేనాపతి రక్షణకు లిచ్ఛవీ స్త్రీసేన సమయాని కక్కడికిపోయి ప్రయత్నించడం ఆజ్ఞోల్లంఘనమే నంటావా మరదీ?"

"ఆజ్ఞోల్లంఘన విషయంలో నా అభిప్రాయాన్నల్లా వుంచు; కాని నిజంగా నీ వల్లాంటి సాహసం చేశావా వదినా?"

"మాలో సాహసం వుంది కాబట్టే సాహసించా మనుకో."

"నేను మగధ సేనాపతి ఏనుగుమీది కురికినప్పుడే కదూ?"

"అప్పుడు మాత్రమే కాదు; ఇంకోసారి కూడాను."

"ఇంకో పర్యాయ మెప్పుడు?"

"నువ్వెన్నితడవలు అంగరక్షకులు లేకుండా యుద్ధరంగంలో సంచరించావో జ్ఞాపకం లేదూ?"

"బహుశా తిరిగి వుండొచ్చు; కాని, నేను ఒంటరిగా వున్నట్టులేదే?"

"శిబిరాన్నుంచి బయలుదేరేటప్పుడో?"

"శిబిరాన్నుంచి ఒంటరిగా బయల్దేరటం నాకు మామూలే."

"అలా వొంటరిగా వున్నప్పుడు లిచ్ఛవీ కాంతలు యుద్ధనిర్వహణ భారం వహించిన తమ సేనాపతి అంగరక్షణకు పూనుకోవడం ఆజ్ఞనతిక్రమించడమా?"

"వదినా! వాదనలో యింత గట్టిదానవు మన జనసమితి సభ్యురాలుగా వుండదగినదానవుసుమా!"

"నేనుకూడ నా వాగ్ధాటి నిరుపయోగమై పోతున్నందుకు విచారపడుతూనే వున్నాను; కాని, వుత్తరాపథ మందలి తక్షశిలవంటి పంచాయతీల్లోనే స్త్రీలకట్టి యోగంలేనప్పుడు, యిక వైశాలిలో ఆశించడానికి తావేదీ? సరే దానికేంగాని, నాప్రశ్నకేం చెపుతావు?"

"ఇంకా చెప్పేదేమిటి? నీవు చెప్పినదాన్ని పక్కికిపక్కీగా అంగీకరించుతున్నాను. పట్టుకున్నప్పుడు అక్కడున్న సైన్యంలో మీ రెంతమందివున్నారు భామా?"

"అసలక్కడ వున్నదేమేము, కాకపోతే ఏ కొద్దిమందో మగసైనికులుండి వుంటారు."

"నా కా సంగతి నింతవరకు చెప్పనేలేదేం వదినా?"

"ఇప్పుడు మాత్రం చెప్పేదాన్నా ఏమిటి? నువ్వానాటి యువకుని ధైర్యసాహసాలకేమీ బహుమతి ముట్టజెప్పలేక పోయినందుకు ఎప్పుడూ ఒకే యిదిగా కలత పడుతూండబట్టి చెప్పాల్సి వచ్చింది."

"ఇంతకూ అక్క డెవరున్నా రేమిటి?"

"ఒకళ్ళిద్దరమా, పూర్తిదళం వున్నాము. అందరము ఒడ్డూ పొడుగూ గలవాళ్లమే. ఆ దళంలో క్షేమ, భామలున్నారు; ఇంకా చెప్పమంటే మా రోహిణికూడ వున్నదంటాను."

నా పక్కనే కులుకుతూ కూచునివున్న క్షేమ తలమీద చెయ్యేసి "క్షేమా! జనపద కళ్యాణివి నువ్వు కూడానా?" అన్నాను.

క్షేమ తక్షణం, "జనపద సుందరి లేకపోతే వచ్చే లోటేమీ లేదన్నయ్యా! కాని, సేనాపతి లేకపోతే ఏమయ్యేదో నువ్వే చెప్పు ?" అంది.

"ఆ రాజ మత్తేభాన్ని పట్టుకున్న దెవరో నే నిప్పుడు చెప్పనా ?" అనడిగింది భామ.

"ఆఁ చెప్పు, తొరగా చెప్పొదినా !" నే నాత్రంతో అన్నాను.

"ఇంకెవరు, గాంధారపడుచే !"

"రోహిణా !" నే నాశ్చర్య చకితాత్ముడనై అన్నాను.

"అవును, రోహిణీ. ఆమె వంటింట్లో కెళ్ళింది లాగుంది. రాగానే ఆమె ధైర్య సాహసాలకు తగిన బహుమతి లభించాలి."

"బహుమతా ?" నే నడిగాను.

"అవును. మరి నువ్వు బహూకరించడానికి ఎంతో యిదయ్యావుగా మరదీ?"

"ఆమెకు బహూకరించేందుకు నా వద్ద ఏముంది వదినా ?"

"నువ్వంత దరిద్రుడువుగాదే. నీకు తోచకపోతే ఏమివ్వాలో నేను చెవుతా విను. ముందు ముద్దు, తర్వాత ఆలింగనం—ముఖ్యంగా ఆ వీరత్వాన్ని జ్ఞాపకం చేస్తూ వీటిని బహూకరించు. ఇంకో సంగతి—అప్పుడా ఏనుగుతో శిబిరందాకా వచ్చిన వారితో క్షేమ, భామలు వున్నారని మర్చిపోకు మరదీ ?" అని భామ నవ్వింది.

"నా వెంట వచ్చారన్న మాట ?"

"అప్పుడు మాత్రమే కాదు. ఆ రాత్రి వుల్కాచేలం వరకు నీకు సహాయులుగా వచ్చినవారిలో మేం ముగ్గురమూ వున్నాము."

"ఏమిటీ ? సేనాపతి సుమన్ మృతిచెందిననాటిరాత్రే ?"

"అవును, కాని. రోహిణికి బహుమతిని ముట్టజెప్పే తొందరలో అంకుశం గుంజుకోవడంలో ఆమె అరచేతిలో చీరుకుపోయిన గాయంసంగతి మరిచేవు."

"నేనా గాయాన్నిదివరకే చూచానులే."

"మరి నాకుకూడ ఏమైనా బహుమతి ముట్టేదున్నదా లేదా ?"

"తప్పకుండాను, కాని, ఏం కావాలో నీవే కోరుకో వదినా !"

"నా మనూ నాహమెంతనే వుండేటట్టుచెయ్యి. అట్టయితేనే నేను, రోహిణి నిరంతరం కలిసివుండడానికి వీలంటుంది."

"ఒస్ ! అది మన చేతిలోపనేలే వదినా ! మనోరథుని నాకు దగ్గర్లోనే వుంచుకుంటాను. అందులో నా స్వార్థంకూడ వుంది."

"అయితే మరీమంచిది. నీ స్వార్థంలో మాయిద్దరిస్వార్థంకూడ కలిసిపోతుంది ఇంక క్షేమ మిగిలేవుంది. ఆమెకేమిటి బహుమతి?"

"నువ్వేచెప్పు వదినా?"

"ఈమెను నీకు రెండోవదినగా చేసుకుంటే బాగుంటుంది."

"రెండో వదిన! అంటే?" నాకామె భావం అర్థంకాక అడిగాను.

"కలవరపడబోకు మరదీ! మనూ సవతిని తెచ్చుకోటానికి నేనుమాత్రం ఒప్పుకుంటానా?"

"ఆ సంగతి నాకూ తెలుసు. మరి?"

"కనపడటంలా సిగ్గుతో ఎవరు తలలొంచుకున్నదీ!"

"వదినా?"

"నీ కింకో అన్నగారెవరో చెప్పుకో మరదీ!"

"కపిలుడేగా. వదినా! బహుమతిమాట యెలాగున్నా యీ జతకూర్చడం నాకు చాలాసంతోషం" అని నేను క్షేమంబలాటంమీద ముద్దుపెట్టుకున్నాను.

"బహుమతిని స్వయంగా సమకూర్చడం మరీ సంతోషదాయకం మరదీ!" అంది భామ.





## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA130B103 |
| పుస్తకం పేరు | సింహసేనాపతి |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 265 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Kasimbi |
| పేజీలు విడదీసినది | Kasimbi |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | GOOD |